# ఆత్మవిచారము

(పూర్వభాగము)

అద్దంకి సీతారామశాస్త్రిచే

విరచితము

చెన్నపట్టణం అడయారునందు దివ్యజ్ఞానదీపిక ఆఫీసువారిచే ప్రచురితము

1922

వెల 1–8–0] [తపాలాకూలి వేరు



సీ॥ అవనిదివ్యజ్ఞాన మను సమాజమునకు గురురూపిణిగ నిల్చి
వరుస నెల్ల ।
యజ్ఞానులం గాంచి యమలవిద్యామృతబిందుతృప్తులఁ జేయు
విధిని గల్ప ।
కమణీయనందగి కరుణాంబురాశియై జ్ఞానరాజ్యప్రభు
శక్తి మించి ।
జననియటంచుస జ్జనులు నుతింపంగ యశమున దిక్కుల
నావరించి ।
వెలయుచున్న వసంతాంబ లలితపూజ్య ।
పాదపంకజములకు స ద్భక్తిమీఱ ।
వినయ మొప్పంగ నీసత్కృతిని గృతజ్ఞ ।
తను సమర్పించినాఁడను ధన్యమతిని ॥

తే॥ బ్రహ్మవిజ్ఞానసభయు శాశ్వతముగాఁగ
నలరుఁగావుత శ్రీవసంతాంబికయును
భావిగురువును సత్యరూపమగుధర్మ ।
మును ధరాస్థలి నెప్పుడు తనరుఁగాత ॥

# విన్నపము.

భరతఖండ మను మనదేశమందు సర్వవిషయములయం దును నవయుగము ఆరంభించినది. మనదేశమందలి పాశ్చాత్య విద్యాశాలలయందు ౩౦-౪౦ సంవత్సరములకు మునుపు విద్యాభ్యా సముచేయుచుండినవారికి సనాతనధర్మమతము ఇట్టిది యను జ్ఞానము లేక యుండినది. క్రైస్తవపాదరీలు ఉపాధ్యాయులుగానుండి సనా తనధర్మమతమును దూషించి తమమతమును స్తుతించి బాలురకు సనాతనధర్మమతమునందు విముఖత కలుగజేయుచువచ్చిరి. పా శ్చాత్యనాగరికమునందు బాలురకు అతిమర్యాదపుట్టుచువచ్చి భరతవర్షపునాగరికమును హేళనముచేయుట అను మనోభావము పెరుగుచువచ్చినది. అట్టి దురవస్థను నిలుపుటకుగానును భరత వర్షముయొక్క నిరుపమమైన నాగరికమును మరల స్థిరపరుచుట కును కొందరు మహనీయులు ప్రయత్నపడి థియోసాఫికల్‌సొసైటీ యను పేర నొక సమాజమును ఏర్పరిచి అందు పాశ్చాత్యులను ప్రముఖులుగానుంచి వారిమూలకముగా సనాతనధర్మమతమునం దలి శాస్త్రీయవిషయములను బోధింపించనారంభించిరి. క్రీస్తుశకా బ్దము ౧౮౭౦ వ సంవత్సరమునందు వ్యవహారములందు ప్రముఖులు

గానుండిన మన దేశపుమహాజనులకు హూణులుచెప్పువచనముల యందు అతిమర్యాదనుంచు స్వభావముండినది గనుక భారతమాత యొక్క ఉజ్జీవనమునకుగా నే పాటుపడినను కార్యసిద్ధిముఖ్య మనియు, భారతవర్షమునందు స్వమతాభిమానము, స్వదేశాభిమా నమును పుట్టించుట ముఖ్యోద్దేశమైనందున పాశ్చాత్యులనే మన దేశపు మతగ్రంథములయందలి యున్నతవిషయములను ప్రచు రించునట్లు అమ్మహనీయులు పురిగొల్పిరి. ఇవ్విధంబున సనాతన ధర్మమతము పాశ్చాత్యప్రకృతిశాస్త్రయుక్తియుతంబుగా హూ ణులవాద్ద్వారా లోకంబున ప్రచురింపబడియె. అట్టి సనాతనధర్మము నందు అనేకవిషయములు యుక్తియుక్తములుగా చెప్పబడియున్నవి.

తరువాత ౧౮౯౩ సంవత్సరము మొదలు శ్రీ ఆనిబెసెంటు అమ్మగారును, యోగీలెడ్‌బీటరుగారును అనేక యుపన్యాసములను ఇచ్చియు, గ్రంథములనువ్రాసియు ననేక రహస్యార్థములనెల్లయు బయలుపరుచుచువచ్చుచున్నారు. ఇట్టి గ్రంథములన్నియు హూణ భాషయందే ప్రచురింపబడియున్నందున హూణభాషాభ్యాసము లేనివారికి అవగాహనకావు. హూణభాషాభ్యాసమున్నవారికైనను సనాతనధర్మమతసంప్రదాయజ్ఞానములేనివారికి అర్థమగుట కొం చెము అసాధ్యము. ఐనను చాలమంది ఆ గ్రంథములను చది వియు వారియుపన్యాసముల వినియు, నానందించుచు స్వమతాభి మానమును స్వదేశాభిమానమును సంపాదించుకొనుచున్నారు.

విద్యాశాలలయందు సనాతనధర్మమతగ్రంథములను బాలు రకు తెలుపునట్లు దిట్టమగుచున్నది. కొంతకాలమునుండి హిందూ దేశమును కప్పుకొనియుండి భారతీయులను ఏమరుచుచుండిన

పాశ్చాత్యనాగరికతాభిమానము క్రమక్రమముగా తొలగుచున్నది. ఇప్పటికి 30 సంవత్సరములకుముందువరకును నలక్ష్యముగానుండిన భారతవర్షీయనాగరికము గౌరవింపబడుచున్నది. ఇవంతయు థియోసాఫికల్ సొసైటీవారివల్ల చాలమట్టుకు జరుగుచున్న దని నా యభిప్రాయము.

సనాతనధర్మమతగ్రంథములు సంస్కృతభాషలోనున్నందున అర్థముచేసికొనుయోగ్యతలేనివాడనై యీ గ్రంథకర్త నగు నేను హూణభాషయందు మొదట విషయమును తెలిసికొని పిమ్మట ప్రస్థానత్రయగ్రంథములయందు సమానార్థములను చదివి సంతసించితిని.

థియోసాఫికల్ సొసైటీని చేరి ముప్పదిసంవత్సరములువిద్యాభ్యాసముచేసి నేను పొందిన సుఖమును ఇతరులును కొంచెముగా ననుభవించునట్టుచేయుట సాధ్యమగునేమో అని నా శక్తి కొలదిని కొన్నిసంగతులను ఈ గ్రంథమునందు వ్రాసి ప్రకటించుటకు ప్రయత్నపడితిని.

తెనుగుభాషాజ్ఞానము స్వల్పమైనందునను సంస్కృతభాషాపరిచయములేనందునను పండితులకు అంగీకారముకలుగునట్టు గ్రాంథికభాషగా వ్రాయుటకు యోగ్యతలేకపోయినది. గ్రామ్యభాషాపక్షపాతుడనుగాను గనుక గ్రామ్యభాషనువ్రాయుటకు ఇష్టము లేదు. కనుక ఉభయమధ్యస్థంబైన వ్యావహారికభాషగా నొకశైలిని అవలంబించి వ్రాయుచున్నాను. "యుక్తియుక్త ముపాదేయం వచనం బాలకా దపి" అని లోకోక్తి ననుసరించి నేను వ్రాయునీగ్రంథము పాఠకలోకమునకు నంగీకారమగు నని నమ్మెద.

ఈ గ్రంథమునందలి విషయములు బహు యున్నతములైనవి. ఒక్కొకవిషయమునుగురించి ఒకగ్రంథమునే వ్రాయతగినంత సామగ్రి సిద్ధముగానున్నను అన్నివిషయములనుగురించియు కొంచెము కొంచెము వ్రాసి థియోసాఫికల్ సొసైటీవారు భారతవర్షీయులకు చేయుచున్న సహాయ మింతటి దని ప్రచురించుట యుక్తము అని నమ్మి ఈ గ్రంథమును పూర్వార్ధము, ఉత్తరార్ధము అని రెండు భాగములుచేసి పూర్వభాగమందు ప్రవృత్తిమార్గవిషయమును నుత్తరార్ధమునందు నివృత్తిమార్గవిషయమును ఇమిడిచి యుంచుటకు ప్రయత్నించుచున్నాను. ప్రకృతమందు ముద్రణాయంత్రపరికరము లధిక వెలలు అయినందున పూర్వార్ధముమాత్రము సొమ్మునష్టము అధికముగాక యుండునటుల క్రయము సులభముగా నేర్పరిచి ప్రచురించుచున్నాను. పుస్తకముసరిగా విక్రయింపబడినయెడల పాఠకలోకమున కంగీకారమని నిశ్చయించుకొనవలయును. అట్లైతే ఉత్తరభాగమును కూడ ముద్రింపించి ప్రచురింపనుత్సాహముకలుగును. ఇది ద్రవ్యలాభమునకుగా వ్రాయబడలేదు.

ఈ గ్రంథమునందు అర్ధానుస్వారములను గమనించలేదు. గురులఘు రేఫలను కూడ విమర్శించలేదు. గ్రంథముద్రణయందు తప్పులొప్పులను చూపుపట్టికను ప్రచురించు నభిప్రాయము లేకున్నను ౨౮ వ పుటయందు ఛాందోగ్యోపనిషద్వాక్యగమకమునకు క్రిందిపంక్తియందు « తేజోభిన్నములను » అని ముద్రితమైన దానిని « తేజోబన్నములను » అని చదువవలయును. నా యందలి స్నేహముతో నీ గ్రంథపు ప్రూఫులను దిద్దిన శ్రీ అల్లాడి మహా

దేవశాస్త్రిలవారు ఈ పై తప్పును సవరించిరి గాని ఏలనో తప్పే ముద్రితమైనది. పాఠకులు మన్నింతురని నమ్మెదను.

ఈ గ్రంథమునందు అనేక గమకములకు ఆకరములు గుర్తులు చెప్పబడియున్నవి గాని ౬ వ యధ్యాయమునందు సంస్కారములనుగురించి వ్రాసినపుడు అచ్చుపడియుండు గమకములకు ఆకరము చెప్పలేదు. అవన్నియు నొక ప్రాచీనగ్రంథము అగు ప్రణవవాదము అను గ్రంథమునుండి యెత్తి వ్రాయబడినవి. ప్రణవవాదము కాశీదేశపు ప్రాచీనగ్రంథము.

ఈ ఆత్మవిచారము అను గ్రంథము వ్రాయుటకు ధైర్యము నిచ్చిన థియొసాఫికల్ సొసైటీనిని, ఈ సొసైటీయందు ప్రముఖులు గానుండు శ్రీ ఆనిబెసెంటమ్మగారినిని యోగీలెడ్‌బీటరుగారినిని గౌరవపూర్వకముగా నమస్కరించి ఈ గ్రంథమును ముద్రణాత్పూర్వము చదివి సవరించిన శ్రీ అల్లాడి మహాదేవశాస్త్రిలవారికిని ముద్రణాకాలమునందు ప్రూఫులుచదివి సవరించిన శ్రీ చిట్టమూరు సుబ్బరాయడుగారికిని నా కృతజ్ఞతను విన్నవించుకొనుచున్నాను.

అడయారు.
1922. సం॥ నవంబరు నెల

అద్దంకి సీతారామశాస్త్రి

# విషయసూచిక

పుట



ఇందీవర దళశ్యామ మిందిరానంద కందళమ్ ।
వందారు జనమందారం వందేహం యదునందనమ్ ॥

ఆనంద మానందకరం ప్రసన్నం జ్ఞానస్వరూపం నిజబోధయుక్తం ।
యోగీంద్ర మీడ్యం భవరోగ వైద్యం శ్రీమద్గురుం నిత్య మహం నమామి ॥

# ఆత్మవిచారము

## ౧ వ అధ్యాయము

### దివ్యజ్ఞానసమాజము

మనము ప్రకృతము జన్మమెత్తి నివసించుచుండు ఆర్యావర్తమునందు బహుకాలముగా మతములు ప్రసిద్ధికెక్కియున్నవను సంగతి అందఱకును తెలిసిన విషయమే. మతములు అనేకములును మతాంతర్భాగములైన దర్శనములును అనేకములని గూడ తెలిసియున్నది.

లోకమందు ఏదైన నొక కాలమందు నివసించు జనసమూహములు అనగా జీవాత్మలసమూహము లన్నియు నొకటే విధమైన

చైతన్యవికాసవంతులు గారు. చైతన్యం అను పదము ఇంగ్లీషుభాష యందు Consciousness అను పదమునకు సమానార్థము. తెనుగునందు ఎఱుక యన వచ్చును. వికాసము అనగా విక సించుట. ఒక చెట్టునందు మొగ్గలుగానుండినవి వికాసముచెంది అనగా మూతపడి ఇమిడియున్న పూలరేకులు వృద్ధి అధికము అగుటవల్ల మూతలు వీడి రేకులు విస్తరిల్లి పూలు అగుచున్నవి గదా. ఈ చర్యకు వికాసము అనిపేరు. అనగా వృద్ధి. అదే విధమున జీవాత్మలు తాము స్వీకరించిన అంతఃకరణచతుష్టయము (అనగా మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము)ను తాము (జీవాత్మలు) జన్మజన్మములయందును సంపాదించిన అనుభవముల వల్ల వికసింపజేసికొందురు. ఈ వికాసము అందరు జీవాత్మ లకును ఒకటే విధము గానుండదు. కనుక జీవాత్మలయొక్క స్థితి యెట్లుండు ననగా నొక బడియందు నూరుగురు బాలురు చదు వుచుండువారు. ఆ బడియందుండు పది తరగతులలోనును సరసు కొని తరగతియొకటికి ఏడుగురు ఎనమండ్రు పదుగురు నుండునట్లు జీవాత్మలును వారివారి వికాసమునుసరించి తరగతులు తీరి యుందురు.

మనము వసించుచుండు భరతఖండమునందు ౧. జొరోస్ట్రి యను మతము, ౨. బౌద్ధమతము, 3. మహమ్మదీయమతము, ४. క్రీస్తుమతము మొదలుగాగల అనేక మతములును వానివాని అంతర్భాగములగు దర్శనములును మన సనాతనధర్మ మను పేర బరగు హిందూమతముతో సహా వర్ధిల్లుచున్నవి. ఈ మతము లన్నియు పై చెప్పబడిన బడిలోనుండు తరగతులని అనుకొందము.

బడితరగతులలో బాలురు ఏవిధమున తరగతులు నిండియుందురో అదే విధమున భరతఖండపు ప్రజలందరును అనేకములయిన మతములయందు విశ్వాసముగలవారై యుందురు. ప్రతి మతమునందును రెండుభాగములు గలవు. బాహ్యము అంతరము అని యీ భాగముల పేళ్లు. బాహ్యభాగము జనసముదాయమునకు అనుష్ఠానమునకు గానేర్పడును. అంతరభాగము జనులయందు విద్యావంతులును బుద్ధిమంతులునగువారికి మాత్రమే అర్థమగును గాన నిట్టివారికి మాత్రము అంతరభాగాభ్యాసమందు రుచి కలుగును.

వివిధమతములందును చెప్పిన సంగతులు కొంతవరకును ఒకటిగానే యుండును. దిగువ తరగతియందు చదువువారలకు పై తరగతియందు చెప్పునట్టిచదువులు అన్నియు తెలియక యుండునుకదా. అదే విధమున ఎడతెగని ఋషి సంప్రదాయానుసారముగా పరంపరాప్రోక్తమై దీర్ఘకాలముగా ప్రచారమందుండు సనాతనధర్మమయిన హిందూమతమునందు బయలుపరిచినన్ని చదువులు తర్వాత బయలుపరుచబడిన మతములయందు చెప్పబడియుండలేదు.

అన్ని మతములకును అంతరభాగ మొకటి యున్నదని పైన చెప్పబడెను. ఈ అంతరభాగము విద్యావంతులును ప్రజ్ఞావంతులునైన వారికే గాని యితరులకు అవగాహన సాధ్యముగాదనియు ముందు చెప్పబడినది. అన్ని మతములయొక్క అంతరభాగములును ఒకటిగానే యుండును. అనగా హిందూమతముయొక్క అంతరభాగమునకును బౌద్ధమతముయొక్క అంతరభాగము

నకును భేద మేమియునుండదు. అటువలెనే అన్ని మతముల ఆంతరభాగములకు పరస్పరభేదములుండవు. ఇట్టి ఐకమత్య మెందువలన కలిగినదనిన నన్ని మతములను బయలుపరిచినవారు ఒకరే. కనుక మతములకు (ఆంతరభాగమందు) భేదములు లేకుండ బయలుపరిచి ప్రతిమతముయొక్క బహిర్భాగమును మాత్రము సాధారణజనుల కర్థమగునట్లు సులభముగానుండునటుల తెలియపరిచినారు.

మన శాస్త్రములయందు కొన్ని అంశములు చెప్పియున్నారు. అవి యేవన్న: పరమకారుణికుడైన భగవంతుడు లోకములను సృష్టిచేసి వానియొక్క యోగక్షేమముల నుద్దేశించి ప్రథమమందు మరీచ్యాదులగు ఋషులను సృష్టించి వారిద్వారా ప్రవృత్తిమార్గమును స్థాపించి పిదప సనకసనందనాదులగు బ్రహ్మమానస పుత్రులను సృష్టించి నివృత్తిమార్గమును స్థాపించిరి. ఈ విషయము శ్రీ మహాభారతశాంతిపర్వమునందు ౩౪౦ వ అధ్యాయమునందు చూడుడు. ఈ మరీచ్యాదిఋషులకును మానసపుత్రులకును వారివారి శిష్యుల సమూహమునకును సిద్ధర్షిసంఘమని పేరు. సకల మతములను ఈ సంఘమే కాలానుగుణముగ బయలు పరుచును. ఋషులును మానసపుత్రులును స్థాపించిన ప్రవృత్తి నివృత్తిమార్గములను గురించి ముందు వ్రాయబడును.

అనేకమతములయందలి ఆంతరభాగములన్నియు భేదము లేక నొకటిగనేయుండునని ముందుచెప్పబడినది. ఈ ఆంతర భాగముననే థియాసాఫీ లేక దివ్యజ్ఞానమని పేరు. థియాసాఫిని సకలదేశములందును సకలమతములందును చాటించు నుద్దేశముతో

నేర్పడిన సమాజమునకు థియోసాఫికలుసొసైటి యనియును దివ్య
జ్ఞానసమాజము అనియును పేళ్లు.

దివ్యజ్ఞానసమాజమునందు నేర్పరులు కొందరు అనేక
గ్రంథములను ఇంగ్లీషుభాషయందు వ్రాసియున్నారు. నాయొక్క
అదృష్టవశమున దివ్యజ్ఞానసమాజమును చేరి ఆ గ్రంథములను
చదివినాను, చదువుచున్నాను. హిందూమతగ్రంథములందు అనేక
స్థలములందు వెదచల్లబడిన బహుముఖ్యమగు విషయములెల్ల
చదువువారికి సులభముగా నర్థమగునట్లు దివ్యజ్ఞానసమాజగ్రంథ
ములయందు ఒకచోట చెప్పబడియున్నవి. అట్టివిషయములను
చదివి వానికి సామ్యములైన విషయములు భారతభాగవతాది
పురాణములందును ఉపనిషదాదిగ్రంథములందును ఎక్కడనున్న
వని వెదకి కనిపెట్టిన వానిలో నాశక్తికొలదిని అవగాహనచేసికొనిన
కొన్ని విషయములను ఆత్మవిచారము అను పేర నొక చిన్నగ్రంథ
ముగ వ్రాయనుద్దేశించి ప్రారంభించినాను. ఇందువలన నేను థియో
సాఫికలుసొసైటికి నా కృతజ్ఞతను చూపుకొనుచున్నాను గాని, నా
పాండిత్యప్రకటనకుగా వ్రాయలేదు. ఈ థియోసాఫికలు సొసైటి
లోకమందంతయు విస్తరిల్లి యున్నది. ముఖ్యముగా మన భరత
ఖండమునందు విశేషముగా ప్రబలియున్నది. ఇందు మతవైష
మ్యములు లేక ప్రజలు ఐకమత్యము కలిగి జీవించుచుండుటకు అనేక
సౌకర్యములున్నవి. దివ్యజ్ఞానసమాజపు ఉపయోగములనును
ఔన్నత్యములనును గురించి వ్రాసినగ్రంథము లనేకములు గలవు.
గనుక ఇక్కడనింతకంటె నధికముగా వ్రాయలేదు.

---

## ౨ వ అధ్యాయము

అజమపి జనియోగం ప్రాప దైశ్వర్యయోగాత్ ।
అగతి చ గతిమత్తాం ప్రాప దేకం హ్యనేకం ।
వివిధవిషయ ధర్మగ్రాహి ముగ్ధేక్షణానాం ।
ప్రణతభయనిహంతృ బ్రహ్మ యత్తన్నతోఽస్మి ॥



### ఉపక్రమము

ఉపక్రమము అను పదమునకు ఆరంభము అని అర్థము. ఉపసంహారమనగా తుదయని యర్థము. ఉపక్రమోపసంహార బద్ధమైనది వ్యక్తప్రపంచము. అనగా లోకము. ఉపక్రమోపసంహారములచే బంధింపబడని వస్తువు చైతన్యమొక్కటే. చైతన్యమునే బ్రహ్మ, పరబ్రహ్మ అనుపేళ్లు వ్యవహరింతురు. ఈ యధ్యాయము మొదట అచ్చుపడియుండు శ్లోకమునకు అర్థము బ్రహ్మపరము. "అజం"—జన్మములేని వస్తువు అని నపుంసక లింగమందు ప్రయోగింపబడియున్నది. భాషయందు పుల్లింగము స్త్రీలింగము, నపుంసకలింగము అని మూడులింగములు గలవు. పరబ్రహ్మమును మననముచేయునపుడు స్త్రీపురుష భేదములు అది

వరకును ఏర్పడలేదు గనుక నపుంసకలింగప్రయోగము. పర బ్రహ్మము జన్మరహితమైనదైనను తనయందు ఇమిడియుండు ఐశ్వర్యము అను శక్తిని అవలంబించి జనియోగము (జన్మమెత్తుట యనుచర్య)ను "ప్రాపత్", పొందెను. అనగా పరాఽపరశక్తులకు ఉత్పత్తిస్థానమైన పరబ్రహ్మము ఏకం నిత్యం విమలం అచలం సర్వధీసాక్షిభూతం భావాతీతం త్రిగుణరహితం అయినను తన శక్తులలో నొకటియగు ఐశ్వర్యశక్తియను మాయాశక్తిని అవలం బించి జన్మమెత్తుటయను చర్యను చేసెను.

అగతి చ గతిముత్తాం ప్రాపత్

అచలమై చలనములేని వస్తువైనను స్వశక్తిని ఉపయోగించి చలనవంతము అయినది.

ఏకం హ్యనేకం

ఒక్కటే నైనను స్వశక్తిని ఉపయోగించి అనేకము అనగా నీ ప్రపంచరూపముగా పరిణమించెను. ఇట్టి విభూతులుగల పర బ్రహ్మమును నమస్కరించుచున్నానని యర్థము.

త్రికాలవేత్తలగు ఋషులు బహురూపగుణభరితమైన లోకము, అందలి పశుపక్ష్యాదులు, స్థావరజంగమములు, మనుష్యులు మొదలుగాగల వన్నియు ఏవిధముగా వ్యక్తీభవించిరని పృచ్ఛచేసి మననము చేసినపుడు వారలకు ఒక వేదవాక్యము జ్ఞాపకమునకు వచ్చినది. ఛాందోగ్యోపనిషత్తు, షష్ఠప్రపాఠకము ద్వితీయఖండ మునందు "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్-ఏకమేవాద్వితీయం" అనగా శిష్యా—రెండవవస్తువు అనునది గోచరించక తాను

ఒంటరిగా నొకటే సద్వస్తువుండెను. అటు ఒంటరిగా నుండిన వస్తువును కొందరు సత్ అనియును మరికొందరు అసత్ అనియును వ్యవహరింతురు. ఎవరు ఎట్లు వ్యవహరించినను అద్వితీయమై ఒక వస్తువు ఉండెననుకొందము. తనయొక్క ఒంటరితనమును తాను ఎరిగి అట్టి ఒంటరితనమును మాన్పుకొనవలెనని ఆ వస్తువునకు కాంక్ష కలిగినదనియు అపుడు ఆ వస్తువు "బహుస్యాం" అనుకొన్నది అనియు చెప్పియున్నది. పైచెప్పిన అద్వితీయమైన వస్తువునే పరబ్రహ్మము అందురు. పరబ్రహ్మ "౧. సత్యం ౨. జ్ఞానం 3. అనంతం" అని శ్రుతులు పలుకుచున్నవి. పరబ్రహ్మ ప్రణవస్వరూపము అనియు చెప్పబడియున్నది. ప్రణవమందును అ-ఉ-మ అను భాగములు గలవనియును వినుచున్నాము. "బహుస్యాం" అను వాక్యమునకు అర్థము "నేను అనేకము కావలయును". ఇందుల అర్థములు అనేకములున్నవి. అవన్నియు నిచ్చట వ్రాయ నుద్దేశము నాకు లేదు. అయితే "బహుస్యాం" అని తలచుకొనగానే నిర్గుణబ్రహ్మము సగుణబ్రహ్మము అయినది. వారినుండి తేజస్సు మొదలగు మూడు వస్తువులు ఉద్భవించినట్లు ఛాందోగ్యోపనిషత్తునందు చెప్పియున్నది. అనగా ఇది సృష్టికి ఆరంభము అని అర్థము.

అగతి చ గతిమత్తాం ప్రాపత్

అను వచనముయొక్క అర్థమును విచారింతము.

వేదమందు "ప్రజ్ఞానం బ్రహ్మ" అను వాక్యమున్నది. బ్రహ్మవస్తువు ప్రజ్ఞానం. అనగా నొకపాత్రయందు నిండుకు నీళ్లుపోసి

యుంచినాము అనుకొందము. ఈ నీళ్లు చలనములేక శాంతముగా
నుండును. ఇది ప్రజ్ఞానముయొక్క స్థితి. ఈ ప్రజ్ఞానము అనునట్టి
అద్వితీయమైన వస్తువు "బహుస్యాం" నేను అనేకము కావలెను
అనుకొనినపుడు ఒక స్పందము కలిగినది. స్పందమనగా అతి
సూక్ష్మమైన చలనము. ఇంగ్లీషుభాషయందు Vibration అందురు.
స్పందములన్నియు ఏదో ఒక విధమయిన చలనమే. చలనము
ఒకవస్తువు ఉండిన స్థలము మార్చి మరియొక స్థలమునకు పోవు
నట్లు చేయవచ్చును. ఒక స్థలమును విడిచి మరియొక స్థలమునకు
పోవు చర్యకు "గతి" అని పేరు. ఇందువలన "అగతి చ గతి
మత్తాం ప్రాపత్" అను వచనముయొక్క అర్థము వివరమగును.

స్పందము అను వార్తను ఉపయోగించినాము గదా. స్పంద
ములు అనేకవిధములు. ఉదాహరణకుగా స్థూలస్పందములను
కొన్నిటిని ప్రస్తావనచేతము. ఒక తటాకమందుండు నీటిలో
౧. తూర్పునుండి పడమటికి, ౨. పడమటినుండి తూర్పునకు,
౩. ఉత్తరమునుండి దక్షిణమునకు, ౪. దక్షిణమునుండి ఉత్తరము
నకు, ౫. వాయవ్యమునుండి ఆగ్నేయమునకు, ౬. ఆగ్నేయ
మునుండి వాయువ్యమునకు, ౭. నైరృతమునుండి ఈశానదిక్కు
నకు, ౮. ఈశానదిక్కునుండి నైరృతమునకు, ౯. అధోభాగము
నుండి ఊర్ధ్వభాగమునకు, ౧౦. ఊర్ధ్వభాగమునుండి అధోభాగ
మునకు, ఇదేవిధమున లెక్కలేనన్ని విధములైన స్పందములు
కలుగవచ్చును. స్పందములు కలిగినపుడంతయు స్ఫులనము కలు
గును. స్ఫులనము అనగా ఉబ్బుట. నీట నానవేసిన విత్తనము
ఉబ్బిన రీతిన ఉబ్బుట. ఉబ్బినపుడంతయు స్ఫులనమువల్ల విస్ఫు

లింగములు కలుగును. ఏవస్తువు స్ఖలనావస్థను చెందునో ఆ వస్తువుయొక్క అతిసూక్ష్మమైన తునక బయలువెడలును. ఒక పాత్రలో నిండుకుకను జలము పోసి ఆ పాత్రను కదలించినట్లైతే జలముయొక్క బిందువులు కొన్ని ఆ పాత్రనుండి బైటికి దుమికి పడును. స్ఖలనముయొక్క పరిణామక్రియ విస్ఫులింగము. ఇందు వల్లనే ముండకోపనిషత్తునందు

యథా సుదీప్తాత్పావకాద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతే సరూపాః

అని చెప్పియున్నది. అనగా మహా జ్వాలావళులతో దహించు చుండు పెనుమంటలోనుండి విస్ఫులింగములు (మిణుగురులు) బయలువెడలును. ఆ విధమున అక్షరవస్తువు (పరబ్రహ్మము) నుండి అనేక జీవాత్మలు బయలువెడలుచున్నవి అని యర్థము. సంగ్రహాముగా మనమెరుగవలసిన దేమనగా పరిపూర్ణమై, అద్వితీయమై, అచలమై యుండిన సత్ అను బ్రహ్మము నందు "బహుస్యాం" అను స్పందముకలిగి ఆ స్పందముయొక్క ఒక కార్యము జీవాత్మలు అనేకములు బయలువెడలెనను విషయము. ఒక స్పందమువల్ల ఒకటే పరిణామము (మార్పు) కలుగవలెనను విధి యేమియు లేదు. అనేక పరిణామములు కలుగవచ్చును.

మహేశ్వరుని లీలావిభూతులు అనేకములు అని పురాణ ములయందు చదివియున్నాము. తాను అనేకములు కావలెనని కాంక్షచెందిన పరమాత్మయొక్క చర్యకు లీల అని నామధేయము. పరమాత్మ సచ్చిదానందమూర్తియు, సత్యం జ్ఞాన మనంతమును అయి ఇచ్ఛాజ్ఞానక్రియలు అను శక్తులను కలిగిన తాను "అనే

కం" అయినపుడు క్రీడించుటకు స్థలనిర్దేశము చేసికొనవలెను. అట్టిస్థలము సప్తలోకస్వరూపమయిన బ్రహ్మాండము. తనయొక్క విస్ఫులింగము (అంశ) అను జీవాత్మయొక్క క్రీడార్థము బ్రహ్మాండమును సృష్టించెను. ఉపక్రమాధ్యాయమునందు, ౧. క్రీడకుడైన జీవాత్మ, ౨. క్రీడారంగమయిన బ్రహ్మాండము ఈ రెండును, గోచరములగుచున్నవి. ఈ రెంటినిగురించి రాబోవు అధ్యాయములలో సాధ్యమైనంతవరకు విపులముగా వ్రాయవచ్చునుగాని ప్రకృతమందు నటరాజరాజును, క్రీడక ప్రవీణుడునైన సచ్చిదానందమూర్తియొక్క అనంతకోటి లీలాపరిణామములలో కొన్నిటినిగురించి సంగ్రహముగా వ్రాయ నుద్దేశము.

## సచ్చిదానందమూర్తి

అంతకుముందు ఏకముగానుండిన వస్తువునకు ఉపనిషత్తునందు సత్ అని నామధేయము. తనయందిమిడియుండు ఐశ్వర్యమును ఉపయోగపరచుకొనిన తరువాత సద్వస్తువు సచ్చిదానందమూర్తిగా పరిణమించిరి. వీరికి సగుణబ్రహ్మయని పేరు. మాయా సమాగమము అయినది. గుణములు బయలువెడలినవి. శక్తులు వ్యక్తికి వచ్చినవి. "నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః" "మమ మాయా దురత్యయా" మొదలగు గీతా వాక్యములు మాయయొక్క మహిమను తెలుపుచున్నవి. వివేక చూడామణియందు

> అవ్యక్తనామ్నీ పరమేశ శక్తిః
> అనాద్య విద్యా త్రిగుణాత్మికా పరా ।

కార్యానుమేయా సుధియైవ మాయా
యయా జగత్సర్వమిదం ప్రసూయతే ॥
సన్నాప్యసన్నా ప్యుభయాత్మికా నో
భిన్నాప్యభిన్నా ప్యుభయాత్మికా నో ।
సాంగా ప్యనంగా ప్యుభయాత్మికా నో
మహాద్భుతాఽ నిర్వచనీయ శక్తిః ॥

అవ్యక్తమని పేరుగలదియు, అనాదియు, త్రిగుణాత్మికమైనదియు నగు మాయవలననే కదా యీ జగత్తంతయు సృష్టింప బడుచున్నది. ఈ మాయ ఇట్టి స్వభావము కలదని చెప్పుటకు సాధ్యము కాదు. సత్ కాదు; అసత్ కాదు; రెండును (సదసత్తులు) కలిసినదియు కాదు. చిత్ కాదు; అచిత్ కాదు; రెండును (చిదచిత్తులు) కలిసినదియు కాదు. అంగసహితమైనదికాదు; అంగములేనిది కాదు; ఈ రెండును కలిసినదికూడ కాదు. ఇది మహాద్భుతమైన దియు, మాటలతో తెలియచేయుట కసాధ్యమును అగు శక్తి. పరమేశ్వరునియొక్క శక్తి ఇట్టి అద్భుతగుణములు కలిగినది. దీనినే

ఐశ్వర్యయోగాత్

అని ఈ అధ్యాయాదిన ముద్రించియుండు శ్లోకమునందుండు "ఐశ్వర్య" అనుపదముచే సూచింపబడినది. సత్త్వరజస్తమోగుణ ములు మాయయందు పుట్టినవి. ఇది మొదలు గుణముల చేష్టల ఆరంభము. ఇది మొదలు స్త్రీలింగపుల్లింగ భేదములు. ఇది మొదలు పరాప్రకృతి అపరాప్రకృతి యనుభేదముల యారంభము.

శ్రీమద్భగవద్గీతయందు చేసిన యుపదేశములో తనయొక్క తత్త్వమును తానే బోధించియున్న వివరమును కొంత విచారింతము.

> భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।
> అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥
> అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం ।
> జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥
> (భ. గీ. 7—4, 5.)

పృథివ్యాది పంచభూతములును వానికిపై మూడుతత్త్వములును వెరసి ఎనిమిది విధములయినది నాయొక్క ఒక ప్రకృతి. దీనికి అపరాప్రకృతి యని పేరు. ఇంతకంటె నధికమైన మరియొక ప్రకృతి కలదు. దానికి పరాప్రకృతి యని పేరు. ఇది జీవము వంటిది. ఇదే స్థూలసూక్ష్మప్రపంచముల నన్నిటిని ధారణవల్ల కాపాడునది. చరాచరాత్మకము అయినదియు దృశ్యములు అదృశ్యములు అగు స్థావరజంగమాది మనుష్య దైవ దానవాది రూపములనన్నిటికిని ఉపాదానకారణమైనది అపరాప్రకృతి. భూలోకము మొదలు సత్యలోకపర్యంతమును గల సకలలోకములకును ఈ అపరాప్రకృతియే కారణము.

> అధిభూతం క్షరో భావః

అని యెనిమిదవ యధ్యాయమునందు చెప్పినది యీ ప్రకృతియే. ఈ స్వభావమునే, ఈ అపరాప్రకృతినే, గీతయందనేక స్థలముల యందు “అవ్యక్తయః” అను పదముచే వ్యవహరించియున్నారు. (అవ్యక్తాద్వ్యక్తయ స్సర్వే ప్రభవంత్యహరాగమే).

తనకు మరియొక ప్రకృతి కలదని చెప్పినారు. ఆ ప్రకృతి యేదని భగవద్గీత ౭ వ యధ్యాయము ౫ శ్లోకమునందు వివరించినారు. అది జీవభూతమైన పరాప్రకృతి. ఈ పరాప్రకృతినే సాంఖ్యదర్శనమునందు «పురుషుడు» అందురు. భగవద్గీత ౮ వ యధ్యాయమందు చెప్పిన «పురుషశ్చాధిదైవతం» పురుషుడు ఈ పరాప్రకృతే. ఇదే అధిదైవతము. ఈ అధిదైవత ప్రకృతినిగురించి ముందు రాబోవు అధ్యాయములలో విపులముగా వ్రాయబడును. అధిభూతమును గీతాశాస్త్రమునందు అచ్చటచ్చటయును క్షరము అని వాడియున్నారు. అధిదైవమును అక్షరము అని కూడ వ్యవహరించియున్నారు. అధిభూతము, క్షరము, అపరాప్రకృతి, యను సంజ్ఞలచే నెరుగగల ప్రకృతికి వ్యక్తి యని పేరు అని ఇదివరకే చెప్పబడినది. అధిదైవము, అక్షరము, పరాప్రకృతి, జీవభూతము, పురుషుడు, అను సంజ్ఞలచే సూచించబడిన ప్రకృతి అవ్యక్తమని ౮ వ యధ్యాయము ౨౦ వ శ్లోకమునందు చెప్పబడియున్నది. ౯ వ యధ్యాయము ౪ వ శ్లోకమునందు «మయా తత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా» అని చెప్పిన «అవ్యక్తము» పరాప్రకృతియే. ౧౫ వ యధ్యాయము ౧౬ వ శ్లోకమునందు సూచించిన అక్షరపురుషుడును ఈ పరాప్రకృతియే. ౧౩ వ యధ్యాయము ౧౯ వ శ్లోకము «పురుషం ప్రకృతిం చైవ విద్ధ్యనాదీ ఉభావపి» లో చెప్పినపురుషుడును ఈ పరాప్రకృతియే. ౮ వ అధ్యాయము ౧౮ వ శ్లోకమునందు «అవ్యక్తము» అని పరాప్రకృతిని గురించియు, «వ్యక్తయః» అని అపరాప్రకృతిని గురించియు చెప్పిరి. ౧౪ వ యధ్యాయము

ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ ।
క్షర స్సర్వాణిభూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే ॥
ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।
*　　*　　*　　*　　*　　*
యస్మాత్ క్షర మతీతోఽహం అక్షరాదపి చ ఉత్తమః ।
అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః ॥

ఇక్కడ విశదముగా తానైన సచ్చిదానందమూర్తి తనయొక్క పరా అపరా అను ప్రకృతులకంటె భిన్నుడు అని చెప్పిరి. తనకు పురుషోత్తముడని వ్యాగహారనామము కలదని చెప్పిరి. ౧. పురుషోత్తమః; ౨. పరాప్రకృతి, 3. అపరాప్రకృతి. ఈ త్రిగణమునందు లెక్కపెట్టబడిన ౨-3 అయిన పరా, అపరా ప్రకృతులవల్లనే జగత్తంతయు కలిగినది. ౧౬ వ యధ్యాయము ౮ వ శ్లోకమునందు "అపరస్పరసంభూతం" అనియున్న వాక్యమునకు ఈ యర్థమును ఇయ్యవచ్చును. అపరా, పరా అను ప్రకృతులవల్ల పుట్టినదని చెప్పవచ్చును. ఇదంతయు "బహుస్యాం" అనిన స్పందముయొక్క కార్యమే.

## జగత్తు లేక క్షేత్రము

క్రీడకుడైన జీవాత్మకు క్రీడారంగమైనచతుర్దశభువనాత్మకమైన బ్రహ్మాండము ఏవిధముగా ఉద్భవము అయినదని సంగ్రహముగా విచారింతము. విపులముగా విచారించను ప్రకృతమందు అవశ్యము లేదు. ఈ పుస్తకముయొక్క కడపట బ్రహ్మాండము అని ఒక అధ్యాయము వ్రాయబడును. అయితే ప్రకృతమందు

తెలియవలసిన విషయము ఏమనగా—“ భూమిరాపోనలో వాయుః ఖం ” అను పంచభూతములు ఏవిధముగా పరస్పరము కలిసినవి మొదలగు విషయములను చర్చచేయువలెను. భూతములు అయిదును అనగా పృథివీ, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము, అనునవియును, అహంకారతత్త్వము, మహత్తత్త్వము, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, శబ్దాదిపంచ విషయములు, మనోవికారములయిన ఇచ్ఛా, ద్వేషం, సుఖం, దుఃఖం, ఇవి మొదలుగాగల వన్నియు క్షేత్రము అని భగవద్గీత ౧౩ వ యధ్యాయమునందు చెప్పబడినవి. అతిసూక్ష్మములైన పంచభూతములు ఒకటితోనొకటి కలిసి స్థూలభూతములయినవి. ఈ చర్యకు పంచీకరణమని పేరు.

పంచీకరణ

మనగా ఐదులు అగుట. సూక్ష్మ ఆకాశతత్త్వము (అనగా సూక్ష్మతత్త్వము) తాను తన సగంభాగము నిలుపుకొని మిగిలిన నాలుగుతత్త్వములగు ౧. వాయు, ౨. అగ్ని, ౩. అప్పు,౪. పృథివీ అను నాలుగింటిని తనలో చేర్చుకొనును. అదే విధముగా సూక్ష్మ వాయుతత్త్వము తన సగంభాగము నిలుపుకొని మిగిలిన సగంభాగమందు తానుగాక మిగిలిన నాలుగుతత్త్వములైన ౧. ఆకాశము, ౨. అగ్ని, ౩. అప్పు, ౪. పృథివీ అను నాలుగు తత్త్వములనును చేర్చుకొనును. ఈ విధముగానే ప్రతితత్త్వమును తాను తన సగంభాగం నిలుపుకొని మిగిలిన తనయొక్క సగంభాగమందు నిలవ నాలుగు తత్త్వములనును చేర్చుకొనును. ఈ ప్రకారం

అయిదుతత్త్వములును తానుగాక మిగిలిన తత్త్వములను తనలో చేర్చుకొనుటవల్ల ప్రతి తత్త్వమందును మిగిలిన అన్నితత్త్వములును కనబడును. ఈ చర్యకు పంచీకరణమని పేరు. ఇదే విధముగా సత్త్వరజస్తమోగుణములు గూడ నొకటితో నొకటి కలియును. ఈ చర్యకు

త్రివృత్కరణము

అని పేరు.

రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా ॥
(భ. గీ. ౧౪-౧౦)

అధిభూతము అను అపరాప్రకృతిలో ఎనిమిది భాగములున్నట్లు ౧౩ వ పుటలో చెప్పబడినది. ఈ యెనిమిదింటియందు అయిదు మనకు ముఖ్యముగా తెలియవలయును. అవి యేవన ౧. ఆకాశము, ౨. వాయువు, ౩. తేజస్సు, ౪. అప్పు, ౫. పృథివి. ఈ ఐదింటికిని తత్త్వములని పేళ్లు.

ఆత్మన ఆకాశః సంభూతః, ఆకాశాత్ వాయుః, వాయోరగ్నిః, అగ్నెరాపః, అద్భ్యః పృథివీ.

అని శ్రుతివాక్యమున్నది. అనగా, పరమాత్మ అయిన సచ్చిదానందమూర్తినుండి ౧. ఆకాశము, ౨. ఆకాశమునుండి వాయువు, ౩. వాయువునుండి తేజస్సు అను అగ్ని, ౪. అగ్ని నుండి అప్పు (జలము అను తత్త్వము), ౫. అప్పునుండి పృథివీ తత్త్వము. దీని అర్థమును కొంత విచారించవలెను. "మాయాంతు ప్రకృతిం వింద్యాత్ మాయినం తు మహేశ్వరం" అను వాక్యము

నందుండు ప్రకృతి అనగా మూలప్రకృతియందు ౮ వ పుటయందు చెప్పిన సత్ అను వస్తువు « బహుస్యాం » అని కామించిన స్పందము ప్రవేశించి మూలప్రకృతియొక్క అణువులను అన్నిటిని స్ఫులనా వస్థకు తెచ్చినది. స్ఫులనము అనగా ఉబ్బుటయని ఇదివరకే విని యున్నాము. అనగా మూలప్రకృతియొక్క అణువులు ఆవరకును ఏదో ఒక తరగతి స్థౌల్యమునందు ఉండినవి. « బహుస్యాం » అనిన స్పందము మూలప్రకృతి అణువులను స్ఫులనావస్థకు తెచ్చి ముందు ఉండినంతకంటె నధికమైన స్థౌల్యమును వాటికి ఇచ్చినది. ఇట్లు స్థౌల్యావస్థ చెందిన అణువులచే గూడిన మూలప్రకృతికి ఆకాశతత్త్వము అని పేరు. « బహుస్యాం » అనిన స్పందము మరికొంతవిస్తరించి ఆకాశతత్త్వమును స్ఫులనావస్థకు తేగా వాయుతత్త్వము ఏర్పడినది. మునుపటి వలెనే « బహుస్యాం » అనిన స్పందము మరికొంత విస్తరిల్లి వాయుతత్త్వపు అణువులను స్ఫులనావస్థకు తెచ్చి వాయుతత్త్వపు అణువులకంటె స్థూలమైన తేజస్తత్త్వమును కలిగించినది. ఇదే విధమున వరుసగా అప్తత్త్వపు అణువులును పృథివీతత్త్వపు అణువులును సృజింప బడినవి. ఆకాశము, వాయువు, తేజస్సు, అప్పు, పృథివీ-అను ఐదింటికిని పంచభూతములని పేరు. పంచభూతముల పంచీకరణా వస్థవల్ల రూపముతాల్చినది గనుక జగత్తునకు ప్రపంచము అని పేరు. స్పందములు అనేకవిధములుగా నుండవచ్చునని పైన వ్రాయబడినది. క్రియలకెల్ల ప్రతిక్రియలున్న విధముగా స్పంద ములకెల్ల ప్రతిస్పందములు గలవు. క్రియను ప్రతిక్రియ ఎట్లు నివారించి నిష్క్రియతను కలుగజేయునో అదేవిధముగా స్పంద

మును ప్రతిస్పందము నివారించి స్ఫురణము అను నిష్పంద స్థితిని తేవచ్చును. క్రియ, ప్రతిక్రియ, నిష్క్రియత—స్పందము, ప్రతిస్పందము, నిష్పందము లేక "స్ఫురణము", అను నీ త్రిగణ ములు మనజ్ఞాపకమునందుంచుకోవలెను. ఈ రెండు త్రిగణ ములను గురించి కర్మ అను నధ్యాయమునందు వాని వినియోగ ములను తెలుపుచు వ్రాయబడును. ఇది ఉపక్రమాధ్యాయము గనుక పాంచభౌతిక జగత్తు సృష్టి అయినంతవరకును స్పందములు ఏవిధముగా పరిణామములను కలుగజేసినవని తెలియచేయవలసి యున్నది. గనుక ఇకమీదట రాబోవు అనేకవిషయములను ఇచ్చట సూచించి సూచనమాత్రముతో విడిచిపెట్టవలసి యున్నది.

సాంఖ్యశాస్త్రమునందు పంచమహాభూతములను గురించి చెప్పుచు వానియొక్క గుణములని వేదాంతమందు చెప్పబడిన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లను ఐదింటికిని తన్మాత్రలని పేరు ఇచ్చిరి. క్షేత్రమును గురించి శ్రీమద్భగవద్గీతయందు ౧౩ వ యధ్యాయము ౫ వ శ్లోకమునందు "పంచచేంద్రియగోచరాః" అని చెప్పియున్నది. ఇంద్రియగోచరములు శబ్దాది పంచవిషయ ములు. ఈ విషయములనే వేదాంతశాస్త్రమందు పంచమహా భూతముల గుణములు అని చెప్పిరి. సాంఖ్యశాస్త్రమందు శబ్దా దులకు తన్మాత్రలని పేరుపెట్టి తన్మాత్రలు భూతముల సృష్టికి కారణములని చెప్పిరి. పై వివరించిన వివరములు కొంచము పరస్పర విరోధములుగా కనబడుచున్నవి. కనుక సమన్వయమును విచా రించవలెను.

స్పందములే జగత్సృష్టికిని స్థితికిని ప్రళయమునకు కారణములను విషయము దృఢముగా మన మనస్సులయం దుంచుకో వలెను. ‹‹ బహుస్యాం ›› అను స్పంద మొక్కటియు ‹‹ ప్రజాయేయ ›› అను స్పంద మొక్కటియు మూలప్రకృతిని ఉద్రేకపరచి మహత్ తత్త్వము మొదలుగాగల తత్త్వములను మరియు నితర అనేక పరిణామములనును కలుగచేసినవి అని యిదివరకే వింటిమి. ప్రతి స్పందమునకును ఒక పరిమాణము కలదు. ఆ పరిమాణమునకు ‹‹ మాత్ర ›› అని సంజ్ఞ. భగవద్గీత ౨ వ యధ్యాయము ౧౪ వ శ్లోకమునందు ‹‹ మాత్రాస్పర్శాస్తుకౌంతేయ శీతోష్ణసుఖ దుఃఖదాః ›› అనియున్నది. గనుక ‹‹ మాత్ర ›› అను శబ్దమునకు కొలత (స్పందపుకొలత) అని అర్థము. సుత్తెతో కొట్టితే కలుగు నట్టి నొక్కుకును సంపెటతో కొట్టినప్పుడు కలుగు నొక్కుకును వ్యత్యాసము కలదుకదా. దెబ్బయొక్క వేగము ‹‹ మాత్ర ››. అదే విధమున స్పందముయొక్క వేగముకూడ మాత్రయే. తన్మాత్ర అనుశబ్దములోనుండు సంధిని వీడదీసినయెడల రెండుపదములగును—తత్ + మాత్ర. ‹‹ తత్ ›› అనగా సచ్చిదానంద మూర్తి. ‹‹ మాత్ర ›› అనగా కొలత. తాత్పర్యమేమన సచ్చిదానందమూర్తియొక్క కాంతువల్ల కలిగిన స్పందముయొక్క పరిమితి లేక కొలత. సాంఖ్యాచార్యుల అభిప్రాయప్రకారము తన్మాత్రలు తత్త్వములకు కారణములు. తత్త్వము అను పదము నందుండు సంధిని వీడదీసినయెడల తత్ + త్వం అని రెండుపదములు ఏర్పడును. పై రెండుపదములలో ‹‹ త్వం ›› అను పదము స్థితి అను అర్థమును ఇచ్చుచున్నది. ఉదాహరణము—అంధత్వం=

గుడ్డితనము, బధిరత్వం=చెవిటితనము, మూకత్వం=మూగతనము. అదేవిధముగా తత్ త్వం అనగా తత్ అది—దానియొక్క త్వం-స్థితి. తాత్పర్యము, (దానియొక్క స్థితి) మూలప్రకృతిపరిణామముయొక్క స్థితి. ఈ అర్థము బాగుగ మనస్సునకు అవగాహన అయితే మంచిది. గనుక చక్కగా మననము చేసి ఈ పై వివరించినప్రకారం తన్మాత్ర అను పదముయొక్కయు తత్త్వం అను పదముయొక్కయు అర్థములను తెలిసికొనవలయును. జగత్తుయొక్క సృష్టి, స్థితిలయముల కధికారము పొందిన అధికారులగు—

బ్రహ్మ, విష్ణువు, శంభువు

అను త్రిమూర్తులు వ్యక్తదశకు వచ్చిరి. వీరు ముగ్గురును సచ్చిదానందమూర్తియొక్క సత్ అనునట్టియు, చిత్ అనునట్టియు, ఆనందం అనునట్టియు, స్వభావములు మూర్తీకరించిన వారు. ఈ త్రిమూర్తులయొక్క స్వభావము సచ్చిదానందమూర్తి సంబంధము అని చెప్పబడెను. వీరల భార్యలు సరస్వతి, లక్ష్మి, పార్వతి. వీరల స్వభావము మూలప్రకృతికి సంబంధపడినది. మూలప్రకృతినే, శక్తి అనియును, అవ్యక్తము అనియును, మాయయనియును వ్యవహరింతురు. అధిభూతము అధిదైవము ఈ రెండును ౧౬-౧౭ వ పుటయందు చెప్పబడిన "బహుస్యాం" అను స్పందముయొక్క మహిమవల్ల పంచీకరణము అను స్థితినిని త్రివృత్కరణము అను స్థితినిని పొందుచు స్థూలసూక్ష్మకారణరూపములగా మారుటకు ప్రారంభించును. క్రీడకుడైన జీవాత్మకు క్రీడారంగమైన జగత్తు ఎట్లు ఉత్పత్తి అయినది అని విచారించవలెను.

ముసకు కారణము. అనగా శబ్దము అను పరిమితి గల స్పందము అది వరకును ఉండిన ప్రకృతిని అప్పటి స్థితికంటె స్థూలముగా చేసినది. ఆ స్థూలత్వమునకు (స్థౌల్యమునకు) ఆకాశతత్త్వము అని పేరు. ఒక ఉదాహరణము నిచ్చి ఈ యర్థమును విశదపరచవచ్చును. ఒకమైలు వర్తుల విస్తీర్ణముగల ఒక తటాకమందు జలమున్నదను కొందము. సూర్యుడు తన కిరణములతోను వాయువు తాను వీచుటచేతను ఒక నెలదినములు ప్రయత్నపడిరనుకొందము. సూర్య కిరణముల వేడిమిచేత తటాకమందుండిన జలము కొంతమట్టుకు ఆవిరిరూపమున పైకెగసిపోయెను. గాలి వీచుటవల్లనును నీరు శోషించిన దనుకొందము. ఒక నెల అయిన తరువాత ఆ తటాక మందుండు నీరు ముందున్నంత పలచనగానుండదు. నెలదినములు సూర్యకిరణముల వేడిమితో నావిరిరూపమున నీరు పోయినందున కొంత మట్టుకు ద్రవత్వము తగ్గి అడుసుకలిసినట్టు కనపడును. మరియు ను ఒక మైలు వర్తులవిస్తీర్ణముండిన నీరు విస్తీర్ణముతగ్గి ముక్కాలు మైలు వర్తులవిస్తీర్ణమే కలిగియుండును. ఈ విధముగా మరియొక నెల దినములు సూర్యుని తేజస్సును చండమారుతమును పనిచేసినయెడల మరికొంత నీరు తగ్గి పలచనయును విస్తీర్ణమును తగ్గిపోవును. ఇదేవిధముగా శబ్దతన్మాత్రయను స్పందశక్తివల్ల ఆకాశ తత్+త్వం అను పరిణామము కలిగియుండిన ప్రకృతియందు "స్పర్శ" అను తన్మాత్ర స్పందరూపముగా ప్రవేశించి వాయుతత్త్వము అను మార్పును కలుగచేయును. ఆకాశతత్త్వములోనుండి వాయు తత్త్వము ఉద్భవించినట్టు కదా అర్థము. అందువల్లనే "ఆకా శాద్వాయుః" అని వేదప్రమాణము. ఇదే విధముగా రూప

తన్మాత్రయను స్పందము వాయుతత్త్వముగా నుండిన ప్రకృతి యందు ప్రవేశించినందున ఆప్రకృతి స్థౌల్యమును చెంది తేజస్త త్త్వము అను మార్పును పొందును. ఇదేవిధముగా రస తన్మాత్ర యను స్పందము అప్తత్త్వమునను గంధ తన్మాత్రయను స్పంద శక్తి పృథివీ తత్త్వమునను కలుగచేయునని యెరుగవలయును. ఐదు తన్మాత్రలు వరుసను అయిదు తత్త్వములను కలుగజేయును. అటుపిమ్మట తత్త్వములు పంచీకరించు. (౧౬ వ పుటచూడుడు) ఉదాహరణమిచ్చినపుడు వర్తులాకారమైన తటాకమని చెప్పితిమి. సులభముగా అవగాహన కావలెనని వర్తులాకారమును చెప్పవలసి వచ్చెను. అయితే బ్రహ్మాండము వస్తులరూపమైనది కాదు. గోళాకారమయినది. నిడివి వెడలుపు మాత్రము గల ప్రదేశము అనగా గోడవలె చౌకప్రదేశమందు గుండ్రముగా వ్రాసినపుడు వర్తులము అని పేరు. అటుగాక చెండువలె గుండ్రముగానుండు వస్తువునకు గోళము అని పేరు. ఉదాహరణము భూగోళము. బ్రహ్మాండము గోళాకారమే. బ్రహ్మాండమునకు అంతర్భాగము లైన ఆకాశగోళము, వాయుగోళను, తేజస్సుగోళము, అప్పు గోళము, పృథ్వీగోళము ఇవన్నియు గోళములే. అయితే పృథ్వీ గోళములో ప్రవేశించి కొంతమించి అప్తత్త్వగోళముండును. అప్తత్త్వగోళములో ప్రవేశించి కొంతమించి తేజస్తత్త్వగోళ ముండును. తేజస్తత్త్వగోళములో ప్రవేశించి కొంతమించి వాయుతత్త్వగోళముండును. వాయుతత్త్వగోళములో ప్రవేశించి కొంతమించి ఆకాశతత్త్వగోళముండును. ఇవన్నియు పంచీ కరణము అయినపిమ్మట కనుబడు స్థితి. ఈ వివరములు అవ

గాహానకు కష్టములు గనుక బ్రహ్మాండమను అధ్యాయమందు విపులముగా వ్రాయబడును. ఇందుల ముఖ్యార్థము ఏమనగా సాంఖ్యశాస్త్రజ్ఞులు చెప్పినట్లు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల నెడి తన్మాత్రనామధేయయుతంబులైన స్పందములు వరుసను ఆకాశ, వాయు, తేజస్సు, అప్పు, పృథివి అను తత్త్వములకు కారణములు అను సంగతియే. ౨౩ వ పుటలో చెప్పిన భూలోకము, భువర్లోకము, స్వర్గలోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము అను నవంతయు తత్త్వములవల్ల కలిగినవి. సచ్చిదానందమూర్తియొక్క అంశలు అయిన సత్, చిత్ ఆనందము అను వానియొక్క స్వభావములనే రూపములగా ధరించిన త్రిమూర్తులు—బ్రహ్మ, విష్ణువు, శంభువు. సత్త్వము రజస్సు తమస్సు అను పేళ్లుగల గుణములయొక్క సహాయము వలనను, ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి అను మూడుశక్తుల వేగముయొక్క సహాయమువల్లనును పైని చెప్పిన త్రిమూర్తులు వారి వారి అధికారములను వహించి ౧. ఆధిభౌతిక, ౨. ఆధిదైవిక, ౩. ఆధ్యాత్మిక సృష్టులను ప్రారంభించిరి. ఈ మూడువిధములైన సృష్టులనుగురించి మూడవ యధ్యాయమందు వ్రాయబడును.

సప్తలోకములలో ఉత్తమలోకమయిన సత్యలోకమునకు బ్రహ్మలోకము అని యొక పేరు కలదు. బ్రహ్మాండమునందు సత్యలోకము అతి యున్నతమైనది. బ్రహ్మలోకమునకు పైన వైకుంఠలోకమని యొక లోకమును అందుకు పైన గోలోకమని యొక లోకమును ఉన్నవి. వైకుంఠగోలోకములు సప్తలోకస్థమైన బ్రహ్మాండమునకు వెలుపలివి.

తత ఊర్ధ్వం చ వైకుంఠో బ్రహ్మాండా ద్బహి రేవ సః ।
తత ఊర్ధ్వం చ గోలోకః . . . . . . . . . . . . . ॥ (దేవీభాగవతము)

బ్రహ్మ, విష్ణువు, శంభుడును, సూర్యుడును, చంద్రుడును, అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని అను సప్తగ్రహములును వారి వారి లోకములును చేరి మనయొక్క ఒక బ్రహ్మాండమయినది. ఇట్టి బ్రహ్మాండములు అనేకములు గలవు. ఇందును గురించియు బ్రహ్మాండము అను అధ్యాయమునందు కొన్ని వివరములు వ్రాయబడును.

ఇతర బ్రహ్మాండములలో ఎట్లున్నను మనబ్రహ్మాండమునందు అధికారముపొందిన త్రిమూర్తులలో బ్రహ్మకు ఆధిభౌతిక సృష్టికి అధికారము. విష్ణువునకు ఆధిదైవికసృష్టికి అధికారము. శంభునికి ఆధ్యాత్మిక సృష్టికి అధికారము. ఆధిభౌతికము అని పేరు గల భూతసృష్టి అయిన తర్వాత ఆధిదైవసృష్టి అయినది. తన్మాత్రలకు, తత్త్వములకు, లోకములకు, ఇంద్రియములకు, మనస్సు మొదలగు అంతఃకరణమునకు, అంతఃకరణముయొక్క పరిణామములైన ఇచ్ఛా, ద్వేషము, సుఖము, దుఃఖము అను వానికిని, పంచ ప్రాణములకు, ఉపప్రాణములకు, అన్నిటికిని అధిష్ఠాన దేవతలు సృష్టింపబడిరి. వారు వారు వారి వారి ఉద్యోగములతో ప్రవేశించిరి. అధిష్ఠాన దేవతల వివరముకూడ బ్రహాండము అను అధ్యాయమునందు వ్రాయబడును.

## జీవాత్మ

అయిన క్రీడకుడు విచ్చేసి అతని క్రీడకుగా సిద్ధపరచబడిన క్రీడారంగమును ప్రవేశించుటకుగా సకలమును సిద్ధముచేసి అయి

నది. ఇంతటి మర్యాదకు అర్హుడైన జీవాత్మ అను క్రీడకుడు ఎవ్వడని విచారింతము. ఛాందోగ్యోపనిషత్తు షష్ఠప్రపాఠకము ద్వితీయ ఖండమునందు "బహుస్యాం" అను వాక్యమును "ప్రజాయేయ" యను వాక్యమును ఉన్నవని యిదివరకే ప్రస్తావించియుంటిమి గదా. అదే ఖండమునందు, తేజస్సు, అప్పు, అన్నము అనునవి ఆ పరమపురుషునివల్ల సృజింపబడినవనియును తృతీయఖండమునందు ఆ మూడు భూతములును త్రివృత్కరణమైనవనియు అండజం, జీవజం, ఉద్భిజ్జం అను బీజములకు త్రివృత్కరణముచెందిన తేజః అప్. అన్నం సృష్టికారణములైనవనియు చెప్పియున్నది.

> సేయం దేవతైక్షత హన్తాహ మిమా స్తిస్రో దేవతా అనేన జీవే నాత్మ నానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి.

అపుడు "బహుస్యాం" అనిన దేవుడు తేజోభిన్నములను చూచి నేను జీవాత్మరూపముగా నామరూపములను అవలంబించి ఈ తత్త్వములలో ప్రవేశించెదను అని చెప్పిరి అని అర్థము. కనుక జీవాత్మ అను శబ్దమునకు నామరూపాన్వితమైన పరమాత్మయని యర్థము. నామరూపములు లేనిది పరమాత్మ. అదే పరమాత్మకు నామరూపములు సంబంధించినపుడు జీవాత్మయని పేరు అని ఛాందోగ్యోపనిషత్తుయొక్క అభిప్రాయము. అనగా పరమాత్మ అను వస్తువును మూసిపెట్టినవి నామరూపములు.

> తదేతదమృతగ్ం సత్యేన ఛన్నం, ప్రాణోవా అమృతం, నామరూపే సత్యం, తాభ్యా మయం ప్రాణ శ్ఛన్నః ।
>
> బృహదారణ్యకం ప్రథమాధ్యాయం షష్ఠబ్రాహ్మణం.

ఈ అమృతవస్తువు సత్యముచేత మూయబడినది. జీవాత్మ అమృతము. నామరూపములు సత్యములు. అనగా నామరూపములు పరమాత్మను కానరాక చేసినవి అని అర్థము. ఇందుకుదాహరణము: ఏపి మ్రానితో కొన్ని బొమ్మలను చేసి, తరిమెనపెట్టి, ఆ బొమ్మలకు రాముడు లక్ష్మణుడు అని పేళ్లుపెట్టి విక్రయమునకుగా బహిరంగమైన స్థలమునందు ఒకడుంచియుండునపుడు ఆ వీధివెంబడి పోవువారలు ఆ బొమ్మలను చూచి ఇది రాముడట ఇది లక్ష్మణుడట, ఈ రామలక్ష్మణులు ఎంత ముద్దుగా నున్నారు చూడుడు, అని ఒకరితొనొకరు ముచ్చటించుకొనుచుందురు కదా. ఎవరైనను ఏపిమ్రాను ఎంత చేవయెక్కిన తునక. ఎంత బాగావున్నది. ఇది ఎన్ని ఏండ్లు పెరిగి ముదిరి చేవయెక్కిన మ్రాను అని ముచ్చటించరు కదా. బాటసారులయొక్క ముచ్చటయందలి సారాంశమేమన రాముడు అను నామమును ఆ రూపమును ఏపిమ్రాను అను మ్రానియొక్క ప్రస్తాపమును కప్పినది గదా. ఎవరికైనను సక్రృత్తుగా నొకరికి తప్ప జనసమూహామునకు ఏపిమ్రానితునక అగపడలేదు. బహుమందికి రామనామమును రామవిగ్రహరూపమును మాత్రమే గదా కనబడినవి. ఇదే అర్థము ఈ పైవ్రాసియుండు "తదేతదమృతగ్ం సత్యేన ఛన్నం" అను బృహదారణ్యకోపనిషద్వాక్యముయొక్క అభిప్రాయము. ఈ అర్థమును ఉపనిషత్తులలో "యథా సోమ్యైకేన మృత్పిండేన విజ్ఞాతేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్ వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" అను వచనములలో సూచించిరి. మనము ఉండు భౌతికప్రపంచమందు జీవాత్మగా

ప్రవేశించి నామరూపములను స్వీకరించిన పరమాత్మను వారు తానే స్వీకరించిన నామరూపములు మూసిపెట్టినవి. చూచువారికి నామ రూపములే గోచరములు అగునుగాని సత్యమైన పరమాత్మగోచర ముకాదు. బుద్ధిశాలులు నామరూపములకు అతీతమైన పరమాత్మను కనుక్కొనగలరు. కనుక పరమాత్మకును జీవాత్మకును ఇంతేగాని స్వభావమందు భేదమేమియు లేదని జ్ఞానులు తెలిసికొందురు.

పరమాత్మ కేవిధముగా పుల్లింగ స్త్రీలింగాది భేదములు లెవో అదేవిధముగా జీవాత్మకును లింగవ్యత్యాసములు లేవు. నామరూపము లను ఎల్లలోచిక్కి, మాయకు లోబడి అజ్ఞానావృతమై, అంతఃకరణనిబద్ధమైన వస్తువు. తాను పారమార్థికమందు సచ్చిదానందమూర్తిగానుండినను, వ్యావహారికమందు తనయొక్క మహిమను మరిచి గుణములకు లోబడిన వస్తువు. సచ్చిదానంద మూర్తియొక్క అంశమైనను మరుపు అను మాయాస్వభావబద్ధుడైన వస్తువు. ఇదే జీవాత్మ. "భ్రామ్యతే బ్రహ్మచక్రే" అనినట్లు బ్రహ్మచక్రమైన బ్రహ్మాండమునందు పరిభ్రమణము (యాత్ర) చేయుచున్న వస్తువు. యాత్రలయందు అనుభవించు కష్టములుమెండు.

సచ్చిదానందమూర్తి "బహుస్యాం" అని అనుకొనినపుడు పుట్టిన స్పందమువల్ల కలిగిన వస్తువు జీవాత్మ. సచ్చిదానందమూర్తి "బహుస్యాం" అనుకొనినప్పుడు తనవంటివారలు అనేకముగా తాను కావలెనని ఇచ్ఛయించియుండురేగాని జీవాత్మవలె స్వల్ప శక్తులు గలిగి బలహీనులైన అనేకము కావలెనని అనుకొనియుండరు. గనుక శక్తిహీనులైన అనేక జీవాత్మలు ఇపుడు మనకు కన బడుచుండినను ఈ జీవాత్మలందరును కాలక్రమమున సచ్చిదానంద

మూర్తులు కావలసినవారే అని నిశ్చయము. ముండకోపనిషద్వాక్యము అయిన, “యథా సుదీప్తాత్పావకాద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతే సరూపాః । తథాఽక్షరాద్వివిధాః సోమ్యభావాః ప్రజాయంతే” అను వాక్యమునందలి అర్థము—మహాప్రకాశముతో వెలుగుచున్న దవదహనంబునుండి వేలకొలది గల మిణుగురులు ఏవిధమున బయలు వెడలునో, ఏవిధముగా ప్రతిమిణుగురును తనయొక్క జన్మస్థానమైన దావాగ్నికి నున్నశక్తులనన్నిటిని కలిగియుండునో అట్టి మిణుగురు స్వల్పమైనను తనయొక్కవృద్ధికి అనుకూలములయిన వరిగడ్డి మొదలగు పదార్థములలో పడినట్లైతే క్రమక్రమముగా వృద్ధిచెంది తన జన్మస్థానమైన దావాగ్నివలె అగుటకు సాధ్యమో అదేప్రకారము ఈశ్వరునిలోని సమస్త శక్తులనును కాలక్రమమున జీవాత్మకూడ పొందగలదు. ఈ చర్యకే మోక్షప్రాప్తియని పేరు. మోక్షమనగా విడదల; బంధనిర్ముక్తి. కనుక స్వస్వరూపోపలబ్ధి. స్వస్వరూపమనగా నీశ్వరస్వరూపము. అనగా, సచ్చిదానందమూర్తివలె పూర్ణుడు అవుట. వ్యవహారమందు ఏమైనప్పటికిని బంధముల బడియున్న జీవాత్మకును పరమాత్మకును స్వభావసామ్యమును మరువ కూడదు.

పరమాత్మకు లింగభేదములు లేవు. అనగా పురుషుడు కాడు. స్త్రీయును కాదు. నపుంసకమును కాదు. అదేవిధమున జీవాత్మకు కూడ లింగభేదములు లేవు.

నైవ స్త్రీ నపుమానేషః నైవచాయం నపుంసకః ।
యద్యచ్ఛరీరమాదత్తే తేనతేన సయుజ్యతే ॥

(శ్వేతాశ్వతరోపనిషత్తు)

స్త్రీ కాదు, పురుషుడు కాదు, నపుంసకము కాదు. అయితే ఏయే శరీరములను అంగీకరించునో ఆయాశరీరములయొక్క లింగముల వల్ల వ్యవహరింపబడును.

పురుషదేహమునందు ప్రవేశించినపుడు పురుషుడు, స్త్రీ దేహమునందు ప్రవేశించినపుడు స్త్రీయని వ్యవహరింపబడు. ఒక జన్మమునందు పురుషనామము, అనగా "శ్రీనివాసవరదవేంకటలక్ష్మీనృసింహతాతాచార్యులవారు" అనియును మరియొక జన్మమందు "తాయారమ్మగారు" "అల్లీసాయబు" అనియు పేళ్లతో పిలువబడును. గాని దేహములయందు ప్రవేశించిన జీవాత్మకు ఇహలోకపు పేళ్లు ఏదియును గావు.

ఈశ్వరుడు అను సచ్చిదానందమూర్తిని ఉపనిషత్తు వర్ణించు విధము:—

బృహచ్చ తద్దివ్యమనంతరూపం సూక్ష్మాచ్చ తత్సూక్ష్మతరం విభాతి ॥
(ముండకోపనిషత్)

ఆ వస్తువు చాల గొప్పది. అదే వస్తువు సూక్ష్మములకన్న నతి సూక్ష్మము. జీవాత్మను గురించియు ఉపనిషత్తు వర్ణించువిధము:—

వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ ।
భాగో జీవస్సవిజ్ఞేయః సచానంతాయ కల్పతే ॥
(శ్వేతాశ్వతరోపనిషత్)

దేహధారియైన జీవాత్మయొక్క రూపము అతిసూక్ష్మము. ఒక వెంట్రుక కొనయొక్క నూరింట నొకభాగములో మరల నూరింట నొకభాగమువలె సూక్ష్మము. మరియు నదే మిక్కిలి (అనంతమైన)

బ్రహ్మాండముకన్న పెద్దది. ఈ వచనములు పరమాత్మకును జీవాత్మకును స్వభావతః సామ్యమును తెలుపుచున్నవి.

జీవాత్మను గురించి చెప్పునపుడు వేదాంతగ్రంథములలో "అంతఃకరణే చిత్ ప్రతిబింబో జీవః" అని చెప్పియున్నది. ఇందువలన మన మెరుగవలసినదేమనగా అంతఃకరణము ఏమాత్రము శుద్ధముగానున్నదో జీవాత్మ ఆమాత్రము ప్రజ్ఞావంతముగా నుండును. "ప్రాణైశ్చిత్తం ఓతం ప్రజానాం తస్మిన్ విశుద్ధే విభవత్యేష ఆత్మా" అని ముండకోపనిషత్తునందు చెప్పియున్నది. సాధారణముగా జనసమూహముయొక్క అంతఃకరణము ఇంద్రియవ్యాపారము చేత మూయబడియున్నది. ఏమాత్రము అంతఃకరణము శుద్ధమో ఆ మాత్రము జీవాత్మయొక్క విభవము వెలియగునని యర్థము.

"బహుస్యాం" అని కాంక్షించిన సచ్చిదానందమూర్తి యొక్క సంకల్పము సిద్ధించవలెననియుంటే వారియంశలైన జీవాత్మలగు మన మందరమును మన మన యంతఃకరణములలో చేరియుండు మలమును పోగొట్టుకొని మన యంతఃకరణములను పరిపక్వము చేసికొని ప్రకృతమందు మనలకు బంధముగానుండు అంతఃకరణమును నిజమైన కరణము (ఆయుధము) గా చేసికొనవలయును. ఇదే సచ్చిదానందమూర్తిగారి యభిప్రాయము.

ఇందువలననే వారు "ప్రజాయేయ" యని అనుకొనిరి. "ప్రజాయేయ" యనగా నేను జన్మముల నెత్తుదునుగాక యని యర్థము.

క్రీడారంగమైన జగత్తుయొక్కయు క్రీడకుడైన జీవాత్మయొక్కయు ఉద్భవమును సంగ్రహముగా విచారించితిమి. ఇక "ప్రజా

యేయ" అను వాక్యమువల్ల పరిణమించిన క్రీడనుగురించి వ్రాయ వలయును. క్రీడకుడు క్రీడారంగమునందు సలిపిన క్రీడయొక్క వివర మును, క్రీడావిధానమును, క్రీడాపాత్రములనును గురించి రాబోవు అధ్యాయములయందు వ్రాయబడును. ఈ క్రీడకే

ప్రవృత్తి నివృత్తి

మార్గములని పేరు. ప్రవృత్తియనగా ప్రవేశించుట. నివృత్తియనగా బయలు వెడలుట. "బహుస్యాం" అనియు "ప్రజాయేయ" యని యు అనుకొనినవారు ప్రవృత్తిమార్గమందు నడువనారంభించిరని అనుకోవలెను. పరమాత్మయొక్క ప్రవృత్తిమార్గయాత్ర జరుగుకాల మునకు పరిమాణము చాల అధికము. వారి ప్రవృత్తిమార్గ యాత్ర ఎప్పుడు ముగియునో తెలియదు. వారు నివృత్తిమార్గయాత్ర ఎప్పుడు ప్రారంభింతురో తెలియదు. ఐనను వారి ప్రవృత్తిమార్గయాత్రను గురించి మూడవ అధ్యాయములలో వ్రాయనగును.

---

## 3 వ అధ్యాయము

ప్రజ్ఞానాంశుప్రతానైః స్థిరచరనికరవ్యాపిభిః వ్యాప్య లోకాన్ ।
భుక్త్వా భోగాన్ స్థవిష్ఠాన్ పునరపి ధిషణోద్భాసితాన్ కామజన్యాన్ ।
పీత్వా సర్వాన్ విశేషాన్ స్వపితి మధురభుఙ్మాయయా భోజయ న్నో ।
మాయాసంఖ్యాతురీయం పర మమృత మజం బ్రహ్మ యత్త న్నతోస్మి ॥



### ఆధిభౌతిక ఆధిదైవిక ఆధ్యాత్మిక సృష్టులు

ఇంతకుముందు అధ్యాయముయొక్క చివరను పరమేశ్వరునియొక్క ప్రవృత్తి మార్గమును ప్రస్తావించియుంటిమి. ఈ అధ్యాయము మొదటనుండు ధ్యానశ్లోకముయొక్క తాత్పర్యము పై చెప్పిన ప్రవృత్తిమార్గమును తెలియపరుచుచున్నది.

రెండవ అధ్యాయములో మూడు విధములైన సృష్టులు కలవు అని చెప్పబడెను. ఆధిభౌతికసృష్టికి అధికారి బ్రహ్మదేవుడు. ఆధిదైవికసృష్టికి అధికారి విష్ణువు. ఆధ్యాత్మికసృష్టికి అధికారి శంభువు అనియు చెప్పబడెను. ఆధిభౌతిక సృష్టియనగా పృథివ్యప్తేజోవాయుఆకాశము లను పంచభూతములను సృష్టిచేయుట. వ్యక్తప్రపంచమంతయు పాంచభౌతికమే కదా. సత్యలోకము మొ

దలు భూలోకము వరకును గల ప్రపంచమంతయు వ్యక్తప్రపంచమే. ఈ ప్రపంచమునకు కారణభూతములైన పంచభూతముల అణువులను బ్రహ్మదేవుడు సృష్టించును. అయితే ఆ అణువులకు ఒకటితోనొకటి కలియుశక్తి లేకయుండును. ఇసుకలోని రాళ్లు ఒకటితోనొకటి కలియవు. అయితే ఆ ఇసుకలో కొంచెము మట్టి కలిపి నీళ్లు పోసి నానిన తరువాత ఆ ఇసుకలోని రాళ్లు కలిసి బొమ్మలు మొదలగు అనేక రూపములను చేయుటకు అనుకూలించును. అద్దేవిధముగా బ్రహ్మదేవుడు సృష్టించిన అణువులు ఒకటితోనొకటి కలియక యుండెను. అప్పటివరకునుండిన స్థితికి ఆధిభౌతికసృష్టి యని పేరు. ఒకటితోనొకటి కలియగల శక్తిని విష్ణువు ఇచ్చి అట్టి శక్తిని పొందిన అణువులను అనేకరూపములగా నిర్మించుటకుగా అనేక దేవతలను సృష్టించిరి. దేవతలను సృష్టించినందున ఈ సృష్టికి ఆధిదైవికసృష్టి యని పేరు.

ఆధిదైవిక సృష్టియందు సృష్టింపబడిన దేవతలు అనేకరూపములను, వివిధాకారములను సృష్టించి లోకమునెల్ల నించిరి. అయితే మనుష్యశరీరమును సృష్టించు వరకును వివిధాకారములు ఎవరికిగా సృష్టింపబడినవో వారు ప్రవేశించలేదు. మానవశరీరములను సృష్టి చేసిన తరువాత ఆ శరీరములలో చిద్వస్తువును ప్రవేశింపచేసిన సృష్టికి ఆధ్యాత్మిక సృష్టియనిపేరు. ఆధ్యాత్మికసృష్టికి శంభువు అధికారి.

పై వివరించిన మూడువిధముల సృష్టులను అనేక పురాణములందు వేరువేరు పేళ్లతో వ్యవహరించియున్నారు. శివపురాణము, మొదటిభాగము, *౬ వ యధ్యాయమునందు పై వివరించిన సృష్టులను పురాణభాషాశైలితో చెప్పియున్నది. శ్రీమద్భా

గవతమందు కారణసృష్టియనియును కార్యసృష్టియనియును విమ ర్శించి ప్రాకృతసృష్టి, వైకృతసృష్టి యను మొదలగు భేదములతో వివరించియున్నారు. దేవీభాగవతమునందును విష్ణుపురాణమునం దును గూఢార్థముగా నీ త్రివిధసృష్టులను చెప్పియున్నది. ఉప నిషత్తులలో చెప్పియుండు సంగతులు బహుగూఢములు. సంప్ర దాయానుసారముగా నుపనిషత్తులను పఠించి సమన్వయపరచుకొ నినవారలకు గాక మిగిలినవారికి అవగాహన అసాధ్యము. మానవ శరీరము జీవాత్మరహితమై ఏ సమయమందైనను ఉండుటసాధ్యము కాదని కొందరు పండితులు వాదించినపుడు వినియున్నాము. ఇది పండితుల తప్పు కాదు. సనాతనధర్మమతమైన హిందూమతమునం దు నాలుగు వేదములు, ఉపవేదములు, షట్ శాస్త్రములు, పురాణ ములు, ఆగమములు, తంత్రశాస్త్రములు బహు బాహుళ్యముగా నున్నవి. ఆయా వేదములకు సంబంధపడిన ఉపనిషత్తులును ఉన్నవి. ఇన్నియు ఆత్మవిద్యకు అవశ్యము. ఇన్నిటిని అధ్యయనముచేసి వానియర్థములను గ్రహించినగాని యేదైన నొక విషయము యొక్క రహస్యము సమగ్రముగా తెలియదు. ఇన్ని శాస్త్రములను, వేదములను, అధ్యయనముచేయను మాత్రము ఒక పురుషా యుస్సు చాలదు. ఇక వాని యర్థములను విచారించినా, అసాధ్యము. లెక్కలేనన్ని పురాణము లున్నవి. అవి అన్నినో మహారహస్యములను తమ గర్భమందుంచుకొని యున్నవి. కనుక వేరు వేరు శాస్త్రములయొక్క సారాంశములను తెలిసి కొనిన అనేకమంది పండితుల సమూహములలోనే గాని రహస్య విషయములనుగురించిన జ్ఞానము లభించదు. ఇందుకనే పూర్వ

కాలమందు బ్రహ్మసత్రము అను పేరుతో మహాపండితసభలు గూడుచుండెను. ఈ కాలమందు అనేక హావ్యాసములవల్ల విద్యాభ్యాసమునందు ఆసక్తి తగ్గిపోయినది. కొంతమట్టుకు ఉదరపోషణార్థము దక్క పారమార్థికముగా శాస్త్రాభ్యాసము చేయువారు దుర్లభము. కనుక మహారహస్య విషయములు సులభముగా నర్థము చేసికొనువారు అరుదు.

గర్భోపనిషత్తునందు "సప్తమే మాసే జీవసంయుక్తో భవతి" అని చెప్పియున్నది. గర్భముధరించిన పిదప ఏడవ మాసమందు ఆ గర్భస్థశరీరమునందు జీవాత్మ ప్రవేశించుచున్నాడని అర్థము. అట్లైతే ఏడుమాసములవరకును జీవాత్మలేని శిశువు యొక్క శరీరమం దెవరుండిరి. నాలుగవ మాసము మొదలు ఆ పిండము చలించుటకు కారణ మెవడు. ఆరవ మాసము మొదలు కాళ్లు చేతులు విసురుటకు అధిపతి యెవరు. గనుక దీని యర్థము ఏమనగా జీవాత్మ కాపురములేని శరీరములు కూడనున్నవి అని యెరుగవలసినది. మరియును మనము నిద్రించుసమయమునందు జీవాత్మయగు మనము లోకాంతరములందు సంచారము చేయునపుడు మనశరీరములు శయ్యలలోనుండగా ఆ శరీరములయం దెవరుందురు. శ్వాసచలనము, భోజనము చేసిన అన్నము జీర్ణము అవుట, ఇట్టి శరీరపోషణచర్యలు ఎవరు జరుపువారు. ఈ ప్రశ్నలు సాధారణజనులకు ఇంగితము కావు. ఆధ్యాత్మికసృష్టివల్ల జీవాత్మలు శరీరములలో ప్రవేశించిరని పైన చెప్పబడెను కదా. అదివరకును జరిగియుండు ఆధిభౌతిక ఆధిదైవికసృష్టులవల్ల అధికారములు వహించిన దేవతాంశములు శరీరధారణాదిక్రియలను జరుపువారు

ములయందు సదా ఉందురు. అందువలననే జీవాత్మలు కాపుర ముండని శరీరములు కూడ జీవించియుండును.

ఐతరేయోపనిషత్తునందు ఆధిభౌతిక ఆధిదైవిక సృష్టులు చెప్పబడియున్నవి. పురుషశరీరము సిద్ధమైనంతవరకును ఇంద్రియ ములకు అధిష్ఠానదేవతలుగా నున్నవారు మానవశరీరమునకన్న తక్కువైన శరీరములలో ప్రవేశించుటకు ఒప్పలేదు. మానవశరీ రము సృష్టి అయిన తరువాత ఇంద్రియాధిష్ఠానదేవతలు మొద లుగా గల దేవతాగణములు వారివారి స్థలములను ఆక్రమించిరి. అందరును ప్రవేశించిన పిదప జీవాత్మ ప్రవేశించిరని చెప్పియున్నది. ఇది చక్కగా మననము చేయదగిన విషయము. ఈ వాదము ఇంతటితో చాలించి జీవాత్మయొక్క పుట్టుక వృద్ధి అను విషయ ములను గురించి విచారింతము.

## ప్రజ్ఞానాంశువులు

ఈ యధ్యాయము మొదట నుండు ధ్యానశ్లోకముయొక్క ప్రారంభమందుండు ప్రజ్ఞానాంశువులను గురించి విచారించవల యును. ప్రజ్ఞానము అనగా పరబ్రహ్మ. అంశువు అనగా కిరణము. ప్రజ్ఞానాంశువు అనగా పరబ్రహ్మముయొక్క కిరణము లేక అంశ, అనగా జీవాత్మ.

సచ్చిదానందమూర్తికి అఖిలాండకోటిబ్రహ్మాండనాయకు డని యొక పేరు కలదు. ఆ పేరుకు అనేక కోట్లకోలదిని లెక్క గల బ్రహ్మాండములకు అధిపతి యని యర్థము. లెక్క లేనన్ని బ్రహ్మాండములలో మనము ఉండు బ్రహ్మాండము ఒకటి. ఒక

బ్రహ్మాండమునందు సప్తలోకములు సప్తతలములు ఉన్నవని ముందే చెప్పబడినది. ఈ బ్రహ్మాండమునకు వెలుపల వైకుంఠము గోలోకము అను లోకములు ఉన్నవి అని కూడ చెప్పబడినది. అనేక బ్రహ్మాండములకు అధిపతి గనుక సచ్చిదానందమూర్తి మన బ్రహ్మాండమునకు వెలుపలనే యుండవలెను. అట్టి సచ్చిదానందమూర్తియొక్క అంశలు అయిన జీవాత్మలు కూడ మొదట మన బ్రహ్మాండమునకు వెలుపల యెక్కడనో ఉండవలెను. ఈ ప్రకారము మన బ్రహ్మాండమునకు వెలుపల నుండు జీవాత్మసంఘములు మన బ్రహ్మాండములో ప్రవేశించి యిచ్చటి అనుభవములను అనుభవించి తద్వారా అనుభవపరులై తమ జన్యస్థానమైన సచ్చిదానందమూర్తివలె విజృంభించవలెను అని ఆశ గొనిరి. అంశలు, కిరణములు అను పదములతో మహారహస్యమైన జీవాత్మ పరమాత్మల సంబంధమును తెలియపరచిరి గాని మనయొక్క మనస్సులకు అవగాహన అగునట్లు వేరు విధముగా చెప్పను సాధ్యము కాదు. శరీరము అనునది లేని సచ్చిదానందమూర్తికి జీవాత్మల సమూహములు శరీరము అని శాస్త్రములలో చెప్పియున్నది. పరమాత్మయొక్క శరీరములో జీవాత్మలందరును అణువులవలె ఇమిడియున్నారు అనియు చెప్పబడియున్నది. మన బ్రహ్మాండమునకు వెలుపల గల స్థితిని తెలిసికొనుట అసాధ్యము గనుక తమ తమ దృష్టికి గోచరమైనట్లు తపోధనులైన పెద్దలు జీవాత్మ పరమాత్మల సంబంధమును వర్ణించిరి.

వేదార్థసంగ్రహము అను గ్రంథమునందు గ్రంథకర్తయగు శ్రీరామానుజాచార్యులను మహానుభావులు చెప్పినది ఏమనగా:-

"జీవాత్మా తు బ్రహ్మణః శరీరతయా ప్రకారత్వాత్ బ్రహ్మాత్మకః" "యస్యాత్మా శరీరం" ఇతి శ్రుత్యంతరాత్.

దీనినే శరీరశరీరిభావము అందురు. జీవాత్మపరమాత్మలకు ఎంత అత్యద్భుతసంబంధముండినను మన బ్రహ్మాండములో ప్రవేశించి యీ బ్రహ్మాండముయొక్క రహస్యములు అన్నియు తామెరుగ వలెనని యిచ్ఛయించిన జీవాత్మలకు ఈ బ్రహ్మాండముయొక్క రహస్యములు ముఖ్యముగా భూలోకమందు ప్రారంభించి క్రమ క్రమముగా «భ్రామ్యతే బ్రహ్మచక్రే» అనినట్లు పరిభ్రమణము చేయు సందర్భమునందు ప్రతిలోకముయొక్క రహస్యములనను తెలిసికొనుటకు సందర్భము కలుగును. కనుక జీవాత్మయొక్క సంసారచక్రయాత్రను సత్యలోకమునుండి భూలోకమునకును మరల భూలోకమునుండి సత్యలోకమునకు అను రెండు తెఱగులగా జ్ఞానులు వర్ణించియున్నారు. సత్యలోకమునుండి భూలోకమునకు ప్రకృతివల్ల బంధింపబడు యాత్రకు ప్రవృత్తిమార్గ మనియును భూలోకసుఖానుభవములు అన్నియు ననుభవించి విసికిన పిమ్మట మరియు భూలోకమునుండి సత్యలోకప్రయాణ మారంభించు యాత్రకు నివృత్తిమార్గము అనియును పేళ్లు పెట్టిరి. ఈ రెండు మార్గములపైకి మనకు ప్రకృతమందు

## ప్రవృత్తిమార్గము

ను గురించిన విచారము అవశ్యము. ప్రవృత్తి యనగా ప్రవేశము. తాను ఉండిన లోకముయొక్క ప్రకృతిపరిణామమునకన్న స్థూల మైన ప్రకృతులతో నేర్పడిన లోకములలో ప్రవేశించి ఆ స్థూల

ప్రకృతిచేత బద్ధుడై తన నిజస్వభావమును జీవాత్మ మరిచిన స్థితికి ప్రవృత్తిమార్గయాత్ర యని పేరు.

యాత్రపోవువారు యాత్ర నారంభించు ముందు తాము ఏ దేశమందు యాత్రచేయదలచుకొన్నారో ఆ దేశముయొక్క వివరములను విచారించి తెలిసికొనునది ఆవశ్యకము. ఆ ప్రకారము మనము జీవాత్మగారు యాత్రచేయతలచుకొన్న దేశముయొక్క వివరమును కొంత విచారింతము. యాత్రదేశము సత్యలోకము మొదలు భూలోకము వరకును గల ప్రదేశము. ఏడులోకములును పంచభూతములు పంచీకరించినందున కలిగిన ప్రపంచముయొక్క భాగములు. గనుక ఏడులోకములను పంచభూతములకు పంచి పెట్టి చూడవలయును. ఏడు లోకములలో-

| | |
|---|---|
| సత్యలోకము . . | ఆకాశతత్త్వ ప్రధానము. |
| తపోలోకము, జనలోకము. | వాయుతత్త్వ ప్రధానము. |
| మహర్లోకము, స్వర్గలోకము | తేజస్తత్త్వ ప్రధానము. |
| భువర్లోకము . . | అప్తత్త్వ ప్రధానము. |
| భూలోకము . . | పృథివీతత్త్వ ప్రధానము. |

అని ఐదు తత్త్వములును ఏడు లోకములుగా పరిణమించియున్నవి. ఈ విధముగా బహుప్రకారముగా స్థూలాతిస్థూల, స్థూల, సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమము లైన ప్రకృతులతో నిండిన లోకములయందు ప్రయాణము చేయనుద్దేశించిన జీవాత్మ ఆయా లోకములలో తన వ్యవహారార్థముగా నొక్కొక్క శరీరమును సంపాదించుకోవలసియుండును. ఇంతకుముందు ౨౫ వ పుట

యందు ఆకాశకోశము మొదలగునవి ఒకటిలోనొకటి ప్రవేశించి యున్నవని చెప్పబడెను. గనుక సత్యలోకము మొదలు భూలోకమువరకును గల లోకములు కూడ నొకటిలో నొకటి ప్రవేశించి యుండునని జ్ఞాపకపరచవలసిన అవశ్యము లేకుండినను జ్ఞాపకార్థముగా నిప్పుడు ప్రస్తావము చేయబడెను. మన అనుభవములో భూమిపై ప్రయాణముచేయువాడు నడుచుటవల్లనో, బండ్లు ఎక్కుటవల్లనో యేవిధముగా నొక యూరు విడిచి మరియొక యూరికి ప్రయాణము చేయునో, సముద్రమందు (నీటియందు) ప్రయాణము చేయువాడు ఓడలు ఎక్కి ప్రయాణము చేయునో, ఆకాశమందు ప్రయాణముచేయువాడు ఱెక్కలు గట్టుకొనియైనను లేక విమానములనెక్కి యైనను ప్రయాణము చేయునో అదేవిధముగా జీవాత్మకూడ, ఆకాశతత్త్వ ప్రధానమైన లోకము (సత్యలోకము) నందు సంచరించుటకు ఆకాశతత్త్వప్రధానమైన శరీరమును సంపాదించుకోవలెను. అదేవిధముగా వాయుతత్త్వప్రధానమైన లోకము (తపోలోకము, జనలోకము) లయందు సంచరించ నుద్దేశించినపుడు వాయుతత్త్వప్రధానమైన శరీరమును సంపాదించుకోవలెను. ఇదేప్రకారము వరుసను తేజస్తత్త్వప్రధానమైన శరీరము నొకటిని, అప్తత్త్వప్రధానమైన శరీరము నొకటిని, పృథివీతత్త్వప్రధానమైన శరీరమొకటిని అనగా ఐదు విధములైన శరీరములను సంపాదించుకోవలెనని ప్రయత్నము చేయును. వేదాంత గ్రంథములందు ఆత్మ పంచకోశవిలక్షణుడు అనియు దేహత్రయ విలక్షణుడు అనియును చెప్పుట సంప్రదాయము. కోశములు అనగా సంచులు. దేహము లనగా చేతులు, కాళ్లు, తల, ముక్కు,

మొదలగు అవయవములను కలిగి మనకు గోచరము అయి యుండు మానవశరీరములవంటివి. కనుక ప్రవృత్తిమార్గప్రయాణో న్ముఖుడైన జీవాత్మ సత్యలోకమునందు అత్యున్నతభాగమునకు రాగానే ఆనందమయకోశముయొక్క అణువును సంపాదించుకొను ను. ఆకాశమందు పరుగెత్తుచున్న పక్షి భూసమీపమునకు రావలెనంటే మిక్కిలి ఉన్నతమైన చెట్టుకొనన ఒక కొమ్మపైన దిగి కొంతతడవు కూర్చుండి పిదప మెట్టు మెట్టుగా భూమికి దిగుటను చూచియున్నాము. అటువలె సత్యలోకమునందలి అణువులపైకి ఒక అణువును జీవాత్మ స్వీకరించును. ఇది మొదలు ఈ ఒక అణువును జీవాత్మ విడువదు. అదే ప్రకారము క్రిందిలోకములలో కూడ ఒక్కొక అణువును ఆక్రమించును. ఈ అణువుల సంఖ్య ఐదు. ఈ ఐదు అణువులనును తన యాత్ర ముగియునంతవరకును జీవాత్మ వదలదు. ఈ అణువులకు Permanent atoms అని ఇంగ్లీషు భాషయందు పేరు. అనగా "శాశ్వతమైన అణువులు" అని అర్థము. ఈ అణువులకు వేదాంతశాస్త్రములయందు

దేహబీజములు

అని పేరు. దేహబీజములనగా దేహములకు విత్తనములని అర్థము. జీవాత్మ ఇకముందు ధరించబోవు దేహములైన స్థూలదేహము, కామమయదేహము, మనోమయదేహము, విజ్ఞానమయదేహము, ఆనందమయదేహము అనునవి అన్నియు ఈ బీజములనుండి వర్ధిల్లును. మనకందఱకును ఈ దేహబీజము లున్నవి. ప్రతి జన్మమందును మన స్థూలశరీరము మరణముపొందినపుడు ఆ జన్మమందు స్థూల

శరీరముగుండా సంపాదించిన శక్తులన్నియు, స్థూల దేహబీజమునం దిమిడియుండును. మరల జీవాత్మ భూలోకమందు జన్మమెత్తుటకు ప్రయత్నము చేయునపుడు ఇదే దేహబీజమును కైగొని ఆ బీజమునందు ఇమిడియుండు దేహవాసనలనన్నిటినిని వికసింపజేసికొని తదనుగుణమైన శరీరమును కల్పించుకొనును. ఇదేవిధముగా నితర సూక్ష్మాది దేహములను గూడ కలుగచేసికొనును. దేహబీజములే ఇక ముందు జీవునికి ప్రాప్తించు శుభాశుభవాసనలను నానావిధములైన కర్మఫలములను చూపుచు అనేకజన్మములందు దేహములను ఉత్పత్తిచేయుటకు కారణములై యుండును. ఈ దేహబీజములన్నియు “సూత్రే మణిగణా ఇవ” అనినప్రకారము వరుసగా నొక సూత్రమును ఆశ్రయించి యుండును. సత్యలోకమందు ప్రవృత్తిమార్గయాత్ర నారంభించిన జీవాత్మ దేహబీజసూత్రము వెంబడి నడుచుచు క్రమక్రమముగా దిగువలోకములయందు సంచరించి స్థూలాతిస్థూలమైన భూర్లోకమును చేరి అగడితెలో పడ్డపిల్లివలె యేమియు చేయలేమిచే గ్రుడ్డివానివలె త్రోవతెలియక భ్రమను చెందియుండును. అంత ఆధిదైవికసృష్టివల్ల వచ్చిన దేవతలు అనేకవేలతరగతులవారు సత్యలోకము మొదలు భూలోకమువరకును అధికారము పొందియుందురు. ఆకాశము మొదలుగాగల తత్త్వములకు అధిష్ఠానదేవతలుగా నుండు ఉన్నతదేవతలకు అనేకవేలలక్షల సహచర, అనుచర, అధికృత, పిల్లదేవత లుందురు. జీవాత్మలు ఆకాశతత్త్వప్రధానమైన సత్యలోకము ప్రవేశించగానే గృహస్థులయిండ్లకు విచ్చేసిన అతిథులు మర్యాదలుపొంది తమ అభీష్టములను స్వీకరించురీతిగా సత్యలోకమును

ప్రవేశించిన జీవాత్మలను వారలు నడువవలసిన మార్గములయందు నడుపుచు వారల పురోవృద్ధికి కావలసిన దేహబీజములు అని వ్యవహరింపబడు భూతసూక్ష్మములను ప్రతి ప్రజ్ఞానాంశువునకును అది కోరుకొనిన భూతసూక్ష్మమును ఈ దేవతలు సంపాదించి యిచ్చెదరు. ఈ ఉన్నతలోకమునందుండు దేవతలు ఇతర బ్రహ్మాండములలోనుండి వచ్చి మన బ్రహ్మాండముయొక్క అధికారములను వహించిన వారు. వారి పూర్వానుభవజ్ఞానము నుపయోగించి తాము తమ చిన్నవయస్సునందు ఏవిధముగా నితరుల సహాయమును కోరి అట్టి సహాయమువల్ల పురోవృద్ధికి వచ్చిరో అట్టి అనుభవజ్ఞానముతో ఇప్పుడు క్రొత్తగా తమలోకమునకు వచ్చిన జీవాత్మలను స్నేహము చేసికొని వారికి కావలసిన సహాయములను ఇత్తురు. సచ్చిదానందమూర్తియొక్క స్వభావములైన సత్-చిత్ ఆనందములు అను అంశలను వృద్ధిపరుచుకొనుటకై ఆకాశతత్త్వపు భూతసూక్ష్మము నొకటిని, వాయుతత్త్వపు భూతసూక్ష్మమునొకటిని, తేజస్తత్త్వపు భూతసూక్ష్మ మొకటిని అనగా మూడు విధములైన భూతసూక్ష్మములను ఆ యా లోకముల ప్రకృతినుండి వీడదీసి జీవాత్మకు ఇచ్చి ప్రవృత్తిమార్గయాత్రకు సిద్ధపరతురు. ఇట్లు భూతసూక్ష్మ (దేహబీజ) త్రికంబును స్వీకరించిన జీవాత్మకు దివ్యజ్ఞానసమాజపువారు వ్రాసిన పుస్తకములలో "ఆత్మబుద్ధిమనస్సు" డని పేరిడిరి. వీరికే మాండూక్యోపనిషత్తునందు "ప్రాజ్ఞుడు" అని పేరిచ్చిరేమో. బ్రహ్మాండాద్బహిఃప్రదేశమందు అనుపాదకతత్త్వవాసియైన ఈశ్వరాంశమునకు దివ్యజ్ఞానసమాజపు పుస్తకములలో "మోనడ్" అని పేరిడిరి. వాస్తవమైన జీవాత్మ

"మోనడ్" ఏ. వీరికే మాండూక్యోపనిషత్తునందు "తురీయుడు" అని పేరు. వీరే పరమాత్మయొక్క శరీరమందు అణువుగా నుండు వారు. వీరే పాంచభౌతికప్రపంచమందు ప్రవేశించి ఆప్రపంచానుభవములనెల్ల సంపాదించికొని తన జన్యస్థానమైన పరమేశ్వరుని వలె కావలెనని ఆశగొని పాంచభౌతికప్రపంచప్రవృత్తిమార్గము నారంభించిన వారు. వీరినే యీ యధ్యాయమునందు "ప్రజ్ఞానాంశువు" అని వ్యవహరించి యున్నాము. వీరు మొదటి వారు. వీరిఛాయ లేక ప్రతిబింబము అనగా "ఆత్మబుద్ధిమనస్కుడు" "ప్రాజ్ఞు" డను వారు రెండవవారు. "మోనడ్" అను ప్రజ్ఞానాంశువును "తురీయుడు" అని వ్యవహరించితిమి. ఇక ముందు ఈ పుస్తకమునందు "తురీయుడు" లేక "తురీయాత్మ" యని యుపయోగించి నపుడంతయు "మోనడ్" అని అర్థము చేసికోవలెను. వీరి ఛాయ లేక ప్రతిబింబుడు అయిన రెండవవారిని "ఆత్మబుద్ధి మనస్కుడు" లేక "ప్రాజ్ఞుడు" అని వ్యవహరించితిమి. సంజ్ఞార్థముగా నికమీద వీరిని "ప్రాజ్ఞాత్మ" యనియు వ్యవహరింతము. వీరు రెండవ వారు. వీరు తురీయాత్మయొక్క ప్రతిబింబము. వీరి వ్యవహారసీమ సత్యలోకము, తపోలోకము, జనలోకము అను మూడులోకములు. పాంచభౌతికప్రపంచముయొక్క అనుభవములను సంపూర్ణముగా ననుభవించవలెనంటే భూలోకము వరకును దిగివచ్చిన గాని సాధ్యము కాదు. గనుక రెండవవారైన ప్రాజ్ఞాత్మ ప్రతిబింబించిరి. అపుడు "తైజసవైశ్వానరాత్మ" యను వారు మూడవవారుగా నుద్భవించిరి. వీరు మహర్లోకము మొదలు భూలోకస్థూలభాగమంతయు వ్యవహరించగలరు.

"తైజసవైశ్వానరాత్మ" పొందిన అనుభవములయొక్క సారాంశములన్నియు ప్రాజ్ఞాత్మయొక్క అంతఃకరణమునందు ఇమిడి వారి అంతఃకరణపరిపాకమునకు కారణము లవును. ఈ పుస్తకమునందు సంజ్ఞార్థముగా నుపయోగించిన ౧. తురీయాత్మ. ౨. ప్రాజ్ఞాత్మ. 3. తైజసవైశ్వానరాత్మ అను నామములు శాస్త్రసమ్మతములుగావు అని పండితులు ఆక్షేపించవచ్చును. ఐనను సంజ్ఞార్థము ఏదో పేళ్లుపెట్టవలసియున్నందున ఈ పేళ్ల నుపయోగించవలసి వచ్చినది. తప్పులైనయెడల పండితులు మన్నింతురని నమ్ముచున్నాము.

దేహబీజము లన్నిటిలో మొట్టమొదట స్థూలాతిస్థూలమైన పృథివీతత్త్వపు భూతసూక్ష్మము విజృంభించుట కారంభించును. ప్రతిభూతసూక్ష్మమును విజృంభించు నపుడు తనజాతికి చేరిన భూతసూక్ష్మములనే ఆకర్షించును. బహిఃప్రపంచమునందలి అనుభవములు మనుష్యుని మనస్సునకు (అంతఃకరణమునకు) సుఖము, సంతోషము, దుఃఖము అను అనుభవములను ఇచ్చును.

విషయానా మానుకూల్యేన సుఖీ దుఃఖీ విపర్యయే ।

విషయములు ఇంద్రియములకు అనుకూలముగా నుండినపుడు మనము సుఖమును అనుభవించినాము అనుకొందుము. అదే విషయములు ప్రతికూలముగా నుండినపుడు దుఃఖము అనుభవించినాము అనుకొందుము. ఇట్టి సుఖదుఃఖానుభవములు కలిగినప్పుడు అంతయు మనకు కలుగునట్టి సంతోషమువల్ల మన అంతఃకరణము వికసించును. ఈ స్థితికి అంతఃకరణ+ఆయామము అని పేరు.

మనకు దుఃఖములు వచ్చినపుడు అంతఃకరణ చిక్కి సుక్కి తగ్గును. ఇట్టి స్థితికి అంతఃకరణ+వ్యాయామము అని పేరు. ఇట్టి ఆయామవ్యాయామములన్నియు వాసనలు అను వానిని కలుగ చేయును. ఇట్టి వాసనలకు ఖనిజము వంటిది భూతసూక్ష్మము అను దేహబీజము. సనాతనధర్మమందు వాసనలు పలువిధములగా భాగించియున్నారు. స్థూలదేహమునకు సంబంధించిన వాసనలు అన్నియు స్థూలాతిస్థూల భూతసూక్ష్మమునందు ఇమిడియుండును. మనస్సుకు సంబంధపడిన వాసనలన్నియు మనోమయదేహమునకు అంకురము అయిన మనోమయ భూతసూక్ష్మమందు దాగియుండును. మరణకాలమందు మన స్థూలదేహము చెదిరిపోవునప్పుడు ఆ దేహముగుండా జతపడిన వాసనలన్నియు ఆ దేహముయొక్క భూతసూక్ష్మమునందు ఇముడును. అదే విధముగా కామమయ లోకమునందు అనుభవానంతరము కామమయశరీరము చెదిరిపోవునప్పుడు ఆ శరీరమునందు సంపాదించిన అనుభవములన్నియు అస్తిత్వభూతసూక్ష్మము అను దేహబీజమునందు ఇముడును. ఇదే ప్రకారము ఇతర శరీరములందు కూడ జరుగును. ఇట్లు వాసనలను ఇముడ్చుకొనియుండుటవల్ల ప్రయోజన మేమని విచారించగా జీవాత్మ స్వర్గలోకానుభవము ముగిసిన పిమ్మట "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" అని చెప్పినట్లు పునర్జన్మమునకు ఉద్యుక్తుడైనపుడు దేహబీజములు వానియందిమిడియుండు గుణములను వ్యక్తీకరించుటకు అనుకూలమైన దేహమును ఇయ్యగల తల్లిదండ్రులు, దేశము, ఇవన్నియు సందర్భించు నంత వరకును "పదవీ పూర్వ పుణ్యానాం" అని జాతకము వ్రాయువారు చెప్పునట్టి

సందర్భములను సంపాదించుకొనుటకు కాచియుండును. జన్మమెత్తిన పిమ్మట దేహబీజఅణువు తనవంటి అణువులనే వెతికి తనవద్ద చేర్చుకొనును. దివ్యదృష్టిగలవారు దేహబీజములను చూచి అట్టి దేహబీజములయొక్క స్వంతదారుడైన జీవాత్మ ఎంతటి వికాసము చెందియున్నాడని కనుక్కోగలరు. ఇంతటితో నీ విమర్శ చాలించి "తురీయాత్మలగు" ప్రజ్ఞానాంశువులు తమ జన్మస్థానమైన అనుపాదకతత్త్వప్రధానమైన లోకమునుండి ఏవిధముగా, ఎందరు బయలువెడలిరి అను మొదలగు సంగతులను విచారింతము. తరువాత మానవ శరీరధారణమునకు ముందు "తురీయాత్మ" యొక్క ప్రతిబింబముయొక్క ప్రతిబింబము ఏ యే శరీరములలో నివసించి యుండెను మొదలుగాగల సంగతులను విచారింతము.

పైనచెప్పిన "ప్రజ్ఞానాంశవులు" (మోనడ్డులు) అను తురీయాత్మలు ఈశ్వరుని శరీరమునందు అణువులు అని చెప్పబడెను కదా. ఒక శరీరమందు కోట్లకొలది లెక్కగల అణువు లుండును. అదేవిధముగా పరమేశ్వరుని శరీరమందు అణువులైన తురీయాత్మలుకూడ లెక్కలేనన్నియని యెరుగవలయును. అసంఖ్యాకమైన తురీయాత్మలపైకి కొందరుమాత్రము పాంచభౌతిక ప్రపంచానుభవమును గోరి అనుపాదకతత్త్వప్రధానమైన లోకము వదలి పాంచభౌతికప్రపంచమందు ప్రవేశించిరి. ఇట్లు ప్రవేశించిన తురీయాత్మలలెక్క ఒక పుస్తకమునందు ౬,౦౦౦,౦౦,౦౦,౦౦౦ అని చెప్పబడియున్నది. ఈ లెక్కకలిగిన జీవాత్మలు ఇపుడు భూలోకము, భువర్లోకము, స్వర్గలోకము అను లోకములలో జననమరణరూపమగు బ్రహ్మచక్రభ్రమణము చేయుచున్నారట.

తురీయాత్మలు పాంచభౌతికప్రపంచప్రవేశ మారంభించు సమయమందు "సప్త ప్రాణాః ప్రభవంతి తస్మాత్" ఏడుప్రవాహములగా బయలువెడలిరి. తెల్లనివర్ణముగల సూర్యప్రకాశమందు ఒక కిరణమును తీసి పగలతీసినట్లైతే ఆ తెల్లవర్ణము ఏడు వర్ణములుగా కనబడునని పాశ్చాత్య ప్రకృతిశాస్త్రమునందు ప్రవీణులైన పండితులు రుజువుపరిచియున్నారు. అదేవిధముగా కోటిసూర్యప్రకాశమువంటి ప్రకాశముగల పరమేశ్వరుని కిరణములైన తురీయాత్మలు కూడ ఏడువిధముల ప్రవాహముగా బయలువెడలిరి. ఒక్కొక ప్రవాహమునకును ఒక్కొక్క ఆధికారికపురుషు డీశ్వరతుల్యుడు అధిపతి.

ఈ అధికారికి దివ్యజ్ఞానసమాజపు పుస్తకములలో Planetary Logos (ప్లానెటరీ లోగాసు) అని పేరు. లోకములయందు ప్రవృత్తి మార్గయాత్ర చేయుచున్న జీవాత్మలందరును పైచెప్పిన యేడు ప్రవాహములలో యేదో ఒకటికి చేరినవారు. పాంచభౌతికప్రపంచమందు ప్రవేశించుటకు ఇష్టపడక పరమేశ్వరుని సామీప్యముననే నిలిచియుండు తురీయాత్మలు అనేకులు. వారి విచారణ మనకవశ్యము లేదు. పాంచభౌతికప్రపంచమందు తనయొక్క ప్రతిబింబమైన ప్రాజ్ఞాత్మయను "ఆత్మబుద్ధిమనస్కు" ని వ్యవహారము జరుపుమని తురీయాత్మ నిర్దేశించి తన ప్రతినిధి అయిన "ఆత్మబుద్ధిమనస్కుడు" సంపాదించిన అనుభవముల సారాంశమునంతయు తురీయాత్మ తనలో జీర్ణపరుచుకొనును. తద్ద్వారా పాంచభౌతికప్రపంచముయొక్క అనుభవమును ఎరిగినవా డగును.

ఆత్మబుద్ధిమనస్కుడు అను ప్రతిబింబము మహర్లోకమునకు క్రింద జరుగు వ్యవహారములలో చర్యజరుపుటకు అంతగా నిష్టపడరు

గనుక స్వర్గలోకము, భువర్లోకము, భూలోకము అను ముల్లోక ములందును తనకు ప్రతినిధిగా తనయొక్క ప్రతిబింబమైన "తైజస వైశ్వానరాత్మ" ను నియమించి ప్రతిజన్మమందును "తైజసవై శ్వానరాత్మ" పొందిన అనుభవములయొక్క సారాంశమును తన లో నైక్యపరుచుకొనును. ఇందును గురించిన వివరములు పున ర్జన్మవిచారము అను అధ్యాయమునందు విస్తారముగా చెప్పబడును.

పాంచభౌతికప్రపంచమందు ప్రవేశించిన తురీయాత్మ తన యొక్క ప్రతిబింబము, ఆ ప్రతిబింబముయొక్క ప్రతిబింబము ఈ రెండును తన స్వంత అభీష్టముప్రకారమే పనిచేయుచున్నారా లేక తప్పుత్రోవలలో చరించుచున్నారా అని మాత్రము జాగ రూకతతో కాచియుండును. జీవునియాత్రయందు చాలదూరము ప్రయాణము జరిగి నివృత్తిమార్గప్రయాణము నారంభించు సమయ ము సమకూరువరకును తురీయాత్మగారు తనయొక్క అధికార మును చూపి వారి ప్రతిబింబమైన ప్రాజ్ఞాత్మను సరియైనదారిన నడు పను స్వధాగా పూనుకోరు.

ఇకమీదట తైజసవైశ్వానరాత్మ స్థూలశరీరమును సంపా దించుకొనిన విధమును విచారించవలెను. "అమూర్తానాం చ మూర్తానాం ధ్యాయినాం యోగచక్షుషాం" అని యొకశ్లోకము కలదు. ఇచట చెప్పబడియుండు "అమూర్తధ్యాయు" లు అను వారిని దివ్యజ్ఞానసమాజ పుస్తకములయందు "అరూపదేవతలు" అందురు. అటేవిధమున "మూర్తధ్యాయు"లను "రూపదేవ తలు" అందురు. ఇందరును మరియును గల వేలకొలది అయిన దేవతాగణములు ఉన్నవి. స్కాందపురాణమందు అనేకములైన

దేవగణములను వర్ణించియున్నది. ముఖ్యముగా అష్టదిక్పాలకులు, విష్ణుదూతలు, శివదూతలు, చిత్రగుప్తగణములు, సిద్ధులు, సాధ్యులు, రుద్రులు, ఆదిత్యులు, వసువులు, అప్సరసలు, మరుత్తులు, యక్షులు; గంధర్వులు, విద్యాధరులు, కిన్నరులు, కింపురుషులు, ఉరగులు, సుపర్ణులు, భూతములు, ప్రేతములు, పిశాచములు, రాక్షసులు, పరానస్థులు, చారణులు, ఉత్కలులు, వైకలులు, వనస్పతులు, శాకినీ, డాకినీ మొదలుగాగల దేవతాగణములందరును సత్యలోకము మొదలు భూలోకపర్యంతమును గల లోకములయందు ముప్పదిమూడుకోట్లు ఉందురు. కరుణామూర్తియయిన పరమేశ్వరుడు మనుష్యసృష్టికి ఉద్యుక్తుడై ఇక రాబోవు జీవాత్మల సహాయార్థమై వైకారికి సృష్టి అని పురాణములయందు వాడుకపడిన దైవసృష్టి చేసి ఆ దేవతలను ముందురాబోవు జీవాత్మలను మానవ శరీరమును పొందుటకుగా అనుకూలమైన మార్గములయందు నడుచునట్లు సహాయపరుతురు.

> సృష్ట్వా పురాణి వివిధాన్యజయాఽత్మశక్త్యా
> వృక్షాన్ సరీసృపపశూన్ ఖగదంశమత్స్యాన్ ।
> తైస్తైరతుష్టహృదయః పురుషం విధాయ
> బ్రహ్మావలోకధిషణం ముదమాప దేవః ॥
>
> (శ్రీమద్భాగ – ౧౧ స్కం, ౯ అ)

దీనితాత్పర్యము — దేవుడు ఆత్మశక్తిచే వృక్షసరీసృపఖగదంశ మత్స్యపశ్వాది నానాదేహములను సృజించియు తనియక బ్రహ్మ పరోక్షసాక్షాత్కారసాధనంబైన బుద్ధినియ్యగల మనుష్యశరీరంబును సృజించి ముదంబొందె నని శ్రీమద్భాగవతంబున చెప్పి

యున్నది. కనుక తురీయాత్మయొక్క ప్రతిబింబము పాంచభౌతిక ప్రపంచమందు స్థావరజంగమ శరీరములు అందులో నుద్భిజ్జ స్వేదజ అండజ జరాయుజములను తెలుగులగు శరీరంబులం బ్రవేశించి ప్రవృత్తిమార్గయాత్ర యెట్లుచేసినది అను వివరమును విచారించవలెను.

ఆధ్యాత్మిక సృష్టికి అధికారిక పురుషు లనేకుల సహాయము కావలెను. అందులో మనువు అను అధికారి అతిముఖ్యుడు. కనుక మనువులను మన్వంతరములు మొదలగు విషయములను విచారించి తరువాత ఆధ్యాత్మిక సృష్టిని విచారింతుము.

## మన్వంతరములు—ప్రళయములు

ఆధిభౌతికసృష్టి, ఆధిదైవికసృష్టి యీ విషయములను గురించి వ్రాయుచువచ్చి ఆధ్యాత్మికసృష్టివిషయమై వ్రాయుటకు ముందు ఆధ్యాత్మికసృష్టియందు ముఖ్యాధికారమును పొందిన అధికారియగు మనువునుగురించి ప్రశంసించవలెను. ప్రతికల్పము నందును ౧౪ మనువులు రాజ్యమేలుదురు. మనువుల రాజ్యకాలమును విచారించుటకుముందు కాలస్వరూపమును విచారించవలెను.

తేఽహోరాత్రవిదోజనాః

అని శ్రీమద్భగవద్గీతయందు ౮వ అధ్యాయమునందు చెప్పియున్నది. అహోరాత్రములు అనగా పగళ్లు, రాత్రులు. మనుష్యుల పగళ్లు మనుష్యుల రాత్రులు మనకు అనుభవమునందున్నవి గదా. సూర్యప్రకాశమున్నంతవరకును మనకు పగలు. సూర్యాస్తమన

ము మొదలు సూర్యోదయమువరకును రాత్రి. ఒక పగలు ఒక రాత్రియును కలిసి ఒక దినము. ఏడు దినములు ఒక వారము. పదునైదు దినములు ఒక పక్షము. రెండు పక్షములు లేక ముప్పది దినములు ఒక నెల. ఆ పక్షములు రెండువిధములు శుక్లపక్షము, కృష్ణపక్షము. శుక్లపక్షమనగా సూర్యాస్తమనము అయినవెంబడే చంద్రుడు కనుబడుచుండుకాలము. అనగా ముందు వెన్నెల కనబడుకాలము. పౌర్ణిమ మొదలు అమావాస్యపర్యంతమును పదునైదు దినములు కృష్ణపక్షము. రెండునెలలు చేరితే యొక ఋతువు. మూడు ఋతువులు చేరితే యొక అయనము. రెండు అయనములు లేక ఆరు ఋతువులు లేక పండ్రెండు నెలలు చేరితే యొక సంవత్సరము. ఇది మనుష్యులకు వ్యవహారార్థముగా ఏర్పడిన లెక్క. మనుష్యమానమందు ఒకనెల పితృదేవతలకు ఒకదినము. మనుష్యులకృష్ణపక్షము పితృదేవతలకు పగలు. మనుష్యులశుక్లపక్షము పితృదేవతలకు రాత్రి. మనుష్యులయొక్క ఒక సంవత్సరము దేవతలకు ఒకదినము. మనుష్యమానమునందు ఉత్తరాయణము దేవతలకు పగలు. దక్షిణాయనము రాత్రి.

మనుష్యులలెక్కతో ౪౩౨౦౦౦ సంవత్సరములు అయితే కలియుగము. కలియుగమునకు రెండంతలకాలము అనగా ౮౬౪౦౦౦ సంవత్సరములు చేరితే ద్వాపరయుగము. మూడు కలియుగములంతకాలము అనగా ౧౨౯౬౦౦౦ సంవత్సరములకాలము త్రేతాయుగము. నాలుగుకలియుగములంతకాలము కృతయుగము అనగా ౧౭౨౮౦౦౦ సంవత్సరములకాలము.

| | | | |
|---|---|---|---|
| ఇట్లు కృతయుగము | ... | ... | ౧౭౨౮౦౦౦ |
| త్రేతాయుగము | ... | ... | ౧౨౯౬౦౦౦ |
| ద్వాపరయుగము | ... | ... | ౮౬౪౦౦౦ |
| కలియుగము | ... | ... | ౪౩౨౦౦౦ |
| | | వెరశి. | ౪౩౨౦౦౦౦ |

మనుష్యసంవత్సరములు చేరితే ఒక మహాయుగము. ఇది దేవతలకు ఒక యుగము. దీనినే దివ్యయుగము అందురు. ఇట్టి దివ్యయుగములు ఒకవేయి చేరితే చతుర్ముఖబ్రహ్మకు ఒక పగలు. అట్లే మరియొక వేయిదివ్యయుగములు బ్రహ్మదేవునికి ఒక రాత్రి.

సహస్రయుగపర్యంతం అహ ర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః ॥

(భగవద్గీత ౮వ అధ్యాయము)

బ్రహ్మదేవునియొక్క పగటికాలమునకు మన్వంతరము అని సంజ్ఞ. రాత్రికాలమునకు ప్రళయము అని సంజ్ఞ. బ్రహ్మదేవునియొక్క పగటికాలమందు లోకమును ఏలుటకుగా పదునలుగురుమంది అధికారులు ఏర్పడియున్నారు. ఈ పదునలుగురుమందికిని మనువులు అని పేరు. ఇద్దరేసి మనువులు ఒకజతగా రాజ్యమేలుదురు. వారలకు సహాయులుగా ఋషులు, ఇంద్రాది దేవతలు మొదలగు వారు పనిచేయుచుందురు. మనువు క్షత్రియాంశసంభూతుడు. ఋషులు బ్రాహ్మణాంశసంభూతులు. ఈ రెండు అంశలకు మూలస్థానము చతుర్ముఖబ్రహ్మ. ఇద్దరుమనువులు జతగా రాజ్య

మేలుదురు అని చెప్పబడెను. ఇద్దరిలో మొదటివారు ప్రధాన మనువు. రెండవవారు ఉపమనువు. ఇద్దరుమనువులయొక్క రాజ్య కాలమునకు మన్వంతరము అని పేరు. మన్వంతరము అను పద ములో రెండు పదములున్నవి. మను+అంతరము. అనగా, "మనువులయొక్కమధ్య" అని అర్థము. ప్రధానమనువుకు సహా యభూతుడై యొకమహర్షి యుండును. ముఖ్యమహర్షికి సహాయులు ఇతరఋషులుందురు. శ్రీమద్భాగవతము, విష్ణుపురాణము మొద లుగాగల అనేక పురాణములయందును మనువుల పేళ్లును ఋషుల పేళ్లును వారు వారు చేసిన చర్యలును కనబడుచున్నవి. అయితే అతి జాగరూకతతో విమర్శించి చదివితేనే గాని అర్థము పీడదు.

### ౧. స్వాయంభువమనువు, ౨. స్వారోచిషమనువు

వీరల సుతులు.

ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు, చైత్రుడు, చిత్రుడు, మదనుడు, కింపురుషుడు మొదలుగాగలవారలు.

వీరికాలపు ఋషులు.

భృగువు, మరీచి, అఙ్గిరస్సు, అత్రి, క్రతువు, పులహులు, వసిష్ఠులు, ప్రాణుడు, వాతుడు, అగ్ని, వృషుడు, నిస్వరుడు, స్తంబ, కుడు, ఊర్జకుడు.

### 3. ఉత్తముడు, ౪. తామసుడు

వీరిపుత్రులు.

విరజస్సు, గాత్రుడు, ఊర్ధ్వబాహువు, సవనుడు, అనఘుడు, సుత పస్సు, శుక్రుడు, ఖ్యాతి, జానువు, జఙ్ఘుడు, కేతురూపుడు మొదలుగాగలవారు.

వీరి కాలపు ఋషులు.

వసిష్ఠ పుత్రులు ఏడుగురు, కావ్యుడు, చైత్రుడు, పృథూరుడు, అవ్య
వర్ణుడు, అగ్ని, పీవరుడు, జ్యోతిర్ధాముడు.

౫. రైవతుడు, ౬. చాక్షుస్సు

వీరిపుత్రులు.

బలుడు, బంధువు, ఉజ్జ్వలుడు, ప్రియవ్రతుడు.

వీరి కాలపు ఋషులు.

ఊర్ధ్వబాహువు, దేవబాహువు, హిరణ్యరోముడు, వేదవంతుడు,
దాముకుడు, శ్రీమంతుడు, పర్జన్యుడు, సుమేదుడు, విజ
రుడు, హవిష్మంతుడు, ఉత్తముడు, మధువు, సహిష్ణువు,
అతినామకుడు.

౭. వైవస్వతుడు, ౮. సూర్యసావర్ణి

వీరిపుత్రులు.

ఇక్ష్వాకువు, నాభాగుడు, ధృష్టువు, నరిష్యన్తుడు, శర్యాతి, పృషాదుడు,
నిర్మోహుడు, వీరబాహువు.

ప్రకృతమందు లోకము వైవస్వతమనువుయొక్క అధికార
మునకు లోబడియున్నది. రాబోవు మనువు పేరు సూర్యసావర్ణి.
వీరి కాలపు ఋషులు:—

గౌతముడు, జమదగ్ని, కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, వసిష్ఠుడు,
విశ్వామిత్రుడు, గాలవుడు, దీప్తిమంతుడు, పరశురాముడు,
కృపాచార్యులు, అశ్వత్థామ, కృష్ణద్వైపాయనులు, ఋశ్య
శృంగులు.

ఇదే ప్రకారము మిగిలిన ఆరుగురుమనువులను గురించియు వ్రాయవచ్చును గాని, గ్రంథబాహుళ్యమగునని వదులుచున్నాము.

ఒక్కొక్క మనువునకును ఒక ఇంద్రుడు కలడు. మనువుయొక్క ఆజ్ఞానుసారముగా నింద్రుడు చర్య జరుపును. వైవస్వతమనువుయొక్క ఇంద్రుని పేరు పురందరుడు. సూర్యసావర్ణిమనువుయొక్క ఇంద్రుని పేరు బలిచక్రవర్తి. మనువులయొక్కయు, ఋషులయొక్కయు అధికారములు మొదలగువానిని గురించియు మనుపుత్రులయొక్క విచిత్రనామధేయములయొక్క అర్థములను గురించియు ఇకముందు వేరొక గ్రంథము వ్రాయవలెనేమోగాని ఈ గ్రంథమందు వ్రాయుటలేదు.

## ఆధ్యాత్మికసృష్టి

ఈ విషయమును ౫౪ వ పుటలో వదలి మన్వంతరములు ప్రళయములు మొదలగు విషయములను సంగ్రహముగా వ్రాసితిమి. ప్రజ్ఞానాంశువులని యపరనామధేయముగల తురీయాత్మలు తాము సత్యలోకము, తపోలోకము, జనలోకము అను లోకముల యందు అనుభవస్వీకారార్థము తమకు ప్రతినిధులగా ఆత్మబుద్ధిమనస్సులు అను అపరనామధేయముగల ప్రాజ్ఞాత్మలను తమ ప్రతిబింబములగా కలుగజేసికొని రని చదివినాము. ప్రాజ్ఞాత్మలు జనలోకము విడిచి క్రిందికి దిగను ఇష్టము లేక మహర్లోకమందు ఉన్నతభాగమునకువచ్చి అచ్చటినుండి దిగువలోకములలో అనుభవస్వీకారార్థముగా ప్రతిబింబించిరనియును అట్టి ప్రతిబింబమునకు 'తైజసవైశ్వానరాత్మ' యని సంజ్ఞావాచకమనియు చదివినాము.

తైజసవైశ్వానరాత్మల మైన మనము భూర్లోకము, భువర్లోకము, స్వర్గలోకము అను త్రిలోకియందు అనుభవించు సుఖదుఃఖముల యొక్క సారాంశమును మన ప్రాజ్ఞాత్మకు నివేదనము చేయు చున్నామనియు అట్టి ప్రాజ్ఞాత్మ తాము అన్నిలోకములలో సంపాదించిన అనుభవములయొక్క సారాంశములన్నియు వారికి మనకును ఆదిపురుషుడైన తురీయాత్మకు ఇత్తురనియు నిదివరకే వ్రాయబడెను. మరియు నిట్టి యనుభవములవల్ల జనించిన వాస నలు శక్తులు అన్నియు తురీయాత్మగారు అంగీకరించిన దేహబీజము లని అపరనామధేయము గల భూతసూక్ష్మములయందు ఇమిడి యుండుననియు వ్రాయబడెను. ఇపుడు భూర్లోకభువర్లోకస్వర్గలోక ముల యనుభవముల నిచ్ఛయించిన 'తైజసవైశ్వానరాత్మ' యొక్కయాత్రనుగురించి విచారించవలెను. ఈ యాత్ర చాల గొప్ప ప్రయాణమును పోలియుండును. ప్రయాణము చేయువారలు తాము పోదలచియుండు దేశ మిట్టిదని విచారించుట వాడుక. 'తైజస వైశ్వానరాత్మలు' ఇట్టి విచారణ చేయుట యరుదు. అయినను ఈ విచార మత్యావశ్యకము. స్థూలాతిస్థూలమగు భూర్లోకము వరకును దిగి అట్టి స్థూలాతిస్థూల ఉపాధులయందు ప్రవేశించు 'తైజసవైశ్వానరాత్మ' ఆ ఉపాధులయొక్క వొల్లలో జిక్కి గుడ్డివానివలె బహుకాలము నానావిధములయిన అనుభవములను బొందుచు ప్రకృతిస్వభావమునకు అలవాటుపడి దానిని కొంచెము కొంచెముగా నెరుగుచు కాలాంతరమున తన నిజస్వభావమును ఎరిగి ప్రకృతికన్న తాను బలవంతుడని యెరిగి ఆ ప్రకృతిని జయించి స్వస్వభావానుసంధానమును పొందును. జీవులు అనగా ప్రాజ్ఞా

త్మలు వానియొక్క ప్రతిబింబములు గూడ నీశ్వరాంశములే. ఆత్మ స్వభావులయ్యు అనాత్మయగు ప్రకృతివల్ల బంధింపబడుదురు. అనాత్మ వేరు తాను వేరు అని జీవాత్మలు అనుభవముద్వారా తెలిసికొనుటకు మనుష్యదేహములందు ప్రవేశించి అనేకస్థూలజన్మము లెత్తినగాని సాధ్యముగాదు. స్థూలాతిస్థూలోపాధులయందు ధాతువర్గము అతి స్థూలతరము. ధాతువర్గము లనగా పాషాణాదులు. జీవాత్మలు (తైజసవైశ్వానరాత్మలు) పాషాణములలో ప్రవేశించి తమయొక్క అంతఃకరణములను వికసింపజేసికొనుటకు ప్రయత్నపడునపుడు వారికి సహాయభూతులైన దేవతలు అనేక తరగతులవారు తోడగుదురు. ధాతువర్గ మనగా రాళ్లు, లోహములు మొదలగు దృఢపదార్థములు. ఇవి స్థావరములు. రాళ్లలో ఎన్నో జాతులు గలవు. మణులు అనేకములు. లోహములన్ననో, ఈ కాలమందు మనకు తెలిసిన బంగారము, వెండి, తామ్రము మొదలగునవి కాక అనేక విధములు గలవు. హరివంశము అను గ్రంథమొక్కటి యున్నది. అందులో శ్రీకృష్ణమూర్తిగారి యుపయోగమునకుగా ద్వారకయందు నిర్మింపబడిన నగరి కట్టడములో ఎన్ని విధములయిన మణులును లోహములు నుపయోగింపబడినదియు ఆ గ్రంథమును చదువువారలకే తెలియును. ఆ మణులు లోహములు వీటియొక్క పేళ్లైనను ప్రకృతమందు వాడుకలో లేవు. ధాతువుల minerals లో సహా ఎరుక cognition, ఇచ్ఛాద్వేషములు desire and hate, స్నేహవిరోధభావములచే నేర్పడు చర్యలు actions కలవని యిప్పటి రసవాదశాస్త్రజ్ఞులు Professors in Chemistry కనిపెట్టియున్నారు. సామాన్యజనులు

అనుకొనునట్లు ధాతువులు నిర్ప్రాణులు గావు. శిల్పశాస్త్ర జ్ఞులు పాషాణములకు నిద్రావస్థ యున్నదనియు ఆ సమయమందు పాషాణములను శిల్పి తనకు కావలసిన విధముగా లోపరుచుకొను ననియును చెప్పుదురు. నిద్రావస్థ యున్న యెడల జాగ్రదవస్థ కూడ నుండవలయును. ఈ రెండవస్థ లున్నపుడు ఇచ్ఛా, ద్వేష ము, సుఖము, దుఃఖము, ఇవన్నియు నుండవలయును. మరియు వైద్యశాస్త్రమందు చెప్పిన సింధూరములు భస్మములు ఇట్టి వాని యందు కొన్ని లోహములకు గల వీర్యమును చంపి వానియం దుండు గుణములను వృద్ధిచేయుదురు. ఇంగ్లీషుభాషయందు "సిల్వరుసాల్టులు" అను రసాయనములు కలవు. ఇందు రెండు ధాతువులు దాంపత్యము జెందియుండును. మరియొక దంపతి "హై డ్రోక్లోరికు ఆసిడు" అని కలదు. ఇందువలన ధాతువులదాం పత్యము తెలియబడుచున్నది. మనుష్యులలో వ్యభిచారమున్నది కదా. అదేవిధముగా "సిల్వరుసాల్టులు" ను "హైడ్రోక్లోరికు ఆసిడును" ఒకటి సమీపమున నొకటిని ఉంచితే ఒక దంపతిలోని స్త్రీ మరియొక దంపతిలోని పురుషుని కోరుకొని పరుగెత్తిపోవును. ఇదంతయు తెలివియొక్క చేష్టయే కదా.

చరకసంహిత సూత్రస్థానము అను గ్రంథమునందు ధాతు వుల గుణాగుణములను, చేష్టలను, ఆటలను, కామక్రోధాదులను గురించి చెప్పియున్నది. కొన్నిధాతువులకు ముప్కారము కూడ కలదు. పాషాణాదులలో చేరిన ధాతువు పటిక అనునది యున్నది కదా. పటిక చక్కగా నున్నగా పొడిచేసి మసలుచున్న వేడినీటి యందు కరిగించి ఆనీటిని ఒక పాత్రయందుంచి గాలిసోకునట్లు

పెట్టితే ఆ నీటి వేడిమి తగ్గను తగ్గను నీరు ఎండిపోయి ఆ నీటి యందు కరిగి కలిసిపోయిన పటికపొడి ఆ పొడిగానే అదియుండిన పాత్రలో నుండవలెనుకదా. అట్లుండదు. ఆ నలుసు లన్నియు నొకటితో నొకటి చేరి విచిత్రములగు రాళ్లుగా నేర్పడును. పటికను కరగచేసి ఎన్ని తడవలు మరల మరల కరిగించినను అదే రూపము నెత్తును. ఇదే విధముగా మైలుతుత్తముకూడ. ఇందువలన ఆ పటిక నలుసులయందును మైలుతుత్తపు నలుసుల యందును ఒకజ్ఞానము కనుపడుచున్నది అని ఊహించవలెను.

లోహములకు అలసట కలదని పాశ్చాత్యశాస్త్రజ్ఞులు చెప్పి యున్నారు. నిరంతరము పనిచేయుటవల్ల అలసట ప్రాప్తించును. ఒక గడియారమందు లోహముతో చేయబడిన భాగములు ప్రతి నిమిషమును ఎడతెగక పనిచేయుచు వచ్చుచు కొన్ని సంవత్సరములకు పిమ్మట కాలనిరూపణము అను చర్యను తప్పుగా చేయుచుండును. అప్పుడు మరమ్మత్తులు అవశ్యము లేక కొన్ని దినములు పనిచేయనీయక ఊరకయుంచితే మరియు పూర్వమువలె బాగా పనిచేయ నారంభించును. స్థూలాతిస్థూలములైన ధాతువర్గ ఉపాధులయందు ప్రవేశించిన జీవాత్ములు (తైజసవైశ్వానరాత్మలు) ఆ ధాతువర్గములకు సంబంధపడిన దేవతలయొక్క సహాయమువల్ల తాము పొందతగిన అనుభవములను పొంది అనేకవేల సంవత్సరములకు పిమ్మట స్థావరములయ్యు కొంతమట్టుకు స్వేచ్ఛావిహారశక్తిగల ఓషధివనస్పత్యుపాధులలో ప్రవేశింతురు. స్థావరములైన ధాతువులు అనగా పాషాణాదులు. వానికి ఒక స్థలము విడిచి మరియొక స్థలమునకు పోవుశక్తి లేదు. ఉన్నస్థలమునందైనను తమ

అంగములను కదిలించు శక్తిలేనివి. స్థావరములయ్యు ఓషధివన స్పతులు స్థలమువిడిచి స్థలమునకు పోవు శక్తిలేకపోయినను తమ అంగములైన కొమ్మలను కదిలించు శక్తి కలిగియుండును. కనుక పాషాణములయం దుండినప్పటికంటె జీవాత్మకు (తైజసవైశ్వాన రాత్మకు) తన యంతఃకరణమును వికసింపజేసికొనవలసినందులకు అనుకూలము అధికముగా నుండును. పాషాణాదులయందు నివ సించి యుండగా 'తైజసవైశ్వానరాత్మ'. గాఢనిద్రావస్థయం దుండినట్లు కనబడును. కేవల సత్తామాత్రము గానుండి తీవ్ర ముగా సూర్యకిరణములు ప్రకాశించగా ఓషధివర్గము అలసట కనుపరుచును. వర్షము కురియగానే స్ఫురత్తు కలిగి తమ సంతోష మును కనుపరుచును. తమకు కావలసిన ఆహారము, సూర్యకాంతి మొదలగునవి యెచ్చట దొరుకునో ఆ యాస్థలములకు తమ వేళ్లను తీగలను కొమ్మలను వ్యాపింప చేయును. మరియు తీగజాతి తమకు ఆధారమును వెదకుచు గోడలయందు సన్న పల్లముండి నను ఆ పల్లములయందు ప్రవేశించి కొంత స్థలమును ఏర్పరచు కొని అంతటికన్న ననుకూలమైన స్థలమును వెదకును. ఇట్టి చర్య లన్నియు అంతఃకరణయొక్క ఆయామవ్యాయామములను కను పరుచుచున్నవి. 'తైజసవైశ్వానరాత్మకు' ఆహారనిద్రాభయాదు లను తెలిసికొనుటకు ఆస్పదములను చాల అధికముగా నోషధివన స్పతివర్గము ఇచ్చును. పాషాణాదులలో కనుపరచలేని రసోల్లాస శక్తిని ఓషధివనస్పతులలో 'తైజసవైశ్వానరాత్మ' కనుపరచ గలదు. రసోల్లాసశక్తి యనగా రసము అధికమైనతరి ఉల్లాస మును చూపుట. శ్రుతులయందు "అత్ర రసోపి దృశ్యతే" అని

చెప్పబడియున్నది. అనగా ఓషధివనస్పతులయందు రసము తెలియుచున్నది అని అర్థము. ఓషధివనస్పతులయందు ప్రాణము రసరూపముగా నభివ్యక్తించుచున్న దని యభిప్రాయము. ఓషధివనస్పతులలో అనేకకోట్ల జాతులున్నను కొన్ని ముఖ్యమైనవి మనకు తెలియవలసినవి ఉన్నవి.

> వనస్పత్యోషధిలతాః త్వక్సారా వీరుధో ద్రుమాః ।
> ఉత్స్రోతసః తమఃప్రాయా అంతస్స్పర్శా విశేషిణః ॥
>
> (శ్రీమద్భాగవతం-3 స్క - ౧౦ అ)

అర్థము— మీదికి వ్యాపించుట, చైతన్యము, అవ్యక్తముగా తెలియుట, స్పర్శజ్ఞానము మాత్రము కలవి.

లతలు అనగా పూలుగాని పండ్లుగాని గలిగి పందిళ్లు మొదలగువానిని ఎక్కుట కవశ్యము లేనివి. మల్లె, జాజి, కాకర, బీర, సొర మొదలగునవి.

ఓషధులు పూచిన తర్వాత ఫలముల నిచ్చి అంతటితో ముగియునట్టి జాతులు. జొన్నలు, సజ్జలు, కాయధాన్యము మొదలగునవి.

త్వక్సారము లనగా త్వక్కునందు బలము గలవి. అనగా చర్మమందు బలము గలవి. వెదుళ్ల వంటివి.

ద్రుమములు అనగా పువ్వులు పూచి కాయలు కాచునట్టి మ్రాకులు, మామిడి మొదలగునవి.

9

వనస్పతులనగా పుష్పలు పూయకయే ఫలమునిచ్చు
అశ్వత్థము, మేడి, పనస, మఱ్ఱి మొదలగు
వృక్షములు.

ఇవన్నియు తమోగుణప్రధానములైనవి. పై వివరించిన జాతులలో
కొన్ని చింత, అవిసె మొదలగు నవి సూర్యు డస్తమించి
నది తెలిసికొని తమ ఆకులను ముడుచుకొనును. మఱ్ఱి, మా
మిడి, జువ్వి, అశ్వత్థము మొదలగు వనస్పతులు అనేక నూర్ల సం
వత్సరములు జీవించియుండి, ఆకురాలుకాలునందు ఆకులు రా
ల్చుచు, పూలఫలాదులకాలమందు పూచుచు ఫలించుచు సంవ
త్సర ప్రతిసంవత్సరము ఇట్టి చర్యనే మరల మరల ఆచరించుటవల్ల
పూర్వాపరజ్ఞానము అను జ్ఞాపకశక్తిని సంపాదించను ఆరం
భించును. వృక్షములలో అనేక దేవవర్గములు పని చేయుచు ఆకు
లకు అలంకారములైన వర్ణములనిచ్చు వారు కొందరు, భూమి
లోనుండి వృక్షములు పీల్చు రసములను పైకి గొనిపోవువారు
కొందరు, ఆకాశమందుండి సూర్యప్రకాశము, గాలి, వాన, మొద
లగు ఆహారములను చెట్లకొనలనుండి బోదెకు కొనిపోయి చేవ
కలుగునట్టు చేయువారు కొందరు, పూలుపూచు చెట్లలో పూల
రేకులకు, వానివర్ణమును, కాంతిని మొదలగువానిని పుష్కలముగా
ఇచ్చి మేము ఇంత సొగసైన పుష్పములను కలుగజేసితిమి కదా
యని గర్వపడు వారు కొందరు, ఇట్లు కోట్లానుకోట్లలెక్కగల
దేవతావర్గము ఓషధివనస్పతి వర్గములయందు వివిధోపాధులను
సిద్ధపరచి జీవాత్మలకు (తైజసవైశ్వానరాత్మలకు) ఇచ్చుచుందురు.
ఇట్లు ఒక మన్వంతరకాలము జరిగినపిమ్మట తైజసవైశ్వానరాత్మ

ఓషధివనస్పతివర్గమును వదలి మృగాదుల శరీరంబులయందు ప్రవే శించుటకు సిద్ధమగును.

## తిర్యగ్జంతువులు

అనునవి ఉత్తరకాలవిచారంబు గానవు. ఆహారనిద్రాభయాది జ్ఞానమాత్రంబులై ఘ్రాణేంద్రియంబున నర్థగ్రహణంబు సేయునవి. దీర్ఘానుసంధానశూన్యంబులై అనగా చిత్తముయొక్క వ్యాపారమైన స్మృతి లేక స్మరణము అను జ్ఞాపకశక్తి లేనివి. ఇవి సృష్టియందు ౨౮ తరగతులు గలవి.

(౧) భాగింపబడిన గొరిసె గలవి తొమ్మిదిజాతులు. అవి యేవన—ఆవు, మేక, గేదె, కృష్ణసారము (చుక్కలుగలజింక), పంది, గవయము అను వృషభజాతి, రురువులను జింకలజాతి, గొఱియ, లొట్టిపిట లను ఒంటె.

(౨) ఒకటే గొరిసెగలవి ఆరు—గాడిదె, గుఱ్ఱము, కంచరగాడిదె, గౌరము అను జింకజాతి, శరభము అను జింకజాతి, చామరి అను నొక జింకజాతి.

(3) ఐదుగోళ్లుగలవి పండ్రెండు—కుక్క, నక్క, తోడేలు, పులి, పిల్లి, కుందేలు, ముండ్లపంది, సింహాము, కోతి, ఏనుగు, తాబేలు, ఉడుము.

(౪)* నీటనుండుజంతువులు—మొసళ్లు మొదలగునవియు, పక్షులును. (ఆకాశమందు పరుగిడు కంక గృధ్ర బక శ్యేన హంస సారసాదులగు పక్షి జాతులను క్రిమికీటాదులను కూడ తిర్యగ్జంతువులతో లెక్కపెట్టవలయును.)

## సమూహాత్మ

క్రిమికీటములు సాధారణముగా బల్లి, తొండ, పక్షులు మొదలగువానికి ఎరగా నేర్పడియున్నవి. క్రిమికీటములు కూడ జగద్వ్యాపారమందు వికాసమునకు కావలసిన జంతువులే. ప్రతి జాతి జంతువులకును ఆ జాతి కంతయు చేరి సమూహాత్మ యొకరుండురు. నల్లులు అను క్రిములకంతయు ఒక సమూహాత్మ. పిల్లులకంతయు నొక సమూహాత్మ. పాములలో ననేక జాతులుండినను వాటి కంతయు వేర్వేరు సమూహాత్మలు. పైన చెప్పబడిన తిర్యగ్జంతుజాలమునకెల్లయు నొక్కొకజాతికి నొక సమూహాత్మ వేరు వేరుగా నుండును. అంతఃకరణవికాసము ఒక పదవికి వచ్చునంతవరకు సమూహాత్మ అవశ్యము.

* సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణకర్మాణి చాపరే

అనగా జ్ఞానేంద్రియములయొక్కయు కర్మేంద్రియములయొక్కయు వ్యాపారము అని అర్థము. దేహధారణార్థమును, జాతితంతుసేవార్థమును ఆహారనిద్రాభయమైథునాదులు తిర్యగ్జంతువులయందు విశదముగా కనబడును. కొంతమట్టుకు జ్ఞానేంద్రియ

ములగు శ్రోత్రేంద్రియము, త్వగింద్రియము, చక్షురింద్రియము, రసనేంద్రియము, ఘ్రాణేంద్రియము ఇవన్నియు చర్మ జరుపు చుండినను మనుష్యశరీరమందు జ్ఞానేంద్రియములు పనిచేయు నంత సుష్ఠుగా తిర్యగ్జంతువులయందు పనిచేయవు. మరియు అంతరింద్రియమైన మనస్సు మనుష్యునియందు పనిచేయునంత సుష్ఠుగా తిర్యగ్జంతువులయందు పనిచేయచాలదు. కనుక మనస్సు సుష్ఠుగా పనిచేయుటకు సాధ్యమగునంతవరకును తిర్యగ్జంతువులు వృద్ధి అనగా అంతఃకరణపరిపాకమును పొందుటకు సమూహాత్మ యొక రుండవలయును. జీవాత్మలు సుష్ఠుగా సిద్ధమైన మానవదేహ ములలోనే గాని ఇతరదేహములలో ప్రవేశించరు. సృష్టిని ఆరం భించి అనేక జంతువులు సృష్టింపడెను,

> సృష్ట్వా పురాణి వివిధా న్యజ యాత్మశక్త్యా
> వృక్షా౯ సరీసృపపశూ౯ ఖగదంశ మత్స్యా౯ ।

అను శ్లోకము ౫౩ వ పుటయందు అచ్చుపడియున్నది. అందులో చెప్పిన ప్రకారము అనేక జంతువులను సృష్టించి ఆ శరీరములలో ఇంద్రియగోళములను కూడ కల్పించి తత్తదింద్రియాధిష్ఠానదేవ తలను పిలిచి

> తాభ్యో గా మానయత్ తా అబ్రువ౯ న వై నోఽయమల మితి ॥
> (ఐతరేయోపనిషత్)

వారికి ఆవుశరీరమును చూపి ఈ శరీరమునందలి ఇంద్రియగోళ ములలో ప్రవేశించవలెను అని సృష్టికర్త చెప్పెను. వారు మాకు ఈ దేహము తృప్తిలేదు అని చెప్పిరి. అనేక వేల సంవత్సర ములకు పిమ్మట

తాభ్యో శ్వ మానయ త్తా అబ్రువ న్న వై నోఒయమల మితి ॥
(ఐతరేయోపనిషత్)

వారలకు గుఱ్ఱముయొక్క శరీరమును చూపెను. వారు మా కిది తృప్తిగాలేదనిరి. పిమ్మట అనేక వేల సంవత్సరములకు తరువాత

తాభ్యః పురుష మానయత్ తా అబ్రువన్
సుకృతం బతే తి పురుషో వా వ సుకృతం ।

పురుషశరీరమును దేవతలకు సృష్టికర్త చూపెను. వారు ఆహా! పురుషశరీరము బహుబాగు అని చెప్పి ఆ శరీరమందు ప్రవేశించిరి.

ఐతరేయోపనిషత్తు వాక్యముల ప్రకారము మానవశరీరము సృష్టియగునంతదాక నింద్రియాధిష్ఠాన దేవతలు మానవశరీరమునకు క్రింది శరీరములలో ప్రవేశించుటకు ఒప్పలేదు అని తెలియుచున్నది. ఇంద్రియాధిష్ఠాన దేవతలు ప్రవేశించి వారి వారి యింద్రియముల యొక్క గోళములలో నిలకడగా నిలుచునంతవరకును జీవాత్మ ప్రవేశించరు అని ఈ యుపనిషత్తులో నింక కొంతదూరము పోతే విశదమగును. కనుక మనుష్యేతరశరీరములలో జీవాత్మ ప్రవేశించ లేదు అని దృఢముగా తెలిసికొనవలయును. జీవాత్మ ప్రవేశించిన మానవశరీరములు అనగా మనుష్యులు ఒకరొకరు వారి వారికి తోచిన ప్రకారము తమతమ కార్యములనుగురించి నిర్ధారణచేసి కొందురు. ఒక వస్తువును చూచినపుడు ఒకనికి ఆహ్లాదముండును; మరియొకనికి ఆహ్లాదముండదు; మూడవవానికి దుఃఖము గలిగినను కలుగును. ఇట్లు సమూహచేష్టలేక వారి వారిమట్టుకు వారు వారు చింతించుకొని కార్యములు చేసికొనుస్థితి రాకపోయినపుడు జీవాత్మ

గారు ఆ శరీరములలో లేరని ఊహించవలెను. మనుష్యజాతికన్న తక్కువమైన తిర్యగ్జంతువులయందు సమూహచేష్టలేగాని వారి వారిమట్టుకు వారు వారు నిర్ధారణచేసికొని కార్యారంభము లేదు. నూరు నక్కలున్నపుడు ఒక నక్క కూయుటకారంభించితే అన్ని నక్కలును సమూహముగా చేరి కూయును. ఇట్లు అనేక ఉదాహరణములు ఇయ్యవచ్చును. సమూహాత్మ తనయొక్క సమూహమునకు చేరిన ప్రతి మృగమునును ఒకటివలనే మఱియొకటిని నడుపును.

అంతఃకరణవికాసము అధికమగుకొలది ఆ యా సమూహాత్మకు చేరిన మృగములు మానవశరీరములను ధరించుటకు సిద్ధమగుదురు. ఒక్క సమూహాత్మకు సంబంధపడినవి పదివేలకుక్కలుండవచ్చును. అందులో ఒక కుక్క సంపాదించిన అనుభవము, అంతఃకరణవికాసశక్తి, ఇవన్నియును ఆ సమూహాత్మ అధికారమునకు లోబడిన కుక్కలు ఎన్నియున్నవో అన్నిటికిని కలుగును. మరియు సమూహాత్మలు వారి వారి జంతువులను వృద్ధిపరచు ప్రయత్నము ఎడతెగక చేయుచుందురు. క్రిమికీటములు పక్ష్యాదులు భక్షించుటకు గా ఉపయోగపడు నని ముందే చెప్పబడినది. బల్లులు పురుగులను తినును. పురుగులయొక్క సమూహజీవాత్మ తన పురుగులను కాపాడవలెనని ప్రయత్నముచేయును. తరుచుగా పురుగులు వృక్షములయొక్క బోదె, కొమ్మలు, ఆకులు ఈ స్థలములను ఆశ్రయించియుండును. బల్లులు, తొండలు, చిన్నచిన్న పక్షులు ఇవన్నియు ఆ పురుగులను పట్టి తినుటకుగా చెట్లను ఆశ్రయించియుండును. అపుడు పురుగులనుకాపాడు దేవతలును వాని

యొక్కసమూహాత్మయును ఆ పురుగులయొక్క రంగులను మార్చి ఆ చెట్టుయొక్క చెక్క ఏ వర్ణముకలిగియుండునో ఆ వర్ణము పురుగులకు ఇచ్చి చెక్క ఏది పురుగు ఏది అని విమర్శించుటకు సాధ్యము కానట్టుగా చేసి పురుగులను కాపాడుదురు. పురుగులు దొరకనందువల్ల తగుమైనంతటి ఆహారము లభించక కష్టపడునట్టి బల్లులు, పక్షులు, ఇత్యాదులను కాపాడు దేవతలును వాని సమూహాత్మలును తమ బల్లులకు పక్షులకు ఇత్యాదులకు మ్రాకులచెక్కవర్ణము నుండి పురుగులరంగును విమర్శించుశక్తిని యిచ్చి తమ బల్లులు, పక్షులు మొదలగువానికి ఆహారము సంపాదించి యిత్తురు. ఈ ప్రకారము దేవతలు ఒకరినొకరు మించి మించి తాము గట్టివారమని యొప్పించునంతలో పురుగులు మొదలగు చిన్నజంతువులయొక్కయు బల్లులు పక్షులు మొదలగువానియొక్కయు శక్తులు యుక్తులును అధికమగును. ఇదేవిధముగా అడివిమృగములలో మెత్తటి కాళ్లు, వ్రేళ్లు కలిగిన పులులు మొదలగునవి. అవి ఆహారముగా సంపాదించుకోవలసిన మృగములకు తమ పాదధ్వని వినరానియ్యక నడుచునట్లు దేవతలు అరికాళ్లకు దూదికట్టినట్లు చేసియుంచుదురు. పులులు మొదలగువానికి ఆహారములగా నేర్పడు కుందేళ్లుమొదలగు వానికి అతివడిగా పరుగెత్తి ప్రాణము తప్పించుకొను శక్తిని (కుందేలు జింక మొదలగువానికి) యిచ్చి దేవతలు మొదలగు వారు కాపాడుదురు. ఇంతేకాక పెద్దమృగములైన ఆవులు, ఎద్లు, గేదెలు మొదలగు గడ్డిమేసి బ్రతుకునట్టివానిని పులులు చిరుతలు పట్టుటకు ప్రయత్నపడినపుడు తమను కాపాడుకొనుటకు పులులకు ఎదురునిలిచి పోట్లాడుటకు కావలసిన కొమ్ము

లను దేవతలు ఇచ్చియుందురు. ఈ విధముగా తిర్యగ్జంతుజాలపు శరీరములయందు వివిధానుభవములను చెంది తైజసవైశ్వానరాత్మలు కాలక్రమమున మానవశరీరములలో ప్రవేశించుటకు సిద్ధపడుదురు.

తైజసవైశ్వానరాత్మలు ధాతువర్గమునందు ప్రవేశించి భూలోకపు అనుభవములను సంపాదించుటకు ఆరంభించిరని ౬౧ వ పుటయందు చెప్పబడెను. దివ్యజ్ఞానసమాజపు పుస్తకములయందు సృష్టివర్గముల సంఖ్య ఏడు అని చెప్పబడియున్నది. "నిహితాస్సప్తసప్త" యని యుపనిషద్వాక్యమున్నది. ఐనను సనాతనధర్మ గ్రంథములయందు ముఖ్యముగా నాలుగు విధములే చెప్పబడియున్నవి. ధాతువర్గము, తరుగుల్మలతావనస్పతివర్గము, మృగ వర్గము, మానవవర్గము అని. కొన్ని గ్రంథములయందు ధాతువర్గమునకు పూర్వము మూడు వర్గములు కలవని చెప్పియున్నది. దివ్యజ్ఞానసమాజపు 'పుస్తకములలో ఎలిమెంటల్ కింగ్డములు Elemental kingdoms అని వ్రాసియున్నారు. ఇవి మూడు తరగతులు గలవి. మహర్లోకమందు మొదటి తరగతివి, స్వర్గలోకమునందు రెండవ తరగతివి, భువర్లోకమునందు మూడవ తరగతివి అని చెప్పియున్నది. ఈ మూడుతరగతులును శ్రీమద్భాగవతమునందు చెప్పిన వైకారిక సృష్టికి సంబంధపడినవి అనుకోవచ్చును. అయినను అంతకంటె వివరమైనదియు దివ్యజ్ఞానసమాజపు గ్రంథములయందు చెప్పినవిధముగానే యించుకైనను వ్యత్యాసములేక యొకపురాతన గ్రంథమునందు ఇటీవల కనుబడినది. అధ్యాత్మవర్గము, సౌరాత్మవర్గము, చంద్రాత్మవర్గము అని. మహర్లోకమునందు అధ్యాత్మవర్గ ముండవచ్చును. ఇదే మొదటి తరగతి ఎలి

మెంటల్ కింగ్డమ్ Elemental kingdom. సౌరాత్మవర్గము స్వర్గ లోకమునకు చేరినది. స్వర్గలోకపు దైవము సూర్యుడు. అతని సంబంధి సౌరాత్మవర్గము. ఇదే రెండవ ఎలిమెంటల్ కింగ్డమ్ Elemental kingdom. చంద్రాత్మవర్గము భువర్లోకమునకు సంబంధించినది. భువర్లోకమునకు చంద్రలోక మని పేరు. ఇదే మూడవ తరగతి ఎలిమెంటల్ కింగ్డమ్ Elemental kingdom. సప్తసృష్టివర్గములు వరుసను ౧. అధ్యాత్మవర్గము, ౨. సౌరాత్మవర్గము, ౩. చంద్రాత్మవర్గము, ౪. ధాతువర్గము, ౫. తరుగుల్మలతావనస్పతివర్గము, ౬. మృగవర్గము, ౭. మానవవర్గము.

## ఆధ్యాత్మికసృష్టి

సచ్చిదానందమూర్తియొక్క ప్రవృత్తిమార్గయాత్రయందు ప్రజ్ఞానాంశువు లను తురీయాత్మలు వానియొక్క ప్రతిబింబములైన ఆత్మబుద్ధిమనస్కులు అను అపరనామధేయముగల ప్రాజ్ఞాత్మలను కలుగజేసికొని సత్యలోక, జనలోక, తపోలోకములయందు చర్య జరిపి అనుభవములను సంపాదించు మని నిర్దేశించిన వనియును అట్టి ప్రాజ్ఞాత్మలు స్థూలత్రిలోకి యయిన స్వర్గలోకము, భువర్లోకము, భూలోకము అను లోకములయందు సంచరించి "స్థిరచరనికర వ్యాపిభిః" అన్నట్టు స్థూలాతిస్థూల, స్థూల, సూక్ష్మ ఉపాధుల యందు ప్రవేశించి అనుభవములను సంపాదించి వానియొక్క సారాంశములను తమకు నివేదనచేయు మని తమయొక్క ప్రతిబింబము లైన తైజసవైశ్వానరాత్మలను నియమించి రనియును అట్టి తైజస వైశ్వానరాత్మలు స్థావరజంగమాత్మకమగు సృష్టియందు ధాతు

వర్గము లని వ్యవహరింపబడు పాషాణలోహాదులయందు ప్రవేశించి నిద్రించి ఆ యుపాధులలో ఎంత సాధ్యమగునో అంత అనుభవ ములను సంపాదించి కాలాంతరమందు ఓషధులు, లతలు, వన స్పతులు మొదలగు ఉపాధులయందు ప్రవేశించి "భుక్త్వాభోగాన్" అని చెప్పిన ప్రకారముగా అనుభవములను సంపాదించి తదనంత రము మృగాదులశరీరములయందు ప్రవేశించి అచ్చట అంతకు ముందు తాముండిన యుపాధులలో సంపాదించిన యనుభవముల కన్న నతి నాజూకులైన యనుభవములను సంపాదించినవనియు అన్నమయకోశము, ప్రాణమయకోశము మనోమయకోశము అను కోశత్రయములను సంపాదించిన వనియు నిదివరకు ఎరిగితిమి. మృగాదుల శరీరములయందు అనుభవప్రాప్తి ముగిసిన పిమ్మట మనుష్యశరీరములయందు ప్రవేశించుటకు సిద్ధములైనవి. మనుష్య శరీరప్రవేశమునకు ముందు మనుష్యేతర ఉపాధులలోని అనుభ వము లన్నియును సంపాదించి తేనే గాని మనుష్యజన్మములయందు కలుగు ప్రయోజనమైన "జ్ఞానం హి తేషా మధికో విశేషః" అనిన ప్రకారము జ్ఞానముయొక్క సంపాదన సులభసాధ్యము కాదు. కనుక నొక పురాణవచనమునందు

> స్థావరం వింశతేర్లక్షం జలజం నవలక్షకం।
> కూర్మాశ్చ నవలక్షం చ దశలక్షం చ పక్షిణః॥
> త్రింశల్లక్షం పశూనాం చ చతుర్లక్షం చ వానరాః।
> తతో మనుష్యతాం ప్రాప్య తతః కర్మాణి సాధయేత్॥
> ఏతేషు భ్రమణం కృత్వా ద్విజత్వ ముపజాయతే।
> సర్వయోనిం పరిత్యజ్య బ్రహ్మయోనిం తతోऽభ్యగాత్॥

అని చెప్పియున్నది. ఈ ఉపాధులలో ప్రవేశించి అచ్చటచ్చట సంపాదించిన యనుభవములను తమ తమ ప్రాజ్ఞాత్మలకు నివేదించి నప్పుడు ప్రాజ్ఞాత్మలు తమ ప్రతిబింబములు చేసిన పనికి మెచ్చి ఇంత వరకును తాము నిస్పృహులవలె ఉండినను ఇప్పటినుండి తాము తైజసవైశ్వానరాత్మలయొక్క వికాసమందు అభిరుచిని చూపు దురు. ఈవరకే మనోమయకోశము అంకురించి యుండినది. ఆ అంకురమును వృద్ధిచేయుటకు తగు ప్రయత్నములను ప్రాజ్ఞా త్మలు చేయుచు తమ ప్రతిబింబములైన తైజసవైశ్వానరాత్మలకు విజ్ఞానమయకోశము అంకురించుటకు కావలసిన ప్రయత్నముల యందు సహాయము చేయుదురు.

మనోమయకోశముయొక్క పుట్టుక మృగములయందే కన బడును. కొంతమట్టుకు పూర్వాపరవిచారమును, చిత్తముయొక్క ధర్మమైన స్మృతి లేక స్మరణము అను జ్ఞాపకమును నిన్నటిదినము తాను చేసిన కార్యములను జ్ఞాపకముంచుకొనియుండుటయు మృగ ములయందు కొన్నిటియందు కనబడును. అనగా అంతఃకరణము (అహంకారము, మనస్సు, చిత్తము, బుద్ధి) కొంచెముకొంచెముగా వృద్ధిచెందుచున్నదని యర్థము. మన యిండ్లయందు పెరుగుచున్న మృగములయిన పిల్లి, కుక్క, గుఱ్ఱము, ఆవు మొదలగు మృగము లకు మనస్సు అతిశీఘ్రముగా నంకురించి వృద్ధియగుచు వచ్చును. సమూహాత్మగారు తైజసవైశ్వానరాత్మలయొక్క లేతవయస్సునందు అనేకవేలలెక్కలకొలది గలవానిని తనయొక్కరి చూపున నుంచు కొనియుందురు. తైజసవైశ్వానరాత్మలు కొంతకొంతగా వృద్ధి చెందుచురాగా నొక్కొక్క సమూహాత్మయు తన విచారణక్రింద

నుండువాటి లెక్కను తగ్గించుకొని మిగిలిన వాటిని మఱికొందరు సమూహాత్మలయొద్ద చేర్తురు. ఒక గురువులవారియొద్ద విద్యాభ్యాసము చేయు శిష్యులలో కావ్యములను చదువుకాలమందు పదు గురు శిష్యులకు ఒకరే గురువుగారు పాఠము చెప్పవచ్చును. శిష్యులు ప్రబుద్ధులు కాను కాను వార్ల లెక్కను తగ్గించుకొని అలంకారశాస్త్రము చదువునప్పటికి ఇద్దరికంటె నధికముగా నొక్క గురువునకు శిష్యులుండరు. తర్కము, మీమాంస మొదలగునవి చుదువుకాలమందు శిష్యులలెక్క మరికొంత తగ్గవలెను. అదేవిధమున తైజసవైశ్వానరాత్మలు మనస్సును సంపాదించుటకు ఆరంభించినపుడు సమూహాత్మలు తమ తమ స్వాధీనమందు కొందరినే యుంచుకొని వారిని జాగరూకతతో మానవశరీరధారణకు సిద్ధపరుచుచు వారు ఇదివరకును సంపాదించిన భూతసూక్ష్మము లను అపరనామధేయముగల దేహబీజములయం దిమిడియుండు శక్తులను తమయొక్క మనశ్శక్తివల్ల వృద్ధిపరచుచు సూక్ష్మత్రిలోకిస్థమైన జన తపస్సత్యలోకములయందు సంచరించుచు తన ప్రతిబింబమయిన తైజసవైశ్వానరాత్మ స్థూలత్రిలోకియందు ఏవిధముగా వర్తించుచున్నదో యని సదా జాగరూకతతో కాచియుండు ప్రాజ్ఞాత్మకును వారి ప్రతిబింబమునకు సంధికలుగజేసి ఆ ప్రాజ్ఞాత్మకును తైజసవైశ్వానరాత్మకును అభేద్యమైన సంబంధరూపమగు విజ్ఞానమయకోశమును కల్పించి తురీయాత్మయొక్క ప్రతిబింబమైన ప్రాజ్ఞాత్మ తనయొక్క ప్రతిబింబమైన తైజసవైశ్వానరాత్మతో చేరి ఇతఃపరం **జీవాత్మ యని వ్యవహరించునట్లు** చేయు

దురు. ఈ సమాగమమునకే ఆధ్యాత్మికసృష్టి యని పేరు.

మానవశరీరమందు క్రొత్తగా ప్రవేశించిన జీవాత్మ ప్రారంభమందే ఇప్పటి మనుష్యులవలె నుండలేదు. నూతనముగా మానవశరీరమందు ప్రవేశించిన జీవాత్మ మాతృగర్భమునుండి నాడే వెలిపడిన శిశువును పోలియుండును. ఆ శిశువునకు తాను వేరు లోకము వేరు అను జ్ఞానము గాని, తాను అను అభిప్రాయముగాని, తనకు కావలసిన విషయములు ఇట్టివి అని గాని, ఆవిషయములను సంపాదించుమార్గము ఎట్టిదియని గాని, సందర్భించిన విషయములు తనకు హితకారులా కావా అను జ్ఞానము గాని లేదు. మాతృగర్భమందుండినపుడు ఆబిడ భుజించిన ఆహారము రక్తముగా మారి శిశువుయొక్క శరీరమందు ప్రవేశించి రక్తనాళములగుండా దేహమంతయు వ్యాపించి శిశువుయొక్క దేహమును కాపాడుచువచ్చినది. శిశువు ఆ సమయమందు ఏవిధమైన శరీరపీడయును దుఃఖమును గాని అనుభవించుటకు అవశ్యము లేదు. మాతృగర్భము విడువగానే తల్లియొక్క దేహమందలి రక్తము తన దేహమందు ప్రవేశించుటకు వీలు లేకపోవును. గనుక తాను ఆహారమున్ను కోరును. ఈ కోరిక అనునదే క్షుద్బాధ. పుట్టిన పిదప కొంతతడవుకు తాను ఇదివరకును అనుభవించని దుఃఖమేదో సంప్రాప్తమైనదని మాత్రము తెలిసికొనును. దుఃఖప్రాప్తికి కారణము తెలియదు. దుఃఖనివారణమార్గమును కనబడదు. తన దుఃఖమును ఇతరులకు తెలియచేయవలెననియు తెలియదు. రోదన మొక్కటి మాత్రము తెలిసిన విధము

కనుక ఏడ్వనారంభించును. "విషయః ఖలు సర్వతః స్యాత్" అనిన ప్రకారము రోదనమును, పాలుపీల్చుశక్తియు, మృగ శరీరవాసిగానుండినకాలమందు నేర్చిన విషయములు. తల్లి బిడ్డకు చన్ను కుడిపింపగా పాలను పీల్చును. మరల ఆకలెత్తి నపుడు ఏడ్చును. "ప్రాణకర్మాణి చాపరే" అను గీతా వాక్యప్రకారము నిద్రించుట, పాలుద్రావుట, శ్వాసవిడుచుట, విణ్మూత్రవిసర్జనాదులు దక్క వేరేమియు తెలియదు. జ్ఞానేంద్రియ గోళము లున్నను ఇంద్రియవ్యాపారములు లేవు. క్రమక్రమముగా నింద్రియవ్యాపారములు ప్రారంభించును. క్షుద్బాధానివర్తి చేయు చువచ్చిన తల్లిగారి ధ్వనిని గుర్తించును. శ్రోత్రేంద్రియము వ్యా పార మారంభించును. తర్వాత త్వగింద్రియవ్యాపారము అనంతరము నేత్రేంద్రియవ్యాపారము, రసనేంద్రియవ్యాపారము ఇవి కనబడును. ఘ్రాణేంద్రియవ్యాపారము కలదో లేదో తెలియదు. ఇట్లు కొన్ని మాసములకాలము గడిచినతరువాత చాలమట్టుకు ఇంద్రియముల వ్యాపారములు క్రమక్రమముగా కనబడుచువచ్చును. అయినను అంతఃకరణవ్యాపారములన్నియు వ్యవహారమునకు వచ్చుటకు కొ న్ని సంవత్సరములకాలము అగును. ఇదేవిధముగా మనుష్య లోకమునందు కూడ జరుగును. అది ఎట్లనగా మనుష్యశరీరము లను పూర్వకల్పమునందు ఉండిన తరహాగా దేవతలు కలుగజేసిరి.

చతుర్ముఖబ్రహ్మగారియొక్క ఒక దినమునకు కల్ప మని పేరు. కల్పమునకు ఒక తడవ ఒక ప్రళయము కలదు. ఈ ప్రళయమునకు దైనందిన ప్రళయము అని పేరు. దైనందిన ప్రళయమునందు భూలోకభువర్లోకస్వర్గలోకములు ప్రళయాగ్నికి

ఆహుతి అయిపోవును. చతుర్ముఖబ్రహ్మగారి యొక్క మరి యొక దినము ప్రారంభించునప్పుడు భూలోకము భువర్లోకము స్వర్గలోకము అనునవి మరల పుట్టి వచ్చును. ఇట్టి ప్రళయా నంతరము మరల భూలోకము ఏర్పడు విధమునుగురించి పురాణ ములయందు అక్కడక్కడ చెప్పియున్నది. ఇప్పటి హూణ విద్యాభ్యాసకులు కోరునట్లు కరతలామలకముగా ప్రతివివరమును విశదముగా చెప్పబడియుండలేదు. సారాంశ మేమని యున్న దనగా ఏ విధముగా నీ లోకమందు జనసమూహము వారు వారు వారి వారి వ్యాసములను నడుపుకొనుచుండగా సూర్యా స్తమన మయి తదనంతరము ప్రతిమనుజునికి నిద్రావస్థ సంప్రాప్తమైన పుడు వారు వారు చేయుచుండు పనులను అరకొరగా విడిచి నిద్రను ప్రారంభించి రాత్రి నిద్రపోయి మరునాడు ఉదయానంతరము నిన్న రాత్రి విడిచిన పనులను విడిచినస్థితినుండి ప్రారంభించి ముగించు కొందురో అదే విధముగా జీవాత్మలందరును పూర్వకల్పాంతమందు ఏ మాత్రము అంతఃకరణపరిపాకమును చెందియుందురో ఆ స్థితి నుండి ప్రారంభించి మరల పూర్వోక్త అంతఃకరణపరిపాకమును ప్రారంభింతురు. క్రొత్త కల్పమందు మరల సృష్టిచేయుటలో మానవశరీరములను ముందుకల్పమువలెనే మానవేతరసృష్టి అంత యు ముగిసిన తరువాతనే చేయుదురు. సృష్టివిషయమును గురించి శ్రీమద్భాగవతాదిగ్రంథములయందు బాహుళ్యముగా చెప్పియు న్నది. మత్స్యపురాణము, మార్కండేయపురాణము, వాయుపురా ణము అను పురాణములలో కొంత అధికముగా చెప్పియున్నది. ప్రళయమపుడు సముద్రములు పొంగివచ్చి భూమినంతయు కప్పి

ఎక్కడచూచినను జలార్ణవముగా నుండునట. మరల కల్పాది యందు జలము కొంచెము కొంచెముగా తగ్గి అడుసురూపముగాను చెట్లుచేమలు వృక్షములు మృగములు మనుష్యులు నివసించుటకు వీలు లేక అడుసుమయముగా నుండినదట. సూర్యరశ్మి వాయువు ఇటువంటివి కొంతమట్టుకు అడుసును గట్టిపరిచి భూమియొక్క రూపమును కలుగచేసెనట.

క్వచిత్ క్వచిత్ పునః సాఽభూత్ క్షితి ర్భాగే న సర్వశః ।
సరిత్సరః సముద్రాంశ్చ సేవన్తే పర్వతానపి ॥

(మార్కండేయపురాణము)

అచ్చటచ్చట మరల గట్టిభూమి అగుపడెను. అన్నిచోట్ల అగు పడలేదు. కొలనులు, కాలువలు, కొండలు, సముద్రములు గా నేర్పడినది.

ఆ కాలమందు ఋతుభేదములు లేవు. అన్ని ఋతువులు అనగా సంవత్సరము ఆదినుండి అంత్యమువరకును సమశీతోష్ణ ముగానుండెను. అట్టి స్థితి ఆహ్లాదకరముగా నుండెను. చెట్లు చేమలు గుట్టలు ఫలములు పుష్పములు గాని లేవు. అట్టి స్థితి యందు మనుష్యులకు ఆహారమునకు బదులు వెలుపలి గాలినుండి ఒక విధమైన తృప్తి కలుగుచుండినది.

న మూలఫలపుష్పాణి న ర్తవో వత్సరాణిచ ।
సర్వకాలసుఖః కాలో నాత్యర్థం ఘర్మశీతతా ॥
తత శ్చ తేషాం పూర్వాహ్ణే మధ్యాహ్నే చ వితృప్తతా ।
పున స్తథేచ్ఛతాం తృప్తి రనాయాసేన సాఽభవత్ ॥

(మార్కండేయపురాణము)

క్రొత్తగా జన్మించిన శిశువువలెనే తన ప్రయత్నములేకయే ఆహా రము దొరకుచుండును. తన ప్రయత్నము లేకయే అనాయాసముగా అనుకూలములు కలుగుచుండెను.

శబ్దాదిర్విషయః శుద్ధః ప్రత్యేకం పంచలక్షణః ।

ప్రతియొకరు గ్రహించు శబ్దముమొదలగు విషయపంచకము శుద్ధముగ నుండెను. ఇట్టి వారలకు ప్రజావృద్ధి యెట్లు కలిగియుండ వచ్చునని పృచ్ఛచేతము.

అసంస్కార్యైః శరీరైశ్చ ప్రజాతాః స్థిరయావనాః ।
తాసాం వినాతు సంకల్పం జాయన్తే అమిథునాః ప్రజాః ॥
సమం జన్మచ రూపంచ మ్రియన్తే చైవ తాః సమం ।
(మార్కండేయపురాణము)

గర్భాధానం, పుంసవనం, జాతకర్మ మొదలగు సంస్కారములు గాని అత్తకోడండ్లు కొట్లాటలు గాని ఆలుమగళ్లు అలకపడడము గాని లేదు. మనుష్యులు ఆ కాలమందు వయస్సులో చిన్న పెద్ద అను వ్యత్యాసములు లేక యెపుడో ఒకపుడు మనుష్యుని శరీరము నుండి మరియొక శరీరము జారిపడినట్లు పడును. బిడ్డలు పుట్టవలెనని కోరకయే బిడ్డలు పుట్టుచుండిరి. అయితే బిడ్డల శరీరములు పెద్దల శరీరములంత పెద్దవి గానును ఆడదా మగవాడా అను చిహ్నములు లేకనే ప్రజలు పుట్టుచుండిరి.

ఈ కాలమందు ప్రజావృద్ధికిగా ప్రయత్నములు చేసి నోములు నోచి యాత్రలు చేసి మంత్రసానులను సహాయపరుచు కొని గాని డాక్టర్లను ఆయుధసహితులుగా రమ్మనిగాని పిలుచు

అవశ్యము లేకనే అరటిచెట్టు అడుగున గడ్డలో పిల్లలు పుట్టినట్టు ప్రజ కలుగుచుండును. అయితే పుట్టినప్రజలు శిశువులవలె చిన్నశరీరములు గలిగియుంటే వార్లను కాపాడుకష్టము ఎవరు పడుదురు. కష్టపడుటకు తెలియదు గనుక అనాయాసముగా తమంతటి శరీరములు తమశరీరములలోనుండి జారిపడుచుండెను. చిన్నపెద్దలను వ్యత్యాసములు గాని ఉత్తమాధమభేదములు గాని లేవు. ఆహారము అవశ్యము లేకయున్నందున కడుపుకూటికి కోటివిద్యలని యొకరి నొకరు ఆశ్రయించవలసిన అవశ్యము లేక పోయెను. కాపురముండుటకు ఇండ్లు అవశ్య ముండలేదు.

అయితే దేశమందు ప్రజలు ఏవిధముగా నొకరినొకరు గణించుచుండిరి అని విచారింతము—

> అనిచ్ఛాద్వేషసంయుక్తా వర్తంతే తు పరస్పరం ।
> తుల్యరూపాయుషః సర్వా అధమోత్తమతాం వినా ॥
> చత్వారితు సహస్రాణి వర్షాణాం మానుషాణి వై ।
> ఆయుః ప్రమాణం జీవంతి న చ క్లేశాద్విపత్తయః ॥
>
> (మార్కండేయపురాణం)

ఇచ్ఛాద్వేషములు గాని చట్టదిట్టములు గాని లేవు. దుఃఖములు, ఆపత్తులు విపత్తులు లేక నాలుగువేలసంవత్సరములు పూర్ణాయుఃప్రమాణము కలిగి జీవించుచుండిరి.

ఇట్లు అనేక లక్షల సంవత్సరములు జరిగిన పిమ్మట స్త్రీ పురుషభేదములు లేని శరీరములయందు ఇది మొదలు స్త్రీత్వము సగమును పురుష(త్వ)రూపము సగమును కలిసి అర్ధనారీశ్వర రూపానుసారముగా మనుష్యులు కలిగిరి. పురాణములలో పురూ

రవుడు ఇలాసుద్యుమ్నయొక్క ప్రజ యనియును వాలిసుగ్రీవులు ఋక్షరాజుయొక్క ప్రజ యనియును చదువుచున్నాము కదా. ఇలాసుద్యుమ్న శరీరము సగము మగ, సగము ఆడుది.

న తాసాం ప్రతిఘాతోఽస్తి న ద్వేషో నాపి మత్సరః ।
పర్వతోదధిసేవిన్యో హ్యనికేతాస్తు సర్వశః ॥
తా వై నిష్కామచారిణ్యో నిత్యం ముదితమానసాః ।
కాలేన గచ్ఛతా నాశ ముపయాంతి యథా ప్రజాః ॥
తథా తాః క్రమశో నాశం జగ్ముః సర్వత్ర సిద్ధయః ।
ఆయుషోఽన్తే ప్రసూయన్తే మిథునాన్యేవ తాః సకృత్ ॥
గులికం గులికా శ్చైవ ఉత్పద్యన్తే ముమూర్షతాం ।
తతః ప్రభృతి కల్పే స్మిన్ మిథునానాం హి సంభవః ॥
(మార్కండేయపురాణం)

వారలకు ద్వేషాది దుర్బుద్ధులు గాని కామక్రోధోద్భవ మైన వేగము గాని లేక యెల్లప్పుడును సంతోషముతో నుండిరి. కొండలు, గుహాల్లు ఇట్టి స్థలములయందు నివసించుచుండిరి. ఇండ్లు ఏర్పడలేదు. సమశీతోష్ణముగా నుండినందున ఆవశ్యకత కనబడలేదు. మరణకాలము సమీపించినపుడు పక్షులు అండములు పెట్టినట్లు మనుష్యులు గ్రుడ్లు పెట్టుచుండిరి. అవి కొంతకాలమునకు అనగా అనేక సంవత్సరములకు తరువాత పిల్లలయి మగపిల్లనో ఆడుపిల్లనో కలిగించును. ఈ శ్వేతవరాహకల్పమందు స్త్రీపురుష భేదమేర్పడినది ఇదియే మొదలు. ఆడపిల్లగా తేరితే ఆ శరీరమందు మగవాని గుర్తులు కొన్నియుండును. మగపిల్లగా తేరితే స్త్రీచిహ్నములు కూడ అదే శరీరమందు కొన్ని యుండును. ఇట్లు కొంతకాలము అనగా కొన్ని లక్షలసంవత్సరముల కాలము జరుగుచుండెను.

ఇపుడు పక్షిజాతులు గుడ్లుపెట్టితే కొన్ని వారములలోపల పిల్లలు గానెదుగును. పూర్వకాలపు గుడ్లు పిల్లలగా నెదుగుటకు కొన్ని సంవత్సరములకాలము చెల్లును. శ్రీమహాభారతాదిపర్వ మునందు శ్రీగరుత్మంతుని జన్మకథ వర్ణించుకాలమందు కశ్యప మహార్షి భార్యలు ఇద్దరికిని ఒక వైషమ్యము కలిగి ఒకతెకు మరి యొకతె బానిసయైనదనియును అట్లు బానిసయైన భార్యపేరు వినతయనియును ఆమె తన భర్తనాశ్రయించి తన బానిసతన మెట్లు వదులును అని అడుగుకొనెననియును అందు కతడు ఒక వరమిచ్చెననియును చెప్పియున్నది. ఆ వరముయొక్క వివరము ఏమనగా వినత అప్పటికి ఇడియుండిన రెండుగుడ్లును ఎదిగినట్లైతే అందులో నొక మహానుభావుడు జన్మించి అతనివల్ల బానిసతనము మాను ననియు చెప్పినట్లున్నది. వినతాదేవి బానిసగానుండి విసికి విసికి అనేక సంవత్సరములయిన పిమ్మట నొక నాడు తనయొక్క గుడ్లు రెండును అదివరకును ఎదగక పోయినందున మరికొంతకాల ము కాచియుండుటకు ఓర్పు లేక ఒక గుడ్డును పెల్లగా పగల దీసెను. అంత నా గుడ్డునుండి వెలువడినవారి పేరు అనూరుడు. అనూరుడు అనగా తొడలు లేనివాడు. ఎందువల్ల తొడలు లేవంటే గుడ్డు చాలినంతకాలము ముదరకపోయినందున దేహము నడుము వరకునే ఏర్పడినది అని అర్థము. ఈ కథ నెందుకు చెప్పవలసివచ్చెనన వచ్చును. పైన చెప్పిన ప్రకారము మానవులు గుడ్లు పెట్టిరనియు ఆ గుడ్లు ఎదుగుటకు అనేక సంవత్సరములు కావలెనని చెప్పిన దానికి ఉదాహరణముగా చెప్పబడెను.

అప్పటివరకును మనుష్యులకు ద్వంద్వములవలని బాధ లేకుండెను. రుగ్మతలు గాని విపత్తులుగాని లేకుండెను. పుట్టిన బిడ్డలను కాపాడవలసిన అవశ్యము లేక తమంతటివార్లనే బిడ్డలుగా మనశ్శక్తివల్ల పొందుచుండిరి. గాలిలోనుండి ఆహారప్రత్యామ్నాయమైన తృప్తియే కలుగుచుండెను. ఇట్లు సుఖముగానుండిన మానవకోటికి మరణము అను అవస్థయు సకలానర్థమూలమైన స్త్రీపురుషభేదములును కలిగెను. మరణ మెట్లు సందర్భించె ననగా పరమేశ్వరుడు ఎవరికి మరణము కలుగవలెనని విధించిరో అట్టివారికి గాలిలోనుండి దేహధారణశక్తిగల సారమును గ్రహించు శక్తి నిలిచిపోయెను. శక్తిగ్రాహకశక్తి అను సిద్ధి నిలిచిపోయినపుడు మరణము కలిగెను.

తాసు సర్వాసు నష్టాసు నభసః ప్రచ్యుతా రసాః ।
పయసః కల్పవృక్షాస్తే సంభూతా గృహసంస్థితాః ॥
సర్వప్రత్యుపభోగాశ్చ తాసాం తేభ్యః ప్రజాయత ।
వర్తయంతి స్మతేభ్య స్తాః త్రేతాయుగముఖే తదా ॥
(మార్కండేయపురాణము)

కృతయుగాంతమువరకును గాలినుండి ఆహారమాకర్షించి జీవించి విపత్తులు రోగములు మొదలగు దుఃఖములు లేకయుండిన ప్రజలకు త్రేతాయుగప్రారంభము కాగానే ఆహారాకర్షణసిద్ధిని దేవతలు ఇచ్చుటను నిలిపిరి. ఇట్లు ప్రజలకు కొంతకొంతగా దుఃఖములను కలుగజేసి వారిని కలియుగమునందు మనవంటివారల మనుభవించు దుఃఖముల ననుభవించుటకు క్రమక్రమముగా శక్తిపొందునట్లు చేసిరి. పూర్వపుశక్తులు మాసిపోయినపుడు ఆకాశమునుండి

వర్షమును దేవతలు కురిపించిరి. ఐతే ఆ వర్షము జలరూపముగా నుండలేదు. క్షీరము అనగా పాలవర్షము కురియుచుండెను. అట్టి వర్షమువల్ల వృక్షములు మొలిచి పెరుగనారంభించెను. ఆ వృక్షములగుండా అప్పటి మనుష్యులకు ఆహారమును, మరియు వారలకు కావలసిన ఇతరజీవనార్థములును కలుగుచుండెను. అదే వృక్షములు కాపురముండుట కిండ్లుగా నేర్పడెను. ఈ వృక్షములకు కల్పవృక్షములని పేరు పెట్టిరి.

కల్పవృక్షములు అను మాట మనకు అలవాటు కలదు. ఆ వృక్షములు శిశుప్రాయులై పరాధీనులైన ప్రజలకు తల్లివంటివి. వారను ఆ కాలమందు ఆ వృక్షములు కాపాడుచుండెను.

> తతః కాలేన వై రాగ స్తాసాం అకస్మికోఽభవత్ ।
> మాసి మాసి ఋతూత్పత్త్యా గర్భోత్పత్తిః పునః పునః ॥

ఇట్లు కొన్ని వేలసంవత్సరములుండినపిదప ప్రజలకు అనురాగము ద్భవించెను. నెలనెలకు స్త్రీలు రజస్వలలు అగుచు గర్భధారణ కలుగుట కారంభమాయెను. ఇది మొదలు ప్రకృతమందు ప్రజోత్పత్తి అవుచున్న విధమున ప్రజావృద్ధి కారంభమాయెను.

ఇది మొదలు ప్రజలకు కష్టములను కొంచెము గమనించ వలెను. రాగోత్పత్తి కలుగ గానే కల్పవృక్షములు నశించి పోయెను. సర్వవిధముల సహాయములుగానుండిన వృక్షములు రాగోత్పత్తివల్ల నశించిపోయినను దేవతలు సహాయభూతులై దయచేసి

> రాగోత్పత్త్యా తత స్తాసాం వృక్షా స్తే గృహసంస్థితాః ।
> ప్రణేశు రపరే చాసం శ్చతుశ్శాఖా మహీరుహాః ॥

వస్త్రాణి చ ప్రసూయంతే ఫలే ష్వాభరణాని చ ।
తేష్వేవ జాయతే తేషాం గంధవర్ణరసాన్వితం ॥
అమాక్షికం మహావీర్యం పుటకే పుటకే మధు ।
తేన తా వర్తయంతి స్మ ముఖే త్రేతాయుగస్య వై ॥

నాలుగు పెద్దకొమ్మలు గల క్రొత్త జాతిచెట్లను సృష్టించి యిచ్చిరి. ఆ వృక్షములనుండి వస్త్రములు కలుగుచువచ్చెను. ఆ వృక్షములలో ఆకులు దుత్తలవలెనుండెను. ప్రతి ఆకుదుత్తయందును తేనె నిండియుండెను. తేనెటీగలు పెట్టిన తేనె కాదు. ఆ వృక్షములలోనే ఫలించిన తేనె. చూపుకు మంచివర్ణముకలదియు సువాసనయుతమైనదియు మహారుచికరమైనదియు దేహమునకు మహాబలము నిచ్చునట్టిదియు వీర్యవంతమును నైనది ఆ తేనె.

తతః కాలాంతరేణైవ పునర్లోభాన్వితాస్తు తాః ।
వృక్షాంస్తాః పర్యగృహ్ణంత మమత్వావిష్టచేతసః ॥
నేశు స్తేనాపచారేణ తేహి తాసాం మహీరుహాః ।
తతోద్వంద్వాన్యజాయంత శీతోష్ణక్షుణ్ముఖానివై ॥
తాస్త ద్వంద్వోపఘాతార్థం చక్రుః పూర్వం పురాణితు ।
గృహాకారాః యథా పూర్వం తేషా మాసన్ మహీరుహాః ॥
తథా పంస్మృత్య తత్సర్వం చక్రు శ్వేశ్మాని తాః ప్రజాః ।
కృత్వా ద్వంద్వోపఘాతం తే వార్తోపాయ మచింతయన్ ॥

ఇట్లు కాలాంతరమందు ప్రజలకు లోభమోహములు ఉద్భవించెను. ఇతరులు ఆ వృక్షముల ఫలితమును అనుభవించుటకు ఓర్వజాలక వారిలో బలశాలులు కొందరు ఆ వృక్షములను ఆక్రమించిరి. ఇట్టి అపచారముయొక్క ఫలము ఏమనగా ఆ వృక్ష

ములు నశించెను. ఓర్వజాలమివల్ల ప్రయోజనము ఇట్లు ఏర్పడినది. అందుకు పిమ్మట శీతోష్ణములు, సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములు పుట్టెను. చలి, గాలి, ఎండ, వానలకు ఓర్వలేక ప్రజలు కొన్ని యిండ్లను కట్టుకొనిరి. ఈ విధముగా క్రమక్రమముగా పక్కణ మహాగ్రామ నగరంబు లేర్పడెను.

ఈ యధ్యాయమునందు ప్రజ్ఞానాంశువు లైన తురీయాత్మలు పాంచభౌతికప్రపంచమందలి యనుభవంబులను సంపాదించు నభీష్టముచే తమ నివాసస్థానమును వదలి సత్యలోకాది ఉత్తమత్రిలోకిని ప్రవేశించి మూడు దేహబీజములను సంపాదించికొని అచ్చట తమ ప్రతిబింబములైన ప్రాజ్ఞాత్మలను స్థిరపరిచి వారిని స్థూలత్రిలోకిలోని యనుభవములను తమయందిమిడ్చుకొని వానియొక్క సారాంశమును తమకు (తురీయాత్మలకు) నివేదించవలె నని నిర్దేశించిరనియు, ప్రాజ్ఞాత్మలు ఉత్తమత్రిలోకిలోనే యుండి క్రిందికి దిగుటకు ఇష్టము లేక తమయొక్క ప్రతిబింబములగు తైజసవైశ్వానరాత్మలను స్థూలత్రిలోకియందు వ్యవహారార్థము నిర్దేశించిరనియు, అట్టి ప్రతిబింబములు ధాతువర్గములయందును, తరుగుల్మలతాదులయందును, మృగాదులశరీరంబులందును ప్రవేశించి సమూహాత్మల యొక్కయు, నితర దేవగణంబులయొక్కయు సహాయంబువలన తత్తద్వర్గంబులయందు సంపాదించుటకు సాధ్యమైనన్నియనుభవములను సంపాదించి దీర్ఘకాలంబునకు పిదప మనుష్యరూపంబులందు ప్రవేశించిరనియు, అట్టి సమయంబునందు విజ్ఞానమయ కోశంబు క్రొత్తగా నేర్పడెననియు, అట్లు విజ్ఞానమయకోశయుతులైన తైజసవైశ్వానరాత్మలను సమూహాత్మలు వదలిరనియు, అట్టి

వదులుటవల్ల నొక్కొక తైజసవైశ్వానరాత్మయు తనయొక్క ఆది పురుషుడైన ప్రాజ్ఞాత్మతో కలిసెననియును, అట్టికలియుట మొదలు నిక ముందు సంజ్ఞార్థము "జీవాత్మ" యని యీ పుస్తకమునందు వాడనగుననియు, నట్లు ఏర్పడిన జీవాత్మ మనుష్యశరీరవాసియైనను అప్పుడే పుట్టిన శిశువువలె పరాధీనుడై యితరుల సహాయమువల్లనే కృతయుగమంతయు జీవించుచుండెననియు, ఋషులు, దేవతలు, పితృదేవతలు మొదలగువారు ఈ శిశుప్రజాసమూహంబునకు కృతయుగమంతయు సహాయులై యుండిరనియు, మానవకోటియంతయు అండజంబులుగను, స్వేదజంబులుగను, స్త్రీపురుషభేద మేర్పడని శరీరంబులలో వసించియుండిరనియు, కాలాంతరమందు ఆ శరీరంబులు ఒక్కొకటిలోనును స్త్రీత్వ పురుషత్వ చిహ్నంబులు కలిసియుండెననియు, మరల కాలాంతరేణ స్త్రీలు పురుషులు అను భేదంబులు వ్యక్తములయ్యెననియు, తరువాత త్రేతాయుగారంభమందు అనురాగముత్పత్తియయి స్త్రీశరీరంబులకు రజస్వలాస్థితి కలిగి యిప్పటికాలమందు ప్రజావృద్ధియగు విధానమున కారంభము అయినదనియును మొదలుగాగల విషయములు సంగ్రహముగా వివరింపబడెను. ఇక ముందు మానవశరీరధారులై అహంకార మమకారాన్వితులై ద్వంద్వాదిదోషఘాతులైన మానవశరీరవాసులైన జీవాత్మలు తమ స్వస్వరూపానుసంధానము బడయ చేయు ప్రయత్నములనుగురించి వ్రాయబడును.

---

# నాలుగవయధ్యాయము

లబ్ధ్వా సుదుర్లభ మిదం బహుసంభవాంతే
మానుష్య మర్థదం అనిత్య మపీ హ ధీరః ।
తూర్ణం యతేత నపతే దనుమృత్యు యావత్
ని్శ్రేయసాయ విషయః ఖలు సర్వతః స్యాత్ ॥

## మానుష్యం

ధాతువర్గతరుగుల్మలతామృగాది వ్యక్తులందు అనేక లక్షల జన్మంబులు ఎత్తినపిదప సంపాదింపబడిన మనుష్యజన్మము అతి దుర్లభము. “బహుసంభవాంతే” అనేకజన్మములకు తరువాత యని యర్థము. ఇట్టి దుర్లభమగు మనుష్యశరీరమునందు పరమ లాభ మొకటి యున్నది. అది అనగా మనస్సు. “బ్రహ్మవలోకధిషణాం” అని ౫౩ వ పుటలో నచ్చుపడియుండు శ్లోకమందున్నది. కనుక మానవజన్మంబునకు పరమార్థంబు బ్రహ్మవలోకనంబే. అట్టి పరమార్థోద్దేశము కలిగిన మానవజన్మ మెత్తితిమి. ఇది “అర్థదం” పురుషార్థములను సంపాదించి యియ్యగలది. అయితే “అనిత్యం” చాలకాలముండునది కాదు. రోగములు

నొప్పులు లేక బ్రతికితే శక్తిమంతులుగా డెబ్బది యేండ్లు బ్రతుక వచ్చును. ఇట్టి డెబ్బదిసంవత్సరములలో కూడ నెన్ని సంవత్సర ములు నిజముగా నుపయోగమో వారి వారి చర్యలను పట్టి నిర్ధారించవలయును. ఇట్లు దోషయుక్తమయ్యు లాభకరమైన మానుష్యము అనగా (మనుష్యత్వము) సంభవించిన పిదప బుద్ధి శాలియైన మనుష్యుడు "నిశ్శ్రేయసాయ" మోక్షప్రాప్తికిగా నతి శీఘ్రముగా ప్రయత్నపడవలెను. "విషయః ఖలు సర్వతః స్యాత్" అనగా శబ్దస్పర్శరూపరసగంధాత్మకంబులును కర్మ గతివిసర్గఆనందాత్మకంబులు నగు అనుభవములు మృగాదుల శరీ రంబులలో నుండినపుడు కూడ ననుభవించితిమి. "జ్ఞానం హి తేషా మధికో విశేషః" అనిన ప్రకారము మృగములకును మనుష్యులకును భేధము జ్ఞాన మొక్కటేగదా.

## పురుషార్థములు

మనుష్యశరీరధారియైన జీవాత్మకు ఈ శరీరముగుండా పొం దగల ప్రయోజనములు నాలుగు—ధర్మము, అర్థము, కామము, మోక్షము అని. ధర్మాది పురుషార్థసిద్ధికిగా మనుష్యులు వారి వారి గుణములను పట్టియు స్వభావసిద్ధమైన చేష్టలను పట్టియు

## వర్ణములు

గా నియమింపబడిరి. వర్ణములు నాలుగు. మహాభారతము, అను శాసనపర్వము, ౨౮ వ అధ్యాయమందు

తిర్యగ్యోనిగత స్సర్వో మానుష్యం యది గచ్ఛతి ।
స జాయతే పుల్కసో వా చండాలో వాప్యసంశయః ॥

మృగాదులశరీరంబులలో యాత్రచేయుచున్న తైజసవైశ్వానరాత్మలు మనుష్యదేహమునందు ప్రవేశించుటకు సిద్ధమయినపుడు వారలు అదివరకును అనుభవించుచుండిన గుణములయిన క్రూరభావము, ఓర్వలేమి, కొట్లాడుస్వభావము, ఇట్టి గుణములను కలిగి నిబంధనలకు లోబడని స్వభావవంతులైనందున పుల్కసుడు చండాలుడు అను జన్మములందు పుట్టుదురు. అనేకజన్మములు అట్లుండి పిమ్మట శూద్రజన్మమునకు వత్తురు. తరువాత వైశ్యుడు, తరువాత క్షత్రియుడు, తరువాత బ్రాహ్మణుడు ; ఇట్లు క్రమక్రమముగా జాతులలో పైపైకి ఎక్కుదురు. అనగా వారల గుణములు కర్మలు స్వచ్ఛములగును. ప్రకృతమందు పుల్కసజీవాత్మలు బ్రాహ్మణశరీరములలో నుందురు. అట్లే బ్రాహ్మణజీవాత్మలును ఇతర వర్ణశరీరములలో నుందురు. "స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః" అని అర్జునుడు చెప్పిన ప్రకారము ఇది వర్ణసంకరమైన కాలము. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు వీరలకు ద్విజులని పేరు.

## ఆశ్రమములు

"బ్రహ్మచారీ గృహస్థ శ్చ వానప్రస్థో యతి స్తథా" అని ౧. బ్రహ్మచర్యము, ౨. గార్హస్థ్యము, ౩. వానప్రస్థము, ౪. సన్న్యాసము అని ఆశ్రమములు నాలుగు.

జనసముదాయమునందు శూద్రుని ధర్మము పరిచర్య. అట్లే ఒక మనుజునియందు బ్రహ్మచర్యముయొక్క ముఖ్యధర్మము పరిచర్య. జనసమూహమందు వైశ్యుడు భూమియందు పయిర్లు పెట్టి పెంచి యితరులకు ఆహారద్రవ్యముల నిచ్చి వారలను కాపాడును. అట్లు గార్హస్థ్యమందు మనుజుడు ఇతర ఆశ్రమములవారలను ఆహారద్రవ్యముల నిచ్చి కాపాడును.

జనసమూహమందు బ్రాహ్మణుడు తాను విరక్తుడై ఇతరులకు చదువు చెప్పి తెలివిని యిచ్చు విధమున ఆశ్రమములయందు సంన్యాసి విరక్తుడై యితరులకు జ్ఞానదానము జేయును. ఇవ్విధంబున వర్ణాశ్రమధర్మములు లోకమందు పరస్పరోపకారులగా నుండుటయే కాక జీవాత్మలవృద్ధికి గారణమై యుండును.

ఈ వర్ణాశ్రమధర్మములను మరికొంత జాగ్రతగా పరిశీలించి చూచితే స్వార్థకములు కొన్నియు పారమార్థికములు కొన్నియుగానున్నవి. అనగా ధర్మము అర్థము కామము అనునవి స్వార్థకము గానును మోక్షము అనునది పారమార్థికముగానును ఉన్నవి. స్వార్థపరిశ్రమమునకు ప్రవృత్తిమార్గము అనియును పారమార్థికపరిశ్రమము, (పరార్థపరిశ్రమము) వీట్లకు నివృత్తిమార్గము అనియును పేళ్లు. ద్వితీయాధ్యాయము చివరను ప్రవృత్తి నివృత్తిమార్గములు అను పదములను ప్రస్తావించితిమి. ప్రవృత్తిమార్గము నివృత్తిమార్గము వీట్లును గురించి ఇకముందు వ్రాతుము.

## మార్గప్రదర్శకులు

అనగా మార్గమును చూపువారు. క్రొత్తగా పశ్వాదుల శరీరములను వదిలి మానవశరీరములయందు ప్రవేశించిన మనుష్య

లకు ఆహారము ఆవాసము మొదలగునవి సంపాదించుకొనుటకు శక్తిలేని కాలమందు అనేక దేవతలు ఋషులు పితృదేవతలును సహాయులు గానుండిరి. కనుక మనుష్యులు కొంతమట్టుకు దేవతలకు ఋషులకు పితృదేవతలకు ఋణస్థులు అయిరి. ఈ మూడు ఋణములనును ఉత్తరోత్తర మనుజులు తీర్చుకోవలెను. వీరికి మహాపీఠము అనియు పేరు. వీరిలో

స్వాయంభువమనువు

మొదటివారు. వారి తరువాత పృథుచక్రవర్తి మొదలగువారు. ఈ తరగతి మార్గప్రదర్శకులు మనుష్యుల దేహసౌఖ్యములకుగా ముఖ్యముగా శ్రమపుచ్చుకొనినవారు. పూర్వాధ్యాయాంతమందు మనుష్యులు తేనెలనిచ్చు వృక్షములవల్ల జీవించుచుండిరనియు జనసముదాయముయొక్క ఉపయోగార్థముగా దేవతలచే నియ్యబడిన ఆ వృక్షములను కొందరు ఆక్రమించుకొనిరనియు ఆ పాపఫలముగా ఆ వృక్షములు మాసిపోయెననియు చదివితిమి.

> నష్టేషు మధునా సార్ధం కల్పవృక్షేషు వై తదా ।
> విషాదవ్యాకులాస్తా వై ప్రజాస్తృష్ణాక్షుధార్దితాః ॥
> తాసాం వృష్ట్యుదకానీహ యాని నిమ్నగతాని తు ।
> వృష్ట్యావరుద్ధైరభవన్ స్రోతః ఖాతాని నిమ్నగాః ॥

అట్లు మాసిపోయిన వృక్షములను చూచి ప్రజలు దుఃఖించిరనియు అపుడు వర్షములు కురియుటకారంభించెననియు అనేక విధములైన ధాన్యములు స్వధాగా భూమిలో ఫలించెననియును పల్లె కాలువలు

మొదలగునవి యంతయు ఏర్పడెననియును రోషమోహామోహన ములు ప్రజలయం దుద్భవించెననియు ఆ రోషాదులయొక్క దుష్ఫ లములగా తేళ్లు పాములు మొదలగు విషజంతువులు ఉద్భవించె ననియు మొదలుగా గల వివరములు శ్రీ మార్కండేయపురా ణమునందు చెప్పియున్నది. మరియు

> బ్రహ్మాణం శరణం జగ్ముః క్షుధార్తాః పరమేష్ఠినం।
> దుగ్ధేయం గౌ స్తదా తేన సస్యాని పృథివీ తలే॥

ప్రజలందరును ఆకలితో కష్టపడి బ్రహ్మదేవునిగురించి ప్రార్థించిరి. అపుడు పృథుచక్రవర్తి యవతరించిరి. భూమి గోరూపముగా నవతరించెను. ఆ గోవుగుండా తమకు ఆహారార్థము కావలసిన ధాన్యాదులను పృథుచక్రవర్తి పాలుపిండినట్టు పిండించెను. ఆ గోవునకు కామధేనువని పేరు. పృథుచక్రవర్తి భూతలమును మిట్ట పల్లములు తీర్చి జనులకు "హస్తసిద్ధి" అను విద్యనేర్పిరి. చేతుల గుండా పనులు చేసి వడ్ల, తట్ర, కుమ్మర, కరమల, కంసల మొదలగు శిల్పవిద్యలను నేర్పిరి. ఈ విధముగా జీవనము అప్పటి నుండి ఆరంభము. తదనంతరము గుణకర్మవిభాగములవల్ల వర్ణవివర ములు ఏర్పడెను.

కల్పవృక్షము కామధేనువు అను పేళ్లు ఎందువల్ల కలిగెనని పై కథవల్ల మనకు తెలియుచున్నది. ఇదంతయు మనుజులయొక్క శరీరపోషణార్థము చేసిన పరికరములు. జీవాత్మలు స్వాభావిక ముగా ప్రవృత్తిమార్గమందు చరించవలసినకాలము గనుక త్రి వర్గము అను సంజ్ఞావాచకమువల్ల నెరుగదగిన ధర్మ అర్థ కామ

ములను అనుభవించి ప్రవృత్తిమార్గయాత్ర ముగించిన పిదప నివృత్తిమార్గయాత్ర నారంభించుటకు కావలసిన సంగతుల నంతయు ప్రజలకు తెలియపరచునట్లు శ్రీస్వాయంభువమనువుగారు ధర్మశాస్త్రమును వ్రాసిరి. ఈ శాస్త్రమునకు మనుధర్మశాస్త్రమని పేరు. ఇట్లు వ్రాసిన శాస్త్రము నందలి నిబంధనలను అనుష్ఠించి యితరులు అనుష్ఠించుటకు నిదర్శనముగా ప్రవృత్తిమార్గప్రవీణు లైనటువంటి గృహస్థులనును, నివృత్తిమార్గప్రవీణులైనటువంటి నైష్ఠికబ్రహ్మచారులనును స్వాయంభువమనువు ఒకస్థలమందు చేర్చి యుంచియున్నారు.

> తత్రాష్టాశీతి సాహస్రా మునయో గృహమేధినాం ।
> పునరావర్తినో బీజభూతాః ధర్మప్రవర్తకాః ॥
> సప్తర్షి నాకవీథ్యంతర్దేవలోకం సమాశ్రితాః ।
> తావంత ఏవ మునయః సర్వారంభవివర్జితాః ॥
> తపసా బ్రహ్మచర్యేణ సంగత్యాగేన మేధయా ।
> తత్ర గత్వా వతిష్ఠంతే యావ దాభూతసంప్లవం ॥
> యతో వేదాః పురాణాని విద్యోపనిషద స్తథా ।
> శ్లోకాః సూత్రాణి భాష్యాణి యచ్చ కించన వాఙ్మయం ॥
> వేదానువచనం యజ్ఞో బ్రహ్మచర్యం తతో దమః ।
> శ్రద్ధోపవాసశ్చ తథా స్వాత్మనో జ్ఞానహేతవః ॥
>
> (యాజ్ఞవల్క్య స్మృతి)

ఇట్టి మునీశ్వరసంఘమునుండియే అన్ని శాస్త్రములును వేదములును భాష్యాదులును మనుష్యుల యుపయోగార్థము వచ్చుచున్నవి. ఈ విధమున ఋషులకు మనుష్యుల మైన మనము ఋణగ్రస్తులము.

ఈ పుస్తకమునందు ౭వ పుటలో మరీచ్యాది ఋషుల గుండా ప్రవృత్తిధర్మము నుపదేశింపించి సనకాదులగుండా నివృత్తి ధర్మము అను మోక్షోపాయమును పరమకారుణికుడైన భగవంతుడు మనుష్యుల శ్రేయః ప్రాప్తికొరకు కలిగించినారని చదివినాము. ఇపుడు చెప్పినయాజ్ఞవల్క్యస్మృతిలోని శ్లోకములవల్ల మనకు నిదర్శనములగా మునీశ్వరసంఘమున్నదని తెలిసినది. సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు తాను సృష్టించిన లోకములయొక్కయు అందలి ప్రజలయొక్కయు యోగక్షేమముల నుద్దేశించి ఇంతకన్న నధికమైన ప్రయత్నములను చేసియున్నారు. ఎట్లనగా

> తతో మా మీశ్వరః సృష్ట్వా జ్ఞానే నాయోజ్య చాసకృత్ ।
> విససర్జ మహీపీఠం లోకస్యాజ్ఞానశాంతయే ॥
> యథా హం ప్రహిత స్తేన తథా న్యేచ మహర్షయః ।
> సనత్కుమార ప్రముఖా నారదాద్యాశ్చ భూరిశః ॥

వసిష్ఠులవారు శ్రీరాములతో చెప్పుచున్నారు:—లోకములను ప్రజలను సృష్టించిన తరువాత బ్రహ్మదేవుడు నన్ను సృష్టించి అమితజ్ఞానమును నాకు ఇచ్చి నన్నును నారదాదులైన ఋషులనును శ్రీసనత్కుమారులవారి అధికారమునకు లోబరిచి ప్రజలజ్ఞాన ప్రాప్తికొరకు భూలోకమునకు పంపిరి. ఇంతేకాక శ్రీసనత్కుమారులవారు మార్గప్రదర్శకసంఘము అను మహాపీఠమునకు అధిపతియై, శంబళగ్రామమునందున్నట్టును ఈ లోకమునందు రాజ్యమేలురాజులు జ్ఞానదానముచేయు గురువులందరును వారియంశాంలనియును తెలియనగు.

ద్వంద్వాని సంప్రవృత్తాని విషయార్థం మహీభుజాం ।
దండ్యతాం సంప్రయాతాని భూతాని భువి భూరిశః ॥
తతో యుద్ధం వినా భూపాః మహీం పాలయితుం క్షమాః ।
న సమర్థా స్తదాయాతాః ప్రజాభిః సహ దీనతాం ॥
తేషాం దైన్యాపనోదార్థం సమ్యగ్దృష్టి క్రమాయచ ।
తతో స్మదాదిభిః ప్రోక్తా మహత్యో జ్ఞానదృష్టయః ॥
అధ్యాత్మవిద్యా తేనేయం పూర్వరాజసువర్ణితా ।
తదను ప్రసృతా లోకే రాజవిద్యేత్యుదాహృతా ॥
రాజవిద్యా రాజగుహ్య మధ్యాత్మజ్ఞాన ముత్తమం ।
జ్ఞాత్వా రాఘవ రాజానః పరాం నిర్దుఃఖతాం గతాః ॥

(యోగవాసిష్ఠము, ౨ భా. ౧౧ అధ్యా—౩-౧౮)

కాలక్రమమున అహోరాత్రావశ్యకత అధికము కానుకాను భూవ్యవసాయమందు కాలము అధికముగా గడపవలసి వచ్చినందున కలహములు, కడుపుమంటలు, కొట్లాటలు, ఘాతలు కలుగుచు వచ్చినందునను కాలదోషములైన ఎండ, గాలి, వాన, చలి మొదలగు బాధలు కలుగుచు వచ్చినందునను రాజులు తమ దేశములయెల్లలకు వెలుపటినుండి తమ ప్రజలకు కలుగుచుండిన శ్రమలను యుద్ధములు లేక నివారించుటకు అశక్తులైరి. తమ రాజ్యములలోనే తమ ప్రజలలో పరస్పరవైషమ్యములను దండన వినాగా నివారించుటకు వీలు లేకపోయెను. కాబట్టి రాజులును ప్రజలును దైన్యముజెందిరి. అట్టి సందర్భమందు మేము రాజులకును ప్రజలకును ధర్మములనుపదేశించి జ్ఞానవంతులనుగా చేసితిమి. ఆ యుపదేశమునకు అధ్యాత్మవిద్య యని పేరు. దానినే రాజవిద్య, రాజగుహ్యమందురు. (ఇది వసిష్ఠులవారు చెప్పినది.)

శ్రీమద్భాగవతము, పంచమస్కంధము, ఏకవింశాధ్యాయ మందు సూర్యుని తేజస్సువంటి తేజస్సుగల సనత్కుమారాది ఋషులు పృథుచక్రవర్తికి జ్ఞానోపదేశము చేయవచ్చిరని చెప్పియున్నది. ఆ అధ్యాయమును చదివితే రహస్యార్థములు కొన్ని వివరమగును.

ఈ మార్గదర్శకసంఘమువారు లోకమునందెల్లమతముల యందును వివిధానుభవములను ఆ యనుభవముల సారాంశప్రాప్తి వల్ల బుట్టిన తేజస్సు, ఓజస్సు, సహస్సు లను సిద్ధులనుపొందిన వారిని చేరదీసి తమ సంఘములోచేర్చికొని లోకమందు అజ్ఞానావృతమైన ప్రజను జ్ఞానవంతులుగాచేసి బంధవిముక్తులనుగా చేయుదురు. మానుష్యము అను నీయధ్యాయమునందు కొన్నిసంగతులను సూచించితిమి. రాబోవు అధ్యాయమునందు మానుష్యమునుపొందిన జీవాత్మ సూక్ష్మలోకములందు సంచారము చేయుటకుగా ఏ శరీరములను ఉపయోగించును మొదలగు విషయములను గురించి వ్రాయనగును.

---

## ఐదవ అధ్యాయము

బీజం సంసృతి భూమిజస్యతు తమో దేహాత్మ ధీరంకురో ।
రాగః పల్లవ మమ్బుకర్మతు వపుః స్కన్ధోఽసవశ్శాఖికాః ।
అగ్రాణీంద్రియ సంహతిశ్చ విషయాః పుష్పాణి దుఃఖం ఫలం ।
నానాకర్మ సముద్భవం బహువిధం భోక్తాత్ర జీవః ఖగః ॥

### ప్రవృత్తిమార్గము

ఇదివరకును జీవాత్మగారు వివిధయోనులయందు జన్మించు చువచ్చి చివరకు మనుష్యశరీరమును ప్రవేశించిరని చెప్పబడెను. ఇచ్చట ముఖ్యమైన యంశము నొక్కటిని చెప్పవలసి యున్నది. ఆత్మానాత్మవిషయమునుగురించి యిపుడే కొంత విచారించిన నిక ముందు తద్వివేచనమునుగురించి విచారించుట సులభము. ఆత్మయనగా జీవాత్మ. ఉపక్రమాధ్యాయమునందు వీరికి "క్రీడకుడు" అను పేరు నుపయోగించినాము. వీరికి సహాయముగా "క్రీడారంగము" అనునది యేర్పడినది. ఇది యనాత్మ. శ్రీమద్భగవద్గీత ౧౩వ అధ్యాయమునందు చెప్పిన క్షేత్రము అంతయు ననాత్మ. వేదాంతసంప్రదాయమునందు అనాత్మకు "బంధము" అని పేరు. అనాత్మబంధములు అనేకములున్నను ప్రకృతమందు ఈ అధ్యాయమునందు శరీరములయొక్కయు, వాని

స్థితియొక్కయు, వాని యుపయోగములయొక్కయు వివరములను సంగ్రహముగా వ్రాయదలచియున్నాము. ఈ అధ్యాయమునందే అనాత్మబంధములలో నతి బలవంతమైన మనస్సుయొక్క స్వభావమునుగురించియు ఆ మనస్సును స్ఫుటీకరించి వీక్షింపచేసినప్పుడు అది యెంత విచిత్రకార్యములను చేయునో ఆ వివరమును సంగ్రహముగా వ్రాయనగును. ఇవంతయు ప్రవృత్తిమార్గము అను ముఖ్యాంశముగా నెరుగవలయును. ఒక్కొక యంశమునుగురించియు నొక్కొక గ్రంథమే వ్రాయవలసినంత విషయములున్నవి. అయినను అన్ని ముఖ్యాంశములనుగురించియు కొంతకొంత తెలిసికొనిన పిమ్మట ప్రతి అంశమునుగురించియు మరియు ననేకవిషయములనుగురించియు చదువవచ్చునని యుద్దేశించి ఈ యధ్యాయమందే కాక యిక రాబోవు అధ్యాయములయందు సహా అంశములనుగురించి సంగ్రహముగానే వ్రాయ నుద్దేశము.

## దేహములు

ఇంతకుముందు తృతీయాధ్యాయమునందు (౮౩ వ పుటయందు) జీవాత్మ పాంచభౌతిక లోకమునందు అనుభవసంపాదనార్థము ప్రవేశించినపుడు అనేక శరీరములను సంపాదించుకొనుటకు ప్రయత్నముచేసి ఏ యే తత్త్వము ఏ యే లోకమందు ప్రధానాంశమో ఆ యా లోకమునందు వ్యవహరించుటకుగా ఆ యా తత్త్వముయొక్క భూతసూక్ష్మమును సంపాదించికొనెను అని చెప్పబడెను. ఆకాశతత్త్వప్రధానమైన మర్త్యలోకమునందు వ్యవహారము జరుపుటకుగా ఆకాశతత్త్వపు

సంపాదించికొనెను. వాయుతత్త్వప్రధానములైన జనలోకము, తపోలోకము అను లోకములయందు సంచారముచేసి వ్యవహారము జరుపుటకుగా వాయుతత్త్వభూతసూక్ష్మము నొక్కటిని సంపాదించికొనెను. తేజస్తత్త్వప్రధానములైన మహర్లోకస్వర్గలోకముల యందు వ్యవహారార్థము తేజస్తత్త్వభూతసూక్ష్మమును సంపాదించికొనెను. అప్తత్త్వప్రధానమైన భువర్లోకవ్యవహారార్థము అప్తత్త్వపుభూతసూక్ష్మమునొకటిని సంపాదించికొనెను. అదే విధముగా భూలోకమందు సంచరించి అనుభవసంపాదనమునకుగా స్థూలశరీరము సంపాదించుకొనుటకై పృథివీతత్త్వపుభూతసూక్ష్మమును ఒకటిని సంపాదించికొనెను.

ఈ చెప్పిన భూతసూక్ష్మములే దేహాబీజము లను నపర నామధేయముతో ౮౮ వ పుటయందు వ్యవహరింపబడెను. కల కండను చేయువారు విధానప్రకారము చక్కెరను పాగుగ కాచి ఆ పాగులో కొన్ని దారములను వ్రేలవిడుతురు. ఆ పాగు చల్లారుచు రాగా చక్కెర అణువులు ఒక దారమువెంబడి గుమిగూడి ఆ దారమును ఆధారముచేసికొని ఒక పెద్ద గడ్డవలె ఏర్పడును. కొన్ని సమయములయందు కలకండపెళ్లలయందు దారములు కండ్లపడుచుండుట అనేకులకు తెలిసిన విషయమే. అదేవిధముగా దేహాబీజము లను అణువులు ఏమిచేయుననగా క్రొత్తగా నొక శరీరము ఏర్పడవలసిన అవశ్యము కలిగినపుడు తన తత్త్వపు అణువులు తనంతటి మంచివానినే వెదకి తనచుట్టు చేర్చుకొనును. అపుడు ఒక శరీర మేర్పడును. ఏ శరీర మైనను అణువుల సమూహామే కదా. వివిధ దేహాబీజములను మొట్టమొదట సంపాదించి

పాంచభౌతిక లోకసమూహమునందు ప్రవేశించుట కుద్యుక్తుడైన ప్రజ్ఞానాంశువునకు ఇచ్చిన దేవతలు ఎల్లపుడు ఆ ప్రజ్ఞానాంశువు యొక్క వివిధ దేహములను కాపాడుటకొరకు సిద్ధముగానుందురు. వారియొక్క అనుగ్రహమువల్ల నొక దేహబీజము తనయొక్క గుణ ధారణలకు అనురూపములైన అణువులను తాను ఆకర్షించుచుం డును. అణువులకు స్వాభావికముగా రెండు శక్తులు గలవు. అను వర్తనశక్తి వివర్తనశక్తి అని. అనువర్తనశక్తిచేత అణువులు ఒకటితో నొకటి కలిసి ద్వ్యణు త్ర్యణు త్రసరేణు అని అనేకవిధములగా నుపాధులు ఏర్పడును. దేహబీజములు అనువర్తనశక్తివల్ల ఆయా లోకమందు జీవాత్మకు కావలసిన శరీరములను సిద్ధపరిచియిచ్చును. ఈ పుస్తకము ౨౫ వ పుట చివరను గోళములనుగురించి సూచిం చినపుడు పృథివీతత్త్వగోళములో ప్రవేశించి కొంతమించి అప్తత్త్వ గోళమున్నదని చదివితిమి. అదేవిధముగా పృథ్వీతత్త్వప్రధాన మైన భూర్లోకమందు వ్యవహారార్థము జీవాత్మ సంపాదించుకొనిన స్థూలశరీరములో ప్రవేశించి అన్నిదిక్కులయందును కొంతమించి అప్తత్త్వప్రధానమైన భువర్లోకమునందు ఉపయోగపడు శరీరము అగు కామమయశరీరము అనునది యున్నది.

"అప్తత్త్వగోళములో ప్రవేశించి కొంతమించి తేజస్తత్త్వ గోళమున్న" దని ౨౫ వ పుటలో వ్రాయబడియున్నది. అదే విధమున కామమయశరీరములో ప్రవేశించి కొంతమించి అన్ని దిక్కులను వ్యాపించి మనోమయ శరీరమున్నది.

"తేజస్తత్త్వగోళములో ప్రవేశించి కొంతమించి వాయు తత్త్వగోళముండును" అని వ్రాసినప్రకారము మనోమయదేహ

మందు ప్రవేశించి కొంత అన్నిదిక్కులయందును మించి వాయు తత్త్వప్రధానమైన లోకములయందు అనుభవసంపాదనకు కరణ మగు బుద్ధిమయశరీరమున్నది. దివ్యజ్ఞానసమాజపు గ్రంథముల యందు వాయుతత్త్వప్రధానమైన లోకములకు "బుద్ధిక్ ప్లేను" (Buddhic plane) అని పేరు. బుద్ధిక్ప్లేనునందు చరించు దేహ మునకు "బుద్ధిక్ బాడి" (Buddhic Body) అని పేరు. ఇదే బుద్ధి మయశరీరము.

"వాయుతత్త్వగోళములో ప్రవేశించి కొంతమించి ఆకాశ తత్త్వగోళమున్నది" అని ౨౫ వ పుటలో నున్నది. ఈ గోళ మునకు దివ్యజ్ఞానసమాజపు పుస్తకములలో "ఆత్మిక్ ప్లేను" లేక "నిర్వాణిక్ ప్లేను" అని పేరు. ఆ ప్రకారము "బుద్ధిక్ బాడి" లో ప్రవేశించి అన్నిదిక్కులలోను కొంత మించి ఆకాశతత్త్వ ప్రధానమైన "ఆత్మిక్ ప్లేను" లేక "నిర్వాణిక్ ప్లేను" అను సత్యలోక సంచారార్థముగా నేర్పడిన శరీరమున్నది. ఈ శరీరము కరచరణాద్యవయవములు కలిగి యుండదు. కనుక అంత ఉన్నత మైన దేహమునుగురించి వ్రాయునపుడు దేహ మను సంజ్ఞ సాధా రణముగా నుపయోగించు సంప్రదాయము లేదు. ఈ ఆచార మును అనుసరించి "పరకోశము" అని మన గ్రంథములయందుప యోగించుచున్నారు. శ్రీమద్భాగవతము, చతుర్థస్కంధము, ౨౩ వ అధ్యాయము, ౧౧ వ శ్లోకమునందు "జీవకోశమ్" అని యుపయోగించియున్నారు. అయితే యోగవాసిష్ఠము, ఉత్పత్తి ప్రకరణము, లీలోపాఖ్యానమునందు "జ్ఞానదేహమ్" అని యుపయోగించియున్నది. దివ్యజ్ఞానసమాజపుగ్రంథములయందు

“ ఆరిక్ ఎగ్ ” (Auric Egg) అని యుపయోగించి యున్నారు. కనుక జీవాత్మకు పాంచభౌతికప్రపంచమునందుండు శరీరములు:

| | |
|---|---|
| ౧. “ ఆరిక్ ఎగ్ ” అను ఆకాశ తత్త్వప్రధాన శరీరము. | Auric Egg |
| ౨. ఇందులోపల సంకుచితమై “ బుద్ధిక్ బాడి ” అను వాయుతత్త్వ ప్రధానమైన శరీరము. | Buddhic Body |
| ౩. ఈ రెండవ శరీరములో మరి యంత సంకుచితమై రెండు తెగలగా భిన్నమై తేజస్తత్త్వప్రధానమై మనోమయ శరీరమున్నది. | 1. Higher Mental Body<br>శుద్ధమానస శరీరము<br>2. Lower Mental Body<br>అశుద్ధమానస శరీరము |
| ౪. ఈ మనోమయ శరీరమందు అంతకన్న చాలసంకుచితమై అప్తత్త్వప్రధానమైన కామమయ శరీరమున్నది. | Astral Body |
| ౫. ఈ కామమయశరీరమందు దానికన్న చాలచిన్నదై మనకు ఇంద్రియగోచరమైన స్థూలశరీరము పృథివీతత్త్వ ప్రధానమైయున్నది. | Physical Body |

ఈ విషయమును వివరముగా మననము చేసి అవగాహన పరచుకోవలెను. బ్రహ్మాండము అను అధ్యాయము చదువబోవు నపుడు ఈ అర్థములు అత్యావశ్యకములు గానుండును.

ఐదు తత్త్వములకును సంబంధించినవి ఐదు « ప్లేనులు » అని దివ్యజ్ఞానసమాజపు వారుపయోగించిన

| | | |
|---|---|---|
| ౧. నిర్వాణిక్ ప్లేను | . . | Nirvanic Plane |
| ౨. బుద్ధిక్ ప్లేను | . . | Buddhic Plane |
| ౩. మెంటల్ ప్లేను | . . | Mental Plane |
| ౪. ఆస్ట్రిల్ ప్లేను | . . | Astral Plane |
| ౫. ఫిజికల్ ప్లేను | . . | Physical Plane |

అను పంచతత్త్వముల ప్లేనులు లేక లోకభాగములయందు జీవాత్మకు ఉపయోగించుటకుగా వారు ఐదు శరీరములను పైన వివరించిన ప్రకారము సంపాదించుకొనిరి. ఇవి అయిదుశరీరములు.

స్థూలశరీరము (ఫిజికల్ బాడి) నందు ప్రవేశించి కొంత దూరము అన్నిదిక్కులయందు వ్యాపించి కామమయశరీరము (ఆస్ట్రిల్ బాడి) న్నది.

స్థూల-కామమయశరీరములు రెండింటియందును ప్రవేశించి కొంతదూరము వెలుపల అన్నిదిక్కులయందును వ్యాపించి ద్వివిధంబుగా భాగింపబడిన మనోమయశరీరమున్నది.

స్థూల-కామమయ-మనోమయశరీరములు మూటియందును ప్రవేశించి వెలుపల అన్నిదిక్కులయందును మించి బుద్ధిక్ బాడి యనునది యున్నది.

స్థూల-కామమయ-మనోమయ-బుద్ధిక్ బాడీలు నాలుగింటను ప్రవేశించి అన్నిదిక్కులయందును మించి « ఆరిక్ ఎగ్ » అను « జీవకోశము » మున్నది.

ఈ అంతటి మధ్యన జీవాత్మ జ్వలించుచు స్థూలశరీర మధ్య నుండు మాంసపిండమైన హృదయమును ఆశ్రయించి యుం డును.

మనోమయః ప్రాణశరీరనేతా ప్రతిష్ఠితోన్నే హృదయం సన్నిధాయ ।
మండకోపనిషత్తు

పై ప్రస్తావించిన యోగవాసిష్ఠము, ఉత్పత్తిప్రకరణము, లీలోపా ఖ్యానమును జాగ్రతగా చదివి మననముచేసినపుడు శరీరములు ఒకటిలోనొకటి ప్రవేశించి స్థూలమైనదానిని సూక్ష్మమైనది ఆవ రించి యున్నదనియు కదలీవృక్షమువలె కప్పుపైన కప్పుండునట్లు శరీరములుండుననియు విశదమగును.

ఈ ఐదుశరీరముల పైకి ఆధ్యాత్మికసృష్టి యని యపరనామ ధేయమునం బరగు విజ్ఞానమయకోశప్రతిష్ఠ యగు పర్యంతమును చాలమట్టుకు స్థూలశరీరము మాత్రము రూపేర్పడినది. అంతకంటె సూక్ష్మములైన శరీరములలో కామమయశరీరము కొంతమట్టుకు మాత్రము ఏర్పడినది. కుమ్మరవాడు కుండలను నిర్మించుతరి కుండరూపమును మాత్రముచేసి ఆవమునందు పెట్టకమునుపు ఆ వస్తువునకు కుండయని పేరు ఇడవచ్చునుగాని ఆ కుండలో నీళ్లు నించుటకు సాధ్యము కాదు కదా. అదే విధముగా స్థూలశరీరము రూపుమాత్రమేర్పడినది. కర్మేంద్రియములైన వాక్కు పాణి పాదము పాయువు ఉపస్థ ఇట్టి ఇంద్రియములు ఏర్పడినవి. వాటిని నాగరికముతో నుపయోగించు యోగ్యత రాలేదు. జ్ఞానేంద్రియ ములైన శ్రోత్రము, చక్షుస్సు, స్పర్శనము, రసనము, ఘ్రాణము అను నింద్రియములయొక్క యునికిపట్టులగు చెవులు కండ్లు, చర్మము,

నాలుక, ముక్కు అను అవయవములున్నవి గాని వాని వాని కార్యములను లాభకరముగా జరిపించు శక్తి జీవాత్మకు రాలేదు. ఇదే విధముగా కామమయదేహమందు అతి ముతకలైన "భావములు" (Emotions) మాత్రము ఆ దేహముగుండా జీవాత్మను అందునుగాని నాగరికతజెందిన సూక్ష్మభావములను (refined emotions) తనగుండా జీవాత్మను అందించగలయోగ్యత ఆ కామమయశరీరమునకు రాలేదు. మనోమయశరీర మన్ననో మరి అంత అసమాధానకరముగా నుండును. ప్రాజ్ఞాత్మకును తైజసవైశ్వానరాత్మకును అభేద్యమైన సంబంధము కలిగి మానవజన్మము వచ్చినదిగాని మానవత్వము ఇదివరకును స్థిరపడలేదు. మానవత్వమనగా "మన్యతే సర్వం అనేన ఇతి"—దేనివల్ల వ్యక్తప్రపంచమంతయు దత్కారణం బైన యవ్యక్తమును ఎరుగబడునో అది యని యర్థము. ఈ శక్తి మానవజన్మమునందు చాలవ్యవసాయము జరిగినపిమ్మటనేగాని సాధ్యముగాదు.

దేహములయందెల్లయు స్థూలాతిస్థూలమైన స్థూలశరీరమును ఆయుధముగా నుంచుకొని ప్రయత్నబాహుళ్యము జరిపినగాని కామమయ మనోమయ బుద్ధిమయాది శరీరములు సుష్ఠుపడవు. కనుక ఆదియందు స్థూలశరీరమును గురించి విచారించవలయును.

## స్థూలశరీరము

జీవాత్మ యుపయోగించు శరీరములన్నింటిలోనును చిన్నదై, స్థూలమై, కొద్దికాలమే బ్రతికియుండునది స్థూలశరీరము. ఈ శరీరముగుండానే జీవాత్మ యనేక భోగములనును దుఃఖములనును

అనుభవించగలడు. "భోగాయతనం ఇదం వపుః". ఇంద్రియ ములవల్లనే జీవాత్మ బహిఃప్రపంచమును ఎరుగును. అట్టి యింద్రి యగోళములు ఈ శరీరమందున్నవి. ఈ శరీరమునకు పుట్టుక, వయస్సు, ముసలితనము, మరణము మొదలగు అవస్థలు గలవు. "స్థూలస్య సంభవ జరా మరణాది దుఃఖాః" అని యున్నది.

ఇట్టి శరీరముయొక్క పుట్టుకయొక్క సందర్భములను విచా రింతము. ఈ విచారమందు మొదటి అంశము కర్మ. కర్మయనగా జీవాత్మ మనస్సుతో చేసిన కార్యములయొక్క ఫలము. ఈ విషయ మును విపులముగా ముందు వ్రాయనగును. జీవాత్మ జన్మమునకు వచ్చుటకుముందు వారియొక్క పుణ్యాపాపఫలములలో రాబోవు జన్మమందు అనుభవించుటకు అనుకూలమైనంత భాగమును వేరు దీసి కర్మవివరణదేవతలు ఆ భాగమును ఒకచిన్న దేవతచేతికి ఇత్తురు. వీడదీసిన భాగమునకు ప్రారబ్ధకర్మ యని పేరు. ఈ చర్య మహర్లోకమందు నిర్ధారింపబడును. అపుడు జీవాత్మ తనయొక్క శుద్ధమనోమయశరీరమందుండును. తన ప్రారబ్ధకర్మయని నిర్ధా రింపబడిన ఫర్మానాను చేతబూనిన చిన్నదేవతవెంబడి జీవాత్మ క్రిందిలోకములకు దిగును. స్వర్గలోకమునందు ప్రవేశించి తన (అశుద్ధ) మనోమయదేహబీజమందలి శక్తులను వెలిపరచుటకు ఎంతటి శక్తిమంతమైన (అశుద్ధ) మనోమయశరీరము అవశ్యమో అట్టి మనోమయశరీరమును సంపాదించుకొనును. పిమ్మట తనకు అప్పటివరకు నుండు శుద్ధమనోమయశరీరము, అశుద్ధమనోమయ శరీరము ఈ రెండు శరీరములతో సహా "ఆస్ట్రల్ ప్లేను" అను భువర్లోకమునకు దిగును. అచ్చట తన కామమయశరీరపు దేహ

బీజమందు ఇమిడియుండు శుద్ధశక్తులు, అశుద్ధశక్తులు ఇవన్నిటిని వ్యక్తీకరించగల కామమయశరీరమును సంపాదించుకొనును. అనం తరము ఆ చిన్న దేవతవెంబడి భూర్లోకమునకు వచ్చును. ఆ దేవత భూర్లోకమందు ఒక విచిత్రమైన పనిచేయును. అనగా తన స్వా ధీనమందుండు జీవాత్మ అనుభవించవలసిన ప్రారబ్ధకర్మను అను భవించుటకు ఎట్టి అంగములుండవలెనో అవన్నియు బాగుగ చిం తించి భూలోకపు సూక్ష్మఅణువులతో నొక ఛాయాశరీరమును కట్టును. గుడ్డితనమును అనుభవించవలసినదిగా ప్రారబ్ధకర్మయం దుండినయెడల ఛాయాశరీరమందు కన్నులను విడిచిపెట్టును. ఆజానుబాహువై ఉన్నత పురుషుడుగానుండవలెనని ప్రారబ్ధ కర్మ యందుంటే ఆ విధముగా ఛాయాశరీరమును కట్టును. సంగీత శాస్త్రము అభ్యసించి గాయకుడుగా నుండవలసినదిగా ప్రారబ్ధకర్మ యందుండినయెడల మంచిశారీరమును ఇయ్యగల అణువులతో కుత్తుకను గట్టును. అజీర్ణరోగముల ననుభవించవలసిన ప్రాప్తి యుండినయెడల బలహీనమైన యణువులతో జీర్ణకోశమును గట్టును. ఈ విధముగా ప్రారబ్ధకర్మానుభవమునకు కావలసిన పరికరములనన్నిటిని ఆ ఛాయాశరీరమందు ఇమిడ్చియుంచి రాబోవుజన్మమునందు జీవాత్మకు ఏ స్త్రీ తల్లిగానుండవలెనో ఆ స్త్రీని ఏ పురుషుడు తండ్రిగానుండ వలసినదిగా ప్రారబ్ధ కర్మయందున్నదో అట్టి పురుషునిని యొకస్థలమునందు చేరు నట్లు చేసి ఆ స్త్రీకి గర్భధారణయగునట్లు చేయును. ప్రారబ్ధ కర్మయను ఫర్మానాను చేతనుంచుకొనియుండు చిన్న దేవత చేయు యుక్తులు అనేకములు. ఇక ముందు తనతండ్రి

యొవడో చెప్పుటకు తెలియక అవమాన పడవలసినదిగా ప్రారబ్ధకర్మయందుండిన యెడల జన్మమునకు రాబోవు జీవాత్మకు న్యాయముగా వివాహితులైన తలితండ్రులుండరు. వ్యభిచారమందు జన్మించును. ఇట్టి వేలకొలది గల యుపాయములనన్నిటిని చిన్నదేవత యుపయోగించి తల్లియొక్క గర్భకోశమందు క్రొత్తఛాయాశరీరమునుంచి జీవాత్మకును ఆ శరీరమునకును ఒక విధమైన అభిమానరూపకమైన సంబంధము నేర్పరిచి ఆ స్త్రీ సమీపముననే జీవాత్మతోసహా తాను (ఆ చిన్నదేవత) ఉండును. ఈ విధముగ జీవాత్మ జన్మించవలసిన దేశము, కాలము, జాతి, తెగ, దంపతులు, అన్నలు, అక్కలు మొదలగు సమూహములనను చిన్నదేవత నిర్ధారించి సంపాదించియిచ్చును.

గర్భముధరించిన నాలుగవమాసమువరకు జీవాత్మ తనకు తల్లిగాకాబోవుస్త్రీయొక్క సమీపమందుండి స్థూలశరీర దేహబీజమును నాలుగవనెలలో గర్భస్థపిండమునకు సంబంధపరుచును. అది మొదలు ఆ పిండము కదులుటకారంభించును. జీవాత్మ స్వాధీనమందుండు దేహబీజసూత్రముగుండా తనయొక్క శక్తిని ఆపిండమును ప్రవేశింప జేయుచుండును. దేహబీజసూత్రము అనగా ౭౫ వ పుటలో ప్రస్తావించియుండు అయిదు శరీరములయొక్కయు "ఛాయమైన అణువు" (౭౭ వ పుటచూడుడు) లను చేర్చిపట్టియుండు దారమువంటి సూత్రము. దీనిని కొందరు సూత్రాత్మ యనియును అందురు. వేదాంతములలో నుపయోగించు సూత్రాత్మ కాదు.

గర్భస్థఛాయాశరీరమునందు అతిజాగ్రతతో అణువువెంబడి అణువుగా దేవతలు స్థూలశరీరమును కట్టుచుందురు. (ఈ విషయ

మై "సంస్కారములు" అను అంశమును చూడుడు.) ఈ రా బోవు శరీరము పరంపరాపేక్షమైనది. పరంపర యనగా నింగ్లీషు భాషయందు (Heredity) అని యర్థము. పరంపర యనగా తలి దండ్రులకు కల రోగములు, స్థూలశరీరవాసనలు మొదలగునవి. జీవాత్మయొక్క దేహవాసనలే కాక తలిదండ్రులయొక్క దేహ వాసనలుకూడ నీ శిశువుయొక్క శరీరమందు వ్యక్తమగుచుండును. మేఘజాడ్యపుశరీరముల సంయోగమువల్ల శిశువు పుట్టితే శిశు వునకు కూడ నా జాడ్యము కలుగునట్టి అణువులవల్ల శిశువుయొక్క శరీరము కట్టబడును. మరియు పిండము గర్భమునందుండు కాల మందు తల్లికి గలుగు సంతోషము, శాంతము, దుఃఖము, కోపము మొదలగు గుణములకు అనుగుణములైన అణువులు ఆ శిశువు యొక్క శరీరమందు ప్రవేశించును. అదే విధముగా తండ్రియొక్క యు మరియు నితర సమీపబంధువులయొక్కయు శాంతకోపావేశ ములచే శిశువుయొక్క శరీరమును కట్టుచున్న దేవతలయొక్క పని మారుచుండును. కనుకనే మనశాస్త్రములయందు గర్భాధానము మొదలు జాతకర్మవరకును గర్భిణీస్త్రీని అతి జాగరూకతతో కా పాడుచుండవలెనని అనేక సంస్కారము లేర్పడినవి.

పిండము గర్భమునందుండు నపుడే ఇక ముందు జీవాత్మ ఉపయోగించుటకుగా భువర్లోకములో తాను సంపాదించుకొనిన కామమయశరీరమునకును పిండమునకును సంబంధ మేర్పడి మరి కొన్ని దినములకు ఇకముందుపయోగించుటకుగా సిద్ధముగానుండు "అశుద్ధమనోమయశరీరము" నకును గర్భస్థపిండమునకును సం బంధ మేర్పడును. ఈ విధముగా నేడుమాసములు ముగియునంత

వరకును జీవాత్మ తన క్రొత్తదేహములో ప్రవేశించకనే శరీరము యొక్క కట్టుటను మాత్రము చాల అక్కరతో కనిపెట్టియుండును. ఏడవనెల ముగియు సమయమందు జీవాత్మ శిశువుయొక్క శరీరము నందు ప్రవేశించును.

జీవాత్మయొక్క స్పందశక్తి అతివేగమైనది. శిశువుయొక్క ఏడునెలల గర్భవయస్సుగల శరీరము అతికోమలమైనది. అత్యుగ్రమగు జీవాత్మస్పందఆందోళనమునకు సహించుటకు శక్తిలేక క్వచిత్తుగా ఏడవనెలలోనే శిశువు మాతృగర్భము వదలి నేల్ల పడుటయు కలదు.

ఛాందోగ్యోపనిషత్తునందు పంచాగ్నివిద్య యని యొక భాగమున్నది. అందు జీవాత్మ తనయొక్క శుద్ధమానసశరీరము (శుద్ధమనోమయశరీరము) నందుండి మరల భూలోకమందు జన్మించుటకు సిద్ధమైనపుడు ప్రారబ్ధకర్మనిర్ధారము కాగానే మహర్లోకమునుండి (ద్యులోకము) స్వర్గలోకమునకు అతనిని దేవతలు తెత్తురనియు అది మొదటిహోమగుండమనియు; ద్యులోకహోమమువల్ల "సోమో రాజా సంభవతి" అని చంద్రలోకపువాడు పుట్టుననియు (చంద్రలోకము అనగా భువర్లోకము. అక్కడ పుట్టునది కామమయశరీరము); చంద్రలోకము రెండవ హోమగుండమనియు; ఆ హోమమువల్ల పర్జన్యుడను వర్షము పుట్టుననియు; ఆ వర్షమును పృథివీలోకము అను మూడవ హోమగుండమునందు హోమము చేసిరనియు; అందువలన అన్నము పుట్టెననియు; నాలుగవ హోమగుండమందు దేవతలు హోమము చేసిరనియు; అందువలన రేతస్సు పుట్టెననియు; అయిదవహోమ

గుండము స్త్రీశరీరమనియు; ఆ హోమగుండమునందు రేతస్సును ఆహుతిగా వేసి దేవతలు హోమముచేసిరనియు; అందువలన గర్భము కలిగినదనియు చెప్పియున్నది. ఈ భాగమును జాగ్రతగా చదువవలెను. అందువలన భూతసూక్ష్మములగుండా అశుద్ధమనోమయశరీరము (Lower Mental Body), కామమయశరీరము (Astral Body), స్థూలశరీరము (Physical Body) అనునవి జీవాత్మకులభించిన వివర మవగాహన యగును.

సారంగధరసంహిత మొదలగు వైద్యగ్రంథములను పఠించితే గర్భిణీస్త్రీకి ఎట్టి ఆహారము ఇయ్యవలెననియు, శిశువునకు ఎట్టి ఆహారమియ్యవలెననియును విశదముగా తెలియును. శిశువు భూలోకమునందు జన్మించిన పిమ్మట సాధారణముగా ఏడు సంవత్సరముల వరకును జీవాత్మ శిశుశరీరమునందు సుష్ఠుగా ప్రవేశించుట లేదు. గనుకనే శిశుశరీరము చేయు కార్యములకు జీవాత్మకు పూచి లేదు. ధర్మశాస్త్రములును ఇప్పటి చట్టదిట్టములు కూడ శిశువులు ఏడేండ్లునిండునంతకు ముందు చేయు తప్పులను గణింపవు. జీవాత్మ శరీరమందు ప్రవేశించిన వెనుక ఉపనయన మను సంస్కారము జరుగును. ఆ సందర్భము ద్విజాతుల శిశువుల రెండవ జన్మము అని శాస్త్రములు చెప్పుచున్నవి. శిశువుకు సప్తమవర్షము వరకును జీవాత్మ చాలమట్టుకు "ఆస్ట్రల్ ప్లేను" అను భువర్లోకమునందు వ్యవహరించుచు సకృత్తుగా శిశుశరీరమందు ప్రవేశించి తనయునికిని గాన్పించుచుండును. చిన్నబిడ్డలకు భువర్లోకపు చూపులు కనబడుట కలదు. భువర్లోకవాసులగు తన స్నేహితులను శిశుశరీరధారియైన జీవాత్మ చూచుచు, సంతోషవ్యాపార

ములను శిశుశరీరమున కలుగు నవ్వులవలనను దుఃఖభయభావముల వలనను నిష్కారణపేడ్పువల్లనను కనుపరుచుచుండును. యక్షులు, గంధర్వులు మొదలగు చిల్లర దేవతలు శిశువు లున్నచోట వచ్చి యుండి వారలకు సంతోషము కలుగునట్లు పాటలు పాడుచు ఆట లాడుచుందురు.

శిశువుయొక్క శరీరము ముదురుచు రాగా జీవాత్మ కొంచెము కొంచెముగా ఆ శరీరమునందు తాను ముందరికన్న నధికకాలము వసించుచుండును. చిన్నబిడ్డలకు ఒక విధమైన దివ్యదృష్టి స్వాభావికముగా నుండును. శిశువుయొక్క మెదడు ముదురుచురాగా జీవాత్మ తన అశుద్ధమనోమయశరీరము (Lower Mental Body) ను శిశువుశరీరముతో జతపరుచును. చిన్నబిడ్డలు పెరుగుకాలమందు తలిదండ్రులు వారలను భయపరచకూడదు. బుద్ధిహీనులైన తలిదండ్రులు బిడ్డలు తులుపితనము చేయుచున్నారు, వార్లను పట్టుట కష్టము అని బిడ్డలకు నల్లమందు ఇచ్చి నిద్రపోగొట్టుదురు. తమ సుఖానుభవములకు బిడ్డలు అడ్డపడుచున్నారని తలచి స్వార్థపరులైన తల్లులు బిడ్డల ఆరోగ్యమును నల్లమందు అను విషమునిచ్చి పాడుచేతురు. ఈ కాలమందు ఎట్టి మహాపురుషులు భూమియందు జన్మించుచున్నారో అనేకులకు తెలియదు. శ్రీ జగద్గురువులవారి యవతారకాలము అతిసమీపమునన్నది. ఆ మహాపురుషులు అవతరించుటకు ముందే అనేకమంది తపోధనులుగానుండినవారు జన్మమును గోరి జన్మించి శిశుత్వ బాల్యము లను అవస్థలను దాటి శ్రీవారియవతారకాలమునకు లోకసేవాధురీణులై యుండవలెనని అనేకులు పక్వజీవులు జన్మించుచున్నారు. కనుక తల్లులు

తండ్రులు బడియందుపాధ్యాయులు మొదలగు వారు తమకంటె నున్నత దశయందుండు మహాపురుషులు బాలశరీరములం దుందు రని యెరిగి వారిని అతి జాగరూకతతో పెంచి చదివించి లోక సేవార్థము సిద్ధపరిచి ధన్యులుగావలెను.

స్థూలశరీరమునకు ఆహారము ముఖ్యము. "ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః" అని శ్రీరామానుజాచార్యులవారు బోధించియు న్నారు. ధర్మశాస్త్రములలోనును బాలురకును బ్రహ్మచారులకును ఉప్పుకారము లధికముగానుండు ఆహారములను ఇయ్యకూడదు అని విధించియున్నది. "న పలాండుం భక్షయేత్" అని యొక ధర్మశాస్త్రవాక్యమున్నది. మనము భోజనము చేయు పదార్థ ములు సాత్త్వికములనియు రాజసములనియు తామసములనియు భాగింపబడియున్నవి. శరీర మారోగ్యవంతమై దృఢముగా నుండ వలెను. పరిశుద్ధములగు ఆహారమును వ్యాయామమును (Physical Excerise) మంచి గాలియును ముఖ్యములు. సత్త్వగుణ మభి వృద్ధికావలెననుట జీవాత్మయొక్క క్షేమకారణము. రాజసతా మసగుణములు మృగశరీరములలోనే స్థిరముగ నేర్పడినవి. మనము భుజియించు నాహారములయందు సాత్త్వికస్వభావపు అణువుల్లు అధికముగానున్న యెడల శరీరముపరిశుద్ధముగా పెరిగి సత్త్వగుణ మధికమగును. స్నానము ప్రతినిత్యమును చేయవలయును. లేకున్న స్థూలశరీరమందు రోమకూపములు మురికివల్ల మూతపడిపోవును. శరీరమందుండు విషములు రోమకూపములగుండా స్వేదరూప ముగా బయట పడవలెను. కనుక రోమకూపములు బాగుగ పనిచేయు నటులుండుటకు స్నానమావశ్యకము. మద్యపానము,

మాంసభోజనము, పలాండుభక్షణము, (మద్యము=సారాయి పలాండు=ఉల్లిగడ్డ) ఇట్టి వస్తువులను శరీరమునకు ఇచ్చినట్లైతే శరీరముయొక్క పారిశుద్ధ్యము తగ్గిపోవును. జీవాత్మకు అనుకూలమైనవి కావు.

ఈవరకు ౧౧౧ వ పుటయందు ఛాయాశరీరము అని ప్రస్తావించియుంటిమి. ఇది చేయుపని యేమనియును ఇది ఏ విధముగా నేర్పడుననియు విచారించవలెను. ౧౦౬ వ పుటయందు మనము చదివిన, ' ప్లేను ' లన్నింటియందును ఏడేసి భాగములు గలవు. అవి అనగా ౧. స్థూలమందు పృథివీ తత్త్వస్థితి, ౨. స్థూలమందు అప్తత్త్వ స్థితి, ౩. స్థూలమందు తేజస్తత్త్వ స్థితి, ౪. స్థూలమందు వాయుతత్త్వ స్థితి, ౫. స్థూలమందు ఆకాశతత్త్వ స్థితి, ౬. స్థూలమందు ఆకాశతత్త్వముకంటె సూక్ష్మమైన (అహంకారతత్త్వమునకు ఈడైన) యొక తత్త్వపు స్థితి, ౭. స్థూలమందు ఆరవతత్త్వముగా చెప్పినందుకన్న నతి సూక్ష్మమైన (బుద్ధి) తత్త్వముయొక్క స్థితి, అని ఏడు విధములగా నొక్కొక ప్లేనును విభజింపబడియుండును. శ్రీదక్షిణామూర్తిస్తవమందు ‹‹ భూరంభాంస్యనలో నిలోంబరమహర్నాథో హిమాంశుః పుమాన్ ›› అని పరమేశ్వరునియొక్క అష్టమూర్తిత్వమును వర్ణించియున్నది. ఇందు నుండి మన కుపయోగమైన అర్థమును స్వీకరించవచ్చును. ఇంతకుముందు ౮౬ వ పుటయందు పంచీకరణమును ప్రస్తావించియుంటిమి. ౪౨ వ పుటయందు పంచతత్త్వములను ఆయాతత్త్వ ప్రధానలోకములను వివరించితిమి. ఇపుడు మనము విచారించవలసినది

## సప్తీకరణము

అని యొక ముఖ్యమైన సంగతి. పాంచభౌతిక ప్రపంచమునందు అయిదు ప్లేనులు అని వర్ణించినందు మాత్రమున సప్తీకరణమును నిరాకరించినవారము కాము. ౨౬ వ పుటయందు సత్యలోకమునకు పైన రెండు లోకములున్నవని చెప్పియున్నది. పాంచభౌతిక ప్రపంచపు అయిదుప్లేనులకుపైన రెండు లోకములున్నవని ౨౬ వ పుటయందు చెప్పబడిన రెండు లోకములును రెండుప్లేనులు. పాంచభౌతికప్రపంచమందు అయిదు ప్లేనులు, అంతకు పైన రెండు, ఇవంతయు కలిసి ఏడుప్లేనులు. వానిపేళ్లు; ౧. ఆదిప్లేను, ౨. అనుపాదకప్లేను, 3. నిర్వాణిక్ ప్లేను, ౪. బుద్ధిక్ ప్లేను, ౫. మానసిక్ ప్లేను, ౬. ఆస్ట్రిల్ ప్లేను, ౭. ఫిజికల్ ప్లేను, అని యేడుప్లేనులు. "నిహితాస్సప్త సప్త" అను వచనమును మరువకుడు. మరియు, ప్రతిప్లేనులోనును మిగిలిన ఆరు ప్లేనుల ప్రకృతికి సంబంధించిన భాగములున్నవి. అనగా ప్రతిప్లేనులోనును ఏడు భాగములున్నవి. ఏడు ప్లేనుల యొక్క అంతర్భాగములు ఒట్టుకు ఏడేళ్లు=నలుబదితొమ్మిది. దీనికి సప్తీకరణమని పేరు. ఇందునుగురించి మననము చేసి అవగాహనచేసికొనవలయును. లోకమంతయు నలువదితొమ్మిది భాగములుగా నేర్పడినది కదా. ఇందుకు సమీపార్థముగల పురాణకథ యొకటియున్నది. శ్రీమద్భాగవతము, షష్ఠస్కంధము ౧౮ వ అధ్యాయమునందు మరుత్తుల జన్మకథానువర్ణనమున్నది. అందు కశ్యపఋషిభార్యయైన దితియొక్క గర్భమందుండిన పిండమును ఇంద్రుడు గర్భమును ప్రవేశించి

చకర్త సప్తధా గర్భం వజ్రేణ కనకప్రభం ।
రుదంతం సప్తధైకైకం మారోదీరితి తాన్ పునః ॥
(శ్రీమద్భా- ౬ స్కం, ౧౮ అధ్యా, ౬౨ శ్లో.)

ఇంద్రుడు దాసవతితల్లియొక్క యుదరంబును యోగబలంబునం బ్రవేశించి "కాంచనప్రభావిశోభితంబైన గర్భమును (పిండమును) వజ్రాయుధమున నేడు ఖండములుగాఁ గోసి........క్రమ్మఱ నా ఖండముల నొక్కొక దాని ప్రత్యేకం బేడేసి తునియలు గా దఱిగె" నని యర్థము. ఇందువలన ఏడు తునక లొక్కొకటియు నేడేసి చిన్నతునకలు, అన్నియు గలిసి నలువదితొమ్మిది తునకలు. ఏడు ప్లేనులనును ప్రతిప్లేనుయొక్క యంతర్భాగము లైన ఎడేసి సబుప్లేనులనును (Sub-planes) గుణించితే నలువదితొమ్మిది సబుప్లేను లైనవి. దీనికి సప్తీకరణము అని పేరు.

## ఛాయాశరీరము

ఇది స్థూలశరీరముయొక్క భాగము. స్థూలప్లేను (Physical Plane) లో ఘనీభూతములైన మూడు భాగములతో మనకు భోగాయతనమైన స్థూలశరీర మేర్పడినది. స్థూలప్లేనులో సూక్ష్మ భాగము లైన మిగిలిన నాలుగు భాగముల ప్రకృతివల్ల కట్టబడినది ఛాయాశరీరము. ఇందులో అంగాంగములు మన స్థూలశరీరము నందలి అంగాంగములవలెనే యుండును. ఛాయాశరీరము స్థూల శరీరములో దూరి యిమిడియుండును. సూర్యబింబమునుండి ప్రాణశక్తులు లోకముపైన నెడతెగక కురియుచుండును. ఆ శక్తు లను అకర్షించు శక్తి ఛాయాశరీరమున కున్నది. స్థూలశరీరమునకు

ఆహారమువల్ల కలుగు బలమునకు సమర్థతకలుగచేయునది సూర్య ప్రకాశము. అట్టి సూర్యప్రకాశమునందుండు ప్రాణశక్తి నాకర్షించి ఛాయాశరీరము స్థూలశరీరమున కిచ్చును. ఘాతలుతగిలినవారికి ఆసుపత్రిలో శస్త్రవైద్యము చేయునపుడు మైకపదార్థములను వాసన చూపుదురు. ఆ ద్రావకశక్తివల్ల స్థూలశరీరమంతయు వ్యాపించియుండు ఛాయాశరీరమును స్థూలశరీరమును విడిచి బయటికి పారదోలుదురు. పిమ్మట స్థూలశరీరమును కత్తులతో కోసినను మనకు నొప్పి ఎరుకకు రాదు. ఛాయాశరీరమువల్లనే దేహబలము, నొప్పులు, మొదలగునవి స్థూలశరీరమునకు అనుభవసాధ్యములు.

స్థూలశరీరము మరణముచెందునపుడు ఛాయాశరీరము స్థూలశరీరమును విడిచి బయటికిపోవును. స్థూలశరీరముండునంతవరకును ఛాయాశరీరముండును. స్థూలశరీరమునకును ఛాయాశరీరమునకును నొక సూక్ష్మసూత్రసంబంధ మున్నది. ఆ సూత్రమును ఛేదించితే (తెంచితే) స్థూలశరీరమునకు వెంటనే మరణము కలుగును. గర్భస్థశిశువునకును తల్లికిని సంబంధ మొక నాభినాళసూత్రమున్నది అని మనకందరికిని తెలిసిన విషయము. నాభినాళసూత్రముగుండా తల్లి దేహమందలి రక్తము శిశువుయొక్క శరీరమును ప్రవేశించును. శిశువు గర్భమునందుండుకాలమందు ఏకారణముచేతనైనను శిశువును తల్లిని కలిపియుంచిన నాళము తెగితే వెంటనే శిశుశరీరము మరణమును చెందును. అదే విధమున ఛాయాశరీరమునకును స్థూలశరీరమునకును సంబంధముగనుండు సూత్రమును ఎవరైనను తెంచితే స్థూలశరీరము వెంబడే మరణముచెందును. ఇట్టి కార్యము యోగమువల్ల సంపాదించిన శక్తిగలవారిచేతనే గాని యితరులచేత

గాదు. స్థూలశరీరము మరణముచెందిన కొన్నిఘడియలవరకును జీవాత్మశక్తి ఛాయాశరీరమందుండును. తరువాత ఛాయాశరీరమును జీవాత్మ వదిలి కామమయశరీరమందు నిలుచును. ఛాయాశరీరము స్థూలశరీరము సమీపమందే నిలిచిపోవును. స్థూలశరీరము దహింపబడి స్థూలఅణువులు చెదిరిపోయినపుడు ఛాయాశరీరము నశించిపోవును. అటుగాక శవములను భూస్థాపన చేయు సంప్రదాయముగల జాతులలో స్థూలశరీరము కొంచెముగా కుళ్లి మురిగి నశించుచువచ్చును. స్థూలశరీరములో ఏ భాగము నశించునో—చేయో, కాలో—ఆ భాగము ఛాయాశరీరమందు కూడ నశించును. స్థూలశరీరము భూమిలో దాగియున్నను ఆ స్థూలశరీరమునకు పైన ఆకాశమందు ఛాయాశరీరము కనబడుచుండును. కొందరు గోరీలు, సమాధు లుండు స్థలములలో ఈ ఛాయాశరీరమును చూచి భూతమో, పిశాచమో, చచ్చినవారు మనలను భయపరుచుటకుగా కనబడుచున్నారని వెఱచి భీతిచెందుదురు. కనుక శవములను దహించుసంప్రదాయయు అనేక కారణములనుపట్టి మంచిది.

ఛాయాశరీరము స్థూలశరీరమువలెనే రూపము కలిగియుండుటవలనను ఛాయాశరీరపు అణువులన్నియు పృథివీతత్త్వపు అణువులే గనుక నీ రెండుశరీరములును ఒకశరీరమనియే వ్యవహారింపబడును. స్థూలశరీరము చెందు అవస్థలన్నియు ఛాయాశరీరమునకు కూడ కలవు.

అణువులకు సామాన్యముగా నొక శక్తిగలదు. వానికి ఎక్కడనుండవలె నని తోచునో ఎక్కడ పోవలెనని తోచునో ఆ

ప్రకారము పోవుశక్తిగలదు. మనదేహములయందు కొంతకాల ముండును. మరికొంతకాలము ఇతరులదేహములయందు పోయి చేరును. ఇతరుల దేహములయందుండు కాలమునందు వారల చేష్టలనుపట్టి మేలో కీడో గుణములను సంపాదించును. ఏ దేహమందున్నను ఆ దేహస్వామియొక్క గుణములకు తుల్యము లైన స్పందశక్తులు అణువులకు గలుగును. దేహస్వాముల విహార శయ్యాభోజనచింతనంబులంబట్టి ఆ యా గుణములు మంచివో చెడ్డవో అట్టి స్పందములు దేహమందలి యణువులకు కలుగును. స్థూలశరీరమునందలి అణువులయొక్క స్పందస్వభావములను పట్టి కామమయశరీరమును మనోమయశరీరము(అశుద్ధమనోమయ శరీరము)ను ప్రేరేపింపబడును. అట్లాగే కామమయ మనోమయ శరీరంబుల చేష్టలను పట్టి స్థూలశరీరము కార్యములకు ప్రేరేపింప బడును. ఇదే సత్సంగము కావలెననికోరుటకును దుస్సంగము త్యజించవలయుననుటకును గారణములు.

మన అనుభవములో దేశమందు సమాజములున్నవి అనుసంగతి నెరుగుదుము. సమాజములలో మెంబర్లయొక్క అభి ప్రాయ బాహుళ్యము ఏ వైపున నున్నదో ఆ వైపున తీర్మానములు జరుగుచుండును. అదే విధముగా స్థూల, కామ మయ, మనోమయ దేహములయందు ఏ విధమైన అణువులు మెండుగానుండునో ఆ విధముగా దేహములు నడుచుకొను ను. కనుక పారమార్థికతలంపు గలవారలు పై చెప్పిన విహార శయ్యాభోజనచింతనంబులయందు పారమార్థికచింతను జతపరిచి దేహములను శుభ్రముగా నుంచుకొనవలయును. ఈ విషయమందు

మరికొన్ని సంగతులు సత్సంగమును గురించి వ్రాయునపుడు వ్రాయబడును.

ఛాయాశరీరము, స్థూలశరీరము ఈ రెండుశరీరములును భూర్లోకమునకు సంబంధపడినవే అని మరలజ్ఞాపకార్థము చెప్పు చున్నాము. ఛాయాశరీరముగుండా స్థూలశరీరమునకు సూర్యకాంతినుండి ప్రాణశక్తి వచ్చుచున్నదని చెప్పబడెను (౧౨౦ వ పుట). ఇట్లువచ్చు ప్రాణశక్తి రక్తనాళములయందును నరములయందును ప్రవేశించి దేహమంతయు వ్యాపించు. స్థూలశరీరములో రొమ్ము నందు హృదయము (Heart) అను మాంసపిండమున్నది. ఈ పిండము ఆత్మకు ఉనికిపట్టు (ప్రతిష్ఠితోన్నే హృదయం సన్నిధాయ). హృదయము రక్తనాళములకు జన్మస్థానము, లయస్థానముకూడ. ఒక గుంపునాళములు శుద్ధరక్తమును హృదయమునుండి శరీరమున కంతయు వ్యాపించునట్లు చేయును. మరియొకగుంపు నాళములు శరీరమందంతయు సంచరించినందున మలినములను సంపాదించిన అశుద్ధరక్తమును హృదయమునకు తెచ్చి శ్వాసకోశములగుండా శుద్ధపరిపించి మళ్లీ శరీరమునకంతయు వ్యాపించునట్లు చేయును.

శ్వాసకోశములు రెండు. ఇవి రొమ్మునందు హృదయమును ఆవరించుకొని యుండును. మంచిగాలిని మనము పీల్చినపుడు ఆ గాలి రక్తమునందలి మలినములను శుద్ధిచేయురీత్యా తాను మాలిన్యమును తీసుకొని ఆ మాలిన్యము ఊపిరిగుండా వెలుపటికి తోయును. హృదయముయొక్కయు శ్వాసకోశముల యొక్కయు వివిధచర్యలను జరుపుటకు వాటికి శక్తినిచ్చునవి నరములు.

శిరస్సునందు మెదడు అని యొకటియున్నది. గోధుమపిండి ముద్దగా కలిపినట్టు కనుపడును. ఈ మెదటియందు సహస్రారము మొదలగు ముఖ్యమైన భాగములు కొన్నియున్నవి. మెదటినుండి నరములు బయలువెడలును. వీపునందు వెన్నెముకయున్నది. అది ఒక విధమైనగొట్టము. ఆ గొట్టమువెంబడి మెదటినుండి ఒక భాగమువెళ్లును. ఆ మెదటితీగెనుండి నరములు బయలు వెడలును.

నరములలో రెండు విధములు. శ్రీభగవద్గీతయందు "సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణకర్మాణి చాపరే". అని చెప్పియున్నది. ఇంద్రియకర్మ లనగా జ్ఞానేంద్రియములు, మనస్సు. ఈ ఇంద్రియములయొక్క కర్మలు నడుపుటకు ఆ ఇంద్రియగోళములకు శక్తియిచ్చు నరములు ఒక గుంపు. ఇంగ్లీషుభాషయందు ఈ గుంపుకు Cerebro-spinal system అని పేరు. ప్రాణకర్మములనగా—శ్వాసవిడుచుట, ఆహారముజీర్ణమగుట, విణ్మూత్రవిసర్జనము, రక్తమును నాళములగుండా పంపుట, గుండెకొట్టుకొనుట, చర్మమునందలి రోమకూపములయొక్క ఆయామవ్యాయామములు మొదలగునవి. "ఇంద్రియకర్మాణి" అనునవి బహుశః జీవాత్మయొక్క అనుమతిపైన నడుచుకార్యములు. "ప్రాణకర్మాణి" అనునవి అనుమతిలేకనే నడుచునవి. ప్రాణకర్మములు నడువకపోతే శరీరము బ్రతికియుండదు.

యోగమార్గమునందు చెప్పియుండు షట్చక్రములు మొదలగునవియంతయు నరములయొక్క సమాగమస్థలములు. ఇవన్నియు స్థూలశరీరమందున్నవి. ఈసంగతులవిషయమైన తెలివి దేహములను శుద్ధిచేయువిషయమందు అతిముఖ్యములు.

## కామమయశరీరము

ఈ శరీరము భువర్లోకమునందు సంచరించుటకుగా జీవాత్మ ఉపయోగించునట్టిది. కామము అన్నపుడు ఏమో ఒకవిధమైన నీచవిషయము అని ప్రకృతకాలమందు అర్థమగును. కామమనగా ఇచ్ఛ. ఇచ్ఛ నీచముగానుండవచ్చును; ఉన్నతముగా నుండ వచ్చును. సాధారణముగా వాసన అను పదమువలె కామము అను పదము. వాసన, సువాసన లేక తావి, దుర్వాసన లేక గబ్బు, అని రెండువిధములు. అదే విధమున కామమును రెండు విధములు. ౧. ధర్మఅవిరుద్ధమైనది, ౨. ధర్మవిరుద్ధమైనది. "ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ" అని శ్రీకృష్ణమూర్తిగారి వచన మున్నది.

"కామమయ ఏవా యం పురుషః" మనుష్యులు సాధారణముగా కామమయులే గదా. మనకందరికిని ఏదో ఒక మనోరథము ఎల్లపుడును ఉండును. ఒకటిని తృప్తిపరిచినపుడు మరియొక మనోరథము ఉదయమగును. ఇట్లు మనోరథములయొక్క సమూహములు దయించి వాని నెల్ల జీవాత్మ యనుభవించి విసికి లేనే గాని వైరాగ్యము పుట్టదు.

నాఽనుభూయ న జానాతి పుమాన్ విషయతీక్ష్ణతాం ।
నిర్విద్యేత స్వయం తస్మాన్న తథా భిన్నధీః పరైః ॥

(శ్రీమద్భా-౬ స్కం, ౫ అధ్యా, ౪౧ శ్లో.)

పురుషుండు తాన యనుభవింపక విషయంబుల తీక్ష్ణత్వం బెరుంగ నేరడు. తానే యనుభవించి కాలక్రమంబున నవ్విషయంబులు

నిస్సారంబు లనియు దుఃఖమూలంబులనియు నెరిగి విరక్తి చెందు నట్లు ఇతరుల బోధవల్ల విరక్తిపుట్టదు. విరక్తిపుట్టిన గాని సాధన చతుష్టయసంపత్తి లభించదు. సాధనచతుష్టయసంపత్తి లేనిదే జ్ఞానోదయము లేదు.

> వైరాగ్యస్య ఫలం బోధః బోధస్యోపరతిః ఫలం ।
> స్వానందానుభవాచ్ఛాంతిః ఏషైవోపరతేః ఫలం ॥
> యద్యుత్తరోత్తరాభావః పూర్వపూర్వంతు నిష్ఫలం ।
>
> (వివేకచూడామణి)

కనుక కామమయశరీరము అత్యావశ్యకము.

భూర్లోకముమొదలైన లోకములయందు—అనగా ఫిజికల్ ప్లేను (Physical plane) మొదలగు ప్లేనులయందు, ప్రకృతి సప్తీకరణమైనదని ౧౧౬ వ పుటయందు చెప్పబడెను. అందువలన భువర్లోకము అగు ఆస్ట్రిల్ ప్లేనునందు కూడ నేడువిధములగు ప్రకృతి స్థౌల్యములనుపట్టి ఏర్పడిన భాగములున్నవి. అట్టి ఏడింటికిని "సబుప్లేనులు" అని పేరు. స్థూలాతిస్థూలమైనది మొదటి సబు ప్లేను. అంతకంటె తక్కువస్థూలము రెండవసబుప్లేను. ఇదేవిధమున మూడవది, నాలుగవది, ఐదవది, ఆరవది, ఏడవది అని ఏడు "సబుప్లేనులు" న్నవి. ప్రతి సబుప్లేనుయొక్క అణువులు ఎంతో (కొంచముగానో, అధికముగానో) "ఆస్ట్రిలుబాడీ" అను కామమయశరీరమునం దున్నవి. అన్ని సబుప్లేనుల ప్రకృతియును చేరి ఏర్పడినది కామమయశరీరము అని మరల నొక్కి చెప్పు తున్నాము. చాలమట్టుకు మనోభావములు (Emotions) పరిశుద్ధ ములైన వానిని మనము చింతించు శక్తివచ్చునపుడు పై "సబు

ష్పైనుల" ప్రకృతి మన కామమయశరీరములయందు విశేషముగా చేరును. నీచములైన మనోభావములను చింతించుచుండు నపుడు అడుగు "సబుష్పైనుల" ప్రకృతి యధికముగా చేరును.

మనకందరకును జాగ్రదవస్థ, స్వప్నావస్థ మొదలగు అవస్థలు కలవు. ఒక్కొక అవస్థకు ఒక శరీరము అను అర్థము కాదు. మనము మేలుకొనియుండి లోకవ్యవహారములు జరుపుచుండు నపుడుకూడ ఇచ్ఛా, ద్వేషము, దుఃఖము ఇట్టి భావములు వచ్చి నపుడు మనము కామమయశరీరమందు పనిచేసినవార మవుదుము. నిద్రాకాలమందు జీవాత్మలు స్థూలశరీరమును వదలి కామమయ శరీరమును ఆశ్రయించి కొంతకాలమును, కామమయశరీరమును కూడ వదలి మనోమయశరీరములయందు కొంతకాలము నుందురు. కామమయశరీరము స్థూలశరీరమువలెనే స్వతంత్రించి నిలుచు శక్తి కలది. జ్ఞానేంద్రియముల కునికిపట్టు. జాగ్రదవస్థయందు బహిః ప్రపంచమును మనము అనుభవించుట ఇంద్రియములగుండానే కదా. ఇంద్రియములలో "సర్వేంద్రియాణాం నయనం ప్రధానం" అని కంటితో బహిఃప్రపంచమును చూచి, ఆనందించినపు డంతయు కామమయశరీరమందుండి మనము పనిచేయుచుందుము. కనుక మనము ప్రాయశః కామమయశరీరవాసులమే. భూలోక మందు శిశువుయొక్క శరీరము కొంతకాలము పరాధీనముగా నుండును. తొట్లలోపడియుండగా తానుగా పక్కలకు పొరలుట గాని, లేచి కూర్చొనుటగాని సాధ్యముకాదు. ఆ శిశువుశరీరము సాధారణముగా ఏడేండ్లవయస్సు అగునంతదాక స్వతంత్రముగా వ్యవహరించదు. అదేవిధముగా కామమయశరీరముకూడ అనేక

జన్మముల నెత్తి ఆ జన్మములందు సంపాదించిన మనస్సుయొక్క శక్తులు ముదురుపర్యంతమును స్వతంత్రముగా నిలువను శక్తి చెందదు. భూలోకపుశిశువునకు ఆహారము మొదలగువానివల్ల ఏవిధముగా దేహము పెరుగునో అదే విధముగా భువర్లోకపుశిశువు అయిన కామమయశరీరమునకు పటుత్వము రావలెనంటే స్థూల లోకపార్శ్వమునుండి స్థూలశరీరముగుండా ఒక విధమైన శక్తియు సూక్ష్మలోకపార్శ్వమునుండి మనోమయశరీరములనుండి ఒకవిధ మైన శక్తియు ఈ రెండును చేరితేనే గాని పెంపులేదు.

జనబాహుళ్యము కామమయశరీరముగుండా పనిచేయుదురు గాని స్థూలశరీరమును వదిలి తానుగా నిలిచిన కామమయశరీర మందు పనిచేయుట అరుదు. ఈ శక్తిగలవారు కొందరే. స్థూల శరీరమును వదిలి కామమయశరీరమునందు నిలిచినవానిని భూలోక దృష్టితో కనుక్కొనుట సాధ్యము కాదు. యోగాభ్యాసముచేసి తద్వారా సంపాదించిన సూక్ష్మదృష్టిగలవారేగాని యితరులు చూడలేరు. అట్టివారి కాశరీరము చాల కాంతివంతముగా కన బడును.

ఇటికలు బండ్లలో తెచ్చి కుప్పలుగా బోసియుంచిన మాత్ర మున ఆ యిటికలు గోడలు అనిపించుకోవు. సున్నముతో కట్టిన పిదపనే గదా ఆ యిటికలు గోడలగును. అదే విధముగా కామ మయశరీరము భువర్లోకమునందలి సప్తవిధప్రకృతియొక్క సమూ హముగా జీవాత్మశరీరములవెంబడి యొక రూపముగా నిలిచినంత మాత్రమున ఆ రూపము కామమయశరీరము అనిపించుకో చాలదు. జీవాత్మ బహువిధములైన ప్రయత్నములవల్ల—అనగా

ఆహారనియమము, నీచమనోభావములను వదిలి ఉత్తమమనోభావములను చింతించుట, చదువు మొదలగు వ్యాసంగములవల్ల మెదడు స్ఫురత్తుగా పనిచేయునట్లు అయితేనే గాని ఆ రూపమునకు శరీరత్వము రాదు.

భువర్లోకప్రకృతికి ఒక స్వభావము కలదు. భూలోకపు అణువుల వలెనే (౧౨౩వ పుట చూడుడు) తమ యిచ్ఛానుసారము స్థలము విడిచి స్థలమునకు పోవు శక్తియు ఇష్టమున్నంతకాలము అచ్చట నుండుశక్తియును గాక జీవాత్మ ఏ విధములైన తలంపులను తలచినను ఏ విధములైన వేషములను వేయవలెనన్నను ఆ వేషములుగా మారుటకును శక్తికలదు. ఈ శక్తిని యోగులు ప్రయత్నపూర్వకముగా నుపయోగించి లోకులకు సహాయముచేయుదురు. శ్రీమద్రామాయణమునందు* మనము చదువు ప్రకారము రాక్షసులు కామరూపులు, అనగా ఇచ్ఛవచ్చిన రూపములను ధరించు శక్తిగలవారు. ఇదే కామమయశరీరపు శక్తి. "దివ్యజ్ఞానసారము" అను పేర నొక గ్రంథమును శ్రీ చిట్టమూరు రామయ్యపంతులుగారు వ్రాసి ఇటీవల అచ్చుపడియున్నది. అందు "అదృశ్యసహాయులు" అని యొక అధ్యాయమున్నది. ఆ అధ్యాయమును చదువ వలయును.

కామమయశరీరము స్థూలశరీరముయొక్క ఆకృతిని ధరించును అని చెప్పినపుడు ఒక విశేషమును మరువకూడదు. స్థూలశరీరము స్థిరమై చేతులు చేతులుండుస్థలమునందే యుండును; కాళ్లు, ముక్కు, తల, చెవి మొదలగునవి వాని వాని స్థలములను విడువవు. కామమయశరీరపు అణువులన్నియు సదా కామమయము

శరీరపు ఎల్లకు లోబడి సర్వకాలమందును స్థలముల మారుచుం డును. గట్టిమట్టికిని అడుసుమట్టికిని ఎంత వ్యత్యాసముండునో, అడుసును ఎట్లు ఒక రూపముగా గట్టుట కష్టమో ఆ విధముగా కామమయశరీరము రూపుమారుచుండును. ఒకపుడు చెవి అను అంగమును కట్టియుండిన అణువులు కన్ను అను అంగమును మరు నిమిషమందు కట్టును. కన్ను అను అంగమును కట్టియుండిన అణు వులు మరునిమిషమందు, వీపుగానో లేక పిరుదులుగానో లేక అరి కాలుగానో ఏర్పడును. కనుక ప్రతి అణువు ప్రతి ఇంద్రియము యొక్క ధర్మమును నడుపగల శక్తిగలిగియుండును. దేహము యొక్క ప్రతి భాగములోనును నేత్రేంద్రియముయొక్క ధర్మమును నడుపవచ్చును. అట్లుగానే శ్రోత్రేంద్రియముయొక్కయు ఇతర ఇంద్రియముల యొక్కయు ధర్మములను నడుపగలదు.

సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షిశిరోముఖం।

అనినట్లు గా నుండును.

కామమయశరీరమునుగురించి బహుబాహుళ్యముగా వ్రా యవచ్చునుగాని గ్రంథవిస్తరభీతి బాధించుచున్నది.

కామంబులు ఎల్లపుడును గర్హితంబులు కావని ౧౨౬ వ పుట యందు చెప్పబడెను. ప్రవృత్తి మార్గయాత్రయందు వివిధములైన కామములును జీవాత్మకు సహాయములు. నీచములైన కామములు కూడ సహాయములే. మనోరథములు మనుష్యుని ఆ సమయమునకు కొందరకు లోబరచినను కాలాంతరేణ అనుభవప్రాప్తి కలుగచేసి (౧౨౭వ పుటచూడుడు) విరక్తునిగా చేయును. ఉత్తమకామములు మనుష్యుడు కోరిన సుఖమును ఇచ్చి ఆ సుఖములను మనుష్యుడు

అనుభవించు రీత్యా అంత్యదశకువచ్చినందున దుఃఖకారణము లగును. "శ్రీకామ శ్శాంతికామః పుష్టికామ స్తుష్టికామ శ్శ్రద్ధాకామో మేధాకామః ప్రజ్ఞాకామ ఆయుష్యకామ ఆరోగ్యకామ ఏవం భాస్కరస్యారాధనం కుర్యాత్" అని వేదమంత్రములయందు చెప్పియున్నది. మరియు "స్వర్గకామో యజేత" అనియు చెప్పియున్నది. స్వర్గాది సుఖములను కోరి యజ్ఞయాగాదులను చేసిన వారు ఆక్రతువుల ఫలకాలము అయిపోగానే

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే ।
తే పుణ్యమాసాద్య సురేంద్రలోకం
అశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్ ॥
తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి ।
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నాః
గతాగతం కామకామా లభంతే ॥

(శ్రీ భగవద్గీత)

మూడువేదములనును అధ్యయనముచేసి వానియొక్క సహాయము వల్ల యజ్ఞములను చేసి స్వర్గలోకవాసమును గోరువారు ఆ యాగ ఫలములవల్ల బహుకాలము స్వర్గసుఖముల ననుభవించి ఆ ఫలము క్షీణించగానే మరల గతాగతకారిణియైన యుయ్యాలయుబోలె భూలోకంబునుం బ్రవేశింతురు. ఇట్లు పలుమారు స్వర్గమునకు వెళ్లి మరల సుఖానుభవానంతరము భూలోకము బ్రవేశించి విసికి

ప్లవాహ్యేతే అదృఢా యజ్ఞరూపాః అష్టాదశోక్త మవరం యేషు కర్మ

(ముండకోపనిషత్తు)

ఈ యజ్ఞరూపములగు పడవలు అదృఢములు, కొద్దికాలమే స్వర్గ ఫలమును ఇయ్యగలవి అని విరక్తి చెందగలరు. అటుగాక ధర్మ విరుద్ధమైన కామములగు వ్యభిచారాది దోషములకు లోబడువారు మన శాస్త్రములలో చెప్పిన నరకములయొక్క అనుభవముల కన్నను అతి దుఃఖదాయకములైన మనోవ్యాకులములను కామ లోకమైన భువర్లోకమునందు అనుభవించి ఆ లోకవాసానంతరము ప్రాప్తసద్బుద్ధులై మరల భూర్లోకమునకు జన్మమునకు వచ్చి క్రమేణ వృద్ధికి వత్తురు. మరిగొందరు అనేక జన్మములందు దుష్ట కామయోజనవల్ల స్వభావతః చెడ్డవారై శ్రీభగవద్గీత ౧౬ వ యధ్యాయమందు చెప్పబడిన ఆసురసంపత్తిని జెందుదురు. వీరందరును కామలోకమందు బహువిధానుభవములను బొంది క్రమేణ కామమయశరీరమును శుద్ధిచేసికొని వృద్ధికిరాగలరు.

భువర్లోకము అను కామలోకమును గురించియు కామమయ శరీరమును గురించియు మాత్రమే ఒక గ్రంథము వ్రాయతగినన్ని విషయములున్నవి. ఐనను కొన్ని సంగతులను మాత్రము చెప్పి ఇంతటితో నిలుపవలయును. మరల నివృత్తిమార్గము అను అధ్యాయమునందు కామమయశరీరమును శుద్ధిచేయుటనుగురించి వ్రాయు నపుడు వ్రాతుము.

కామమయశరీరమునకు కూడ మరణావస్థ కలదు. అనగా ఆ శరీరమును కట్టియుండు అణువులు చెదిరిపోయి అవి సంపాదించిన స్పందశక్తులన్నియు కామమయశరీరపు దేహబీజమునందు ఇమిడియుండు సమయము. ఈ విషయమును "సంసారచక్రమను" అంశమునుగురించి వ్రాయునపుడు వ్రాయనగును.

## మనోమయశరీరములు

"మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధ మేవ చ" అని యుపనిషత్తులయందు చెప్పియున్నది. ఆ విధముగా మనస్సు రెండు విధములు గనుక మనోమయశరీరములు కూడ రెండు విధములు. ౧. శుద్ధమనోమయశరీరము, ౨. అశుద్ధమనోమయశరీరము అని (౧౦౭ వ పుటచూడుడు). "ఫిజికల్ ప్లేను" నందు ఏడు విధములగు "సబు ప్లేను లు" న్నవని యిదివరకే చెప్పబడెను. "ఫిజికల్ ప్లేను" లో నుపయోగింపబడు శరీరములు రెండు అని యును చెప్పబడెను. అవి యేవని మరల జ్ఞాపకార్థము చెప్పెదము. ౧. ఛాయాశరీరము, ౨. స్థూలశరీరము. ఛాయాశరీరము కూడ స్థూలశరీరమే. "ఫిజికల్ ప్లేను" లో నుండు ఏడు "సబు ప్లేనుల" పైకి స్థూలాతి స్థూలము మొదలు మూడు "సబుప్లేనులు" ఎక్కినంత వరకును గల పృథివి, అప్పు, తేజస్సు అను తత్త్వముల సంబంధములైన మూడు "సబు ప్లేనుల" ప్రకృతివల్ల కట్టబడినది స్థూలశరీరము. అంతకుపై వగు నాలుగు "సబు ప్లేనుల" ప్రకృతి వల్ల కట్టబడినది ఛాయాశరీరము (౧౨౦ వ పుటచూడుడు). "ఫిజికల్ ప్లేను" నందు ఉండు "సబు ప్లేను" లలో రెండు విధములైన భాగములు ఏర్పడిన విధమువనే "మెంటల్ ప్లేను" నందును ఏడు "సబుప్లేనులు" గలవు. ఈ "సబు ప్లేనులు" కూడ రెండు భాగములుగా భాగింపబడినవి. ఇందులో మొదటిభాగము నకు నాలుగు "సబు ప్లేనులు" ను రెండవ భాగమునకు మూడు "సబుప్లేనులు" ను సంబంధపడినవి. పృథివి, అప్పు, తేజస్సు, వాయువు అను తత్త్వముల సంబంధములైనవి నాలుగు "సబు

ప్లేన్సు" లు మొదటి తరగతివి. అంతకుపైన సూక్ష్మతరములైన మూడు "సబుప్లేనులు" రెండవ తరగతివి.

ఇచ్చట ఒక ముఖ్యాంశమును గమనించవలెను. "ఫిజికల్ ప్లేను" యొక్క "సబు ప్లేనులు" రెండు తరగతులుగా విభజింపబడినవి. "మెంటల్ ప్లేను" యొక్క "సబు ప్లేను" లు కూడ రెండు తరగతులుగా విభజింపబడినవి. అయితే ఈ రెంటికిని నొక వ్యత్యాసము కలదు. అది యేమనగా, "ఫిజికలుప్లేను" నందలి "సబుప్లేను" లు స్థూలాతిస్థూలము మొదలు మూడు మాత్రము ఒకతరగతియై పైనాలుగు మరియొకతరగతియైనది. "మెంటల్ ప్లేను" నందు స్థూలాతిస్థూలము మొదలు నాలుగు మొదటి తరగతి. పై మూడును మరియొక తరగతి. నాలుగు, మూడు, అను అంకెలు వ్యత్యస్తములైనవి. ఇది గమనించవలసిన విషయము.

మెంటలు ప్లేను నందు స్థూలార్థము అగు నాలుగు "సబు ప్లేనులు" ను అశుద్ధమనస్సునకు చేరినది. "అశుద్ధం కామ సంకల్పజం" అని యుపనిషద్వాక్యము. అశుద్ధమనస్సునకు ఉపాధి అశుద్ధమనోమయశరీరము. ఇందుకు పైవి యయిన మూడు "సబు ప్లేను" లకును సంబంధపడినది శుద్ధమనస్సు. "శుద్ధం కామవివర్జితం" అని యుపనిషద్వాక్యము. శుద్ధమనస్సున కుపాధి శుద్ధ మనోమయశరీరము. మనుష్యులకు బంధమునకుగాని మోక్షమునకుగాని మనస్సే కారణము.

> మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః।
> బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం మనః॥
>
> (అమృతబిందూపనిషత్)

విషయాసక్తమైన మనస్సు బంధకారణము. నిర్విషయమైనది మోక్షకారణము.

ఇట్లు బంధమోక్షములకు కారణమైన మనస్సును గురించి కొంత తడవు విచారించవలెను. మోక్షకారణమైనది శుద్ధమనస్సు. ఇందునుగురించి విచారము కొంత నిదానించి చేయవచ్చును. నివృత్తిమార్గమును గురించి వ్రాయునపుడు ఈ విచారము రాగలదు. ప్రకృతమందు అశుద్ధమనస్సును గురించిన విచారము సమీచీనము. "అశుద్ధం కామసంకల్పజం" అనిన విధమున అశుద్ధమనస్సు కామములవల్ల పెరుగునది. అయినను కామములు గర్హితములు గావు అని ౧౨౬ వ పుటయందు వ్రాయబడెను. నీచములైన కామములు మొదట దుఃఖములను కలుగజేసి ఆ దుఃఖములను అనుభవించిన తరువాత ఆ అనుభవమువల్ల పుట్టిన మంచిబుద్ధి గుండా మేలైన కామములను మాత్రము సంకల్పించుటకు అవకాశముండును. కామములు మేలైనవైనను నీచములైనవైనను బంధకారణములే. బంధములనగా కట్లు, లేక సంకిళ్లు. సాధారణముగా సంకిళ్లు ఇనుముతో చేయబడును. ఒక వేళ బంగారముతో చేసినను అవి సంకిళ్లే కదా. నీచములైన కామములు ఇనుపసంకిళ్లవంటివి. మేలైన కామములు బంగారపు సంకిళ్లవంటివి. ఇనుముతో చేసినవైనను బంగారముతో చేసినవైనను సంకిళ్లేమో సంకిళ్లే గాని ఆభరణములు గావు. కనుక మొట్టమొదట బంధకారణమైన

అశుద్ధమనోమయశరీరము

ను గురించి విచారింతము. ముందుచెప్పిన విధమున నీ శరీరము "మెంటల్ ప్లేను" యొక్క దిగువభాగపు నాలుగు "సబుప్లే

నుల" లోని ప్రకృతివల్ల గట్టబడినది. ఈ శరీరమునందు (అశుద్ధ) మనస్సు అను అంతరింద్రియము వ్యవహారము జరుపును. అశుద్ధ మనస్సు కామసంకల్పజము గనుక కామమయశరీరముతో కలిసియే గాని వేరుగా వ్యవహరించుటకు సాధ్యము కాదు. ఇంద్రియముల కన్నిటికిని స్థూలశరీరమునందు గోళములు గలవు. గోళములనగా నునికిపట్టులు (౧౧౦ వ పుటచూచుడు). అంతరింద్రియమునకు స్థూలశరీరమందు గోళము మెదడు. మెదడు తలయందున్నది (౧౨౫ వ పుటచూడుడు). కనుక అశుద్ధ మనస్సుయొక్క వ్యవహారమంతయు మూడు శరీరములగుండా జరుగవలయును—అశుద్ధ మనోమయశరీరము, కామమయశరీరము, స్థూలశరీరము. ఇన్నియు ను అంతరింద్రియమైన మనస్సునకు ఆయుధములు. యోగమార్గమందు కొంతవరకును సిద్ధులు కలుగు పర్యంతమును జాగ్రదవస్థయందు సాధారణజనునికి ఈ మూడు శరీరములును మనస్సుచే జరుగవలసిన వ్యవహారములకు ఆవశ్యకములు. కామమయశరీరమును కట్టిన ప్రకృతి కన్నను మనోమయశరీరమును కట్టిన ప్రకృతి చాల సూక్ష్మమైనది. మరియు చాల చలనస్వభావము కలది. ఈ శరీరము ప్రతిజన్మమునందును జీవాత్మసంపాదించిన శక్తులనుపట్టి పెరుగుచుండును. ఒకటే జన్మమున చిన్నబిడ్డగానుండి పిల్లవాడై యౌవన పురుషుడైనపుడు స్థూలశరీరము పెరుగుచు వచ్చునట్లు అశుద్ధమనోమయశరీరము ప్రతిజన్మమునందును జీవాత్మ చేసిన వ్యాసంగముల ననుసరించి పెరుగుచు వచ్చును.

యుక్తి, చాతుర్యము, జ్ఞాపకశక్తి మొదలగు మనశ్శక్తులు అధికము కాను కాను అశుద్ధమనోమయశరీరము పెరుగుచువచ్చు

ను. కళలు కాంతులు అధికమగును. ఈ శరీరమందు కరచరణా ద్యవయవములు కనబడవు. పెద్ద గుడ్డువలె నుండును. కామమయ శరీరమందును స్థూలశరీరమందును ప్రవేశించి వానిరెంటిని అన్ని దిక్కులయందును మించియుండును. యుక్తిచాతుర్యములు అధికము కాను కాను మనోమయశరీరమునకు కాంతి అధికమగును. ఈ శరీర మునందుండు కాంతులే సాధారణ కూలివానికి చదువరికిని గల ముఖప్రకాశమునకు కారణము. మెంటల్ ప్లేను యొక్క ప్రకృతి అతి సూక్ష్మమైనందున స్పందములు ఆ ప్రకృతియందు ప్రవేశించినపుడు ప్రకృతి చాల కదులును. ఆ కదులుటవల్ల కాంతు లుద్భవించును.

మనోమయశరీరము చింతనమువల్ల పెరుగును. తర్కశాస్త్ర ములు చదువువారికి వాదించుట సాధ్యము. వాదములు ఎంత యుక్తిసహితములో అంతటి గట్టివాడని పేరు కదా. ఎదుటి కక్షి వాదములకు సమయస్ఫూర్తిగా ప్రతివాదములను ఉపయోగించు వాడు చాల యుక్తిమంతుడని పేరుపొందును. అట్టి వాదములు, సమయస్ఫూర్తియుక్తులు ఇవన్నియు మనోమయశరీరములయందలి అణువులలో స్థూలమై ముతకలుగానుండువానిని ఆ శరీరములయం దునుండి వెలుపలికి తోలి వాని స్థానమునందు నాజూకులైనవియు నుసూక్ష్ములైనవియునగు అణువులను చేర్చుటకు కారణములు. ఇంతే కాక చిత్రపుపనులు—అనగా పటములు వ్రాయుట, పరోప కారార్థముగా చింతించి చింతించి పని చేసి చేసి లోకులందరును తనవంటివారలే యని ‹‹ ఆత్మవత్సర్వభూతాని ›› యని ఆచరణకు తెచ్చుకొనుట అను అంశములన్నియు మనోమయశరీరములను వృద్ధిచేయును.

మనోమయశరీరములు పొటగ్రాఫు ఎత్తు పెట్టెల వంటివి. పొటగ్రాఫుపెట్టెకు ఎదురుగా వెలుతురునందు ఏ వస్తువున్నను ఆ వస్తువుయొక్క బింబము పొటగ్రాఫుపెట్టెలోనుండు అద్దముపైన బడును. అదేవిధముగా లోకమందు అనేకులుచింతించు తలంపులన్నియు ఇతరుల మనస్సులయందు ప్రవేశించును. వెలుపలి నుండి మన మనస్సులోపలికి ఈ విధముగా ననేక తలంపులు దూరుచుండును. అవి దూరిన సంగతి మనకు ఎరుకకు రాదు. మనమే ఎందువల్లనో ఈ తలపులను తలచినాము అని అనుకొందుము. అయితే ఆ తలపు మనది కాదు. ఏకాగ్రమైనమనస్సులయందు ఇతరుల తలంపులు సులభముగా ప్రవేశించవు. కల్లలుగట్టిన తోటలలో ఇతరులు దూరుట కష్టము. కల్లలు లేని తోటలలో ఇతరులు ప్రవేశించుటకు అడ్డి లేదు. ఆ విధముగా ఏకాగ్రము సంపాదించని మనస్సులయందు ఇతరుల తలంపులు ప్రవేశించుట సులభము. మన అనుమతి లేనిదే మన మనస్సులలో ప్రవేశించు తలంపులు మనయొక్క స్వభావమును అనుసరించినవిగా నుండును. మన స్వభావమునందు నీచభావములయం దనురక్తి యున్న యెడల నీచతలంపులు మనమనస్సులయందు ప్రవేశించును. అంతేకాదు. ఇతరుల తలంపులు మన మనస్సునందు ప్రవేశించి ఆ విధమైన కార్యములను చేయుటకు ప్రేరేపించును. అట్టి తలంపులు మనవికాకున్నను వానివల్ల జరిగిన కార్యముల యొక్క పూచి మనదే. తలంపులు నీచములుగా నుండవచ్చును. శుభ్రముగా నుండవచ్చును. ఏవిధమైనను పూచి కార్యముచేయు వానిదే.

అశుద్ధమనోమయశరీరమును శుభ్రపరుచువిధమును ఆ శరీరమును ఏవిధముగా జీవాత్మయొక్క లాభమునకుగా నుపయోగించవచ్చును అను విషయములనుగురించి నివృత్తిమార్గము అను అధ్యాయమునందు వ్రాయబడును.

## శుద్ధమనోమయశరీరము

అమృతబిందూపనిషత్తునందు మనస్సును శుద్ధమనియు అశుద్ధమనియు భాగించినపుడు “ అశుద్ధం కామసంకల్పజం ” అనియును “ శుద్ధం కామవివర్జితం ” అనియును చెప్పియున్నది. ఈ వాక్యముల ననుసరించి నీచములైనను కామములైనను ఉన్నతములైన కామములైనను అన్నియు కామములే. గనుక కామసహితములైన తలంపు లన్నియును అశుద్ధకామమయశరీరమునకే సంబంధపడినవి అని అశుద్ధకామమయశరీరమునుగురించి వ్రాసినపుడు చెప్పబడెను. లోకమందు ముప్పాతికాముప్వీసమమందికి కామప్రేరితములైన తలంపులే గాని యితరములు అగుబడవు. కామరహితములైన తలంపులు చాల కష్టములు.

“ మెంటల్ ప్లేను ” యొక్క ఏడు “ సబుప్లేనుల ” లో సూక్ష్మతరములైన పైమూడు “ సబుప్లేనుల ” యొక్క ప్రకృతితో శుద్ధమనోమయశరీరము కట్టబడెను అని ౧౩౫ వ పుటయందు చెప్పబడెను. ఈ శరీరముయొక్క మనోధర్మములయందు కామము ఏమాత్రమైనను చేరదు. ప్రతి జీవునకును నాలుగు శరీరములు ఈ కాలమందు పనిచేయుచుండును. ౧. స్థూలశరీరము. ఇది మరణముచెందు నపుడు ఈ శరీరమునందలి శక్తులన్నియు స్థూల

భూతసూక్ష్మమునందు ఇముడును. ౨. కామమయశరీరము. భువ ర్లోకానుభవములు ముగిసి నపుడు కామమయశరీరమునకు మరణ ము కలుగును. అపుడు కామమయశరీరమునందుండినశక్తు లన్నియు నాశరీరముయొక్క దేహబీజమునం దిమిడియుండును. ఆవల 3. అశుద్ధమనోమయశరీరము స్వర్గలోకానుభవానంతరము చెదిరిపోవును. అపుడు అశుద్ధమనోమయశరీరపు దేహమునకు బీజమైన "మెంటల్ యూనిట్" అను అణువునం దిమిడి యుం డును. ౪. శుద్ధమనోమయశరీరము అను అత్యున్నతశరీరము. మొదటి మూడు శరీరములు నశించిన రీతిగా శుద్ధమనోమయ శరీరము శిథిలము గాదు. జీవాత్మకు ఇక చాల కాలము ఇది యునికిపట్టు. జీవన్ముక్తి దశకు సామీప్యము వచ్చునంతవరకును ఈ శరీరముండును. కనుక స్థూలత్రిలోకియందలి యుపాధులైన స్థూల శరీరము, కామమయశరీరము, అశుద్ధమనోమయశరీరము అను నీ మూడుశరీరములు నశించునపుడంతయు ఆ శరీరముల దేహ బీజములు శుద్ధమనోమయశరీరముయొక్క ఆవరణమందు నిలిచి జీవాత్మ నాశ్రయించియుండును. ఇందునుగురించిన వివరములు సంసారచక్రము అను అధ్యాయమునందు వ్రాయనగును.

## మనస్సుయొక్క స్వరూపము

వేదాంతములందు "త్రిపుటి" యను నొక సంజ్ఞావాచ కము కలదు. త్రిపుటి యనగా మూడింటి సముదాయము. దీని కుదాహరణ మేదనగా, అసద్వస్తువైన జగత్తు దృశ్యము అనగా చూడబడు వస్తువు. చూడబడునదియుంటే చూచువారుండ

వలెనుగదా. అట్టి చూచువారు జీవాత్మలు, అనగా మనము. చూచువానికి "ద్రష్ట" యనిపేరు. ద్రష్ట చూచును, దృశ్యము చూడబడును, ఈ రెంటికిని చూపు అను సంబంధ ముండవలెను. ఈ చూపుకు "దృష్టి" యని పేరు. ద్రష్టా, దృశ్యము, దృష్టి యను మూడును ఇపుడు త్రిపుటి యనబడు. ఇదేవిధముగా మరి యొక త్రిపుటి కలదు. "జ్ఞాతా" అనగా ఎరుగువాడు, "జ్ఞేయం" అనగా నెరుగబడు వస్తువు, "జ్ఞానం" అనగా నెరుగునట్టి శక్తి. ఇపుడు ఏర్పడిన త్రిపుటి ఏమనగా "జ్ఞాతా, జ్ఞానం, జ్ఞేయం" అనునది. ఈ త్రిపుటియందు జ్ఞానం అను నంశము క్రింద నొక భాగము అంతఃకరణము. జీవాత్మలు జగత్తు నెరుగవలెనంటే అంతఃకరణము ముఖ్యసాధనము. బహిఃప్రపంచమందు గల శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు మొదలగునవి విషయములని పేరు గొన్నవి యని ముందే చెప్పబడెను కదా.

విషయములను ఇంద్రియములు గ్రహించును. ఇంద్రియములు గ్రహించినవిషయములను ఆత్మ అంగీకరించవలెనంటే ఆత్మకును ప్రపంచమునకును మధ్యవర్తియొక రుండవలెను; అట్టి మధ్యవర్తి యంతఃకరణము. ఒకానొక రాజువద్దకు అర్జీదారులు పోవలెనంటే రాజుగారికి అర్జీదారుల ప్రార్థనను మనవిచేయు మధ్యవర్తియైన యధికారి యొకమంత్రి యున్నట్టు క్షేత్రజ్ఞుడైన జీవాత్మకును బహిఃప్రపంచమునకును మధ్యవర్తి యంతఃకరణము. ఆత్మ సత్పదార్థము, ప్రపంచము అసత్పదార్థము. ఈ రెంటికిని మధ్యవర్తి యంతఃకరణము. ఇదే యర్థము జ్ఞానవాసిష్ఠమందు చెప్పబడి యున్నది.

భావ స్పదసతో ర్మధ్యే స్యాణాం చలతి యశ్చలః ।
కల్పనోన్ముఖతాయాత స్తద్రూపం మనసో విదుః ॥

(జ్ఞానవాసిష్ఠము)

కల్పనాశక్తికలదియై సత్పదార్థమునకును అసత్పదార్థమునకును సంబంధము కలుగజేయువస్తువు మనస్సు అని తాత్పర్యము.

మనస్సునకు కల్పనాశక్తి యెట్లుకలిగినదంటే పరమేశ్వరుడు సత్ చిత్ ఆనందము అను స్వభావములు గలవాడు. ఈ మూడు స్వభావములలో చిత్స్వభావముయొక్క పరిణామము అంతఃకరణము. ఈ మూడుస్వభావములయొక్క పరిణామములును ప్రకృతి యందు అనాదిగానుండు సత్త్వరజస్తమోగుణములగుండా ప్రతిబింబించి మనకు కనబడు. చిత్స్వభావపరిణామమైన యంతఃకరణమునకు సంకల్పాది శక్తులు సహజములు.

అనంత స్యాత్మతత్త్వస్య సర్వశక్తే ర్మహాత్మనః ।
సంకల్పశక్తికలితం తద్రూపం యన్మనో విదుః ॥

(జ్ఞానవాసిష్ఠము)

సర్వశక్తిమంతుడైన పరమాత్మయొక్క సంకల్పశక్తిచేత నిర్మింపబడిన తత్త్వమునకు మనస్సని పేరు అని తాత్పర్యము. మరియును,

స ఆత్మా సర్వగో రామ నిత్యోదిత మహావపుః ।
యన్మనో మననీం శక్తిం ధత్తె తన్మన ఉచ్యతే ॥

(జ్ఞానవాసిష్ఠము)

సర్వశక్తిమంతుడైన పరమాత్మకు మననావస్థ సంధించినపుడు ఆ శక్తివల్ల అంతఃకరణము పుట్టినది. కనుకనే ఇంతశక్తిమంతమైన

యంతఃకరణముతో జేయబడు కార్యములే కార్యములు గాని మిగిలినవి కార్యములు గావని జ్ఞానవాసిష్ఠమందు చెప్పబడియున్నది. "యత్కృతం మనసా రామ తత్కృతం విద్ధి చానఘ"—కనుక మనస్సుతో చేయబడిన కార్యమే కార్యము.

ఈ యంతఃకరణ చతుష్టయమందు మనస్సు చిత్తము బుద్ధి యను మూటినిని బహిఃప్రపంచవ్యాపారములయందు ప్రవేశ పెట్టునది యహంకారమను భాగము.

> అహమర్థోదయో యోఽయం సర్వానర్థైక భాజనం ।
> ఏత చ్చిత్తద్రుమస్యాస్య విద్ధి బీజం మహామతే ॥
> (జ్ఞానవాసిష్ఠము)

సర్వానర్థకారణమైన మనస్సు చిత్తము బుద్ధి యను నంతఃకరణభాగములగు వృక్షమునకు బీజమువంటిది యహంకారము అని తాత్పర్యము. ఈ యహంకారము అనేకజన్మములయందు మననముచేసి యభ్యాసమును పొందిన రీతిన కార్యములను ప్రేరేపించును. ఈ అభ్యాసముననే వాసన యని పేరు. కనుక మనస్సును శుద్ధిచేయవలెనంటే వాసనలను చక్కపెట్టవలెను. మనస్సును శుద్ధిచేయుట అను మహాభ్యాసమునకు వేదాంతమందు "మనోనాశము" అనియు వాసనలను చక్కపెట్టుటకు వాసనాక్షయము అనియు చెప్పుదురు. విద్యారణ్యకృత జీవన్ముక్తివివేకము అను గ్రంథమునందు వాసనాక్షయ మనోనాశములు అని జంటగానే యుపయోగించి యున్నారు. మరియు యోగవాసిష్ఠమందు, శిఖిధ్వజోపాఖ్యానమందు—

> వాసనైవ సదా రాజన్ స్వరూపం విద్ధి చేతసః ।
> చిత్తశబ్దస్తు పర్యాయో వాసనాయా ఉదాహృతః ॥

అనగా వాసనలే చిత్తమునకు స్వరూపము. చిత్తం అను శబ్దము బుద్ధిపర్యాయవచనమే అని తాత్పర్యము. కనుక అహంకార మన్నను, మనస్సన్నను, చిత్తమన్నను బుద్ధియన్నను వాసనలే గాని వేరుకాదు. అంతఃకరణమును శుద్ధపఱచవలెననినను, బల పఱచవలెననినను వాసనలను గమనించవలెనని యర్థము.

## స్వభావము

వేదాంతశాస్త్రములయందును, సాధారణముగా దేశభాష లలోనను స్వభావము అనుపదము తరుచుగా నుపయోగించు చున్నారు గదా. "అది వాని స్వభావము" "వారి వారి స్వభావములను మార్చను ఎవరికి సాధ్యము" అను వాక్కులు సాధారణముగా వినుచున్నాము. శ్రీమద్భగవద్గీత ౧౮ వ యధ్యాయము, శ్లోకములు, ౪౨-౪౩-౪౪ లలో వచ్చు "స్వ భావజం" అను శబ్దమును, ౧౭ వ యధ్యాయము, రెండవశ్లోకములో వచ్చు "స్వభావజా" అనుపదమును, ౧౮ వ యధ్యాయము, అరు వదియవ శ్లోకమునందుండు "స్వభావజేన" అను పదమును, అదే యధ్యాయము, ౪౭ వ శ్లోకమునందుండు "స్వభావనియతం" అను పదమును, అదే యధ్యాయము, నలువదియొకటవ శ్లోకమం దుండు "స్వభావప్రభవైః" అను పదమును, అయిదవ యధ్యా యము, పదునాలుగవ శ్లోకమునందుండు "స్వభావః" అను పదమును, మూడవయధ్యాయమునందు ముప్పదిమూడవ శ్లోకము నందుండు "స్వస్యాః ప్రకృతేః" అను పదములవల్ల సూచిత ములైన అర్థములన్నియు స్వభావమునే తెలుపుచున్నవి. అట్లైతే

స్వభావమనునది యేమి? అపుడే పుట్టినబిడ్డకు ఎవరును నేర్పించ కయే తన తల్లి పాలను పీల్చు శక్తి యెక్కడిది? దీనినే స్వభావ మందురు: ఆ శక్తి యెట్లువచ్చినది అనగా ననేకజన్మములందు మృగశరీరములలో నుండినపుడు తల్లిపాలు పీల్చి త్రాగి త్రాగియు నభ్యాసమైనందున కలిగిన శక్తి. దీనినే వేదాంతశాస్త్రజ్ఞులు దేహవాసన యందురు. అనేకతడవలు ఒకకార్యమును ఒక విధ ముగా చేసి చేసి మరల చేయుచు వచ్చినందున సంపాదింపబడిన వాడుక. ఇదే విధముగా మనస్సునకును వాడుకలు ఏర్పడును. కార్యములను సంకల్పించి, వికల్పించి, అనేక కోట్లమారు లౌక విధమైన తలంపులను తలచినందున వచ్చిన వాడుక. దీనినే వాసన యని చెప్పుదురు. ప్రకృతమందు దృఢముగా తెలిసికోవలసిన విషయ మేమనగా. మనము అనేక జన్మములయందు తమో గుణము, రజోగుణము, అను గుణములచేత ప్రేరేపించబడి చేసిన క్రతువులు, కామములు, కర్మలు, వీటిచేత మన యింద్రియములు, మన యంతఃకరణము, మన దేహములు, ఇవన్నియు నేదోయొక విధముగా తమ యభ్యాసప్రకారము చింతించి, సంకల్పించి, వికల్పించి, నిశ్చయించి, కార్యములను చేయుచున్నవి. అట్టికార్య ములు మొదలైనవాటిచేతను, వాటిఫలాఫలములు, పరికరములు వీట్లచేతను మనము బద్ధులమై మనతో సహా యితరులను కూడ బంధించియున్నా మని తెలిసికొని యిదివరకును బలహీనముగా నుండిన సత్త్వగుణమును ఇకనైనను బలపరిచి మనకు ఇంద్రియ అంతఃకరణాదులవల్ల కలిగిన బంధములను పోగొట్టుకొనుప్రయ త్నము చేయవలయును.

ఇది మనకు సాధ్యమను సంగతి కర్మయను అధ్యాయము నందు బాహుళ్యముగా వ్రాయబడును. అయితే ప్రకృతమందు పైవివరించిన రీతిన ఏవిధమున సత్త్వగుణమును వృద్ధిపరుచుకొని రజస్తమోగుణములశక్తిని తగ్గించవచ్చునో ఆ వివరమును విచారించవలెను. ఇట్టి మహాప్రయత్నము మన అంతఃకరణముతోనే జరుగవలసియున్నది. అంతఃకరణములోకూడ ముఖ్యముగా ననుసంధానకారియయిన చిత్తముయొక్క సహాయముచేత జరుగవలయును. అనుసంధానము అనగా నింతకు పూర్వము మనము చేసిన కార్యములవలని ఫలములను మనకు జ్ఞాపకమిచ్చుశక్తి. ఈ శక్తి చిత్తముయొక్క స్వభావము. ఇంతే కాక అనుసంధానము కలుగజేయు చిత్తమునకన్న నధికమైన అధికారముగలది యంతఃకరణముయొక్క భేదములలో నొకటైన బుద్ధియనునది. ఈ బుద్ధియొక్క పని నిశ్చయించుశక్తి. చిత్తము ఇచ్చిన అనుసంధానమును పరిశీలించి నిశ్చయమును కలుగజేయునది బుద్ధి.

మనస్సు సద్వస్తువైన బ్రహ్మమును మనకు అగుపడకుండ మూతవేసిపెట్టును. కనుక దీనికి సద్వస్త్వాచ్ఛాదకమని పేరు. ఏలయనగా బహిఃప్రపంచమందు మనకు కనుపడువస్తువులన్నిటియొక్క నిజస్వరూపమును మన కందనీయక మన యంతఃకరణమును, వాసనలను, అట్టి వస్తువులయొక్క నిజరూపగుణములను మార్చి మనకు కనుపరచును. ఏవిధముగానైతే మన కండ్లకు రంగులు గల అద్దములతో జోడింపబడ్డ ముక్కద్దములను తగిలించుకొని వస్తువులను చూచితిమంటే అద్దములవర్ణమే మనకు కండ్లపడునో అదేవిధముగా బహిఃప్రపంచమును జీవాత్మకు తెలియపరచవలసిన ధర్మ

మును వహించిన యంతఃకరణము ఆవస్తువులన్నిటిని తన స్వభావ ములకు మార్చి జీవాత్మకు కనుపరచును. సత్యమును మరుగు చేయును గనుక అచ్ఛాదకమని పేరు.

అంతఃకరణము (మనస్సు) కొందరికి బలహీనముగను మరి కొందరికి బలవంతముగ నుండును. బలహీనమనస్కులు మన కక్కరలేదు. గాని బలవంతమైన మనస్సుగలవారు తమ యభి ప్రాయములను ఇతరుల మనస్సులోనికి వారల యెరుకలేకనే ప్రవేశ పెట్టవచ్చును. అది యెట్లంటే. జగత్తున కంతయు నొక మనో మయకోశమున్నది. జగత్తునకు అండాండమని పేరు. ఒక జీవా త్మకు పిండాండమని పేరు. అండాండమునందుండు తత్త్వము లన్నియు పిండాండమునందు గలవు. అండాండపు మనస్సునకు జగన్మనోమయకోశమని పేరు. ఈ జగన్మనోమయకోశము ఒక మహాసముద్రమువంటిది.

> ఏకం వస్తు జగత్సర్వం చిన్మాత్రం వారివాంబుధిః ।
> తదేవ స్పందతే ధీభిః వస్తు వారీవ వీచిభిః ॥
> (శిఖధ్వజోపాఖ్యానం-జ్ఞానవాసిష్ఠం)

జగత్తు చిత్ అను నీళ్లతో నిండిన సముద్రమువంటిది. అలలుకొట్టి నపుడు సముద్రమంతయు నే విధముగా నల్లకల్లోలమగునో అదే విధమున జగత్తుయొక్క మనోమయకోశమంతయు సంకల్పములచే చలించును. అలలు లేనపుడు ఏవిధముగా సముద్రపు నీరు నెమ్మ దిగా నుండునో అదేవిధమున శుద్ధసాత్త్వికవృత్తిగల యంతఃకర ణము అలలు లేకనే తటాకోదకమువలె నెమ్మదిగా నుండును. కనుక దుర్మార్గప్రవర్తనమునందుండువారలు దుష్టతలంపులను తలచి

తలచి దుష్టతలంపులు అను వాయువును పుట్టించుచుంటే ఇట్లు కోటానుకోట్లమంది దుష్టతలంపులు అను చలనహేతువులను పుట్టించుచుంటే జగన్మనోమయకోశము అను సముద్రమందు అలలవలె హెచ్చుతక్కువలు కలుగును. రాజసతలంపుల అలలు రాజసస్వభావముగల వారినందరిని రాజసస్వభావతలంపులు తలచునట్లు చేయును. సాత్త్వికస్వభావముగల తలంపులు సాత్త్వికస్వభావముకల తలంపులు తలచునట్లు చేయును. దీనికి ఉదాహరణము. ఒక కొలనునందు వేయి తామరపుష్పములు తేలుచున్నను ఆ కొలనుయొక్క యొక మూలమందు తామరపువ్వును కోయను ప్రయత్నపడినవాడు ఆ పువ్వును లాగితే ఆమాత్రమునకే కొలనులోని నీళ్లయందు స్తిమితము తప్పి తద్వారా అలలుపుట్టి ఆ అలలు కొలనునంతయు ఆవరించినందున ఆ నీటిపై తేలుచున్న పుష్పములన్నియు చలించునుగదా. కొలనులోనున్న పూలపైకి ఒక పుష్పమునే కదా కదిలించినది. అయినను కదిలింపబడని మిగత పూలన్నియు కదలలేదా? అదే విధముగా జగన్మనోమయశరీరమందు తొందరకలుగచేయుటకు ప్రతిమనుష్యునకును సాధ్యము. మరియొక విధముగా నుదాహరణ మియ్యవచ్చును. కరమలవ్వాని కొలిమియొద్ద ననేక ఇనుపతునకలున్నవి. అవి యొకటితోనొకటి తగలకయే దూర దూరముగానున్నను కొలిమిలో వెలుగుచుండు అగ్నియొక్క తీక్ష్ణమువల్ల కొలిమిలో లేకనే దూరాననుండు ఇనుపతునకలన్నియు వేడెక్కును గదా. ఇది ఎట్లు జరుగుతున్న దనగా కొలిమిలోని అగ్నియొక్క తీక్ష్ణము అందుకు చుట్టునుండు ఆకాశ అణువులలో ప్రసరించి ఆయణువులన్ని వేడిమిని ఆకర్షించినందున ఆ

యణువులతో పరివేష్టితమైన యినుపతునకలు అన్నియు వేడిమిని ఆ కర్షించినవి. అందువల్ల వాటికి ఉష్ణతయెక్కినది. ఒక్కస్థలమందు వెలుగుచున్న అగ్ని తనతో కలియని యినుపతునకలను కూడ యెట్లు వేడిమి పొందునట్లు చేయునో అదే విధమున నొకానొకడు చింతించు తలంపులతో లోకుల యెఱుక లేకయే వారల మనస్సులలో కూడ నొకానొకని మనస్సునందలి సంకల్పములవంటి సంకల్పములు జనించునట్లు చేయవచ్చును. అట్టి వారల మనస్సులలో పుట్టు సత్సంకల్పములకో దుస్సంకల్పములకో మొదటివాడు పూచి చెందవలెను. ఇదేవిధముగా లోకమందు కోటానుకోట్లమంది అనేకవిధములైన నీచచింతనములను చింతించుచుందురు కదా. ఇట్టి నీచ సంకల్పములవల్ల కలుగు చెరుపును వర్ణింప వాచామగోచరముగా నుండును. దీనికి ప్రతిగా సత్త్వగుణప్రధానులైన రాజయోగులు, ఋషులు, దేవతలు మొదలగువారు చెప్పనలవిగానంత తపశ్శక్తి పొందినవా రనేకులు లోకహితార్థముగా తపస్సులు చేసి సత్సంకల్పశ్రేణులను ప్రతిక్షణమునందును లోకమునందు కుమ్మరించుచుందురు. గనుకనే లోకములో నీమాత్రమైనను సుఖము, శాంతము కనపడుచున్నవి. అంతఃకరణపరిశుద్ధియు, చిత్తైకాగ్రతయు లేని పది వేలమంది తలచు దుష్టతలంపుల నంతయును వాటివలన కలుగు చెడ్డఫలములనంతయును తపశ్శక్తి చెందిన మహానుభావు డొక్కడు సమాహితచిత్తముతోఁ జేయు సత్సంకల్పశ్రేణి శుద్ధపరచి లోకమునకు కీడు రానీయక కాపాడును. శ్రీమద్భాగవతము, తృతీయ స్కంధముయొక్క కడపట ‹‹ ఆస్తేయోగం సమాస్థాయ సాంఖ్యాచార్యై రభిష్టుతః । త్రయాణా మపి లోకానాముపశాంత్యై సమా

హితః" అని యున్నది. కర్దమప్రజాపతియొక్క కుమారుండును శ్రీ మహావిష్ణుయొక్క లీలావతారములలో నొక్కడున్నైన కపిలమహర్షి వారియాశ్రమమందు యోగారూఢుడై ముల్లోకముల శాంతి కొఱకుగా యోగమందు (తపస్సునందు) న్నారని యర్థము. కావున మనము కూడ ప్రతిదినమునందును కొంతసేపు లోకహితార్థము సమాహితులమై జపము చేయవలెనని భావము.

## జ్ఞాపకశక్తి

ఇది యంతఃకరణశక్తి. అంతఃకరణభాగములైన మనస్సు, చిత్తము, బుద్ధి యను మూటిలో చిత్తముయొక్క స్వభావము అనుసంధానము అని యిదివరకే చెప్పబడెను కదా. అనుసంధానమనగా ఇంతకు పూర్వ మొకనాడు ఇట్టియిట్టి సందర్భములయందు ఈ విధమైన అనుభవము సిద్ధించెనుకదా. నేడును నాటి సందర్భములే తటస్థించియున్నవి గనుక నాడు సిద్ధించిన అనుభవమే నేడును సిద్ధించును అను జ్ఞాపకము. కనుక చిత్తముయొక్క ధర్మము జ్ఞాపకము. కొందరు తమకు దృఢమైన జ్ఞాపకశక్తి కలదని చెప్పుకొందురు. కొందరు తమకు జ్ఞాపకశక్తియే చాలదనుకొందురు. ఇట్టి వ్యత్యాసమునకు కారణ మేమనిన, మనల కందరకును పూర్వజన్మ వాసనలున్నవి. ఆ వాసనలను అనుసరించి కొందరికి కొన్ని వస్తువులయందు, కొన్ని విషయములయందు, కొందరు మనుష్యులయందు, రాగమును, మరికొన్ని వస్తువులు, విషయములు, మనష్యులు, వీర్లయందు రాగములేమియు గానున్నది. అదే విధముగా కొన్ని విషయములు, కొందరు మనుష్యులు, ఇట్టి వాటియందు ద్వేషము

కూడ నుండును. అట్టి ద్వేషమున్నవాట్లయందు మన మనస్సు నకు అక్కర కలుగదు. రాగమున్నస్థలములో నభిమానముండును. మిగతవిషయములలో అశ్రద్ధయుండును. ఏ యే విషయములను మనము అభిమానము, శ్రద్ధ వీట్లతో గమనింతుమో వాటియందు జ్ఞాపకము స్థిరముగానుండును. అభిమానము లేక, శ్రద్ధాహీనులమై మనము చూచు, విను, విషయములయందు జ్ఞాపకము సున్న. ఇది మనయొక్క తప్పు గనుక ఏకార్యమైనను శ్రద్ధతో, అభిమాన ముతో చేయుచుండు వాడుకను అనగా నిలకడచెందిన మనస్సును ప్రయత్నపూర్వకముగా కలుగచేసికొంటిమంటే జ్ఞాపకము మనకు బలపడును.

శ్రీమద్భగవద్గీతయందు అర్జునుడు చెప్పినది యేమన

చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం ।
తస్యాహం నిగ్రహంమన్యే వాయోరివ సుదుష్కరం ॥
(భ. గీ. ౬-౩౪)

ఓయి శ్రీకృష్ణా నామనస్సు మహా చంచలస్వభావము గలదియు, దేహేంద్రియాదులను క్షోభపెట్టి పరవశతను తెలుపునట్టిదియు, నిగ్రహించుటకశక్యమైనదియు, విషయములయందు దృఢమైన ప్రవేశము కలదియుగానున్నది. దానిని నిలుపుట గాలిని కట్టి పెట్టుట యెంతకష్టమో అట్లు శ్రమగానున్నది అని చెప్పెకొనెను గదా. అర్జునునివంటివానియొక్క మనస్సే యిట్టి స్థితియందుంటే మనవంటివార్ల సంగతి అనుకో నవశ్యముండదు. చంచలమైన మనస్సుతో నేకార్యము చేసినను ప్రయోజనములేదు. గనుక మనస్సును తనయిచ్ఛ వచ్చినట్టు పోనియ్యకూడదు. కోతివలె ఒక

వస్తువునుండి మరియొక వస్తువుపైకి దాటు అభ్యాసమును చాలించు నట్లు చేయవలెను. ఇట్లు చేయుప్రయత్నమునకు ఏకాగ్రతయని పేరు. అనగా మనస్సునకు ఒక వస్తువును చూపి "ఓ మనసా యీవస్తువును విడిచి నా ఉత్తరవు పొందువరకును వేరువస్తువుపైకి పోకూడదు" అని చెప్పవలెను. చిత్తైకాగ్రతతో నేకార్యము చేసినను ఏ విషయమును చింతించినను, ఏవస్తువుగమనించినను, జ్ఞాపకము ధృఢముగా నుండును.

వాసనలను శుద్ధిచేసి కొంటేనే గాని మనస్సు మనకు వశపడదు. మనస్సు వశపడకుంటే మనము చేయు కార్యములకు వీర్యము తక్కువ. వీర్యహీనమైనకార్యములు చేసి ప్రయోజనము లేదు. లోకమందు ఏవ్యవహారమందు మనను ప్రవేశించినను, వ్యాపారము, చదువు, ఉద్యోగము, జపము, తపస్సు ఇట్టి కార్యములలో నేదియైనను ఏకాగ్రతచెందినమనస్సుతో చేసినగాని వేరువిధమున ప్రయోజనాభావమును, కాలహరణమును కలుగును. కనుక మనస్సును ఏకాగ్రముగా నుంచుకొనువిధమును విచారింతము.

## చిత్తైకాగ్రత

ఇంద్రియాణాం హి చరతాం యన్మనోను విధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివాంభసి ॥
(భగవద్గీత, అధ్యా ౨, శ్లో ౬౭)

ఇంద్రియములు విషయములను వెదకుచు సంచరించుచుండగా ఏ ఇంద్రియమునైనను మనస్సు అనుసరించి వర్తించునో అట్టి మనోయుక్తమైన యింద్రియము ఆ మనస్సును ఏవిధముగానైతే

నీటిమీద సంచరించుచున్న యోడను ప్రతికూలమైన వాయువు ఆ యోడను త్రోవతప్పించి ముంచునో ఆ విధముగా తత్త్వజ్ఞానమార్గ మునుండి తప్పుత్రోవలయందు లాగును.

జిహ్వైకతోఽచ్యుత వికర్షతి మావితృప్తా
  శిశ్నోఽన్యత స్త్వగుదరం శ్రవణం కుతశ్చిత్ ।
ఘ్రాణోఽన్యత శ్చపలదృ క్క్వచ కర్మశ క్తి
  ర్బహ్వ్యస్సపత్న్య ఇవ గేహపతిం లునంతి ॥
ఏవం స్వకర్మ పతితం భవవైతరణ్యా
  మన్యోన్య జన్మమరణాశన భీతభీతం ।
పశ్యన్ జనం స్వపరవిగ్రహ వైరమైత్రం
  హంతేతి పారచర పీపృహి మూఢమద్య ॥
నైత న్మన స్తవ కథాసు వికుంఠనాథ
  సంప్రీయతే దురితదుష్ట మసాధు తీవ్రం ।
కామాతురం హర్ష శోక భయైషణార్తం
  తస్మిన్ కథం తవగతిం ప్రమృశామి దీనః ॥

(శ్రీమద్భాగవతం-సప్తమస్కంధము, నవమోధ్యాయము)

ఇట్లని పరమభాగవతుండైన ప్రహ్లాదుడు శ్రీమన్నృసింహమూర్తిని ధ్యానించెను. ఈ శ్లోకంబుల తాత్పర్యం బేమన—

తృప్తిజెందక నాయొక్క జిహ్వేంద్రియము ఒక్కపార్శ్వ మునను, శిశ్నమొక్కపార్శ్వమునకును, శ్రోత్రేంద్రియ మొక్క ప్రదేశమునకును, ఘ్రాణేంద్రియము మరియొక్కస్థలమునకును, చంచలతయే స్వభావముగాగల నేత్రేంద్రియ మొక్కడకును, కర్మేంద్రి యములు మరియొక్కడకును, నన్నాకర్షించుచున్నవి. ఈ చిత్ర మును విచారించగా లోకమం దనేకభార్యలను బెండ్లియాడిన వానిని ఆ భార్యలందరును ఏకకాలమున తమ తమ యిండ్లకు రమ్మని పీడించిన యట్లున్నది. భార్యేషణ విత్తేషణ పుత్రేషణయను నేషణాత్రయంబుచేతను, హర్షము, శోకము, భయము, మొదలగు

మనస్స్వభావములచేతను శ్రమపడి దైన్యముచెందినవాడనైనను నేను చేసిన పాపములచే బీడింపబడిన నా మనస్సు కామాతురమైనదై, యున్నను ఓ వైకుంఠనాథా, నీయొక్కకథలను వినను ఇచ్ఛగొన్నదిగా గనబడదు గాన నిన్నేవిధమున చెందగలను. నీ చరితంబు లేవిధంబుగ వినగలను. అని తనదైన్యమును, తనయొక్క యింద్రియముల ప్రబలతనను భక్తాగ్రగణ్యుడైన ప్రహ్లాదుడు చెప్పి దుఃఖించెను.

కావున జిహ్వాదీంద్రియములు ఒకొక్కటియు నొకొక్కదారిన లాగుచుండగా వాటిని నిరోధింపను శక్తిలేని మనస్సుగలవాడు భక్తియోగముగాని, జ్ఞానయోగముగాని, కర్మయోగముగాని అనుష్ఠించలేడు. ఇంద్రియముల వెంబడి పరువెత్తనీయక మనస్సును తనకు (జీవాత్మకు) ఇష్టమైన యొక వస్తువునందు నిలుపు శక్తి జీవాత్మ సంపాదించుకోవలెను.

మనస్సును ఏకాగ్రముగా జేయవలెనను ప్రయత్నముచేయువారలకు ఉపాసకు లని పేరు. ఉపాసకులలో ననేక భేదంబులు గలవు. అనాదియైన త్రిగుణములయొక్కయు. వాటియొక్క త్రివృత్కరణభేదంబుల వలనను ఏదో యొకగుణమును ముఖ్యముగా గలవారలు. త్రివృత్కరణ మనగా మూడింటగుణించుట. పంచీకరణము అనగా నైదింటగుణించుట. ప్రకృతమందు గుణత్రివృత్కరణము ఏమని విచారించవలెను.

సత్త్వగుణము ముఖ్యమై రజోగుణము కొద్దిగను తమోగుణము కొంతయు కలిగియుండు జాతి యొకటి. రజోగుణ మధికముగను సత్త్వగుణము తమోగుణము ఇవి కొంచెముగా గలిగి

యుండు జాతి మరియొకటి. తమోగుణము అధికమై సత్త్వగుణము రజోగుణము కొంచెముగా గలిగియుండు జాతి మరియొకటి. ఏజాతియందు చూచినను మూడుగుణములు కనబడుచుండు స్థితికి గుణత్రివృత్కరణమని పేరు. అది యెట్లనగా

రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా ॥
(భ. గీ. ౧౪-౧౦)

ఓయి అర్జునా సత్త్వగుణము అనునది రజోగుణమును తమోగుణమును అణచి తనయొక్క స్వభావములగు జ్ఞానము, సుఖము వీట్లను కలుగజేయును. రజోగుణమనునది సత్త్వగుణమును తమోగుణమును అణచి తన స్వభావములగు కర్మలను ప్రేరేపించును. అదే విధముగా తమోగుణము సత్త్వగుణమును రజోగుణమును అణచి తన స్వభావములైన అజాగ్రత, ఆలస్యము, నిద్ర, సోమరితనము అను స్వభావములను కనపరుచును. తమోగుణము ముఖ్యముగా వివేకము అను వాసననైనను కనబడనీయదు.

యోగశాస్త్రజ్ఞులు మనస్సునకు రెండు అవస్థలను చెప్పియున్నారు. వ్యుత్థాన దశ యొకటి. నిరోధ దశ రెండవది. ఇందులో వ్యుత్థానము అను దశయందు మూడు భాగములు గలవు. క్షిప్తము, మూఢము, విక్షిప్తము అనునవి. క్షిప్తమనగా నెల్లప్పుడును రజోగుణము అధికముగానున్నందున నా రజోగుణ స్వభావములనే చూపెడుస్థితి. మూఢమనగా తమోగుణ మధికముగానున్నపుడు ప్రమాదము ఆలస్యము నిద్ర యిట్టి స్వభావములనే చూపునట్టి స్థితి. విక్షిప్తమనగా సత్త్వగుణము అధికము

గా నుండగా నేకాగ్రతను చెందినను అపుడపుడును రజోగుణ ప్రేరితమై ఆ రజోగుణముయొక్క స్వభావములైన విషయములలో ప్రవేశింపించు స్థితి.

నిరోధదశ యనగా సత్త్వగుణము అధికముగా నుండుట చేత నేకాగ్రత చెందిన మనస్సు ఇటునటు కదలక "యథా దీపో నివాతస్థో నేంగతే జ్వలతే పునః" గాలిలేని స్థలమునందుండు దీపము కదలకయే వెలుగుచుండు రీతిని నిలిచి యుండుట. ఈ స్థితికే యేకాగ్రచిత్తమని పేరు.

సాధారణముగా లోకవ్యవహారములయందు కాలము గడు పు జనులు తమ మనస్సులు పరువులిడుచుండుటను కనుక్కోలేరు. చంచలము మనస్సుయొక్క స్వభావము. ఐనను పరువులిడు స్వభా వము గల జంతువులను స్వేచ్ఛగా పోనీయక నొక స్తంభమునకు కట్టిపెట్టితిమంటే ఆ జంతువు అట్టి కట్టును విడిపించుకొని స్వే చ్ఛగా బరువులిడను చేయుప్రయత్నములు మెండు. గంతులు వేయు ను. స్తిమితమువదలి కట్టినత్రాళ్లు తెంచుకొని పోవుప్రయత్నములు చేయును. ఆ జంతువును స్తంభమునకు కట్టకమునుపుకూడ గం తులువేయు స్వభావము ఆ జంతువున కుండినది. అయినను మన ము శ్రద్ధతో ఆ స్వభావమును గమనించలేదు. అదేవిధముగా లౌకిక జనులయొక్క మనస్సులు బహుశా పరువెత్తు స్వభావము కలవే. ఇట్లుండ నెవడైనను ప్రయత్నపూర్వకముగా తన మనస్సు నేకాగ్రముగా నుంచవలెనని పాటుపడితే అపు డతనికి తన మనస్సు అతి చంచలమని తెలియును. ఇదివరకును మనస్సును నింద్రి యములను నిరోధించను ఏ ప్రయత్నము చేయలేదు గనుక

నిపుడు అతని కేమి తోచుననగా, భాపురే, నామనస్సు అతి చంచలమే. దీని నేవిధమున నొక స్థలమందు నిలుపగలనని యాశ్చర్యము, చింతయు కలుగును. అయితే యిందు చిత్రమేమియు లేదు. మనము రైలుబండిలోనుండి ఆ బండి ఘంటకు నలువదిమైళ్ల వేగముతో బరువెత్తుచుండ నాబండియందు సుఖముగా కూరుచుండు మనకు ఆ వేగము తెలియరాకున్నను మనము ఆబండిలో లేక పొలములో నిలబడియుండి వేగముతో బరువెత్తు రైలుబండిని చూచితే, భళీ, యీ బండి యింత వేగముతో బోవుచున్నదా యని విస్మయము చెందుదుము గదా. అదే విధమున మన మనస్సు అతివేగముతో నొక వస్తువుపైన నైనను కొంతకాలము నిలువక బరువెత్తుచుండిన కాలమందు మనమైన జీవాత్మలును ఆ మనస్సు వెంబడి పోవుచుంటిమి. అటు గాక మనస్సు వేరు; నేను వేరు; మనస్సనునది నాయొక్క యింద్రియము; నేను మనస్సున కధిపతిని అని యెరిగి మనస్సును నిలుకడ నుంచను ప్రయత్నపడినపుడు రైలుబండిలో నుండి వేరైన పిమ్మట ఆ బండియొక్క వేగమును మనము తెలిసికొనిన విధముననే మనస్సుయొక్క వేగమును కూడ తెలిసికొందుము; అందువల్ల భయపడవలసిన యవశ్యములేదు. అధైర్యముచెంద నవశ్యములేదు. ఒకానొకడు ఒక గుఱ్ఱమును గొని దానిని సవారిచేయను తలచినపుడు అది ఎడము ఇయ్యక యజమానుని తన్నను కరువను ప్రారంభించిన మాత్రముననే అధికముగా ద్రవ్యము సెలవు చేసి కొన్నగుఱ్ఱమును యే యజమానుడైనను విడిచిపెట్టునా? విడిచిపెట్టడు గదా. అయితే ఆ గుఱ్ఱమును నయమున భయమున నభ్యాసమునకు లోబరచి తన స్వాధీనము

చేసికొనును గదా. ఆ రీతిగనే మనమును మనస్సును నయమున మనకు లోబరుచుకోవలెను.

చిత్తమును జయించుటకు రెండుమార్గములు కలవు. మొదటిది యుక్తి. రెండవది హఠయోగమునందు చెప్పిన మార్గములు. అందులో మొదటిమార్గమైన యుక్తిని ముందుగా విచారింతము. యోగసూత్రములయందు "అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః" అని చెప్పియున్నది. "అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే" అని శ్రీభగవద్గీతయందును చెప్పియున్నది. కనుక కించిత్తు వైరాగ్యము చెంది మనోనిగ్రహమున కభ్యాసము నారంభించవలెను. మనస్సును నిరోధించుటకుగా మనకు కావలసిన వైరాగ్యము మిగుల కష్టమైనది గాదు. దుశ్చరితములను మాత్రము నిలుపుకోగల శక్తి యొక్కటి సంపాదించుకోవలెను. మరియును తాను పొందవలెనని ఇచ్ఛయించిన వస్తువును ఏ విధముననైనను పొందెదను అను మనోదృఢముండవలెను. ఈ మనోదృఢము మిక్కిలి సహాయకారి. పాఠశాలలయందు చదువు బాలురు తమ పరీక్షలయందు తేరి తద్వారా పురోవృద్ధికి రావలెనను దృఢతరమైన యిచ్ఛగొనియుందురుకదా. అట్టి బాలురు తమ పాఠములను హెచ్చరికతో వల్లింతురు. చింతనము చేయుచుందురు. వల్లించునపుడును మనస్సునందు వికారములు పుట్టకయుండవలెను. ఇంద్రియ సుఖములయందు ఆశగాని ఆటలయందు అభిలాషగాని కలిగినయెడల వల్లింపు, చింతన ఇవి బాగుగ జరుగవు. సుఖములయందును ఆటలయందును తత్కాలమునకు ఇచ్ఛలేమి యొక విధమైన వైరాగ్యము. ఈ మాత్రపు వైరాగ్యముంటే వల్లింపు, చిం

తన ఇవి బాగుగ జరుగును. ఒక పుస్తకము నెత్తికొని యతి ఆదర
ముతో చదువ నారంభింతురు. ఒక పుటయందు యిరువది పంక్తు
లుండును. చదువుచు రాగా కండ్లు పుటను చూచుచు పెదవులు
ఆ శబ్దముల నుచ్చరించుచుండినను ఆ పుటలో నాలుగు పంక్తుల
వరకును చదువరియొక్క మనస్సు కంటితోనును పెదవులతోను
కలిసి పనిచేయుచుండి అయిదవ పంక్తి మొదలు తాను (అనగా,
మనస్సు) ఆ పుటను ఆపుస్తకమునును వదిలి యెక్కడికో యొక
యూరికి గాని, లేక నిన్నటిదినము ఆ చదువరి విన్నయుప
న్యాసములనైనను, లేక తాను ఆడిన యాటలనుగాని, లేక తనకు
స్నేహితులుగానుండు స్త్రీపురుషుల యిండ్లలో తినిన పిండివంట
లను గాని తలచి యానందించుచుండును. మనస్సు ఈ ప్రకారము
విహరించుచుండగా కండ్లు పుస్తకమును విడిచి పోవు. పెదవులు
పంక్తివెంబడి పంక్తియు చదివి ఆ పుట ముగించును. మనస్సు
తప్పించుకొని పరుగెత్తిపోయిన వివరము చదువువాడు గమనించ
లేదు. అయితే తాను చదివిన పుటయందలి విశేషములు ఏవి
యని చింతన చేయ నారంభించిన యప్పుడు ఆ పుటయందు గల
మొదటి నాలుగు పంక్తులయందు చెప్పియుండు సంగతులు మా
త్రము చింతన కుపయోగించును గాని మిగిలిన భాగము కొంచె
ముగాని అవగాహనమై యుండదు. సర్వప్రయత్నములగుండా
తాను పరీక్షలో తేరవలెనని యుద్దేశించియుండు విద్యార్థి యేమి
చేయవలెనంటే, తాను యే పుటను చదువుచుండెనో అదే పుటను
మరల నారంభించి అనగా మొదటి పంక్తి మొదలు చదువనారం
భించి జాగరూకతతో గమనించుచు చదువవలయును. అపుడు ఏమి

జరుగునంటే మనస్సైనది తన దొంగతనము నీ విద్యార్థి తెలిసి కొన్నాడని యెరిగి యిటు అటు పోక ఏడు ఎనిమిది పంక్తుల వర కును విద్యార్థియొక్క నేత్రేంద్రియము, వాగింద్రియము, వీట్లతో కలిసి పనిచేయుచు తొమ్మిదవ పంక్తి యొద్ద నుండి మరల స్వేచ్ఛ గా పోవును. రెండవతూరి చదువునప్పుడు విద్యార్థి తనలో తాను సంతోషపడి మనస్సు తనను వదిలి యెక్కడికిని పోలేదని సంతో షించి యుండును. అట్టి సంతోషముతో చదువుచున్న తన యజ మానుని ఏమరిచి మనస్సు మరల పరువెత్తి పోవును. ముందరి వలెనే ఆ పుటను చదివి ముగించిన విద్యార్థి ఆ పుటలో తాను చదివిన విషయమును చింతనచేయ నారంభించినపుడు ఎనిమిదవ పంక్తి వర కును అవగాహనమై యుండును. అపుడు విద్యార్థి తన మనస్సు యొక్క దొంగతనమును తెలిసికొని మరల నాపుటలో మొదటి పంక్తి నారంభించి చదువుచు రావలెను. మొదటిపంక్తినే యేల నారంభించవలెనంటే, దొంగతనము చేసి పరువెత్తిపోయిన మన స్సును దండించు నిమిత్తమై. ఇట్లు పలుమారు దండించితేనే గాని మనస్సు తనయొక్క చాంచల్యమును వదలచాలదు. జీవాత్మ తన కధిపతి యను నర్థము నంగీకరించదు. కావున నీ విధముగా విద్యార్థియైనవాఁడు తాను మనస్సునకును ఇంద్రియములకును యజ మానుఁడను సంగతి తెలిపి నట్లైతే మూడవ తూరి ఛదువ నారం భించినపుడు మనస్సు అతిభక్తితో తనకధిపతియైన విద్యార్థిని మోసపుచ్చి యిటు అటు పరువెత్తదు. ఇంద్రియములును మనస్సును విద్యార్థిని అనుసరించి పనిచేయును. ఏ సమయమందు విద్యార్థి యేమరునో అపుడు తన యిష్టమైన విషయములపైకి వెళ్లెదనని మన

స్సు పొంచువేయుచుండును ; గాని విద్యార్థి యేమరక జాగరూకుడై యుంటే మనస్సు పరువెత్తక ఆ పుస్తకపుటయందే నిలుకడచెంది యుండును. ఈ విధముగా పలుమారు అనేక సంవత్సరములకాలము ప్రతిదినమును, ఏమిపని చేయుచున్నను ఏమరకయే నిశ్చితాత్ముడై మనస్సునకు అంకుశము వేసి వేసి స్వాధీనము చేసికొనవలెను. ఎపుడు మనస్సు తననిజమైన స్థితిని కనుకొ్కనునో అపుడు తన యజమానుడైన జీవాత్మను ఏమరిచి మోసపుచ్చు ప్రయత్నమును వదలుకొనును.

> యత్కృతం మనసా రామ తత్కృతం విద్ధి చానఘ ।
> యత్త్యక్తం మనసా రామ తత్త్యక్తం విద్ధి సర్వదా ॥
>
> (జ్ఞానవాసిష్ఠం)

తాత్పర్యము—మనస్సుతో చేయబడిన కార్యమే కార్యము. మనస్సుతో చేయబడిన త్యాగమే త్యాగము. జ్ఞానేంద్రియములును కర్మేంద్రియములును బహిఃకరణములు. మనస్సు అంతఃకరణము. బహిఃకరణములును (అనగా వెలుపలి ఆయుధములును) అంతఃకరణమును (అనగా దాగి, లోపలనుండు ఆయుధమైన మనస్సును) కలిసి చేసిన కార్యమే కార్యము. కనుక మనస్సును ఏకాగ్రముగా నుంచవలెను. అనగా మనస్సును నిరోధించవలెను. అనగా మనస్సును మనము ఏవస్తువుపైన నిలిచియుండుమని నియమించితే ఆ వస్తువుపైననే నిలిచియుండునట్లు అలవాటు చేయవలయును. చిత్తైకాగ్రత అని వ్యవహరింపబడు చిత్తజయమునకు అనేక మార్గము లున్నను సాధారణజనులు సులభముగా నభ్యసించను సాధ్యమైన

మార్గము పైవివరించిన విద్యార్థి పుస్తకమును చదువు రీతియే. అందువల్ల నేవిధమయిన చెరుపును సంభవించదు.

జపమాల

కొందరు తమ ఆహ్నికక్రియలు జరుపునపుడు మంత్రములను ఆవర్తిచేతురు. ౧౦౮ తడవలు లేక ౧౨౮ తడవలు లేక ౧౦౦౦ తడవలు ఈ ప్రకారము ఒకానొక మంత్రమును జపింతురు. అపుడు లెక్క పెట్టి జపించవలెనను ఇచ్ఛతో రుద్రాక్షమాల, లేక తులసిపూసలమాల, స్ఫటికమాల, పొగడములమాల, యిట్లు అనేక విధములైన పూసలను దారములో గుచ్చి యైనను లేక తామ్రము వెండి బంగారము ఇట్టి లోహముల తంతెలతో కట్టియైనను ఏర్పరచబడిన మాలల నుపయోగింతురు. మంత్రమును జపముచేయు విధానము లనేకములు గలవు. మంత్రము అను శబ్దమునకు అర్థ మేమనగా "మననా త్త్రాణాచ్చైవ మంత్ర ఇత్యభిధీయతే" అనగా మననము చేయుటవల్ల అట్టి మననము చేయువానిని తరింపజేయు శక్తికలది గనుక మంత్రమనబడును. మంత్రములు శబ్దస్వరూపములు. దేవతా విషయములు. ఋషిప్రోక్తంబులు. ఛందోబద్ధంబులు. అనగా ప్రతి మంత్రమును ఏదో యొక దేవత నుద్దేశించియుండును. "ఓం నమః శివాయ" యను మంత్రమునకు దేవత మహేశ్వరుడు. "ఓం నమో నారాయణాయ" యను మంత్రమునకు దేవత శ్రీమన్నారాయణమూర్తి. "ఓం నమో భగవతే వాసుదేవాయ" యను మంత్రమునకు శ్రీమాన్ వాసుదేవుడు దేవత. అన్ని మంత్రములకు అక్షర

సంఖ్యలు గలవు. ప్రతి మంత్రమునకును ధ్యానశ్లోక మొకటి కలదు. మంత్రములను జపించుకొనుటకు పూర్వము అంగన్యాసము, కరన్యాసము, దిగ్బంధము, అను తంత్రములు గలవు. అవి ముఖ్యములు. అంగన్యాస కరన్యాస దిగ్బంధములు చేసికొని ధ్యానశ్లోకముపఠించి ఆ ధ్యానశ్లోకమునందు వివరించిన ప్రకారము ఆ మంత్రపు దేవతయొక్క రూపమును గురూపదిష్టమార్గమున భావించవలెను. గురూపదిష్టమనగా గురువులవారిచేత ఉపదేశకాలమందు చెప్పబడిన విధముగా నని యర్థము. మంత్రమునకు సంబంధించిన దేవతయొక్క రూపమును, కండ్లు, ముక్కు, చెవులు, నొసలు, చెక్కిళ్లు, కపాలము, ముఖవిలాసము, ఇత్యాది వివరములు ఖచితముగా నేర్పడునట్టుగా మనస్సుతో నేకాగ్రచిత్తము అను శక్తితో రూపము స్ఫుటముగా కట్టుకొని అట్టి మనోమయరూపము గల దేవతకు ఉపాసకుడు జపించు మంత్రమును సమర్పించుకోవలెను. పై వివరించిన జపము నోటిమాటలకు అతి సులభసాధ్యముగాని యనుష్ఠానమునకు అతి శ్రమసాధ్య మను సంగతి ప్రయత్నముచేసినపుడు తెలియవచ్చును. మనస్సులో నొక భాగముతో భగవంతునియొక్క రూపమును, వివరముగా, స్ఫుటముగా, ఆభిరూప్యము నిచ్చి భద్రముగా నిలుపుకొని యుండవలెను. ఇది మాసిపోవునట్లు ఏమర కూడదు. మనస్సుయొక్క మరియొక భాగముతో మంత్రమును జపించవలెను. ఒక స్థలమునందు క్షణమాత్రమైనను నిలుపుట కసాధ్యమైన మనస్సు నొకవస్తువుపైన నిలుపు శక్తిని సంపాదించికొని ఆ మనస్సుయొక్క మరియొక భాగముతో మంత్రమును మననము చేయవలెనంటే అతి కష్టసాధ్యము. ఇంతేకాక

తాను జపించు మంత్రము ఎన్నితడవలు జపించినదని లెక్కపెట్టు కోవలెనంటే మనస్సులో మరియొకభాగ మేర్పరిచి ఆ భాగముతో లెక్క పెట్టవలెను. అపుడు ఎన్ని పనులు ఏక కాలమందు జరుగ వలెనో యోచింతము. మనస్సుయొక్క ఒక భాగముతో, ఏకాగ్ర చిత్తముతో కట్టిన శ్రీమద్భగవంతునియొక్క విగ్రహామును పో గొట్టుకోక, నిలుపుకొని యుండుట మొదటిది. మఱియొక భాగముతో నేకాగ్రముగ మంత్రమును మననము చేయుట రెండవది. జపమాల చేతంబూని దానియందలి పూసలు లెక్కకు సరిగా త్రిప్పుచువచ్చుట మూడవది. అధమపక్షము ఈ మూడు కార్యములును ఏక కాలమందు జరుగవలెను. ఇది కష్టతరము. అనేక సంవత్సరముల యభ్యాసమువల్ల కలుగు శక్తివల్లనే గాని సాధ్యము కాదు. అందువల్లనే జపమాలికలు అనేక తరహాలవి. మనస్సుయొక్క జయము కొంచెముగా గలవారలు ఉపయోగిం చను సాధ్యమైన మాలలో పదునారుపూసలు మాత్ర ముండును. నూటయెనిమిది తడవలు మంత్రమును మననము చేయుటకు విశేషకాలమవును, అంతకాలము మనస్సు నేకాగ్రముగ నుంచు కొనుట చాల కష్టము. పదునారు తడవలు మంత్రమును మన నము చేయుటకు స్వల్పకాలము చాలును. ఇది చక్కగా, దృఢముగా, అంతరాయము లేకయే, జపము చేయుశక్తి గలిగిన తరువాత ముప్పదిరెండు పూసలమాల నుపయోగించవచ్చును. అది చక్కగా, నిశ్చలముగా, నిరంతరాయముగా, సాధ్యమైన తరువాత ఏబదినాలుగుపూసలమాల నుపయోగించవచ్చును. ఈ ప్రకారము తనయొక్క మనస్సును ఉపాసకుడు తనయొక్క అంత

రాత్మతృప్తి చెందునటులజయించి, ఏకాగ్రపరిచి, మనసా రూపమును కట్టుశక్తిని, కట్టినరూపమును నిలుపుకొనుశక్తినిని, నిశ్చలముగా సంపాదించుకొనిన పిమ్మట మనస్సును ఏకకాలమందు రెండు మూడు నాలుగు పది వస్తువులపైన ప్రత్యేక ప్రత్యేకముగా నిలుపుశక్తిని సంపాదించికొనవచ్చును. ఇట్టి శక్తికే సప్తావధానము, దశావధానము, శతావధానము అనిపేళ్లు. ఈ శక్తులు అతి కష్టసాధ్యములు. ఇట్లుండగా ననేకులు జపములు చేయు వారల మనస్సేకాగ్రముగా నున్నదో లేదో భగవంతునికే తెలియవలెను. నూటయెనిమిది పూసలమాలలను ఉపయోగించుచు, రుద్రాక్షలతో కవచములు కిరీటములు చేసికొని, చేత నక్షమాల బూని, ఆ మాలను ఇతరులు చూడకూడదని గోముఖము అను నొక తిత్తియందు మాలబూనిన చేతిని చొప్పించి, బహిరంగస్థలములయిన నదీతీరములు, ఉద్యానములు మొదలగు స్థలములయందు అనేకులు తనను చూచుచుండగ జపము చేయుచు, అట్టి విచిత్రస్థితిని ఫొటగ్రాఫులగుండా లోకమందు ప్రచురించుచుందురు. ఇట్టి మహానుభావులు నిజముగా నేకాగ్రచిత్తములతో పైవివరించిన ప్రకారము మనోరూపమును అభిరూప్యముతో కట్టి, స్థిరముగా నుంచుకొని, మంత్రమును మననముచేసి, మాలతో పూసలను కూడ తప్పిపోకయే త్రోయుచు వచ్చు శక్తి గలిగియుంటే వారికి నానమస్కారంబుల సమర్పించెద. శిష్యుని మనస్సుయొక్క ఏకాగ్రతను తెలిసిన గురువులు శిష్యులకు జపమాలను ఇచ్చుట సంప్రదాయము. ఇందుకు మాలాసంస్కారమనిపేరు.

## చిత్తజయోపాయములు

చిత్తజయమున కుపాయంబులు హఠయోగాది గ్రంథములలో ననేకంబులుండినను అతి జాగరూకతతో, సద్గురువులవారి యుపదేశప్రకారము అభ్యసించితేనే గాని యామార్గముగుండా శ్రమ కలుగకమానదు. ఇంగ్లీషుభాషయం దనేకపుస్తకములు ఇటీవల ప్రాణాయామాది మార్గంబుల మనస్సును జయించు ఉపాయములను గురించి వ్రాసియున్నారు. వాటియందు చెప్పిన ప్రాణాయామముల నభ్యసించను ప్రయత్నించితే కొందర కలుగవచ్చును. కొందరు అభ్యసించి కష్టము పడియున్నారు.

అనేక జన్మములయందును మనస్సు తానే అధిపతియని తప్పభిప్రాయమును చెందియుండి స్వేచ్ఛాసంచారము చేసి చేసి స్వతంత్రము చెందియున్నది గనుక అట్టి స్వతంత్రము మరువ చేయవలెనన్న ననేక కాలము పైవివరించిన యభ్యాసమును చేయుచురావలెను. ఒకానొకఁడు పదిసంవత్సరముల కాలము స్వేచ్ఛావిహారముచేసి తద్వారా దేహమునకు జబ్బు గలుగజేసికొని యుండును. అందువల్ల అనారోగ్య మధికమై వాతరోగము, కాళ్లు, కీళ్లు, నొప్పులు మొదలయిన జబ్బులను అనుభవించుచుండును. అట్టివాడు తనకు సంభవించిన అనారోగ్యతను పోగొట్టుకోవలెనని ఔషధములు పుచ్చుకొన ప్రారంభించును. ఒక వారము రోజులు ఔషధము పుచ్చుకొని తనకు ఆలోపలనే ఆరోగ్యము కలుగలేదని చింతించితే ఆరోగ్యము కలుగునా? పదిసంవత్సరముల కాలము కొంచెము కొంచెముగా నిరంతరము వృద్ధిపొందుచుండిన జాడ్యమునకు ఒక సంవత్సరకాలమైనను విరుగుడు ఔషధము

సేవన చేయవద్దా? ఈ విషయము దేహాధారులమైన మన కందఱి కును తెలిసినదే కదా. అదే ప్రకారము అనేక జన్మములయందు స్వేచ్ఛగా పోయిన మనస్సును నిరోధించుటకు దీర్ఘకాలము, ఎల్లపుడును, ప్రయత్నము చేయుచు రావలెను. దీర్ఘకాలమనగా ననేకసంవత్సరముల కాలము. ఎల్లప్పుడును అనగా చదువునపుడు గాని, జపముచేయునపుడు మాత్రముగాని కాదు. ఏపని చేయు చుండినను సరే అపుడంతయు. ఇదియే ఎల్లపుడు అని అర్థము. దుర్మార్గమునందు అభ్యాసపడిన గుఱ్ఱమును అతి జాగరూకతతో సవారిచేయువాఁడు నడ, గాలపు, కాంటరు ఇత్యాది గతిభేదము లతో గుఱ్ఱమును సవారిచేయుచుండినను ప్రతి నిమిషమును గుఱ్ఱము తనను క్రింద తోయునేమోయని అతి జాగ్రతగా నుండును కదా. ఆ విధమున మనస్సు మనను ఏకాలమందు ఏమార్చునో యని యతి జాగ్రతగా నుండవలయును.

చిత్తైకాగ్రత నారంభించువారికి కొన్ని శ్రమలు గలవు. మనుష్యులకు పిండాండమనియు లోకము (జగత్తు) నకు అండాండ మనియు పేళ్లు. అండాండము అను జగత్తుయొక్క మనోమయ కోశము అను సముద్రమందు ఎవడో ఒక జీవాత్మయొక్క మనస్సు నందు పుట్టిన మంచి తలంపులు అను అలలవల్ల, అదేవిధముగా దుష్టతలంపు లనునట్టి యలలవల్లకూడ స్తిమితము తప్పును అని చెప్పబడియున్నది కదా. ఆవాక్యములకు నిజమైన యర్థము ఏ మనగా—ఎక్కడనో యేవ్యూళ్ళోనో యెవడో ఒకఁడు ఏదో ఒక విధమున తలంపులను తలచిన ఆ తలంపులు ప్రతి తలంపును ఒకరూపమును దాల్చి వెంబడే ఆతలంపునకు అనుగుణమైన ధోఱ

చేతనము ఆరూపమందు ప్రవేశించి ఆచేతనము ఆ మనోరూప ముతో సహా జగన్మనోమయకోశము అను మహాసముద్రమందు అతివేగముతో విచ్చలవిడిగా సంచరించుచుండును అనియును, అట్లు సంచరించుసమయమందు ఆతలంపుతో సమానమైన గుణ ముగల తలంపులు తలచు స్వభావముగల జనులయొక్క మనస్సుల యందంతయు తనతో సమానమైన గుణముగల తలంపులను పుట్టించుచు, తనవంటిరూపములను అనేకములను, అట్టిరూపముల యందు నివసించగలచేతనము లనేకములను, పుట్టించుచుండు నని తాత్పర్యము. దివ్యజ్ఞానసమాజపువారి పుస్తకములలో నీరూపము లకు థాట్ ఫారమ్సు (Thought-forms) అని పేరు. మనము సదా కాలమును మనస్సునం దేదో యొక విషయము తలచుచుందుము. తలచు తలంపులన్నియు మన స్వంత తలంపులు కావు. ఇతరుల తలంపులు అనేకములు పుంఖానుపుంఖములుగా మన మనస్సునందు అనుమతి లేకయే ప్రవేశించును. మనస్సు నేకాగ్రముగా నుంచుట కారంభించు సమయమందు ఇట్టి పరుల తలంపులు అనేకములు మనకు విదితములగును. కనుక మనముగా ప్రయత్నపూర్వకముగా తలంచని తలంపులకు స్థలమియ్య కూడదు. అపుడే యేకాగ్రత సాధ్యము.

మరియు చిత్తైకాగ్రతకు కొంచెము ప్రయత్నము అవశ్యము. ఈప్రయత్నము మనస్సునకు సంబంధించిన ప్రయత్నముగాని దేహమున కేవిధమైన సంబంధమునులేదు. సంతోషము, దుః ఖము, కోపము మొదలగు గుణములు మనస్సునకు సంబంధించినవే యైనను స్థూలశరీరముకూడ ఆ యా గుణములు పుట్టినపుడు తనలో

నొక విధమైన మార్పును చూపును. సంతోషము కలిగినపుడు చిరునవ్వును ముఖమునందు శాంతియు కనపడును. కోపము వచ్చినపుడు ముఖమునందు రక్తమధికముగాఁ జేరి ముఖము మట మట లాడుచుండును గదా. ఇందువల్ల మనస్సునందుఁ బుట్టిన మార్పులు మనస్సులోనే నిలువక స్థూలశరీరమందు కూడ అట్టి మార్పులను చూపును అని తెలిసికొనవలెను. అదే విధముగా చిత్తైకాగ్రత నారంభించవలెనన్నపుడు స్థూలశరీర మొకవిధముగ బిగుతును చెందును. శరీరమందుండు మాంసకండలు బిగువెక్కి కనుబొమలు ముడిపడి ఎవనితోనో శత్రువుతో కొట్లాడ నుద్దేశించు వానివలె ముఖమునందును, శరీరమునందును, మెడయందును ఒక విధమైన బిగుతు గలుగును. ఇది కూడదు. కొంతదూరము అనగా పది నిమిషములు ప్రయత్నము చేయునప్పటికి మెడనరములును, వీపులోనును నొప్పి కలుగును. క్రమేణ తలనొప్పి పుట్టును. ఇట్టి దురవస్థల కవశ్యములేదు. శాంతముగా, సుఖముగా, సంతోషముగా ననుష్ఠాన మారంభించి నడుపవలెను. మనస్సును అంతకంటె బలశాలియైన కరణముచే జయించవలెనే గాని మనస్సునకంటె బలహీనమైన స్థూలశరీరముచే జయించుటకు సాధ్యముగాదు. గనుక స్థూలశరీరమందు వికారములు పుట్టకూడదు.

అధ్యాత్మ విద్యాధిగమః సాధుసంగమ ఏవ చ ।
వాసనాసంపరిత్యాగః ప్రాణస్పంద నిరోధనం ।
ఏతా స్తాయుక్తయః పుష్టా స్సంతి చిత్తజయే కిల ।

(జీవన్ముక్తివివేకము)

ఆత్మవిద్యా గ్రంథములను చదువుట, సత్పురుషులతో సహవాసము చేయుట, కామము, క్రోధము, మదము, మాత్సర్యము మొదలగు దుర్గుణములు మనసమీపమందు రానియ్యక తొలఁగించుట, ప్రాణాయామము, ఇవి మొదలయిన యుక్తులు చాల కలవు. ఈ యుక్తులలో ప్రాణాయామ మొక్కటి తప్ప మిగిలిన వేవియు భయోత్పాదకములు గావు. ప్రాణాయామము మాత్రము కొంచెము జాగ్రతగా నభ్యసించవలసిన విషయము గనుక ప్రాణాయామాభ్యాసము ప్రకృతమందు వదిలి మిగిలినయుక్తులను అభ్యసించ వచ్చును. హఠయోగరీతిన మనస్సును జయించు ఉపాయములను కొంత విచారింతము. తరచుగా హఠయోగమందు ప్రాణాయామము అనునది యొక ముఖ్యమైన యుపాయము. ఇది చాల దుఃఖమును కలుగజేయును. శిష్యునియొక్క గుణాగుణములను బహుకాలము గమనించుచువచ్చిన సంప్రదాయజ్ఞుఁడైన గురువుల్ల నియ్యబడిన రీతిని ప్రాణాయామాభ్యాసము చేయవలెను. వేరువిధముగా ననేక చిల్లర పుస్తకములలో చెప్పిన ప్రకారము ప్రాణాయామమభ్యసించితే దేహమునకు రుగ్మత కలుగవచ్చును. అజీర్ణము, తలనొప్పి, దుష్టస్వప్నములు, పిచ్చిపట్టుట, ఇట్టి దుఃఖములు కల్గుగ వచ్చును. జాగ్రతగానుండవలెను. రెండవది, హఠయోగులలో కొందరు స్వస్తికాది ఆసనముల గూర్చొని తమ యెదుట నొక శూలమును భూమియందు నాటి ఆ శూలమును రెప్పపాటు లేకుండ ఒకముద్రతో చూచు నభ్యాసము చేయుచుందురు. మరి కొందరు తమ యెదుట తెల్లనిగోడమీఁద నొకనల్లని చుక్క పెట్టి ఆ చుక్కను రెప్పపాటు వేయకయే చూచుచుందురు. ఈ

రెండు అభ్యాసములయందును చెరుపు నిష్కర్షగా కలదు. రెప్ప
పాటు లేక చూచుచుండునప్పటికి కండ్లు అలసటచెంది కండ్లలో
నీరుకమ్మును. అంతటితో నాయభ్యాసము వదలకనే యాచరించు
చుంటే కొన్నాళ్లకు కండ్లనరములు బలహీనములై వికారరూప
ములు కండ్లపడును. తలనొప్పి విడువదు. అట్టి తలనొప్పి మరవ
గొట్టుటకుగా బంగి మొదలగు ద్రవ్యముల నుపయోగించుదురు.
ఈ విధముగా చెడుపు కలుగును. హఠయోగాభ్యాసములు దేహ
దార్ఢ్యమును అనుసరించియుండును. మన యింట కట్టియుంచిన
ఆవు తన కట్టు వదుల్చుకొని పరువెత్తినపుడు ఆ యావును మరల
దాని స్థలమునకు చేర్చుటకు రెండుమార్గములు గలవు. అవియే
వన, మంచి లేత పచ్చి గడ్డిని ఆ యావునకు చూపి ఆ గడ్డియం
దలి మోహముచే నా యావు మన సమీపమునకు రాగా మెల్ల
మెల్లగా నా యావు కంఠమందు త్రాడు గట్టి త్రాటిగుండా దాని
స్థలమునకు తీసుకొని వెళ్లి కట్టుట యొక మార్గము. లేక మంచి
కఱ్ఱ చేతబూని ఆ యావును తరిమి తరిమి అది అలిసి నిలిచినపుడు
దానిని పట్టి కట్టు మార్గ మొకటి. ఈ రెండు మార్గములలో
మొదటి మార్గము యుక్తిమార్గము. అందువల్ల మనకుగాని
ఆవునకుగాని శ్రమలేదు. రెండవ మార్గము హఠమార్గము. ఆవు
నకు శ్రమ మనకు అతిశ్రమ. ఈ రెండవమార్గము సుఖదాయ
కము గాదు. కనుక చిత్తమును గూడ యుక్తిచే నిరోధించుట
యత్యావశ్యకము. అతిసులభము. ఆవునుపట్టి కట్టగోరినవాడు
తానుగాని ఆవుగాని శ్రమబడకనే పచ్చిగడ్డియొక్క సహాయముతో
ఆవును కట్టినట్లు ఆత్మవిద్యాభ్యాసము, సాధుసంగము మొదలగు

నభ్యాసములచే చిత్తము జయించుట యుక్తిసాధ్యము అని పేరు. అదే యావును కఱ్ఱతో కొట్టి అలిపించి తాను అలిసి పిమ్మట పట్టి కట్టినరీతి హఠయోగాభ్యాసములతో మనస్సును స్వాధీన పరుచుకొనుట. మనస్సునే స్వాధీనపరుచుకొందురో లేక పిచ్చి పట్టితే మనస్సును పోగొట్టికొందురో తెలియదు. ఇట్లు పిచ్చిపట్టి చెడిపోయిన వారనేకులు గలరు. సులభమై, శ్రమగాని చెరుపుగాని లేని మార్గమునే యవలంబించవలెను.

## చిత్తైకాగ్రతవలని లాభములు

లోకులు ఎవరో యే ఊళ్లోనో తలచినతలంపులు రూపములు గొని, జగన్మనోమయకోశమయిన మహాసముద్రమందు ఆ రూపములందు ప్రవేశించిన చేతనములతో సహ విచ్చలవిడిగా సంచరించుచు తమ స్వభావమువంటి స్వభావము గల తలంపులు తలచుయోగ్యత గలవారల మనస్సులయందు తమ స్వభావమువంటి తలంపులు పుట్టించును అని ౧౬౯ వ పుటలో చెప్పబడెను గదా. ఎప్పుడు మనయొక్క మనస్సు ఏకాగ్రతను చెంది యుండునో అప్పుడు జగన్మనోమయకోశమందు సంచరించు (థాటుఫారంసు) చేతనములచే ప్రాణమును పొందిన మనోరూపములు మనవద్దకు రావు. అదియెట్లన్న, నేకాగ్రతచెందిన మనస్సు జాగరూకతతోనుండును. గనుక ఆ దుష్టతలంపులు, మన సమీపమునకు రావు. ఒకానొకడు మిగులవెలగల ద్రవ్యములను తన యింటియందుంచికొని యుంటే కావలివార్లను నియమించి ద్రవ్యములను కాపాడుకొనును. కావలివారలు మేలుకొని యుండు సమయమందు

సాహుకారుని యింటిలో దొంగలు ప్రవేశించుటకు వీలుండదు. ఏకాగ్రత చెందిన మనస్సు కావలివానితో సమానము. ఇతరుల దుష్టతలంపులు చోరులతో సమానము. ఇతరుల దుష్టతలంపులు మనయొక్క మనస్సును ప్రేరేపించి దుష్టకార్యములు చేయునుద్యమమును కలుగజేయుట మానును.

మరియొక యుదాహరణమున్నది. అది యేదన: కుమ్మరవాని చక్రము అతివేగముతో తిరుగుచుండు సమయమందు మనమెవరైనను నొక రాతిని ఆ చక్రమునకు తగులునట్లు రువ్విన యెడల నా రాయి అతివేగముతో తిరుగుచున్న చక్రమునకు తగలగానే ఆ చక్రపువేగముచే రువ్విన వాని పార్శ్వమునకే తిరిగి వచ్చును.

ఏకాగ్రచిత్తము పరిపూర్ణముగాఁ జెందిన మనస్సు అతివేగముగా తిరుగుచున్న కుమ్మరవానిచక్రముతో సమానము. ఇతరుల దుష్టతలంపులు రాళ్లవంటివి. గనుక నేకాగ్రత చెందిన మనస్సుల యందు మన యనుమతిలేనిదే అవి ప్రవేశించవు. మోక్షాపేక్ష గలవారలు జపము, ధ్యానము, మొదలగు అనుష్ఠానములు చేయు వారల యనుష్ఠానములు పరిపూర్ణముగ సాధించను ఏకాగ్రచిత్త మత్యావశ్యకము. అటుగాక మోక్షాపేక్షలేక కేవల లౌకిక వ్యవహారముల లోనే ఆసక్తిగలవారలకు కూడ ఏకాగ్రచిత్త మత్యావశ్యకము. వ్యాపారము చేయువారయి ఏకాగ్రచిత్తముతో తమ లెక్కలను చూచుకొన్నట్లైతే తప్పులు కలుగవు. తాము క్రయమునకు తెచ్చుకొన్న సరుకులు నూర్లకొలది తమ అంగళ్లలో నుండగా వాటియొక్క వెలలు పుస్తకములు చూడకయే చెప్పగలరు. కేవలము ఐహికచింతతోనే యుండువారు ఏకాగ్ర

చిత్తముతో నొక పుస్తకము చదివినను ఆటపాటలు చూచినను అటుపిమ్మట ననేకసంవత్సరములు గడిచిన పిమ్మట కూడ ఏ నాటకపాత్ర మెక్కడ ఉండెను, ఎవడు ఏ పాటలు పాడెను అను మొదలుగా గల వివరములను చక్కగా జ్ఞాపకముంచుకొందురు. మరియు నేకాగ్రమైన చిత్తముతో మన స్నేహితులను తలచి ఏవైనను తలంపులను పంపితే ఆ తలంపులు అట్టిస్నేహితుల మనస్సులలో ప్రవేశించి తమను తమ స్నేహితులు తలచుకొనుచున్నారేమో అని అనుకొందురు. అది యెట్లంటే.—

## భావపరివర్తనము

ఇంగ్లీషులో "థాటుట్రాన్స్ఫరన్సు" అని చెప్పుదురు. "థాటు" అనగా భావము, "ట్రాన్స్ఫరన్సు" అనగా పరివర్తనము. అనగా మనయొక్క మనస్సులోని భావమును ఇతరుల మనస్సులో పలికి వారలకు తెలియకనే చొచ్చునట్లు చేయుట. ఇది భావపరివర్తనము. లోకులు ఒకరి యభిప్రాయములను గాని భావములను గాని యితరులకు తెలుప గోరినపుడు ఏ విధముగా తెలుపింతురని విచారింతము. (1) తన యభిప్రాయములను ఎదుటివానికి తెల్పవలెనంటే ఆ యభిప్రాయములు మనయొక్క మనోమయశరీరము నుండి స్థూలశరీరమందుండు వాగింద్రియమునకు దిగిరావలెను. పిమ్మట ఆయభిప్రాయము మాటలగా రూపెత్తవలెను. మొదటివాడు ఎదుటివానితో మాటలాడుట యొకరీతి. (2) లేక మొదటివాడు మొదటివానియొక్క సమక్షమమందు లేక దూరాన నుంటే తనమనస్సునందలి యభిప్రాయములును ఒక దూతగుండానో లేక

యొక యుత్తరము(జాబు)గుండానో తెలుపవచ్చును. (3) ఎదుటి వాడు అతి దూరాననుంటే సమాచార మత్యవసరమైతే, తంతి సమాచారము పంపవచ్చు. దీనినే టెలిగ్రాము అని వాడుదురు. (4) టెలిగ్రాములు పంపడమునకు తంతులు అవశ్యము. తంతుల యొక్క యొక కొనయందు సమాచారములను పంపువాడు కొన్ని గుర్తులుగల శబ్దములనుచేయును. ఆశబ్దములు తంతియొక్క కొనన నుండు ఆపీసులో విద్యుచ్ఛక్తివల్ల వినును. ఆశబ్దములను చేర్చి వ్రాసుకొని వానియొక్క అర్థమును ఒక సమాచారముగ వ్రాసి మనస్నేహితునికి టెలగ్రాపు ఆఫీసువారు పంపుదురు. (5) మరి యొక విధమైన టెలగ్రాపు కలదు. తంతులు లేని టెలిగ్రాపు అని పేరు. అది యెట్లన్న, ఒకానొక అత్యున్నత ప్రదేశమందు కొన్ని స్తంభములను కట్టి ఆ స్తంభములపైన విద్యుచ్ఛక్తి గల వస్తువులను ఉంచుదురు. ఆయున్నతస్థలమునకు సమీపమున భూమియందు ఒక గది కట్టి అందులో కొన్నివిద్యుచ్ఛక్తి యంత్రములను స్థాపించి కొన్ని సూదులను ఉంచుదురు. ఇట్లు అనేక స్థలముల యందు ఆపీసులు ఉంచుదురు. ఈ విధముగా భూమికి సమీప మందుండు గదిలోని విద్యుచ్ఛక్తియంత్రమందు మనమాటలకు ఏర్పడిన కొన్నిగుర్తులను కొట్టితే ఆగుర్తులు మనముండు స్థలమం దుండు ఆపీసునుండి వెడలి ఇతరస్థలములయందు ఉండు ఆపీసుల లోని సూదులను చలింపచేయును. ఆచలనములు అను సంజ్ఞలను మాటలగా వ్రాసికొని సమాచారములగా మార్చుదురు. ఇందుకు తంతులు అవశ్యములేదు. ఉన్నతప్రదేశములయందు అత్యున్నత ములైన స్తంభములు మాత్రము కొన్ని ఆవశ్యము. అనేక వేల

మైళ్లలో నుండి పై వివరించిన తంతె లేని టెలిగ్రాఫుల సమాచార ములు రావచ్చును. దూరము ఒక లెక్క కాదు.

తంతులు లేకయే విద్యుచ్ఛక్తి ఎవిధముగా నొక యూరి నుండి మరియొక యూరికిపోవునను ప్రశ్న మనస్సునందు కలుగ వచ్చును. అందుకు సమాధాన మేమన, విద్యుచ్ఛక్తి యనగా వర్షాకాలమందు మేఘడంబరసమయమందు మేఘముతో మేఘము తగిలినందున పుట్టు ప్రకాశమునకు మెరుపులు అనిపేరు. మెరుపులు అను మాటకు సంస్కృతమందు విద్యుత్ అని పేరు. మెరుపులు, మెరుములు, మించులు, అను పదములన్నియు నొకటే యర్థమును తెలుపునవి. ఆమెరుపులయందు ఒక శక్తికలదు. ఒక నిమిషమునకు అనేక వేల మైళ్ల దూరము పోవుశక్తి. విద్యుచ్ఛక్తి సర్వకాలమందును ఆకాశమందు నిండియుండును. పృథివీతత్త్వపు పంచీకృత భాగములలో పృథ్వీవాయువుతత్త్వముయొక్క ప్రకృతి ఆకాశమునందు నిండియుండును. పృథ్వీవాయువు అను ప్రకృతిపరి ణామము విద్యుచ్ఛక్తికి ముఖ్యమైన యుపాధి. మన యూరి యం దుండు ‹‹ తంతెలు లేని టెలిగ్రాఫు ’’ ఆఫీసునందు మనము చేయు చిహ్నములు మన యూరి సమీపమందుండు అత్యున్నత స్తంభ ములకు ఎక్కి అ స్తంభముల నావరించియుండు పృథ్వీఆకాశము అను తత్త్వభాగములో ప్రవేశించి ఒక నిమిషమునకు అనేక వేల మైళ్ల దూరమందుండు ‹‹ తంతెలేని టెలిగ్రాఫు ఆఫీసు ’’ స్తంభముల యొద్దకు పోయి అక్కడ నుండు ఆఫీసులోనుండు సూదులను కద లించును. ఆ ఆఫీసులోనుండువారు ఆ సంజ్ఞలను మాటలగా నర్థము చేసికొని సమాచారములను సిద్ధపరచి పంపుదురు. ఈ పై చెప్పిన

అయిదు విధములైన త్రోవలకును భౌతికవస్తువుల సహాయము కావలెను. భౌతికవస్తువులనగా మనయింద్రియములకు, ప్రకృతము ముఖ్యముగా కండ్లకు, గోచరమగు వస్తువులు. అదృశ్యమగు ద్రవ్యమైన మనస్సు చేతనే సమాచారములను పరివర్తనము చేయు త్రోవ యొకటి కలదు. పరివర్తన మనగా నొక స్థలమునుండి మరియొక స్థలమునకు మార్చుట. అదే పైన ప్రస్తావింపబడిన "భావపరివర్తనము". ఏకాగ్రచిత్తమును సాధించిన వారల భావములు, అనగా తలంపులు, అతి ఆభిరూప్యముచెందిన రూపములుగా కాగలవు. ఆభిరూప్యమనగా రూపము బాగుగా నేర్పడుట. ఆ విధమున నాభిరూప్యముచెందిన భావములు ఏకాగ్రచిత్తము సాధించినవాని మనస్సునందు పుట్టి, రూపెత్తి, అతడు ఉద్దేశించిన వారి మనస్సునందు ప్రవేశించును. వారలమనస్సులయందు ఆ భావము బాగుగా నేర్పడును. రామతీర్థుడను యోగాభ్యాసి యొకడు తన మనస్సును స్ఫుటముగా నేకాగ్రముగా చేసికొని వాని యింటియందు ఒక సమయమందు కూర్చుండును. అతని స్నేహితుడైన లక్ష్మణస్వామి యను మరియొక యోగాభ్యాసి అనేక నూర్ల మైళ్లదూరముననుండు తన యింటియందు అదే ఘంట, అదే నిమిషమందుకూర్చుండును. రామతీర్థుడును లక్ష్మణస్వామియు ఏతత్పూర్వమే నిబంధనలు జేసికొని ఫలానాఘంట సమయమునకు మన మిద్దరమును నొకగదిలో నేకాగ్రచిత్తులమై కూర్చొందము. ఒకరు తలచిన తలంపులు (భావములను) మరియొకడు తెలిసికొన ప్రయత్నముచేసి యేకాగ్రచిత్తుఁడై తన మనస్సును నిర్విషయముగా నుంచుకొందమని నిశ్చయించుకొందురు. ఇట్లు దృఢనిశ్చయులై కూరు

చున్న తరువాత రామతీర్థుడు ఒక భావమును తలచి దృఢముగా మరియొక తడవ తలచి లక్ష్మణస్వామి మనస్సులో చొప్పింపించును. రామతీర్థుడు తలంపులను తలచునపుడు లక్ష్మణస్వామి మనస్సును నిర్విషయముగా నుంచుకొనును. పిమ్మట లక్ష్మణస్వామి తన వంతున తలంపులను తలచి భావరూపములను రామతీర్థునికి పంపును. అపుడు రామతీర్థునియొక్క మనస్సు నిర్విషయముగా నుండవలెను. అట్లయితే లక్ష్మణస్వామి తలంపులను రామతీర్థుడు తెలిసికొనును. ఈ ప్రకారము రామతీర్థుడు లక్ష్మణస్వామి యను పేళ్లు వహించిన అభ్యాసకులు వారు వారు తెలిసికొనిన విషయములను ఒకరికొకరు టపాలా ద్వారా ఉత్తరము వ్రాసి సంతసింతురు. ఇది యభ్యాస మనబడును. ఇట్టి యభ్యాసము ప్రతిదినమును చేసి దృఢపడిన పిమ్మట తన మనస్సునందలి భావమును ఇతరులమనస్సులలో చొప్పింపజేయుట సులభముగానుండును. ఏకాగ్రచిత్తము అను శక్తిని సంపాదించికొనిన వారికే మనస్సును నిర్విషయముగా నుంచుకొనుట సాధ్యము కనుక ఏకాగ్రచిత్తము ముఖ్యసాధనము. యోగశాస్త్రమందు

పరేంగితజ్ఞానము

అని యొక సిద్ధినిగురించి చెప్పియున్నారు. ఏకాగ్రచిత్తము గలవారు తమ మనస్సును నిర్విషయముగా నుంచుకొన్నపుడు వారెవరి ఇంగితమును (భావమును అనగా తలంపును) ఎరుగవలెనని యనుకొందురో వారిభావము నిర్విషయముగా నుండు తమ మనస్సునందు ప్రవేశించును. ఉదాహరణము.—పోటగ్రాపు నెత్తు

వాడు తనయొక్క కామిూరా యను నద్దమును సిద్ధపరచియుంచి యుంటే ఆయద్దమునకు ఎదురుపడు ఏవస్తువైనను ఆయద్దములో, తన ఇష్టమున్నను లేకున్నను, తన రూపము ముద్రింపఁబడక నూరకుండును. ఆ విధముగా నిర్విషయమనస్సు పరుల ఇంగితము లను, అనగా భావములను, తలంపులను, తెలిసికొనవచ్చును. ఇదే పరేంగితజ్ఞానమనుసిద్ధి. ఏ విధముగానైతే లోకమునందు ఇతరుల యనుమతి పొందకయే వారల సొమ్ము మనస్వాధీనము చేసికొంటే అట్టి చర్యకు దొంగతనము అని పేరు వచ్చునో అదే విధమున పరేం గితజ్ఞానమును సిద్ధిని సంపాదించినవారలు ఇతరుల మనస్సులోని భావములను వారి యనుమతిలేనిదే గ్రహించకూడదు. గ్రహించితే సొమ్మును గ్రహించినపుడు ఏ విధముగా నది దొంగతన మనబడు నో అదే ప్రకారము ఇంగితాపహారము గూడ దొంగతన మగును. ఇది మహాదుష్కర్మ. అయితే ఈ సిద్ధిని లోకోపకారార్థముగా నుపయోగించ వచ్చును.

జీవాత్మ యజమానుడు. శరీరము ఒక రథమువంటిది. రథ మును ఆరోహించి యా రథస్వామిగా నుండు వాడు జీవాత్మ. రథ మునకు గుఱ్ఱములు కట్టుదురు గదా. ఆ గుఱ్ఱములే కదా రథ మును లాగునవి. గుఱ్ఱములకు కళ్లెములు వేసియుందురు. ఆ కళ్లె ముల చేతబూని సారథి గుఱ్ఱములను తోలును. అవి పరువెత్తగా రథము పరువెత్తును. రథమునెక్కిన యజమానుడు తన కార్యముల నెరవేర్చుకొనును. రథస్వామి జీవాత్మ, సారథి బుద్ధి, కళ్లెములు మనస్సు, ఇంద్రియములు గుఱ్ఱములు. అనగా మనస్సనునది యిం ద్రియములను సరియైన దారిన నడుపవలెను గాని ఇంద్రియముల

వెంబడి మనస్సు పరువెత్తకూడదు. అట్లు కాక గుఱ్ఱములు విచ్చ లవిడిగా పరువెత్తునపుడు సారథి కళ్లెముల లాగిపట్టక గుఱ్ఱములు పోవుదారిన పోనిమ్మని కళ్లెముల వదల పెట్టడు కదా. అదే విధ మున నింద్రియములను వాటి త్రోవన పోనియ్యక మనస్సు ఆ యింద్రియములను ఆపుటకు బుద్ధిసహాయము కావలెను. అందు వల్లనే "సర్వాదృష్టీః పరిత్యజ్య నియమ్య మనసా మనః" అని జ్ఞానవాసిష్ఠమందు చెప్పియున్నది. అనగా సర్వేంద్రియముల వ్యాపారములను వదలుమని మనస్సును మనస్సుచేత నియమించ వలె నని యర్థము. ఇంద్రియములను వాటి వ్యాపారములలో ప్రవేశించక నియమించి మనస్సు తానును బహిఃప్రపంచమందు వేటలాడబోకయే స్థిరముగా ఏ విధమైన చలనమైనను లేక యుం డుటకు నిర్విషయ మనస్సని పేరు.

నిర్విషయమైన మనస్సు నిశ్చలముగా ఫొటగ్రాపులు దీయు వాని పెట్టలోనుండు అద్దమువలె నెమ్మదిగా నుండును. ఫొటగ్రా ఫువాని యద్దము తానుకదలక ఊరకుండగా ఆ యద్దమున కెదురు గానుండు వస్తువుల బొమ్మలు ఆ యద్దమునందు ప్రతిఫలించునవి కదా. ఆ రీతిననే నిర్విషయముగా మన మనస్సున్నపుడు ఇతరుల మనస్సునందలి ఇంగితములు, అనగా భావములు, అట్లనగా తలం పులు కొంచమైనను శిథిలముగాకయే నిర్విషయమైన మనస్సునందు ప్రతిబింబించును. ఇదే పరేంగితజ్ఞాన మను సిద్ధి.

సహాయము చేయ బూనుకొనువానికి లోకు లందరును స్నేహితులే కదా. గనుక నతడు దుఃఖమునొందినవార్ల సమక్షమ మునకు వెళ్లను జంకవలసినది అవశ్యము కాదు. ఒకవేళ తాను

తన స్థూలశరీరముతో వారి సమీపమునకు వెళ్లను జంకినను తన యిల్లువిడిచి కదలకనే తాను తన సంకల్పరూపములు అను దూత లను లెక్కలేనన్నిటిని పంపి దుఃఖాక్రాంతుల మనస్సునకు శాంతి పుట్టునట్టు చేయవచ్చును. అది యేవిధముగానంటే సహాయము చేయ తలచుకొనువాడు తనయింట కూర్చొని మనస్సును ఏకాగ్ర ముగా జేసికొని ఎవరికి సహాయము చేయవలెనని యిచ్ఛయించు నో ఆ పురుషుడో, స్త్రీయో వారియొక్కరూపమును మనసా చింతించి తన మనస్సుతో వారి రూపమును చక్కగా భావించు కొనవలెను. పిమ్మట ఆ పురుషునియెదుటనుండి అతనికి తాను స్నేహితుడుగానుంటే ఏ విధముగా నిరాటంకముగా నతని రహస్య ములనుగురించి మాటలాడునో ఆ ప్రకారము తన మనస్సునందు నిలుపుకొన్న దుఃఖియొక్క రూపముతో అతిప్రేమ, ఆదరము, వీట్లను కనుపరిచి మాటాడవలయును. అట్లు మాటలాడుటకు నిర్ధారణచేయునట్టిసమయ మెటువంటిదిగా నుండవలెనంటే సహా యము పొందగల మనుష్యుడు కొంతవఱకు మనశ్శాంతితో నుండు సమయముగా నుండవలెను. అనగా పగట్లో మనుష్యు లందరును వ్యాపారవ్యాసంగములతో మునిగియుందురు. రాత్రి భోజ నానంతరము శయనించుటకు పూర్వము కొంతకాలము సుమారు అరఘంటసేపు శయనించుప్రయత్నములో నుందురు గనుక నా సమయము చాలమట్టుకును శాంతిసమయము. అట్టిసమ యమందు సహాయముచేయ నుద్దేశించిన యేకాగ్రచిత్తుడు ఆ దుఃఖిని తలచి ప్రేమించి, ఆదరించి, స్నేహించి, ఊరడించి తాను తన మనస్సునందు కట్టుకొనిన యాదుఃఖియొక్క రూపముతో తన

యూరడింపు మాటల నన్నియు మాటలాడవలయును. ఈకార్యము యొక్క ప్రయోజన మేమిగా పరిణమించు ననిన, దుఃఖియొక్క మనస్సునందు కొంత కొంతగా కొన్నాళ్లకు దుఃఖము తగ్గును. ఏమి యిది యాశ్చర్యము; ఈ విధమైన మన సహాయముతో నింత ప్రయోజనము కలుగునా యని శంకింపవలదు. ఇందుకు శ్రీమహా భారతము ఆదిపర్వమందు మరియొక విధమైనదృష్టాంత మున్నది. పాండవులును కౌరవులును శ్రీద్రోణాచార్యులవారివద్ద నస్త్ర విద్యాభ్యాసము చేయుచుండినపుడు ఏకలవ్యు డను బోయవా డొకడు అస్త్రవిద్యార్థియై ద్రోణాచార్యులవారి నాశ్రయించి అస్త్ర విద్య చెప్పియిమ్మని వేడుకొనెను. వారు విద్యను చెప్పి యివ్వ ననిరి. అంత ఏకలవ్యుడు తన యర్యణమునకు వెళ్లి అచ్చట ద్రోణాచార్యులవారి రూపమొక్కటి మట్టితో సిద్ధపరిచి ఆరూప మునకు పూజలుచేసి దానినే గురువుగా భావించి అస్త్రములు నభ్యసించుచు వచ్చి నిజమైన ద్రోణాచార్యులవారిగుండా వారి యొక్క శిష్యులు నేర్చుకొన్నవిద్యల నన్నిటిని తానును నేర్చెనని విందుముకదా. ఈ కథయందు ఏకలవ్యుడు ఏకాగ్రచిత్తుడై ద్రోణా చార్యులవారిని స్మరించి తాను లాభము పొందెను. అదేప్రకారము మనమందరమును ఏకాగ్రచిత్తత సంపాదించి పరహితమును చేయవలెను. ఎప్పుడైనను పరపీడనమునకు గాని స్వహితమునకు గాని మనశ్శక్తిని ఉపయోగించకూడదు. ఈవిధముగా పరులకు మితిలేనంత సహాయము చేయుశక్తిని, భూతానుకంపయను గుణము ను, ప్రియవాదిత యనుగుణమును అభ్యసించి పరమేశ్వరుని దూతలుగా ప్రచ్ఛన్నులుగా సేవించవచ్చును.

మనమందరమును పురుషోత్తముడైన ఈశ్వరునియంశలము అను సంగతిని నమ్మితిమంటే ప్రకృతము భూలోకములో నుండు జీవాత్మలందరును, మరణము చెంది భువర్లోకము, స్వర్గలోకము అనులోకములలో వసించుచుండు జీవాత్మలందరును అన్నదమ్ములే కదా యనునమ్మకము దృఢముగా నేర్పడవలెను. జాతి, కులము, గోత్రము, స్త్రీపురుషభేదము లన్నియు స్థూలశరీరమును అంటి యుండునవేగాని ఆత్మను ఆశ్రయించినవి కావు. గనుక చిత్తై కాగ్రతను సంపాదించికొనినవారు వాస్తవముగా, మాటలతో మాత్రము గాదు, భావమునందు సహ ఏకాగ్రచిత్తముతో "సర్వేజనా స్సుఖినోభవంతు" అని ప్రకృతము భూలోకమందు నివసించుచుండు జీవాత్మల నుద్దేశించియు, "లోకా స్సమస్తా స్సుఖినో భవంతు" అని భువర్లోక స్వర్గలోకములయందుండు జీవాత్మల నందర నుద్దేశించియు మనఃపూర్తిగా ప్రేమాదర ములతో దీవించవలెను. చిత్తైకాగ్రత పొందినవార లనేకులు రాజయోగులు ఈ ప్రకారముగా మనల నందరిని యెల్లప్పు డును దీవించుచుండువారు. అందువల్ల మనలకు సంభవించ వలసినచెరుపు కొంతమట్టుకు తగ్గును. మనమును అదేవిధముగా భ్రాతృభావము చూపవలెను. చిత్తైకాగ్రతనుగురించి యిక ముందు 'భక్తి' 'ధ్యానము' అను నధ్యాయములలో మరికొన్ని సంగ తులు వ్రాయబడును.

పైనచెప్పినరీతిగా మనస్సును నిలకడగా నొకవస్తువుపైన నిలిపినపుడు మనయుత్తరవు లేకనే మనస్సైనది ఆవస్తువును వదిలి వేరువస్తువులయొద్దకుగాని, విషయములవద్దకుగాని వెడలకనే, గాలి

లేనిస్థలమందు కదలకయే వెలుగుచున్న దీపమువలె స్తిమితముగా నుండును. ఆస్థితికే "మనోనాశము" అని పేరు.

యత్తు చంచలతా హీనం తన్మనో మృత ముచ్యతే ।
ఏతః ఏవ మనో నాశ స్త్వవిద్యా నాశ ఏవచ ।
యద్య త్సంవిద్యతే కించి త్త్రత్రాస్థా పరివర్జనం ॥

(జ్ఞానవాసిష్ఠము)

ఇందుకు తాత్పర్యము.—

చంచలత్వహీనము అనగా చంచలత్వము అను స్వభావమును పోగొట్టుకొన్న మనస్సును శాస్త్రజ్ఞులు "మృతం" చచ్చినది అందురు. అనగా అట్టిమనస్సు నశించినది అనబడును. అట్టిస్థితికే మనోనాశము అని పేరు.

ఒకానొకడు తనమనస్సును తాను జయించినాడా లేదా అని తనశక్తిని పరీక్షించవలె నని యభిలాష కలవాడైతే

త్యజ న్నభిమతం వస్తు య స్తిష్ఠతి నిరామయః ।
జితమేవ మన స్తేన బాహ్యప్రసర ముజ్ఝతా ॥

(జ్ఞానవాసిష్ఠము)

తనకు అదివరకును చాల యిష్టమైన పదార్థమును వదిలి యీవస్తువును వదలినానని ఎంతమాత్రమైనను చింతలేకయే యెవ డుండగలడో వానిమనస్సు నిజముగా జయింపబడినదే యని యర్థము.

మనస్సు ఈ ప్రకారము జీవాత్మకు స్వాధీన మైనపుడు జీవాత్మ తానై ప్రయత్నించి చింతించవలె నని యిచ్ఛయించిన విషయమునే చింతించును. ఒకానొకసమయమందు "బలవా నిం

ద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి ” యను వచనప్రకారము ఇంద్రియములు మహాబలము కలవి గనుక మనస్సు ఏమరియున్న సమయమందు మనస్సును విషయముల పార్శ్వమునకు లాగ వచ్చును.

ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః।

(శ్రీమద్భగవద్గీత)

ఇంద్రియములు నిలుకడ కలిగియుండనీయక క్షోభ కలుగచేసెడి స్వభావముగలవి. మనస్సును గూడ బలాత్కారముగా విషయములయందు ప్రవర్తింపను ఆకర్షించు స్వభావము కలవియని ప్రసిద్ధముగా తెలిసినవిషయము అని తాత్పర్యము.

ఇట్టి దురవస్థ ప్రాప్తించినసమయమందు జీవాత్మ తన ముఖ్యకరణమైన మనస్సును ఏకాగ్రపరిచి ఆ యింద్రియముల చేష్టలనుండి త్రిప్పి తన పురోవృద్ధి కభిమతముగ నుండు విషయమునందు నిలుకడగా నిలుపవచ్చును. ఇచ్చట నేకాగ్రతను సంపాదించిన ఫలము తెలియుచున్నది.

## దిగ్బంధము

దిగ్బంధము అనుశబ్దమున కర్థమేమనగా దిక్కులయందు బంధము. అనగా నొకానొకడు ఉండుస్థలమునకు చుట్టును ఒక రక్షాబంధము కట్టుట. రక్షాబంధము అనగా తనను తాను రక్షించుకొనుటకై తనకు చుట్టు ఒక గోడవలె నిగ్రహశక్తిగల ఒక పొలిమేరను కట్టుకొనుట. ఒకానొకడు చాల ధనమును పెట్టెలలో పెట్టికొనియుండే ఆ ధనమును ఇతరులు దొంగలించుకొని

పోక యుండునట్లు ఒక గదిలో పెట్టి తలుపు మూసి తాళము వేసి యుంచితే ఆ ధనము భద్రముగా నుండునుగదా. ఆ పెట్టెలు ఉండు స్థలమునకు నలుదిక్కులయందును గోడలు గట్టి భూమిదిశను భద్ర పరచి అదే విధమున పైదిక్కు అనగా ఆకాశము (మేఘముల మార్గము) నుండి కూడ దొంగలు రాలేకుండునటుల ఆ గోడలపై, దళముగ కప్పువేసియుంచితే ధనము ఉండు పెట్టెలు భద్రపరుపబడి నవి అనుకొనవచ్చును. అనగా ధనముగల పెట్టెలకు తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము, అధఃప్రదేశము, ఊర్ధ్వప్రదేశము అను అన్ని దిక్కులయందుండియు ఎవరైనను వచ్చి ఆ ధనమును స్పర్శించకుండునటుల భద్రపరచుట. స్వల్పమైన ధనమును గల వాడు ఆ ధనమును ఒక పెట్టెయందుంచి తాళము వేస్తే ఆ ధనము నకు దిగ్బంధము చేసినట్లు అర్థము. అదే విధమున ఒకానొకడు తనగదిలో కూర్చొని ఆ గదితలుపు గడియవేసికొని యితరులను రానియ్యక ఏదో ముఖ్యమైన హవ్యాసముతో నుంటే అతడు తనకు దిగ్బంధము చేసికొనియున్నాడు అనవచ్చును. అదే విధ ముగా మనస్త్రీలు అతి వెలగల నగలను ధరించి తాము నిద్రించు సమయమందు ఒకగదిలో ప్రవేశించి ఆ గదియొక్క తలుపును గట్టిగా భద్రపరుచుకొంటే దిగ్బంధము చేసికొన్నార నదగును.

లేక మానవంతులయిన స్త్రీలుగాని పురుషులుగాని తమ వద్ద ధనములేకపోయినను ప్రతిమనుష్యునకును స్వభావతః పుట్టి యుండు మానధనము ఏ పురుషుడైనను స్త్రీయైనను అపహరించగల ప్రయత్నములు చేయునట్లు తమకు తెలిసినట్లైతే అట్టి దుర్మార్గులు తమను స్పర్శించుటకు అనుకూలము లేకుండునటుల తాము ఒక

గదిలో దూరి తలుపును భద్రపరిచికొంటే తాము దిగ్బంధము చేసికొన్నట్లు అర్థము.

అథవా ఒక మహామంత్రమును జపించువాడు ఆమంత్రము యొక్క ప్రయోజనము పొందను ఆశించితే అట్టి ప్రయోజనమునకు విఘ్నము కలుగచేయవలెను అను ఉద్దేశమును మాత్రమే మనస్సునందు గల దుష్టచేతనములు తనయందు ప్రవేశించిగాని తనసమీపమునకు వచ్చిగాని ఆ మంత్రప్రయోజనమును తనకు అందనీయక చేయుట అసాధ్యమగునట్లు తనచుట్టు మెంటల్ ప్లేను అణువులతో ఒక వలయమును ఏర్పరచుకొనుటకు దిగ్బంధము అని పేరు.

ప్రతిమంత్రమును జపముచేయువాడు అంగన్యాసము, కరన్యాసము, రక్షా, దిగ్బంధము, ధ్యానము అను నంశములను అనుష్ఠించును అని యింతకు ముందే చెప్పబడెను కదా. ప్రతిమంత్రముయొక్క యుపాసనావిధానమునందును "ఇతి దిగ్బంధః" అని యొక యంశము కలదు. పైవివరించిన ప్రకారము దుష్టచేతనములు తనయొక్క మనస్సున ప్రవేశించనీయక చేయు బందోబస్తుకు దిగ్బంధము అని పేరు.

దుష్టచేతనములలో ననేకజాతులు గలవు. శ్రేష్ఠమయిన మంత్రములను జపముచేయునపుడు ఆ మంత్రముల ప్రభావమువల్ల లోకమందలి దుర్మార్గస్వభావము గల చేతనములకు శ్రమ కలుగును. అట్టిశ్రమకు కారణమైన మంత్రమును జపము చేయనీయక అభ్యంతరము కలుగజేయుట దుష్టచేతనముల కభీష్టము. గనుక మనము చేయు జపములకు ప్రత్యవాయము కలుగచేయు చెడ్డచేత

నములు ఒక జాతివి. మనము జపతపములు కొద్దిగా జేసి తన్మూల ముగా కొంతమట్టుకును సత్త్వగుణము నార్జించుకొని యున్న యెడల అంతమాత్రమునకే మనయందు విరోధమును చూపుచు మనయొక్క సత్త్వగుణమును శిథిలపరచుటకుగా మన మేమరి నిద్రపోవుసమయమున మనశరీరమునందు ప్రవేశించి చెడుపు కలుగజేయు నుద్దేశముగల చెడ్డచేతనములుగూడ కొన్ని గలవు. కనుక కొంత మట్టుకు మనము చెడ్డచేతనములబాధను నివారించు టకై రాత్రులయందు నిద్రించుటకు ముందు దిగ్బంధము చేసికొని నిద్రించుట యొక సంప్రదాయము.

మరియు దుశ్చేష్ట లగు కల్లు, సారాయి, నల్లమందు, భంగి మొదలగువాటిని యుపయోగించుట, వ్యభిచారము మొద లగు దుర్నడతలకు లోబడుట, మొదలుగా గల దుస్స్వభావములు గలిగియుండి తనను తాను దిద్దుకొనుటకు ప్రయత్నపడువారలు ప్రాయశః దుష్టచేతనములబాధలకు భయపడవలసినది. దుష్కార్య ములు చేయుచున్నకాలమందు భువర్లోకసంచారులగు దుష్టచేతన ములు దుస్స్వభావముగలవానికి సహాయభూతములుగా నుండిరి. చెడ్డపనులు మానుకోవలె నని ప్రయత్నముచేయ నారంభించ గానే ఆ చెడ్డచేతనములకు ఇన్నాళ్లును ఆశ్రయముగా నుండిన దుర్మార్గుడు సన్మార్గము నవలంబించితే తమకు ఆశ్రయము లేక పోవునుగదా యని దుఃఖించు చేతనములు అతని ప్రయత్న ములను కొనసాగనీయక చేయు నుద్దేశముతో సకల ప్రయత్నములు చేయును. పై ప్రస్తావించిన చెడ్డచేతనములు దుర్మార్గమువదలి సన్మార్గము నవలంబించువాని శరీరములకు కీడును కలుగజేయును.

గనుక మహనీయులగువారు అట్టివారికి క్షేమము కలుగజేయవలె నని దిగ్బంధముచేసి బలహీనులను కాపాడుదురు. దిగ్బంధమునకు కవచము అనియును పేరు.

కవచము అనగా నొకవిధమైన అంగసంరక్షణవస్తువు. వీరులు యుద్ధరంగమందు ప్రవేశించు సమయమందు శత్రువుల బాణములు గాని, కత్తులు, కటారులు, ఈటెలు, బల్లెములు మొదలగు పదును ఆయుధములుగాని తమ శరీరములకు తగిలి అవి తమ చర్మమును భేదించి గాయపరచనీయకుండునట్లు కత్తులు మొదలగు నాయుధముల కభేద్యమైన లోహము తమ శరీరమునకు అంగీవలె చేయించి ఆ అంగీని తొడుగుకొని కృపాణహస్తులై యుద్ధరంగములోనికి వెళ్లుట పూర్వాచారము. ఆధునిక కాలమందు కూడ ఈ యభ్యాసము ఉన్నది. మన కండ్లకు అగపడు శత్రువులు భౌతిక శత్రువులు, దృశ్యశత్రువులు, అనియును వారల ఆయుధములకు భౌతిక ఆయుధములు, దృశ్యఆయుధములు, అనియును పేళ్లు. దృశ్య (కనబడు) శత్రువులయొక్క దృశ్య (కనబడు) ఆయుధములను నిరాకరించుటకు వీరులు దృశ్య (కనబడు) కవచములను ధరించిరి. దుర్మార్గచేతనములు అదృశ్యములు. మన కండ్లకు కనబడవు. గనుక మనము ధరించు కవచములు అదృశ్యములుగా నుండవలెను. ఇట్టి అదృశ్యములైన కవచములను తమ శిష్యులయొక్క శరీరములను ఆవరించునటుల కట్టునట్టి గురువులగు పెద్దవారు తమయొక్క చిత్తములను ఏకాగ్రపరిచికొని ఆ మనస్సుతో కవచమును చింతించి చింతించి జగన్మనోమయకోశముయొక్క అణువులతో నొక కవచమును కట్టుదురు. జగన్మనోమయ

కోశముయొక్క అణువులు మహర్లోకము లేక స్వర్గలోకము యొక్క అణువులు. ఇవి అతి బలవంతములు. మనోమయకోశపు అణువులకంటెను బలహీనములైన స్థూల అణువులు మనోమయ కోశపు అణువులతో నేర్పరచబడ్డ కవచమును భేదించుకొని ప్రవేశించ చాలవు. చెడ్డస్వభావముగల అదృశ్యచేతనములయొక్క శరీరములు భువర్లోకపు అణువులతో కట్టబడినవి. మహర్లోకస్వర్గలోకముల అణువులకంటె భువర్లోక అణువులు స్థూలములు. మహర్లోక స్వర్గలోక అణువులతో కట్టబడిన కవచములు భద్రములు.

కవచములను మహానీయులు కట్టి శిష్యులకు భద్రము కలుగజేయుట యొకవిధము. శిష్యులే అనగా మనవంటివార్లమే కవచములను కట్టుకొనుట మరియొకవిధము. నారాయణ కవచము, శివ కవచము, అను పేళ్లను వినుచున్నాము గదా. నారాయణ కవచమునకు గాని, శివ కవచమునకు గాని, సంబంధించిన మంత్రములు చాల మట్టుకు అచ్చుపడియున్నవి. అయితే మంత్రముల పదములు మాత్రము కవచములు కావు గదా.

అకృత్వా శత్రుసంహారం అగత్వాఖిలభూశ్రియం।
రాజాహం ఇతి శబ్దాన్నో రాజా భవితు మర్హతి॥

అనగా నొకానొకడు తనను లోకులు రాజు అని వ్యవహరించవలెనని యాశ గొన్నయెడల అతడు రాజ్యము సంపాదించుకొని శత్రు రాజులను యుద్ధమందు ఓడించి వార్లవల్ల కప్పములు గొంటేనే గాని వృథా పేరునకు మాత్రము నేను రాజును అను కొన్న మాత్రాన రాజు కాచాలడు అని వివేకచూడామణి యను గ్రంథమందు చెప్పఁబడియున్నది.

అనగా తాత్పర్యము—వృథామాటలతోనే గాక వస్తుతః సహా కవచ ముండవలెను. పండితులును భక్తులునగు ననేకుల యభిప్రాయమందు కవచమంత్రములను చదివినంత మాత్రముననే కవచమువల్ల కలుగు లాభములు కలుగునని నిశ్చయము. అట్లు కాదు. కేవల మంత్రపారాయణమువల్ల యత్కించిత్ ప్రయోజన ముండవచ్చును గాని కవచధారణము వల్ల కలుగునంత ప్రయోజన ముండదు. కవచమును గురించి చెప్పు మంత్రములలో ఫలితార్థ శ్లోకములయందు "యస్సదా ధారయే న్మర్త్యః శైవం కవచ ముత్తమం" అనియు "స్థితే చ కవచే దేహే" "వీరశ్రేష్ఠో వీర భద్రో బభూవ ధారణాద్యతః" "యద్ధృత్వా వామదేవశ్చ దేవల శ్చ్యవన స్స్వయం" ఇది మొదలగు విధములుగా కవచ ధారణ మును గురించి చెప్పబడి యున్నది. ధారణము అనగా మనము అంగీ తొడుగుకొన్నట్లు ఒక వస్తువును సిద్ధపరచి తొడుగుకోవలె నని యర్థము. ఇందును గురించి దివ్యజ్ఞానసమాజపు పుస్తకముల యందు చాల విపులముగా వ్రాయబడి యున్నది. సర్వ విధము లైన కవచములును కట్టుకోవలసినందుకు ముఖ్యమైనది అంతఃకరణ శుద్ధి, చిత్తైకాగ్రత, భూతానుకంప, మొదలగు పరోపకార చింతా రూపకములైన తలంపులు. అన్ని కవచముల కన్నను పరిశుద్ధాం తఃకరణము, భూతహితేచ్ఛ మొదలగు మంచి గుణములు శ్రేష్ఠ ములు. కనుకనే "సర్వభూత హితే రతాః" మొదలగు విధ ములుగా నుపదేశ మియ్యబడినది. పరిశుద్ధాంతఃకరణులు దైవ భక్తిని ముందిడికొని గురువుల వారియనుజ్ఞ పొంది కవచములు కట్టి ధరించుకోవలెను. కేవల కవచమంత్రపారాయణము మా

త్రము చాలదు. కవచములను కట్టు విధములను గురువులగుండా ఉపదేశము పొందవలెను.

సంఘే శక్తిః కలౌ యుగే

అనగా కలియుగమునందు సంఘమునందు శక్తి యున్నది. సంఘమనగా అనేకులు ఏకగ్రీవముగా ఏకోద్దేశముతో చేరి పని చేయుట. ఇట్లు పలువురు ఏకాభిప్రాయముతో చేరి జరుపు నుద్యమములకు సమాజములు, సొసైటీలు, అని సంజ్ఞా వాచకములు. బ్రహ్మవిద్యా సమాజము, ప్రార్థనసమాజములు, అని అనేక విధములైన సమాజములు వేర్వేరు ఉద్దేశములతో నేర్పడియున్నవి.

అనేకులు ఏకగ్రీవముగా, ఏకాభిప్రాయముతో చేరి యేదో ఒక కార్యము చేయవలెనన్న అందుకు ముందుగా ఆ సమాజపువారందరును ఒక స్థలములో ఒక సమయమందు చేరి తాము చేయవలెనని యుద్దేశించి యుండు కార్యము సఫలము కావలెనని ఏకాభిప్రాయముతో చింతించి, చింతించి, తాము చేయబూనుకొన్న కార్యము అనుకూలించవలెనని ప్రార్థన చేయుచు అదే సమయమందు తాము చేయనుద్దేశించిన కార్యము తమ యుద్దేశప్రకారము సిద్ధించినట్లు భావించుకొని అట్లు సిద్ధించినందుకు పరమేశ్వరునికి కృతజ్ఞతను చూపి, నాటిమట్టుకు పైచెప్పిన జపచర్యను నిలుపవలెను. మరల మరుసటిదినము ముందుదినమున చేరినట్టే అందరును కూడి ముందు దినమున జరిపిన ప్రకారమే జపము చేసి మనోమయరూపములను పుట్టించవలెను. ఇట్లు జాగరూకతతో కొన్ని మాసముల కాలము జరుపుచు వచ్చి తరువాత కార్యము

నారంభించిన యెడల ఆ కార్యము అతిశీఘ్రములో తమ యిష్టాను సారము అనుకూలించును. దేవాలయముల జీర్ణోద్ధారములు, దుర్నడతయందుండు జనులను దిద్దుట, మొదలగు ప్రయత్నములు పైవివరించిన సంఘసంకల్పమువల్ల సిద్ధించును.

సంఘసంకల్పసమాజమందు చేరిన వారందరును ఒకచే స్థలమందు కూడవలెనను నవశ్యము కూడ లేదు. వారు వారు వారి వారి యింట్లో కూర్చొని జపము చేయవచ్చును. అయితే అందరు నొకచే సమయమందు అనగా ప్రతి నిత్యమును ఉదయము తొమ్మిదిఘంటలకు ప్రారంభించుట అంటే అదే తొమ్మిదిఘంటలకు ప్రతి నిత్యమును ప్రతి వాడును సంఘసంకల్పమును ప్రారంభించవలెను. మరియు నొకరు ఏవిధముగా తలచుచున్నారో అదేవిధముగా నందరును తలవవలయును. ఇట్లు ఒకచే సమయమందు సంఘసభ్యులందరును వారి వారి యింట గూర్చొని విసుకు చెందక బహుదినములు జపము చేయుచురాగా ప్రతి జప్తయొక్కయు సంకల్పరూపములు (thought forms) అనేకములై శక్తిమంతములై, తుల్యరూపములుగలవై, తుల్యస్వభావవంతములై మరియు తుల్యశక్తిమంతములునై అవి గుంపులు గూడి సభ్యులు ఉద్దేశించిన కార్యమునకు తోడ్పాటులై ఆ కార్యములను చెడుప తలచిన వార్లను ఆవేశించి విరోధభావములను ప్రబల నీయకయు, సహాయభావమును పుట్టించియు ఉద్దేశమును నెరవేర్చునట్లు చేయును. ఇది మా అనుభవము. ఎవరైనను ప్రయత్నము చేసి పరీక్షించవచ్చును. చీమల బారి దినప్రతిదినమును ఒక బండపైననడుచుచు రాగా బహుకాలమిట్లు నడిచిన పిదప

ఆ బండపైన చీమలబారి నడిచిన గుర్తు ఏర్పడునని లోకోక్తి. అదే విధముగా నేకాభిప్రాయము గలిగి, ఏకోద్దేశముతో, ఏక కాలమందు, ఏక విధమైన, యుద్యమము చేయువారు చీమలవలె బలహీనులైనను వారు చేయబూనుకొన్న కార్యమున కెన్ని ప్రత్యవాయములున్నను అవి యెంత బలవంతములైనను మహాకాఠిన్యముగల రాతిబండమీాద గుర్తులేర్పడినట్లు అనగా బలహీనములైన చీమలశక్తికి రాతిబండ దోవ యిచ్చినట్లు ఆటంకములన్నియు తొలగి పోవును. ఉద్దేశించిన కార్యము సిద్ధించును.

ఈ విధమున సంఘసంకల్పశక్తిచేత లోకులకు తాము చేయగోరిన యుపకారములను చేయవలయును. ఇది భ్రాతృభావము.

---

## ౬ వ యధ్యాయము

స్తోష్యే భక్త్యా విష్ణు మనాదిం జగదాదిం।
యస్మి న్నేతత్సంసృతిచక్రం భ్రమతీత్థం।
యస్మిన్ దృష్టే నశ్యతి తత్సంసృతిచక్రం।
తం సంసారధ్వాంతవినాశం హరి మీడే॥



### సంసారచక్రము

ఇంతకుముందు ౩౧ వ పుటలోనును మరియు నితర స్థలముల యందును చెప్పిన ప్రకారము సత్యమైనవస్తువు అగు పరబ్రహ్మ యొక్క అంశమైన జీవాత్మ పాంచభౌతికప్రపంచమైన క్రీడారంగ మునందు ప్రవేశించి అందలి యనుభవముల నన్నిటినిని పొందు టకుగా జీవాత్మ యను పేర ప్రయాణమారంభించెను. మనుష్యే తర శరీరములయందు అతిదీర్ఘకాలము బహుదీర్ఘయాత్ర చేసి మనుష్యశరీరమందు ప్రవేశించె నని చదివితిమి. పరమేశ్వరుడు అనేకరూపములను సృష్టించి ఆ రూపములతో తృప్తిచెందక "బ్రహ్మావలోకధిషణం" బైన మానవరూపంబును సృష్టించి ఆ రూపమునందు తన కళయైన జీవాత్మను ప్రవేశపెట్టెననియు చదివి తిమి. మనుష్యరూపధారులైన జీవులు వారి లేతతనమునందు

దేవతల సహాయమువల్ల కల్పవృక్షము, కామధేనువు, ఇట్టి వస్తువులగుండా జీవించుచు వచ్చి త్రేతాయుగాదియందు "హస్తసిద్ధి" యను శక్తిని పొంది. తమచేతులగుండా వ్యవసాయము, మొదలగు పనులు చేసి జీవనము సంపాదించుకొనిరనియు చదివితిమి. మనుష్యకోటియొక్క క్షేమము నుద్దేశించి శ్రీ స్వాయంభువమనువుగారు ధర్మశాస్త్రములను రచియించిరనియు చదివితిమి. ఈ ధర్మశాస్త్రముల ప్రకారము మనుష్యులను ప్రవృత్తిమార్గమునందు నడిపించి ఆవల నివృత్తిమార్గమునకు సిద్ధపరుచుటకు (౮౦౦౦౦) యెనుబది వేలమంది ఋషులను మహర్లోక జనలోకములయందుంచిరనియు చదివితిమి. ఇంతే కాక స్వాయంభువగు బ్రహ్మయొక్క మానస పుత్రులు అనేక ఋషులతో సహా శ్రీ సనత్కుమారులవారి యధికారమునకు లోబడి "మహాపీఠము" అను నొక సమాజముగా నేర్పడి శంబళగ్రామమందున్నారనియు, ఆ పీఠమునందలి ఋషులు లోకక్షేమమునకు కావలసినన్ని ప్రయత్నములను చేయుచునున్నారనియును, లోకమందు ఏ దేశమందైనను ఏర్పడునట్టి రాజులందరును శ్రీ మహాపీఠముయొక్క ఆజ్ఞానువర్తులైన బొమ్మలనియు చదివితిమి. "తేన వినా తృణమపి న చలతి" అను వాక్యము శ్రీమహాపీఠాధిపతియగు మహానుభావున కన్వయించును. ఇట్టి మహాపీఠానురక్షితులమైన మనము అనగా జీవాత్మలము "బ్రహ్మవలోకధిషణు" లు కావలెననునది మన జన్మముయొక్క ఉద్దేశము. ఇట్టి యనల్పప్రయత్నమును జరిపి ఫలము పొందుటకు చాలకాలముకావలెను. అయితే ౯౨ వ పుటయందు చెప్పిన ప్రకారము ఈ స్థూలశరీరము అల్పాయుస్సుగలది. ఉద్దేశము బహు

దొడ్డది. కనుక ఒక స్థూలశరీరమునందే ఈ ప్రయత్నము కొన సాగదు. నూరుపుటలు వ్రాయవలెననువాడు ఒకటికంటె నధిక ములైనన్ని పెనసలులను ఉపయోగించవలసినది. అటుల అనేకతడ వలు స్థూలశరీరములను పొంది ప్రయత్నముచేయుచురావలెను. స్థూలశరీరము సంపాదించుకొనుచర్యకు "జననము" అని పేరు. స్థూలశరీరము రాలిపోవును అను చర్యకు "మరణము" అని పేరు. ఇట్టి జననము, మరణము, అను అవస్థలు స్థూలశరీరమునకు మాత్ర ముకాదు. కామమయశరీరము (౧౩౩ వ పుటచూడుడు), అశుద్ధ మనోమయశరీరము (౧౪౧ వ పుటచూడుడు), అను రెండు శరీర ములకుకూడ కలదు.

పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనం।

మరల పుట్టుట, మరల చచ్చుట, మరల మాతృగర్భమునందుం డుట, యని యర్థము. కనుక అనేకతడవలు జన్మమెత్తుట అనేక తడవలు మరణముచెందుట యనునది నిశ్చయము. ఇట్లు మరల మరల చేయుపనికి చక్రసేవ యని పేరు. బండ్లు నడుచునపుడు చక్రములు తిరుగుచుండును. ఒక నిమిషము అత్యున్నతస్థితిలో నుండిన చక్రభాగము మరియొకనిమిషమునందు అడుగుభాగముగా నగును. అడుగుభాగముగానుండినది పైభాగమగును. ఈ చర్యకు సరణము అని పేరు. సమ్యక్సరతీతి సంసారః. లేక ఒక చీమ చక్రముయొక్క కట్టువెంబడి నడుచుచున్నయెడల ఆరంభమెక్కడ కొనయెక్కడ నని తెలియక సంచరించునట్లు జీవాత్మ సంసార చక్రమందు సంచరించుచుండును. "ఆవర్తాంతర కీటవత్" అని యుపనిషత్తులలో చెప్పియున్నది. సంసృతిచక్రము లేక సంసార

చక్రము అనగా సంసారము అను చక్రము. "సంసరతి అనయా జీవః ఇతి సంసృతిః అహంకారాదిప్రపంచః, స ఏవ చక్రం భ్రమతి ప్రత్యహం ఆవిర్భావతిరోభావాభ్యాం పునః పునః ఆ వర్తతే" అనగా అహంకారతత్త్వము మొదలు పృథివీతత్త్వము వరకును గల తత్త్వముల మేళనమువల్ల సృష్టియయిన లోకములు చక్రము అనబడును. ఈ చక్రమునందు సంచరించుటకు సంసృతి యని పేరు. ఈ చక్రమునకే

సర్వాజీవే సర్వసంస్థే బృహంతే తస్మిన్ హంసో భ్రామ్యతే బ్రహ్మచక్రే।

బ్రహ్మచక్రమనియు పేరు (౨౨ పుట చూడుడు). ఈ పెద్దచక్రమునందు ఏడుప్లేనులున్న వని (౧౧౯ వ పుట) చెప్పబడెను. అందులో మనుష్యశరీరధారులైన జీవాత్మకోట్లు మూడుప్లేనులలో మాత్రము తరుచుగా యాత్ర జరుపుదురు. పాంచభౌతికప్రపంచమునందు అనుభవసంపాదనార్థము కొన్ని తురీయాత్మలు (ప్రజ్ఞానాంశువులు) బయలు వెడలిన వనియును అనేక ప్రజ్ఞానాంశువులు బయలువెడలక వారున్నలోకమందే యుండిరనియు నిదివరకును చెప్పబడియె. అనుభవసంపాదనార్థము బయలువెడలిన తురీయాత్మలలెక్క ఆరువేలకోట్లు అనియు వింటిమి. ఈ ఆరువేలకోట్ల లెక్కగల జీవాత్మలయందరినిని దివ్యదృష్టిగలవారలు "మెంటల్ ప్లేను" యొక్క ఉన్నతభాగము అయిన మూడు (౧౪౧ వ పుట చూడుడు) సబుప్లేనులలోనున్నట్లు చూడగలవారు. జీవాత్మలయొక్క నివాసస్థలము తరుచుగా "మెంటల్ ప్లేను" యొక్క ఉన్నతభాగ మగు మూడు సబుప్లేనులు. ఈ భాగమును దివ్యజ్ఞానసమాజపు పుస్తకములలో (Higher Mental Plane) హైయర్

మెంటల్ ప్లేను అను పేర వాడుదురు. జీవాత్మ ఊహాపోహావిచ క్షణుడై తత్త్వార్థ సంవేదనము, యథార్థసంభాషణము, భూత హితము, మనస్సును జయించుట, అధ్యాత్మవిద్యా శ్రవణము, అమాత్సర్యము, దుష్కార్యములు చేయమి, ద్వంద్వసహిష్ణుత, ఈవి, ఇంద్రియనిగ్రహము, మొదలగు సద్గుణములను సంపాదించి వాని అభ్యాసబలమువల్ల

> క్రోధః కామో లోభమోహౌ వివిత్సా-
> కృపా-సూయా మానశోకౌ స్పృహాచ ।
> ఈర్ష్యా జుగుప్సా చ మహాగుణేన
> సదా వర్జ్యా ద్వాదశైతే నరేణ ॥

(సనత్సుజాతీయం)

క్రోధము, కామము, లోభము, మోహము, విషయాసక్తి, దయా రాహిత్యము, పరులయందుండు సద్గుణములను అలక్ష్యముగా వా డుట, ఆత్మస్తుతి, చింతావిలాపనులు, విషయభోగేచ్ఛ, ఈర్ష్య (ఇతరుల ఐశ్వర్యమును చూచి ఓర్వలేమి) మొదలగు దుర్గుణము లను జయించు రీత్యా సాధనచతుష్టయ సంపత్తిని చెంది సద్గురు వుల నాశ్రయించి తారకోపదేశసహితదీక్షావంతులగునంతవరకును జీవాత్మలకు "హైయర్ మెంటల్ ప్లేను" అని దివ్యజ్ఞానసమా జపు గ్రంథములయందు వాడునట్టి మహర్లోకమే నిత్యవాసస్థాన ము. జీవాత్మ నిత్యవాసస్థానమునుండి బయలువెడలి "లోయర్ మెంటల్ ప్లేను" అను స్వర్గలోకమునకు దిగి అచ్చట అశుద్ధ మనోమయశరీరమును కట్టుకొని (౧౧౦ వ పుటచూడుడు) "ఆస్ట్రి ల్ ప్లేను" అను భువర్లోకమునకు దిగి అచ్చట కామమయశరీర

మును కట్టుకొని పిమ్మట "ఫిజికల్ ప్లేను" అను భూలోకమునకు దిగి స్థూలశరీరమందు వసించుటకు ప్రారంభించును. మనమందర మును ఈ ప్రకారముగా వచ్చినవారమే. సంసారచక్రమందు అర్ధవర్తులమును నడచినవారము. మనము మరణముచెందునప్పుడు స్థూలశరీరమునువదిలి, కొంతకాలము కామమయశరీరమునందుండి భువర్లోకానుభవములను ముగించుకొని కామమయశరీరమును వదిలి అశుద్ధమనోమయశరీరవాసులమై స్వర్గలోకానుభవములను ముగించుకొని అశుద్ధమనోమయశరీరపాతానంతరము మహర్లోకమగు హైయర్ మెంటల్ ప్లేనును చేరుదుము. ఈ విధమున సంసారచక్ర మను వర్తులమునందు రెండవ సగమును నడిచినవార మగుదుము.

పైన చెప్పిన విధమున సంసారచక్రమునందు ఏడు మజిలీ లున్నవి.

౧. హైయర్ మెంటల్ ప్లేను అను నివాసస్థలము, మహ ర్లోకము.

౨. ప్రయాణోన్ముఖులై (ఆవిర్భావమందు) లోయర్ మెంటల్ ప్లేను అను స్వర్గలోకము.

3. ప్రయాణోన్ముఖులై (ఆవిర్భావమందు) ఆస్ట్రిల్ ప్లేను అను భువర్లోకము.

౪. భూలోకమందు జననము-వాసము. భూలోకవాసము ముగిసినవెంబడే యాతనాశరీరము అను ఆస్ట్రిల్‌బాడి యందు నిలిచి, (తిరోభావమందు)

౫. ఆస్ట్రిల్ ప్లేను అను కామలోకము లేక భువర్లోక భాగము.

౬. స్వగృహాగమనమును సూచించు (తిరోభావమందు) లోయర్ మెంటల్ ప్లేను అను స్వర్గలోకము.

౭. స్వగృహాగమనము అనగా తనయొక్క నిత్యనివాసస్థానమైన హైయర్ మెంటల్ ప్లేను అను మహర్లోకము.

ఈ ఏడు రంగములు (మజిలీలు) న్నవి. జీవాత్మ యొక వ్యాపారితో సమానము. వ్యాపారి సంవత్సరాదియందు తన యిల్లువదిలి కొంత ద్రవ్యముతో సహ దేశాంతరగమనముచేసి అయా దేశములయందు వ్యాపారద్రవ్యములను సంపాదించి, వ్యాపారముచేసి లాభమును సంపాదించి, తాను ఇంటినుండి తీసికొనిపోయిన ద్రవ్యముతో కూడ వ్యాపారమందు సంపాదించిన లాభద్రవ్యమును చేర్చి తాను ఇల్లు వదిలిపోయినప్పటికన్న నధికమైన ద్రవ్యముతో సంవత్సరాంత్యమున తన యిల్లుచేరి సంసారమందు కొద్దికాలముండి మరల కొత్త సంవత్సరము పుట్టగానే ముందరివలెనే వ్యాపారమునకుగా దేశాంతరగమనము నారంభించును. ఈ విధముగా జీవాత్మయు తన నిత్యనివాసస్థానమందుండు కాలము సంసారచక్రమయిన స్వర్గము, భువర్లోకము, భూలోకము, ఈ మూడు లోకములయందును ఉండు కాలములకన్న చాల కొంచెము. దేశాంతరమందు వ్యాపారికి మంచిసరుకులు దొరికినయెడల దేశములు తిరిగి వానిని విక్రయము మొదలగు విధముల సెలవుపుచ్చి వ్యవహరించుటకు ఛాలకాలము కావలయును. జీవాత్మ వ్యాపారసామగ్రిని సంపాదించు స్థలము భూలోకము. ఆ సామగ్రియందు కామసంకలితములైన వానిని విమర్శించు స్థలము భువర్లోకము. మనస్సు శక్తులను విమర్శించుస్థలము స్వర్గలోకము, ఇవన్నిటియొక్క

సారాంశములను మూలద్రవ్యముతో చేర్చి తాను ఇంతటిలాభము ననుభవించినానని లెక్కచూచుకొను స్థలము మహర్లోకము. ఇదే సంగ్రహముగా సంసారచక్రభ్రమణమునందు జరుగు సంగతి. ఇందులో సామగ్రిసంపాదనస్థల మగు భూలోకమందు ఉండు కాలము అతి స్వల్పము. సాధారణముగా నొక చుట్టుకు ౧౫౦౦ సంవత్సరములు పట్టును. అందులో భూలోకవాసము నూరేండ్ల కధికపడదు.

ఇక సంసారచక్రభ్రమణముయొక్క వివరములను విచారింతము. జీవాత్మ తన నిత్యనివాసస్థలము విడిచి అశుద్ధమనోమయశరీరమును, కామమయశరీరమును, సంపాదించికొని (౧౧౦-౧౧౧ వ పుటలుచూడుడు) భూలోకమందు తల్లియొక్క

## గర్భవాసము

నందు నిలిచి యున్నాడనుకొందము. సనాతనధర్మమతమునందు గర్భోత్పత్తి యయినది మొదలు జీవాత్మయొక్క శక్తులు వ్యక్తపరుచుటకు అనుకూలములైన దేహము కలుగవలెనని జీవాత్మకు సహాయముగా ననేక

## సంస్కారములు

ఏర్పడియున్నవి. సంస్కార మనగా చక్కపెట్టుట యని యర్థము. లోకమంతయు స్పందసమూహము. స్పందములనగా నాంగ్లేయ భాషయందు "వైబ్రేషనులు" (Vibrations) అని యర్థము. సంసారచక్ర మను నీ యధ్యాయమునందు కర్త జీవాత్మ, కరణ

ములు శరీరములు, కర్మ సంసారచక్రభ్రమణము. సంస్కార ములు ఎందు కుపయోగమనగా జీవాత్మయందలి స్పందముల కును శరీరములయందలి స్పందములకును ఐకమత్యము కలుగ జేయుటకు. ప్రతిజన్మమునందును తైజసవైశ్వానరుడు సంపా దించి తన యజమానుడైన జీవాత్మకు నివేదించిన అనుభవము లనుపట్టి జీవాత్మయొక్కయు జీవాత్మ స్వాధీనమందుండు దేహ బీజములయొక్కయు స్పందశక్తులు మహాశక్తివంతములగుచుం డును. క్రొత్తగా జన్మమునకు వచ్చి మాతృగర్భమందు ప్రవే శించునప్పటికి మరియొక విధమయిన స్పందసమూహములతో జీవాత్మకు సంబంధము కలుగును. తనకు తల్లికాబోవుస్త్రీయొక్క యు, తండ్రికాబోవుపురుషునియొక్కయు, మరియును మాతా పితృలయొక్క సమీపస్థులైనజనులయొక్కయు, దేహముల స్పంద సమూహములతో జీవాత్మకు సంబంధము కలుగవలసివచ్చెను. ఒకరొకరి స్పందస్వభావము ఒకవిధము గానుండును. ఇన్ని విధములయిన స్పందములనును సమన్వయపరిచితేనేగాని జీవాత్మ యొక్క భూలోకవ్యవహారము ఫలవంతముగానుండదు. ఇంటి యందుండు వారొకరొకరును ఒక విధమైన అభిప్రాయముతో నుండినయెడల గృహకృత్యము బాగుగ జరుగదను సంగతి మన కందరకును తెలిసేయున్నది. ౧౫౪ వ పుటయందుండు శ్రీమ ద్భాగవతశ్లోకములో చెప్పినయర్థమువలె ఒక సంసారమందుండు అనేకుల స్పందస్వభావములు అనేకవిధములుగా నున్నయెడల క్రొత్తగా జన్మమునకు వచ్చిన జీవాత్మ ఈ జన్మమునందు సంపా దించుకోవలెనని యనుకొని నన్ని లాభములను సంపాదించు

కొనుట దుర్లభము. అందువలననే ఇట్టి స్పందసమూహములస్వభావ ములను సమన్వయపరుచుటకుగానే కదా సంస్కారము లేర్పడినవి.

"సమ్యక్క్రియుతే పరస్పరప్రస్తావః సంస్కారః" ఇతి సూత్రం.
పరస్పరప్రస్తావైశ్చ యథాయథం జ్ఞానం భవతి ।
సర్వైః ప్రకారై స్తత్కారణ మితి హి విజ్ఞేయం భవతి ।
తత స్సంస్కారేణైవ బ్రహ్మజ్ఞానసిద్ధిః ।

పరస్పరము అనగా జీవాత్మయొక్క స్పందములకును క్రొత్తగా సంపాదించుకొనుబోవు శరీరములయొక్క స్పందములకును సమన్వయము కలుగజేయునది గనుక సంస్కారము అని సూత్రవాక్యము. నిజమైన జ్ఞానము పరస్పరసమన్వయము కలుగజేసికొని కార్యారంభము చేయుటవల్లనే కదా కలుగును. కనుక సర్వప్రకారముల చేత పరస్పరప్రస్తావము జరుపవలెను. ఏలనంటే సంస్కారముల వల్లనే బ్రహ్మజ్ఞానము సాధ్యము. సంస్కారములు అనేకశాస్త్రములయందు అనేకవిధములుగా చెప్పియున్నవి. నలువదియెనిమిది కంటె నధికముగా నెక్కడయు చెప్పియుండలేదు.

గర్భాధాన పుంసవన సీమంత జాతకర్మ నామకరణాన్నప్రాశన చౌలోపనయనాని, చత్వారివేదవ్రతాని, స్నానం, సహధర్మచారిణీ సంయోగః, పంచానాం యజ్ఞానా మనుష్ఠానం, దేవపితృమనుష్యభూత బ్రాహ్మణా మే తేషాం చాష్టకా పార్వణశ్రావణ్యా గ్రాయణచైత్ర్యాశ్వయుజీకార్తికీ చేతి. సప్తపాకయజ్ఞసంస్థా—అగ్న్యాధేయ మగ్నిహోత్రం దర్శపూర్ణమాసా వాగ్రాయణం చాతుర్మాస్యాని, నిరూఢపశుబంధ స్సౌత్రామణీతి. సప్త హవిర్యజ్ఞసంస్థా-అగ్నిష్టోమాత్యగ్నిష్టోమోక్థ్యషోడశీ వాజపేయాతి రాత్రాప్తోర్యామా ఇతి సప్తసోమసంస్థా ఇత్యేతే.

చత్వారింశత్సంస్కారాః. అథాష్టా వాత్మగుణాః—దయాసర్వభూతేషు క్షాంతి రనసూయా శౌచ మనాయాసమంగళ మకార్పణ్యా మస్పృహా చేతి—

(గౌతమసూత్రము.)

సంన్యాసోపనిషత్తునందు నలువదియెనిమిది సంస్కారములు ప్రస్తావింపబడియున్నవి. ఐనను, ఆ అతిబాహుళ్యములును అందులో కొన్ని నిత్యములు కావుగనుకయు, ముఖ్యముగా

షోడశసంస్కారా శ్చ వేదపరిగణితా భవంతి। యద్యపి స్మృతిషు దశసంస్కారా ఉక్తాః। తథాపి గౌణముఖ్యన్యాయాత్ ముఖ్యాశ్చ దశ సంస్కారాః। షట్చ గౌణా భవంతి। ఏవ మేవ హి షోడశసంస్కారా స్సంప్రయుక్తా భవంతి ॥

వేదములయందు పదునారు సంస్కారములు చెప్పబడియున్నవి. ఐనను, స్మృతులలో పది సంస్కారములే చెప్పబడియున్నవి. సంస్కారములు రెండుతెరగులవి; గౌణమనియు, ముఖ్యమనియు. ముఖ్యములు పది. గౌణములు ఆరు. ఈ రెండుతెగలును చేరి పదునారు. సంస్కారములనుగురించి యజుర్వేదమందు చెప్పియున్నది: “యజనం క్రియతే సర్వం యజు రితి తదర్థాత్”.

నాలుగువేదములు గలవు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము అని.

వేదా శ్చత్వారో భవంతి। ఋగ్యజుస్సామాథర్వాణ శ్చేతి। జ్ఞానప్రవచనపరో ఋగ్వేదః। క్రియా ప్రవచనపరో యజుర్వేదః। ఇచ్ఛా ప్రవచనపరం సామ। ఏతత్త్రియాణా మేకబీజత్వేన సమాహారప్రవచనపరోఽథర్వ వేదః ॥

ఋచ్యతే జ్ఞాయతే బ్రహ్మతత్త్వం సర్వం సంక్షిప్తం యయా సా ఋగ్వేదసంహితా ఇత్యర్థః ।

యజతే క్రియతే బ్రహ్మతత్త్వభాసనం సంక్షిప్తం యత్ర సా యజుర్వేదసంహితా । సామ్యతే ఇష్యతే జ్ఞానక్రియా ఇతి సామవేదసంహితా । తథా చార్యతే ప్రాప్యతే బ్రహ్మతత్త్వ మేతత్త్రియఫల మితి అథర్వవేద సంహితా పదార్థః ॥

సంస్కారములలో

మొదటిది, గర్భాధానము. ప్రతిమాసమందును స్త్రీలు బహిష్ఠలు అగుదురు. ఆ సమయమునకు ఋతువు అని పేరు.

తదో త్సాహితానా మేవ తాసాం భోగో విహితో భవతి । తత్రైవ వీర్యరజసోర్యోగా ద్గర్భసంస్థాపనం భవతి । తత్స్థాపన మేవ ప్రథమసంస్కారః । గర్భవతీనాం హి, సామాన్యాత్ విశేషావగతి ర్భవతి । తన్నిర్విఘ్నగర్భసంస్థితయే సంస్కారస్య చైకస్య చావశ్యకం భవతి ॥

ఆ ఋతుకాలమందుత్సాహముచెందిన వారిని భోగించుట శాస్త్రసమ్మతము. అప్పుడు గర్భమును ధరింతురు. నిర్విఘ్నముగా గర్భోత్పత్తి జరుగుటకుగా నేర్పడిన సంస్కారము గర్భాధానము.

రెండవది, సీమంతోన్నయనము. గర్భధారణ అయినది మొదలు పిండము పెరుగుచుండును. పిండము పెరిగి అంగాంగములు ఏర్పడినపుడు ఈ సంస్కారమునకు కాలము.

యస్మాత్కాలాద్గర్భాధానం భవతి తస్మాత్తదభివర్ధనం । యస్మింశ్చ కాలే తదభివర్ధనపరిసమాప్తిః, రజోవీర్యస్థితపరమాణుభిః తత్పూర్తి ర్భవతి, సర్వాంగాంగి వ్యవహార శ్చ స్పష్టోభవతి । తదా సీమంతోన్నయనసంస్కారః । స చ జీవాగమనకాలకార్యో భవతి । శరీరనిర్మాణా

నంతరమేవ హి జీవాభినివేశన మితి సర్వత్రోక్తం భవతి । శరీరనిర్మాణం హి రజోవీర్యాణుభి ర్జ్ఞేయం భవతి । అణూనాం ప్రత్యేక మపి తచ్ఛక్తేః విద్యమానత్వేన తన్నిర్మాణభవనం సిద్ధం భవతి । పశ్చాద్గర్భస్థితే దేహే అస్తి కశ్చిదాత్మా తదణుసంబద్ధః స చాగత్య తిష్ఠతి । తత్ర తదాగ మనోత్సాహాత్తత్స్థితిసంబంధ పరిరక్షణార్థం సీమంతోన్నయన సంస్కారః । సీమా హి శరీరస్య తదంతం । తచ్చ తత్పరిసమాప్తి రితి విజ్ఞేయం । ఉన్నయనంచ తత్సంబంధరూపప్రయోజనసాధన మితి తదర్థః ॥

ఈ సమయమునందే జీవాత్మ గర్భస్థపిండమునందు ప్రవేశించి యుండును (౧౧౪ వ పుట చూడుడు). శరీరము కట్టబడిన తరువాత నే జీవాత్మ ప్రవేశించునని సకలశాస్త్రములయందును చెప్పి యున్నది. శరీరము కట్టి అయిన పిమ్మట గర్భమునందుండు శిశు శరీరమందు ఇమిడియుండు దేహబీజ మెవ్వనిదో ఆ జీవాత్మ (౧౧౨ వ పుట చూడుడు) ప్రవేశించును. అట్టి ప్రవేశమునకు సుస్వాగతమును తెలుపుటకుగా సీమంతోన్నయనము అను సంస్కారము.

<u>మూడవది, పుంసవనము.</u> ఈ సంస్కారము కొన్ని దేశములలో సీమంతమునకు ముందుగానే జరుగును.

స చ జీవస్య స్థితౌ సత్యాం యా యావస్థా భవతి తత్ జ్ఞాపకోయం సంస్కారః । తేన యస్మిన్ యస్మింశ్చ యోనౌ పూర్వమాసీత్ తత్సర్వ యోనేః అనుక్రమణం చైకయోనౌ తత్పరకే చ భవత్యే వేతి విజ్ఞేయం । యథా వృక్షస్య జీవస్య పశుత్వప్రాప్తౌ ప్రథమం వృక్షనిర్మాణం వృక్ష జాతివ్యక్తి క్రమేణ భవతి, పశ్చా త్పశుత్వారోపః । ఏవ మేవ హి విధానం సర్వత్ర ద్రష్టవ్యం । అత ఏవ సీమంతోన్నయనానంతరం పూర్వ యోనేః శరీరనిర్మాణస్థస్య అనుకరణ ముక్తం భవతి ।

అనగా జీవాత్మ ధాతువృక్షమృగమానుష్య ఉపాధులయం దెల్ల యు ప్రవేశించినపుడు ఆయాజాతిశరీరము ఏట్లుండినదో ఆ రూప ములనన్నిటిని ప్రవేశించియుండిన జ్ఞాపకమును మనుష్యయోని యం దనుభవించి చూచును. గర్భధారణ అయి నాలుగునెలల వరకును పాషాణరూపముగా నుండును. అయిదవ నెలలో పిండ మును చూచితే ఒక గడ్డకు వేళ్లు దిగినపుడు ఆ గడ్డచుట్టును వెం ట్రుకలున్నట్టు కనుపడురీత్యా వృక్షజాతిని నిర్దేశించును. ఆరవ మాసమందు గర్భస్థశిశుశరీరమును చూచినపుడు ఇక ముందు కాళ్లుచేతులుగా నేర్పడబోవునవి కొంతమట్టుకు రూపేర్పడి నాలుగు కాళ్లుగల చిన్నకుందేటివలె కనుపడురీత్యా మృగవర్గ దేహము యొక్క లాంఛన కనబడును. అప్పటికే స్త్రీ పురుషనియమము ఆ శిశుశరీరమందు ఏర్పడియుండును. ఏడవ మాసమునందు మను ష్యరూపము ఖండితముగా నేర్పడియుండును. జీవాత్మ ఇదంతయు చూచుచుండిన రీత్యా పూర్వజన్మజ్ఞానములు పొందియుండును. పూర్వజన్మముల జ్ఞానము కలిగియుండు నని గర్భోపనిషత్తునందు చెప్పియున్నది. ఈ సందర్భమునందు గర్భోపనిషత్తు "ద్వితీయే మాసే-తృతీయే మాసే" అను భాగములను చదువవలయును. ఇది పుంసవన సంస్కారము.

ప్రకృతకాలమందు ఈ సంస్కారమునకు అర్థము, పుట్ట బోవుబిడ్డ మగబిడ్డగా బుట్టవలెనని చేయుమంత్రములను కలిగిన సంస్కారము. అయితే, ఏడవనెలకుముందే మగ ఆడశిశు త్వము నిర్ధారణ అయిపోయినది. ఇపుడు మారుటకు సాధ్యము కాదు.

ఐదవది, నామకరణము. నామకరణము అనగా పేరుపెట్టుట.

సర్వం చ బ్రహ్మేత్యుక్త్వా సర్వే బ్రహ్మాండకల్పకాభవం తీతి వ్యాఖ్యానా త్తేషాం పృథక్పృథ జ్నామకరణం భవతి । యద్యపి బ్రహ్మణ శ్చైకత్వం । తథాపి పృథక్పృథ క్ప్రతిభాసమానం తథాభాసనమాత్రం । అతః ప్రతిభాసమానానాం తేషాం నామాన్యపి పృథక్పృథగేవ సంతి । వస్తుతస్తు సర్వాణి నామాని సర్వస్యాఖ్యాతాని భవంతి ॥

పరబ్రహ్మ మొకటే యైనను ఆ బ్రహ్మమునందు వ్యక్తు లనేకములు కలుగును గనుక వేరు వేరు వ్యక్తికి వేరు వేరు పేరుండవలెను.

ఇపుడు నామకరణము నడుపు నపుడు "మాస నక్షత్ర వ్యవహార నామేతి నామత్రయ ప్రవృత్తి స్సర్వత్ర దృశ్యతే" మాసనామము నక్షత్రనామము వ్యవహారనామము అని మూడు పేళ్లు పెట్టుదురు. ఈ స్థూలశరీరమునకు లోకవ్యవహారార్థముగానును శ్రౌతస్మార్తకర్మలు నడుపుటకును వ్యవహారనామము పయోగపడుచున్నది. గర్గసంహిత యను గ్రంథములో శ్రీ కృష్ణమూర్తికి నామకరణము జరిపినపుడు ఆ శిశువునకు పెట్టిన పేరు ఆ శిశువుయొక్క చెవిలో రహస్యముగా చెప్పబడె నని చెప్పియున్నది. ఇందులో రహస్యవిషయములు అనేకములున్నవి. ౭వ పుటలో "నామరూపే వ్యాకరవాణీతి" అని యున్నది. రూపమున్నపుడు నామముకూడ నుండవలెను. మొట్టమొదట మనుష్యునికి ప్రజ్ఞానాంశువు అను తురీయాత్మ యను రూప మొక్కటి. తదనంతరము, రెండవరూపము లయాత్మ, మూడవది కాలాత్మ, నాలుగవది సంకల్పాత్మ, అయిదవది ఇంద్రియాత్మ

(సుబాలోపనిషత్తు). మనుష్యులకందరకును ఇట్లు సూక్ష్మరూపములు గలవు. రూపమున్నపుడు నామముకూడ యుండవలసినది అని ఛాందోగ్యోపనిషద్వాక్యమువల్ల తెలియుచున్నది. కనుక మనుష్యునికి వ్యవహారనామము కాక వేరు పేళ్లుండవలెను. సూక్ష్మలోకములలో ఆయా లోకవ్యవహారమునకు ఒక్కొక నామధేయ ముండును. జ్ఞానప్రదులైన గురువులు రహస్యనామధేయములతోనే తమశిష్యులను పిలుతురు.

సంగీతశాస్త్రమునందు షడ్జ, ఋషభ, గాంధారాది స్వరములను సూచించువర్ణములు స రి గ మ ప ధ ని యని ఏడు వర్ణములున్నవి. ఈ స్వరములలో నొక్కొకటి యొక రాగముగా నుపయోగించవచ్చును. అన్నియు కలిసినపుడు సంగీతగ్రామము కట్టును. అదే విధముగా లయాత్మ, కాలాత్మ, యిట్టి యాత్మలకు వేరు వేరు స్వరములు కలవు. ఇవన్నియు కలిసి గ్రామము కట్టిన ప్రకారము తురీయాత్మనామ మేర్పడును.

స్వరములనన్నిటిని వీణయొక్క తంత్రులవల్ల శబ్దింప చేయవచ్చును. ఒక్కొక స్వరమునకు ఒక్కొక తంతెయున్నదనుకొందము. గాంధారస్వరమునియ్యగల తంతెను మీటినపుడు గాంధారస్వరము మాత్రము శబ్దించును. అనగా ఆ తంతెయొక్క స్పందశక్తి గాంధారము. ఇదే విధమున మరియొక తంతెయొక్క స్పందశక్తి ఋషభము. మరియొక తంతెయొక్క స్పందశక్తి షడ్జము. ఈ విధముగా ఆ యా తంతెయొక్క స్పందశక్తివల్ల ఒక్కొక స్వరమును వాయించగలదు. లోకమంతయు స్పందమయము. శబ్దము ఒక తరహా స్పందము. స్పర్శము ఒక తరహా స్పందము.

వర్ణము ఒక తరహా స్పందము. నీలవర్ణము ఒక తరహా స్పందము. లోహితవర్ణము ఒక తరహా స్పందము.

స్పందములే జగత్కారణములు అని ౨౦ వ పుటయందు చెప్పబడినది. తెల్లవర్ణమును పగలతీసినపుడు ఏడు వర్ణములు కన బడును అని ప్రకృతిశాస్త్రజ్ఞులు రుజువుపరిచియున్నారని ౫౧ వ పుటయందు ప్రస్తావించబడెను. వర్ణములన్నియు స్పందములే. స్పందములవేగము వర్ణములను నిర్ధారించును. పైచెప్పిన ఏడు వర్ణములను కూడపెట్టితే తెల్లవర్ణమగును.

ప్రణవమను ఓంకారమందు అ, ఉ, మకారము, అర్ధమాత్ర యని భాగములున్న వని శాస్త్రములుచెప్పుచున్నవి. ఈ నాలుగు భాగములను సంధింపచేసినయెడల ఒక ఓంకారమగును. నాలుగు శబ్దములైన అకార, ఉకార, మకార, అర్ధమాత్రలు కలిసి యొక ఓంకారమైనట్లుగానే ఏడువర్ణములు కలిసి ఒక తెల్లవర్ణ మవును.

అకార, ఉకార, మకార, అర్ధమాత్రలుగా నున్నపుడు పృథక్ భావమును, అన్నియు కలిసి యొక ఓంకారమైనపుడు ఐక్య భావమును, మనకు తెలియవచ్చును. అదే విధమున అన్నమయ కోశాధిష్ఠాతయైన భూతాత్మ, ప్రాణమయకోశాధిష్ఠాతయైన ఇం ద్రియాత్మ, మనోమయకోశాధిష్ఠాతయైన సంకల్పాత్మ, విజ్ఞాన మయ కోశాధిష్ఠాతయైన కాలాత్మ, ఆనందమయకోశాధిష్ఠాతయైన లయాత్మ యనునవి యన్నియు పృథక్భావమును చూపును. ఇవన్ని టియొక్కయు సమాహారమును (ఐక్యభావమును) చూపునదియును పంచకోశ విలక్షణమైన వస్తువును అగు తురీయాత్మ యను ప్రజ్ఞా నాంశువు లేక మోనడ్డు వీని అన్నిటియొక్క ఐక్యము. లయాత్మ

మొదలు భూతాత్మవరకును గల ఆత్మలయొక్క స్పందశక్తులన్ని యు తురీయాత్మయందు గలవు. శబ్దములు స్పందములయొక్క పరిణామములు అని యిదివరకే చెప్పబడెను. లయాత్మయొక్క స్పందశక్తులు లయాత్మయొక్క నామధేయముగా నుండగల శబ్దమును కలుగచేయును. కాలాత్మయొక్క స్పందములు కాలాత్మకు నామధేయముగా నుండగల శబ్దమును ఒక్కటిని కలుగచేయును. ఇదేవిధమున మిగిలిన ఆత్మలకన్నియు నామధేయములుగా నుండతగిన శబ్దములను ఆ యా స్పందములు కలుగచేయును. కేవల నశ్వరమైన స్థూలశరీరమునకు ప్రతిజన్మమునందును ఒక వ్యవహారనామము నిత్తురు. అయినను స్థూలశరీర(దేహ)బీజమునకు వేరు నామధేయము కలదు. ఈ రహస్యనామధేయములు మనకు తెలియవు. ఐతే మనము ఏ మహానుభావులను ఆశ్రయించి శుశ్రూషచేసి వారి యనుగ్రహంబున సంసారసాగరమును తరించుటకు ప్రయత్నపడుదుమో అట్టి నిర్హేతుకదయాసింధువులైనవారియొక్క యోగదృష్టికి ఈ నామధేయములన్నియు తెలిసేయుండును. మరియు యోగాభ్యాసవశీకృతమనస్కులై, ఆత్మాభిన్నదృష్టిగలవారై, అదృశ్యసహాయులుగా నుండి, సూక్ష్మలోకచారులైన శాంతమూర్తులకు ప్రతిమనుజునియొక్కయు రహస్యనామధేయములు అవశ్యమున్నప్పు డెల్లయు తెలియవచ్చును. ఏ యే లోకమందు ఎవరున్నను ఆ యా లోకమునందు పైనచెప్పిన శాంతమూర్తులు ఆ యా జీవాత్మలను వార్ల వార్ల పేర్లుపెట్టి పిలిచి వార్లకు సహాయము చేయుదురు. ఇవంతయు యోచించి చూచినపుడు "జ్ఞానాధీనం నామ" అను వచనమునకు అర్థము విశదమగును.

మరియు జ్ఞానదాతలైన గురువులు తమ శిష్యులైన జీవాత్మలకు జ్ఞానోపదేశము చేయుచు శిష్యునియందు జ్ఞానోత్పత్తినిని అహంకారమమకారనివర్తినిని చూచి వారలకు దీక్షానియమములు ఏర్పరుతురు. దీక్షలు అనేకములు. ముఖ్యముగా ౧. బ్రహ్మవిత్, ౨. బ్రహ్మవిద్వర, ౩. బ్రహ్మవిద్వరీయాన్, ౪. బ్రహ్మవిద్వరిష్ఠః అని. మరియు నీ విషయమై నారదపరివ్రాజకోపనిషత్తునందు అనేక తరగతుల సంన్యాసములను చెప్పియున్నారు. ప్రతిదీక్షకును దీక్షా గురువులవారు దీక్షితుడైన శిష్యునికి క్రొత్తగా నొక పేరిత్తురు. ఇది పరమరహస్యము. మహాపీఠమువారికి తప్ప నితరులకు తెలియదు. ఈ ఆచారమును అనుసరించియే ఈ కాలమందు సంన్యాస వేషమును వేసికొనినవారికందరకును శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యడిత్థానంద అని ఆనందపు పేళ్లు వ్యవహారమునకు ఏర్పడుచున్నవి.

ఆరవది, చూడాకర్మ. "మాతృగర్భజాతకేశనఖాపనయన రూపం." పుట్టుకతో వచ్చిన వెండ్రుకలు, గోళ్లు, వీట్లను తీసి వేయుట.

ఏడవది, కర్ణవేధ. చెవులు కుట్టుట. చూడాకర్మ, కర్ణవేధ అను నీ రెండు సస్కారములయందు కుఱ్ఱవానికి అలంకారము చేయుటకు ప్రారంభింతురు. సాధారణముగా నైదేండ్లవయస్సప్పుడు ఈ సంస్కారములు జరుగును.

ఎనిమిదవది, వ్రతబంధము లేక ఉపనయనము.

---

అత్ర చ సంసారకార్యం మమత్వవ్యవహారం కించిత్ జ్ఞాత్వా స్త్రీవ మేతత్ । ఏతత్ప్రకారాణాం తన్నియంతౄణాం తత్కర్తౄణాం చాపి జ్ఞానప్రయోజనతయా అంతర్ముఖీకరణం భవతి. ।

ఉపనయనము అను సంస్కారమును బాలునియొక్క ఏడవ సంవత్సరమునందు జరుపుదురు. ఏడవ సంవత్సరమునందు జీవాత్మ బాలుని శరీరమునందు ప్రవేశించును అని ౧౧౫ వ పుటయందు వ్రాయబడినది. జీవాత్మ స్వంతముగా అధ్యక్షతపొందగానే తాను ఈ లోకమందు ఏకార్యములను ఏవిధమున జరుపవలెనని తెలిసికొనుటకు ప్రయత్నపడును. ఉపనయన సంస్కారమునందు వటువునకు ఉపవీతము (జందెమును) ఇత్తురు. ఉప+వీతము అనగా సమీపించుట. ఎవరిని సమీపించుట? విద్యనేర్పుగురువులను. నూతనముగా స్థూలశరీరమందు సుష్ఠుగా ప్రవేశించిన జీవాత్మ సంసారమందు “ఏతత్కిమస్తి, కథ మేతాదృశే దుఃఖేపి ఏతత్కారణే ప్రవృత్తిః—ఇత్యాది పర్యాలోచ్య విషీదతి” ఏమి? ఇది, ఈ సంసారము ఎట్టిది. ఈ దుఃఖరూపమైన సంసారమందు దారి యేది. ఏ కార్యము ఎట్లు చేయవలెను. ఇట్టి చింతనములవల్ల దుఃఖముచెందినవాడవును. ఈ సందర్భమందు “సత్యపి చ తస్మిన్ విషాదే యో హ్యేతన్మాత్రం జానాతి స స్వయ మాచార్యత్వేన తం శిక్షతి ఏత దేవ ఉపనయనం.” ఇట్లు చింతాక్రాంతుడైన జీవాత్మకు ఒక గురువు దొరుకును. జీవాత్మయొక్క సందేహములనెల్లయు తీర్పగలగురువు. వీరికి ఆచార్యులవారని పేరు.

> ఆచినోతి హి శాస్త్రార్థా నన్యా నాచారయత్యపి ।
> స్వయ మాచరతే చైవ తస్మా దాచార్య ఉచ్యతే ॥

నిజమైన శాస్త్రములయొక్క ముఖ్యాంశములను ఒకచోటచేర్చి ఆ ప్రకారము నడువుమని యితరులకు పదేశించువారును తామే ఆ

శాస్త్రములనిబంధనల ననుష్ఠించువారును గనుక ఆచార్యులవా రనబడుదురు. ఉపనయనం (ఉప+నయనం) అనగా సమీపము నకు పిలుచుకొనివెళ్లుట. ఈ క్రియ సద్గురువులవారి సహాయము వల్లనే గాని వేరు విధమున జరుగుట లేదు. జీవాత్మయొక్క దీర్ఘ కాల అనుభవములో సుఖములు దుఃఖములు ఇవి ఒకటిని విడిచి యొకటి యుండదు అని తెలిసికొనియున్నాడు.

> సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖం ।
> ద్వయమేతద్ధి జంతూనా మలంఘ్యం దినరాత్రివత్ ॥
> సుఖమధ్యే స్థితం దుఃఖం దుఃఖమధ్యే స్థితం సుఖం ।
> ద్వయమేతద్ధి జంతూనాం ప్రోచ్యతే జలపంకవత్ ॥
>
> (అధ్యాత్మరామాయణము)

ద్వంద్వాతీతుడుగా బ్రతుకవలెనంటే జీవాత్మకు జ్ఞానోదయము కావలెను. జ్ఞానోదయమునకు సహాయులు ఆచార్యులవారు. వారి సమీపమునకు పోవుట అను ప్రయత్నమునకు ఉపనయనము అని పేరు. ద్వంద్వాతీతానుభవము బ్రహ్మజ్ఞానమువల్లనే సాధ్యము. బ్రహ్మజ్ఞానము సంపాదించు ఆచారమందుండువాడు "బ్రహ్మ చారి". బ్రహ్మచర్యవ్రతము జరుపుటకుగా వ్రతబంధము ఉప వీతము అను జందెము. వటువు తన మనస్సునందు చేసికొనిన ప్రతి జ్ఞను నడుపగలను, తప్పుటలేదు, అని చేసికొనిన నిశ్చయమును సూ చించునది యజ్ఞోపవీతము. బ్రహ్మచర్యము రాగానే ఒక యజ్ఞము చేతురు. ప్రకృతకాలమందు సాధారణహోమము. ఈ యజ్ఞము నకు "సర్వే మహర్షయః ఋషయో మహాత్మానో బ్రాహ్మణా యోగినశ్చ దేవాశ్చ యజ్ఞే సమాగచ్ఛంతి । ఆగత్య చ యథాత్మక

ముపదేశం కుర్వంతి". ఇట్టి మహానుభావులందరును ఆ యజ్ఞము నకు వత్తురు. వచ్చినవారిని సభాసదులందరును "ఆవాహాయి త్వా చ సర్వే ప్రార్థయంతి—ఏతద్బ్రహ్మచర్యం పూర్ణం కురుత, యతో నిర్విఘ్నబ్రహ్మతత్త్వాధ్యయనే చ అస్య ప్రవృత్తిర్భవేత్ ఇతి". తలిదండ్రులును అడుగున కనినప్రకార ముపదేశించి పంపుదురు. "మాతాపితరౌ తమేవం ఉపదిశ్య ప్రేషయతః—గచ్ఛ, తాత, యథా సుఖం. ఏతదాజ్ఞాం కురు, శాస్త్రాణ్యధీత్య బ్రహ్మ తత్త్వం పరిజ్ఞాయ బ్రహ్మభావం ప్రాప్య సంసారాభినివిష్టో భవ, ఇత్యాది."

ఇది మొదలు త్రికాలములయందును సంధ్యావందనము, గాయత్రీజపము, ప్రాతస్సాయంకాలములయందు అగ్నిహోత్ర మందు హోమము ఇత్యాది నియమములు ఏర్పడును.

పండ్రెండుసంవత్సరములు గురువులవారి గృహమునందు వసించిన పిదప గురువులవారి యనుజ్ఞపొంది,

స్నాతకము, వివాహము, అను కర్మలు జరుగును. బ్రహ్మ చర్యాశ్రమమునందు బ్రహ్మజ్ఞానము సంపాదించుకొనిన వటువు "ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః" అని గురువులవారి యుత్తరవు ను అనుసరించి పుత్త్రసంపాదనార్థము వివాహము చేసికొనును.

౧౧ వధూప్రవేశము, ౧౨ ద్విరాగమనము, ౧౩ ప్రసూత సంస్కారము, ౧౪ జననవ్రతము, ౧౫ నివర్తనము లేక వానప్రస్థా శ్రమ స్వీకరణము.

ఉపనయనము మొదలు నివర్తనమువరకును లోకానుభవ మునందు మనుష్యుడు తెలిసికొనవలసిన అనుభవములను గురించి

ఒక గ్రంథమే వ్రాయవచ్చును గనుక ౧౬ వది మరణము అను విషయమునుగురించి విచారింతము.

ప్రారబ్ధకర్మ (౧౧౦ వ పుట) అనుభవము ముగిసిన సమయమునకు తరుచుగా స్థూలదేహమునకు మరణము సంభవించును. గడ్డపారవంటి లావాటి యినుపచట్టమును కొలిమిలో కాచి సాగ తీయుటకు సంపెట పెట్లు కొన్ని నిమిషములకాలము అవశ్యముగా నుండును. సాగతీయవలసినంత సాగతీసినతరువాత సంపెటను ఒక మూల పడవేసి చేతిసుత్తెతో కరమలవాడు సన్న దెబ్బలతో ఆ గడ్డపారను దిద్దును. ఎదివరకు సంపెట ఉపయోగమో అదివరకును ఉపయోగించిన ప్రకారము ప్రారబ్ధకర్మ ముగియగానే స్థూలశరీరమును వదిలి జీవాత్మ ఇతర శరీరము అగు కామమయశరీరమందు నివసించుటకు ప్రారంభించును. ఈ చర్యకు మరణము అని పేరు. జీవాత్మ స్థూలశరీరమును వదిలి పోవునపుడు స్థూలశరీరమునందేమి మార్పులు కనబడును అని విచారించవలెను.

## నాడీపంజరము

ఇదివరకు ౧౧౨ వ పుటయందు దేహబీజములను చేర్చి పట్టియుండు దేహబీజసూత్రము ఒకటియున్నదని చెప్పబడినది. ఈ సూత్రమునుండి వేరుగా నొకసూత్రము విద్యుల్లేఖవలె బయలు వెడలియున్నది. విద్యుల్లేఖ యనగా మెరుపుతీగె. మెరుపుతీగె అతికాంతివంతముగానును బహుసూక్ష్మముగానుండును. ఈ తీగె బయలువెడలి శుద్ధమనోమయశరీరమందు విస్తరిల్లి అనంతరము అశుద్ధమనోమయశరీరమునంతయు నాక్రమించి తదనంతరము కామమయశరీరమంతయు నాక్రమించియుండును.

ఈ పంజరము బీరకాయపీచువలె ఎక్కడ మొదలు ఎక్కడ కొన అని కనుగొనుటకు అసాధ్యమగునట్లుండును. "బుద్ధిక్ప్వేనుయొక్క ప్రకృతివల్ల ఏర్పడియుండును. "తిర్యగూర్ధ్వ మధః" అనినప్రకారము పైకి క్రిందికి ప్రక్కలకు అంతయు నావరించియుండును. దేహబీజములనన్నిటిని ఆవరించియుండును. "తంతు పంజరమధ్యస్థ లూతికా యథా భ్రమతి తథా అసౌ తత్ర ప్రాణశ్చరతి". ప్రతిదేహమందును ఆ దేహముయొక్క ప్రాణము ఆయా దేహముయొక్క నాడీపంజరమునందు సంచరించుచునుండును. స్థూలశరీరముయొక్క భూతసూక్ష్మము భూలోకమునందు మాతృగర్భమునందు చేరగానే ఆ భూతసూక్ష్మమునుండి పై చెప్పిన విద్యుల్లేఖవంటి సూత్రము బయలువెడలి శిశుశరీరమును కడవరకును అల్లుకొని స్థూలశరీరమునందలి ప్రాణశక్తులు సంచరించుటకు మంచి వలవలె విస్తరిల్లి పంజరమువలె ఏర్పడును. "దేహేస్మిన్ జీవః ప్రాణారూఢో భవతి" అని యుపనిషద్వాక్యము. మరియు "హృదయాకాశే మహోజ్జ్వలా జ్ఞానరూపా భవతి." "యోగకాలే చా నేన అగ్నినా బ్రహ్మరంధ్రం స్ఫురతి" అని యుపనిషద్వాక్యములు. ఈ పంజరమును అనుసరించి కుండలినియు, చతుర్దశముఖ్యనాడులును, "గుదస్య పృష్ఠభాగే వీణాదండాశ్రితా మూర్ధపర్యంతం బ్రహ్మరంధ్రే చ విజ్ఞేయా వ్యక్తా సూక్ష్మా వైష్ణవీ భవతి" అను వైష్ణవీ అని పేరుగల నాడియు "ఏతాసు చతుర్దశనాడిష్వన్యా నాడ్య స్సంభవంతి" అనిన యితరనాడులు అనేకములును పుట్టును.

యథాఽశ్వత్థాది పత్రం సిరాభిర్వ్యాప్తం ఏవం శరీరం నాడీభిర్వ్యాప్తం । దశవాయవ స్సర్వాసు నాడీషు చరంతి । సర్వగాత్రేషు

. . . . . . అగ్నినా సహ వ్యాపయన్ ద్విసప్తతి సహస్రేషు నాడీమార్గేషు చరన్ . . . . . . సాంగోపాంగకళేబరం వ్యాప్నోతి ।

ఇట్లు లెక్కలేనన్ని నాడీనాళములగుండా ప్రాణము దేహమంతయు చరించుచుండును. అవసానకాలము సమీపించినపుడు స్థూలదేహములో నిమిడియుండు నాడీపంజరము మెల్లగా ఎల్లవైపులనుండియు లోపలికి ముణుచుకొనును. ముణుచుకొని స్థూలశరీరభూతసూక్ష్మమును ఆవరించుకొని హృదయస్థానమునందు జ్వలించుచు నిలుచును. అపుడు అంగాంగములు చల్లనగుటకు అరంభించును. ప్రాణకళ హృదయస్థానమందు కొంతతడవుండి అక్కడి భూతసూక్ష్మముతో సహా, ముణుచుకొనియుండు నాడీపంజరముతో కూడ పైకిలేచును. హృదయమునుండి కంఠస్థానమందుండు చక్రమునకు, అచ్చటినుండి భ్రూమధ్యస్థమైన చక్రమునకు, తదనంతరము సహస్రారమునకు, కట్టకడపట బ్రహ్మరంధ్రమునకు వెళ్లి శరీరము విడిచిపోవును. హృదయమునుండి పైకిపోవు మార్గమునకు సుషుమ్న యని పేరు.

## చరమస్థితి

జీవాత్మ స్థూలశరీరము ప్రవేశించినపుడు, అనగా, జన్మము నెత్తినపుడు రాబోవు జన్మమునందు అనేక మంచిపనులుచేసి ఆ విధమున తన మేలుకొఱకు ప్రయత్నము చేయవలెనని ఆశకొనియుండును. ఈ విషయమును గురించి గర్భోపనిషత్తునందు విశదముగా చెప్పియున్నది. మాతృగర్భమునందుండగా పూర్వజన్మజ్ఞానముతో నుండును. ముందు జన్మములయందు తనకు ఉండిన అనుకూలసందర్భములను విడనాడుకొనినందుకు చాల దుఃఖించి,

యిక రాబోవు జన్మమునందు సత్కార్యములనే చేయుదును అని నిశ్చయించుకొనును. అయినను గర్భమును వదిలి నేలపడగానే ఆ నిశ్చయములన్నియు మరిచి పోవును. మరల మరణకాలమందు జీవాత్మ ఒక నిమిషకాలము సమాహితచిత్తుడై జన్మమెత్తినది మొదలు ఆ క్షణమువరకును తాను చేసిన సత్కార్యములు, దుష్కార్యములు, అన్నిటిని పరీక్షించును. అతని సహాయమునకుగా ఆ జీవితకాలమందు జరిగిన ముఖ్యాంశములన్నియును అతని యెదుట నిలుచును. ఆ కార్యములనెల్ల పరిశీలించి ఇన్ని మంచివి, ఇన్ని చెడ్డవి, అని తెలిసికొని మంచికార్యములనే చేయుదును, చెడ్డ కార్యములను చేయను, అని యొక ప్రతిజ్ఞ చేసికొనును. ఈ పరీక్షా కాలము జీవాత్మకు పురోవృద్ధికారణము. అప్పట్లో అతనిని ఎవరును తొందరచేయకూడదు. శాంతముగా నుండునట్లు ఒంటరిగా విడిచిగాని లేక చుట్టును ఉండువారలు నిశ్శబ్దముగా నుండునట్లేర్పాటుగాని చేయవలయును. “నాయనా నాకేమిగతి” అను మొదలగు ఏడ్పులవల్ల జీవాత్మయొక్క చరమస్థితియందు అతనికి కావలసిన శాంతమును ఇయ్యక అతనియొక్క కార్యమునకు హానియును చేయుదురు. ఇందువలననే చావనుసిద్ధముగానుండువారికి కర్ణమంత్ర శ్రవణము, నామస్మరణము మొదలగు సచ్ఛ్రవణములు జరిగించి శాంతమును ఇయ్యవలెనని ఆచారము.

## మరణము నిద్రతో సమానము

ప్రతినిత్యమును మనము పగట్లో వ్యాయామములవల్ల దేహమును అలిపించుకొని రాత్రియగునప్పటికి నిద్రను చెందుదుము కదా.

నిద్రాకాలమందు మనస్థూలశరీరమును వదిలి కామమయశరీరముతో ఆస్ట్రిల్ ప్లేనునందు కొంతతడవును, మనోమయశరీరములతో మెంటల్ప్లేనునందు కొంతతడవును సంచరించుచుందుము. ఈ లోపల పరుపున పడియుండు స్థూలశరీరము విశ్రాంతి చెందుచుండును. అట్టి విశ్రాంతివల్ల బలమును సంపాదించుకొని మరల కార్యములను చేయుటకు శక్తివంతమై సిద్ధపడును. అప్పట్లో మెలుకువ కలుగును. అనగా మరల జీవాత్మ స్థూలశరీరమందు ప్రవేశించును. ఇదే విధముగా జీవాత్మ స్థూలశరీరమునందు ౫౦-౬౦-౭౦ సంవత్సరములు కాపురముండి తరువాత స్థూలశరీరమును మనము ఇప్పట్లో ప్రతిరాత్రియందును వదిలినట్లు ఈ జన్మమునకు తనకు కలిగిన స్థూలశరీరమును వదిలి కామమయశరీరవాసియై కామలోకమందు కొన్నియేండ్లుండి పిమ్మట అశుద్ధమనోమయశరీరముతో కొన్నియేండ్లు స్వర్గలోకమందుండి అక్కడి సుఖానుభవములను ముగించుకొని మరల మనము ఇప్పట్లో ప్రతినిత్యమును ఉదయాన నిద్రలేచినరీతిగా భూలోకమును ప్రవేశించును.

మనము రాత్రులలో నిద్రాకాలమందేమి చేసినదియు మనకు జ్ఞాపకముండదు. అదేవిధముగా మనము మరణముచెంది మరల జన్మమునకువచ్చువరకును ఆస్ట్రిల్ ప్లేను, మెంటల్ప్లేను ఇట్టి స్థలములయందేమిచేసినదియు జ్ఞాపకముండదు. జ్ఞాపకము లేమికి మరుపు లేక విస్మృతి అని పేరు. ప్రతిరాత్రియు మనకు కలుగు మరుపుకు విస్మృతి యని పేరు. ప్రతిజన్మాంతమందును మనకు కలుగు మరుపుకు అత్యంతవిస్మృతి యని పేరు.

"జంతోర్ హ్యేకస్యచిద్దేహోః మృత్యు రత్యంత విస్మృతిః

అని చెప్పియున్నది. మరణము పెద్దమరుపు నిచ్చునని యర్థము.

జీవాత్మయొక్క చరమావస్థయందు తాను ఇప్పటి స్థూల శరీరమును ధరించినదిమొదలు చేసిన సకల కార్యములను (మంచి వానిని చెడ్డవానిని అన్నిటిని) పరీక్షించి తనకు బుద్ధిలేమివల్ల దుష్కార్యములనుచేసితినని దుఃఖించి ఇక రాబోవు జన్మములయందు సత్కార్యములనే చేతునని ప్రతిజ్ఞ చేయునని చెప్పబడియె.

> నిద్రాదౌ జాగరస్యాంతే యో భావ ఉపజాయతే ।
> తం భావం భావయన్ నిత్యం ముచ్యతే నేతరో యతః ॥

ప్రతిరాత్రియును జాగ్రదవస్థచివరను నిద్రావస్థ ఆరంభమునందును ఏ భావము పుట్టునో ఆ భావమును రాత్రి అంతయు భావించి ముక్తిచెందుదురు. అనగా రాత్రి నిద్రాదిన భగవద్ధ్యానము నారంభించి ఆ ధ్యానావస్థతోనే నిద్రించితే రాత్రి అంతయు మంచి కార్యములనే చేయుచు ముక్తిసాధనమును సంపాదించును. ఇది యొకరాత్రియందు కలుగు అనుభవము. ఇదేవిధమున “జాగరస్యాంతే” అనగా జాగ్రదవస్థతోతుల్యమైన యొకజన్మముయొక్క కొనను, “నిద్రాదౌ” అనగా నిద్రతోసమానమైనదియు, మరణానంతరము “ఇహలోకం పరిత్యజ్య గతోసి పరమాంగతిం” ఈ లోకము వదిలి పరలోకములలో సంచరించు అవస్థయొక్క ఆరంభమందును, అనగా పైనప్రస్తావించిన చరమదశయందు తాను చేసిన దుష్కార్యములను, మరియు సత్కార్యములను కూడ పరిశీలించి తెచ్చుకొను నిశ్చయజ్ఞానము అను “యో భావ ఉపజాయతే” భావమును పరలోకసంచారకాలము కడవరకును

"భావయన్నిత్యం" భావించుచు "ముచ్యతే" బంధవిముక్తి చెందును. అనగా ఆ నిశ్చయబుద్ధితో రాబోవు జన్మమును ఎత్తును. చరమావస్థయందలి పరీక్ష ఇంతముఖ్యము గనుక నిరాటంకముగా నీ పరీక్షను జరుపుటకందరును సహాయపడవలెను. బ్రతికినకాలమంతయు న్యాయప్రవర్తనమువల్లనో, అన్యాయప్రవర్తనమువల్లనో, ధనమునార్జించి సంసారమును కాపాడుచుండి తాను తరించు మార్గమును అంతగా గమనించక కాలహరణముచేసిన జీవాత్మకు చరమావస్థలో కలుగు లాభమునకుకూడ అడ్డము పోవలెనా? ఇది మహాపాపము.

జీవాత్మ చరమకాలచింతనము ముగించి నిశ్చయముచేసికొని కాగానే ౧౨౧ వ పుటయందు చెప్పబడిన సూక్ష్మసూత్రము తెగును. ఈ సూత్రము స్థూలశరీరమునను ఛాయాశరీరమునను చేర్చిపట్టుకొనియుండును. కొన్ని పురాణములలో చెప్పియున్నదేమనగా: ముగియుచున్న జన్మమునందు జీవాత్మ సత్కార్యములను చేసి భగవద్భక్తిని ధృఢముగా సంపాదించియుండినయెడల తాను ఏ దేవతను ధ్యానించుచుండెనో ఆ దేవతయొక్క దూతలు వచ్చి ఈ సూత్రమును తెంచుదురు. సాధారణజనులకు యమదూతలు ఈ పనిచేయుదురని యభిప్రాయము. ఈ విషయమందు అజామీళోపాఖ్యానము చదువవలయును. ఈ సూత్రము తెగినవెంటనే స్థూలశరీరమునకును జీవాత్మకును కల సంబంధము సంపూర్ణముగా విడిచిపోవును. అయినను జీవాత్మ తాను ఇన్ని సంవత్సరములకాలముపయోగించిన వస్తువును ఎడబాసి పోవుటకు ఇష్టపడక అభిమానముతో శవముయొక్క సమీపమందుండును.

జీవాత్మను మనము చూడలేము, కాని మన చర్యలనన్ని ఆ వస్తువు (జీవాత్మ) చూచును. బంధువులరోదనము మొదలగు సాహసములకు కారణము తెలియక దిగ్భ్రమచెందును. తన బంధువులు ఏల ఏడ్చెదరని అడుగును. ఆ మాటలు మనకు వినరావు. ఏలనంటే కర్మేంద్రియమైన వాగింద్రియము అచట నేలపడియుండు శవమునందున్నది. కాని ఛాయాశరీరమందుండు ఇంద్రియముతో వైఖరీవాక్కు నుచ్చరించుటకు సాధ్యముగాదు. జీవాత్మ ఏవిధముగానైనను మనతో మాటలాడి మనము ఏడ్చుచున్నందుకు కారణమేమని యడుగవలెనని యెన్ని విధముల మనలను హెచ్చరించినను మనకు తెలియక పోవును. మనలకు సూక్ష్మదృష్టి లేనిది కారణము. కనుక తాను విసికి జీవాత్మ ఒక మూల చేరి తనకు ఇన్ని సంవత్సరములకాల ముపయోగముగానుండిన శరీరము తన కిపుడుపయోగించనందుకుగా దుఃఖించుచుండును.

### దహనము

ఇంతలో నిరుగింటివారు పొరుగింటివారందరును గుంపులు కూడి శవమును కట్టి శ్మశానభూమికి తీసుకొనివెళ్లుదురు.

తస్మాన్మరణం హి స్థూలే తత్పరిత్యజ్య జీవస్య సూక్ష్మశరీరాభిగమన రూపకార్యకరణ మేవ। అత ఏవ "మృతే సతి యమాలయం గచ్ఛతి" ఇత్యాది ప్రవచనం। యమో హి నివృత్తిః। తదాలయ స్సూక్ష్మదేహః। నివర్తనం హి ప్రవర్తనస్యైవ భవతి। యదిదం ప్రవర్తనం స్థూలదేహస్థితి రూపం। తతో నివృత్య అన్యత్ర గచ్ఛతీతి విజ్ఞేయం। సోయం యమాలయో హి సూక్ష్మదేహః। తస్మిన్ జీవస్య స్థితిః। స్థిత్వా కామలోకాదిషు నివసతి జీవః ఇతి విజ్ఞేయం ॥

ఎపుడు స్థూలశరీరము మందావస్థను (ముదుసలితనమును) చెందునో అపుడు జీవుడు స్థూలమును విడిచి సూక్ష్మములోనికి వెళ్లును. ఈ చర్యకు మరణము అని పేరు. మరణానంతరము జీవుడు యమాలయమునకు పోవును అను స్మృతివాక్యమునకు ఇదే అర్థము. యముడు అంటే నివృత్తి అని యర్థము. అతని ఆలయము అనగా సూక్ష్మదేహాయు. ప్రవర్తనను అనుసరించియే కదా నివర్తన. స్థూలదేహామందుండి విషయవ్యాప్తిగలిగియుండిన స్థితికి ప్రవర్తన యని యర్థము. స్థూలదేహస్థితిముగియగానే ప్రవర్తన ముగియును. నివర్తన యారంభించుననగా యమాలయము అను పేర వ్యవహరింపబడు సూక్ష్మదేహములో నిలుచును. సూక్ష్మదేహావాసియైన జీవుడు కామలోకమందుండును.

> సూక్ష్మస్థూలయో ర్నిత్యసంబంధా త్సూక్ష్మదేహస్థ జీవః కామలోకాదాగంతుమిచ్ఛతి। యది చేత్ స్థూలశరీరస్య వర్తమానతా, తర్హి మృతేఽపి స్థూలదేహే హ్యేత దాగమనం పూర్వ మిష్టపదార్థానాం పరిచిన్తనం తస్య కామలోకేపి భవతి। అత్యంతమిష్టతయా చా గత్య తాదృశస్థూలదేహేన తేషాం పదార్థానాం భోగసాధనత్వం భవతి। తత్రాప్యనేకే చ దోషాః సంభవంతి। తద్వారణాయ హి చాస్య స్థూలదేహస్య అగ్నౌ ప్రక్షేపః। స్థూలదేహా భావేపి స్థూలసదృశం ఏకం లింగశరీర మధితిష్ఠతి। సోపి స్థూలాంతర్గత మేవ। తత్ర స్థితౌ సత్యామపి పదార్థభోగో భవతి। ఈప్సితతమానాం తద్ద్వారా ప్రాప్తి రితి విజ్ఞేయం।

మరణాత్పూర్వము అనేకసంవత్సరములు అనగా నాయుష్కాలమంతయు స్థూలశరీరమునకు కామమయశరీరమునకు ఐకమత్యము విడనాడకయుండియున్నందున పరస్పరస్నేహము అతిబలము.

మరియు జీవాత్మ తాను స్థూలశరీరమును ఆయుష్కాలమంతయు ననుభవించియుండెను. కొంతకాలము మనముపయోగించుచుండిన వస్త్రములుగాని ఆభరణములుగాని మనకు అతిప్రియవంతము లగుచు ఉండలేదా. అట్లుండగా “ భోగాయతనం ఇదం వపుః ” అని సకలవిధములైన సంతోషానుభవములను తనకు ఇచ్చుచుండిన స్థూలశరీరమందు ఆత్మకు ఎంతటి అభిమానముండవలెనో యోచించిచూడుడు. జ్ఞానేంద్రియములైన; శ్రోత్రముతో నెన్ని సంగీతములను వినియుండును, తనప్రియయొక్క ప్రేమాలాపములను వినియుండును; మరియు నేత్రేంద్రియముతో నెన్ని సంతోషదాయకములైన వస్తువులను చూచియుండును; రసనేంద్రియముతో రుచులు రుచులుగా భోజనపానంబులుచేసి సంతసించియుండును; త్వగింద్రియమైన శరీరముతో చందనపుష్పాది అనుభవములనును ప్రియాలింగనములనును అనుభవించియుండును. ఇదే విధమున కర్మేంద్రియములతో నెన్ని యానందములననుభవించియుండును. కనుక “ భోగాయతనం ఇదం వపుః ” అయిన స్థూలశరీరముమీద ఆత్మకు మమత్వ మెంతో అధికముగా నుండును. కనుక సూత్రము తెగిన ద్వారా ఆ స్థూలశరీరమునకును ఆత్మకును గల సంబంధము తెగిపోయినను తాను కామమయశరీరమందు ప్రకృతము నివసించియున్నను తనదిగానుండిన స్థూలశరీరములో మరల ప్రవేశించి సుఖములను అనుభవించవలె నని అతిబలవంతమైన ఆశగొనియుండును. కనుక చచ్చియైనను స్థూలశరీరముంచే సర్వప్రయత్నేన జీవుడు ఆశరీరమందు ప్రవేశించుటకు కావలసిన సన్నాహములను చేయును. అట్లు స్థూలశరీరమందు ప్రవేశించిన

యెడల అనేక దుఃఖములు కలుగును. కనుక మరణముచెందిన స్థూలశరీరము అగ్నికి నియ్యబడును.

ఒక ఆక్షేపము కలుగవచ్చును. జీవాత్మ స్థూలశరీరమును ప్రవేశించుటకు ఇచ్ఛయించితే ఆశరీరమును కాల్చి భస్మముచేయకయే భూస్థాపనచేయుసంప్రదాయము ననుసరించి మట్టిక్రింద దాచియుంచితే జీవాత్మ ఆ శరీరములో ప్రవేశించితే మాత్రము ఏవిధము ఆ శరీరమును మట్టిక్రిందినుండి పైకి తేగలడు. పైకి తెచ్చినప్పటికే కదా అందువల్ల ననర్థముకలుగును అనవచ్చును. మట్టిక్రింద స్థాపించబడినపుడు స్థూలశరీరము ఉపయోగించుటకు సాధ్యముకాదు. నిజమే. ఐనను ౧౨౨ వ పుటయందు చెప్పినప్రకారము స్థూలశరీరము భూస్థాపనమైయుండగా ఛాయాశరీరము ఆ శరీరమునకు సరిగా పైన ఆకాశమందు తేలుచుండును. స్థూలశరీరమును ఉపయోగించుటకు వీలులేకపోయినందున జీవుడు ఛాయాశరీరములో ప్రవేశించి ఆ శరీరమునే స్థూలశరీరమువలె నుపయోగించును. ౨౨౬ వ పుటయందు "స్థూలదేహాభావేపి స్థూలసదృశం ఏకం లింగశరీర మధితిష్ఠతి। సోపి స్థూలాంతర్గతమేవ" యని మొదలుగాగల వచనములవల్ల ఆ ఛాయాశరీరముతో మాత్రము అత్యంతప్రియములైన స్థూల విషయములను అనుభవించుటసాధ్యము. విషయములను అనుభవించితే యేమి చెడుపు అని ఆక్షేపించవచ్చును. ఇది జీవాత్మ యొక్క పురోవృద్ధికి చాలచెడుపు. కనుక స్థూలదేహమును భూస్థాపనచేయక దహనము చేయుటవల్ల ఛాయాశరీరముకూడ నశించును. ఈ కష్టములన్నియు కామాతురులైన జీవాత్మలకే గాని కొంచెము వైరాగ్యమును సంపాదించిన వారికి కలుగదు.

సంన్యాసులశవములను దహించు సంప్రదాయములేదే వారి గతి యేమి యని యడుగవచ్చును. ఈ కాలపు సంన్యాసులలో కూడ చాలమంది వైరాగ్యముచెందియుందురు. కొందరు అతివ్రాత్యులు, "ఆహారానంద," "సంగీతానంద," "నిద్రానంద," "శయ్యానంద," అను పేళ్ల కొందరు అధములున్నను ప్రాయశః వైరాగ్యవంతులే సంన్యాసులగుదురు గనుక వారలశరీరములు భూస్థాపనమైనను చెరుపు కలుగదు.

కేవల విషయాసక్తులైన వారి దేహములు శ్మశానమునందు దహించినందున అట్టివారికి దహించినవారిమీద అతి ఉగ్రమైన కోపము వచ్చును. ఛాయాశరీరవాసులై శ్మశానమందు నిలిచియుండి చితిపైనుండి తమ శవమును ఏవిధముచేతనైనను క్రిందికి పొర్లించుప్రయత్నము చేయుదురు. ఉద్దేశమేమంటే ఆ శరీరము దహింపబడకూడదు అని. తనకు చాల ప్రియులైన బంధువులందరును తనకు అతిప్రియమైనస్థూలశరీరమును దహించిరి. తాను అనేకవిధముల వారలతో మాటలాడవలెనన్నను వారు మాటలాడరైరి. ఇట్టి అన్యాయములను కొంచెమయినను దయలేకయే క్రూరమును చూపిన బంధువులయొక్క చేష్టలు చూచి ఛాయాశరీరమందుండు జీవాత్మకు దిగ్భ్రమకలుగును. అందువలన జ్ఞానేంద్రియములన్నియు మాయగప్పినట్టు చెవిటితనము, మూగతనము మొదలగు అవస్థలు కలుగును.

కనుకనే దహనము జరుగుచుండినపుడే నగ్నశ్రాద్ధ మనియొక్క కర్మ చేయుదురు. "ప్రేతస్య అంధత్వ, మూకత్వ, బధిరత్వ నివారణార్థం నగ్నశ్రాద్ధం కరష్యే" అని సంకల్పము.

ఈ శ్రాద్ధమువల్ల అంధత్వాది దోషములు నివారించును. ఈ లోపల స్థూలశరీరపు అణువులన్నియు పటాపంచలై పోగా ఛాయాశరీరముకూడ చెదిరిపోవును. జీవుడు కామమయశరీరమందు నిలిచి వెలుపలి సంగతులేమియు తెలియక నిద్రావస్థవలె సాధారణముగా రెండుదినములుండును.

ప్రేతకు అపరక్రియలు జరుపునపుడు " దహనజనితతాప తృష్ణా, పిపాసా, క్షుదు పశమనార్థం మృత్తికాస్నాన, వాసోదక, తిలోదక, పిండప్రదానాని కరిష్యే " అని మంత్రములబాడుదురు.

తాపము, తృష్ణా, పిపాసా, క్షుత్ అనునవి యంతయు జీవునియొక్క భ్రమవల్ల కలుగునవి. దహింపబడినశరీరమే తానని జీవుడు అనుకొనియుంటే అగ్నియొక్క వేడిమివల్ల తాపము, దాహము, ఆకలి మొదలగునవి కలిగినట్లు అనుకొనును. కామలోకమునందుజీవులు ఏ విధమైన శ్రమ తమకుసందర్భించినది అని అనుకొన్నను అట్టి శ్రమ సందర్భించును. తలంపువల్ల కలిగిన శ్రమ; వేరుకాదు.

శ్మశానమునందు దహనము ముగించి యిల్లుచేరగానే శవము ఉండినస్థలమునకు సరిగా పైన రెండు ఉట్లుకట్టి ఒక పాత్రలో జలమును ఒకపాత్రలో క్షీరమును నించి ఆ యుట్లపై ఉంచుదురు. ప్రేతకు దాహము అని తోచినప్పుడు ఆ జలముయొక్క సారమును పీల్చును. ఆకలి అని తోచినపుడు క్షీరముయొక్క రసమును పీల్చును. అదిమొదలు దశదినంబులు ప్రతినిత్యమును శవముండినచోట ఒక పాత్రలో నీళ్లును మరియొక పాత్రలో అన్నమును ఉంచుదురు. ఇందుకును పై చెప్పిన యుద్దేశమే.

ఈ ప్రకారము సంసారచక్రయాత్రయందు తన స్వస్థానమైన శుద్ధమనోమయశరీరమునకు వాసస్థానమైన "హైయర్ మెంటల్ ప్లేను" అను పేరబరగు మెంటల్ ప్లేనుయొక్క పైమూడు సబు ప్లేనులయందుండి (౧౩౫ వ పుట చూడుడు) లోయర్ మెంటల్ అను భాగమునకు దిగి వచ్చి అశుద్ధమనోమయశరీరమును గ్రహించి అచ్చటినుండి ఆస్ట్రిల్ ప్లేనుకు దిగి అచ్చట "ఆస్ట్రిల్ బాడీ" (౧౦౬ వ పుట చూడుడు) అను శరీరమును సంపాదించికొని భూలోకమునకు వచ్చి గర్భవాసముచేసి శిశువై, బాలుడై, వటువై, గురుకులవాసముచేసి, స్నాతుడై, గృహస్థై, బిడ్డపాపలగని, బ్రహ్మోవలోకధిషణుండై, గృహస్థాశ్రమమును ముగించుకొని, వానప్రస్థ సంన్యాసములకు సిద్ధుడై కాలవశమున మరణముచెంది, స్థూలశరీరమును పోగొట్టుకొని, భూలోకమందుండినపుడు తాను కోరిన కోరికలు తలంచిన తలంపులు సత్కార్యములు దుష్టకార్యములు అన్నిటినిని చరమావస్థయందు పరీక్షించి వానియొక్క సారాంశ సంభూతమైన నిశ్చయజ్ఞానయుక్తుడై, అదివరకును తనకుండిన ఛాయాశరీరమును కూడ పోగొట్టుకొని కామమయశరీరమునందు నిలిచి కామలోకానుభవములను విమర్శించుటకు సిద్ధమైయుండు జీవాత్మ కామలోకమందేమిచేయబోతున్నాడని విచారించవలెను.

## కామలోకము

"కామనాయాః లోకః కామలోకః ఇతి వ్యుత్పత్తిః." అనగా భూలోకమందుండినపుడు కామించిన కామములనుగురించి చింతన జరుపుటకుగా నిర్ధారింపబడిన లోకము. దీనినే పితృలోక

ము, నరకము అనియు వాడుదురు. ఇది భువర్లోకముయొక్క భాగము.

> "మృతేసతి యమాలయం గచ్ఛతి" ఇత్యాది ప్రవచనం । యమో హి నివృత్తిః । తదాలయ స్సూక్ష్మదేహః । తస్మిన్ జీవస్య స్థితిః । స్థిత్వా కామలోకాదికే నివసతి జీవః ఇతి విజ్ఞేయం । తత్రైవ సూక్ష్మకర్మణాం భోగో భవతి । స చ దుఃఖరూపః । తత్రైవ నరకాది వ్యవహారః । తత్ర త్యానాం అశుభకామానాం తస్య పరిచింతనా భవతి । అతః ఏవ తత్ర అనేక దుఃఖానుభవః । అత్ర శోక మనుతిష్ఠతి ।

చచ్చి యమాలయమునకు పోవుచున్నాడని లోకోక్తి. యముని యొక్క ఆలయము సూక్ష్మదేహము. దీనినే మనము కామమయ శరీరము అని వాడుచున్నాము. కామమయశరీరముతో కామ లోకనివాసము. భూలోకమందుండినపుడు తలంచిన అశుభకామ ములయొక్క చింతనము కామలోకమందు జరుగును. అట్టి చింత నము దుఃఖరూపముగానుండును. ఇదే నరక మని వ్యవహారిం తురు. పైకనిన సంస్కృతవాక్యములయొక్క అర్థమునే ఇక ముం దు కొంత విపులముగా వ్రాయుదుము.

ఈ అధ్యాయములోనే మరణమునుగురించి వ్రాసినపుడు దహనము అయిన పిమ్మట నగ్నశ్రాద్ధము జరిగినదనియు తదనం తరము ప్రేతయొక్క బంధువులు ఇండ్లకు తిరుగుకొనివచ్చి ప్రేత యుండిన స్థలములో రెండు ఉట్లు వ్రేలవిడిచి యొకటిపై నీళ్లను-ఒకటి పైన పాలును గల పాత్రలనుంచి నారనియు, పిమ్మట పది దినములవరకును ప్రతిమధ్యాహ్నమును కొంత అన్నమును కొంత ఉదకమును ఉంచుసంప్రదాయమును కలదు అని వ్రాయబడెను. ఇదంతయు ప్రేతయొక్క బంధువులు చేయు కార్యములు.

ప్రేతకు దహనము అయిన మరునాడు సంచయనము జరుగును. నిత్యవిధి జరుగును. ఈ లోపల స్థూలదేహమును పోగొట్టుకొనిన జీవాత్మయొక్క కామమయశరీరమునందు కొన్ని మార్పులు ఏర్పడును. కామమయశరీరము ఆస్ట్రిల్ ప్లేనుకు సంబంధపడినది. భూలోకము అను ఫిజికల్ ప్లేనునందు ఏడు విధములైన ప్రకృతిభాగములున్నట్టే భువర్లోకమైన ఆస్ట్రిల్ ప్లేనునందు కూడ ఏడు విధములైన ప్రకృతిభాగములున్న వని ౧౧౭ వ పుట యందు చెప్పబడియె. ఆస్ట్రిల్ బాడీ అని మారుపేరుగల కామమయశరీరము ఆస్ట్రిల్ ప్లేనుయొక్క ఏడు సబుప్లేనుల ప్రకృతి వల్ల కట్టబడినది అనియు చెప్పబడియె. కామమయశరీరపు అణువు లన్నియు కామమయశరీరముయొక్క ఎల్లకు లోబడి సదా సర్వ కాలములయందును ఉండినచోటనుండకయే తమ యిష్టానుసారముగా కలిసి సంచరించుచుండునని ౧౨౦ వ పుటయందు చెప్ప బడియె. జీవాత్మ స్థూలశరీరమునందు వసించియుండు కాలమునందు ఈ విధముగా అణువుల మేళనము అగుచుండును. అగ్నిపైన యొక పాత్రలో జలమును ఉంచి తెర్లపెట్టితే ఆ జలముయొక్క అణువులు నాట్యముచేయునుగదా. ఆ పాత్రయొక్క అడుగుభాగమునందుండిన నీటియణువులు నీటిపైభాగమునకెగియును. ఆ జలముయొక్క అణువులలో నొక యణువైనను తానున్న స్థలమందుండదు గదా. అదే విధమున ఆస్ట్రిల్ బాడీయొక్క అణువులు ఎల్లపుడు స్థలము మారుచుండును. దహనము అయిన పిమ్మట రెండుదినములవరకును స్మారకములేక నిద్రపోయినట్టు జీవాత్మలు ఉందురు. తరువాత మేలుకొన్నప్పటికి ఆస్ట్రిల్ బాడీలోని స్థూలాతిస్థూలములైన

అణువులన్నియును నొక ఆవరణముగా నేర్పడియుండును. ఇది అప్తత్త్వమునందు పృథివీభాగపు అణువులు. ఇంతకంటె సూక్ష్మములైన అప్తత్త్వమునందు అప్పుభాగపు అణువులన్నియు నొక ఆవరణముగా నేర్పడును. అప్తత్త్వపు తేజస్సణువులన్నియు నొక ఆవరణముగా నేర్పడును. ఇదే విధముగా మిగిలిన నాలుగు విధముల ప్రకృతిభాగములును చెరి యొక యావరణముగా నేర్పడును. అనగా ఏడు ఆవరణములగా నేర్పడి అశుద్ధమనోమయ శరీరమును శుద్ధమనోమయశరీరమును మరియు పైశరీరములను ధరించియుండు ప్రేతను ఆవరించుకొనును. నట్టనడుమ మనోమయశరీరములయందుండు జీవాత్మ, అతనిచుట్టు మొదటి యావరణముగా ఆస్ట్రల్ ప్లేను మొదటి సబుప్లేనుకుచేరి సూక్ష్మాతి సూక్ష్మమయిన ప్రకృతితో కట్టబడిన యావరణము; ౨. జీవాత్మను, మొదటి యావరణమును, ఈ రెంటినిని ఆవరించుకొని సుసూక్ష్మము అయిన ఆస్ట్రల్ ప్లేనుయొక్క రెండవ సబుప్లేనుకుచేరిన ప్రకృతిచే కట్టబడిన యావరణము; 3. ఇదివరకుండు రెండు ఆవరణములను, వాటిమధ్యన ఉండు జీవాత్మను, అంతటినిని ఆవరించుకొని ఆస్ట్రల్ ప్లేనులో మూడవసబుప్లేనుయొక్క (అప్తత్త్వపుఆకాశ) ప్రకృతిచే నేర్పడిన యావరణము; ౪ ఇదివరకునుండు మూడు ఆవరణములతో కూడిన జీవాత్మను ఆవరించుకొని ఆస్ట్రల్ ప్లేను నాలుగవసబుప్లేనుయొక్క (అప్తత్త్వవాయువు) ప్రకృతివల్ల నేర్పడిన యావరణము; ౫. ఇదివరకునుండిన నాలుగు ఆవరణములను, వానిమధ్యనుండు జీవాత్మను, ఆవరించుకొని ఆస్ట్రల్ ప్లేను అయిదవ సబుప్లేనుయొక్క (అప్తత్త్వతేజస్సు) ప్రకృతివల్ల నే

ర్పడిన యావరణము; ౬. ఇదివరకునుండు ఆవరణములతో నావరింపబడియుండు జీవాత్మను ఆవరించుకొని ఆస్ట్రిల్ ప్లేను ఆరవ సబుప్లేనుయొక్క (అప్తత్త్వపు అప్పు) ప్రకృతిచే నేర్పడిన యావరణము; ౭. ఇదివరకునుండు ఆవరణములతో కలసిన జీవాత్మను ఆవరించుకొని ఆస్ట్రిల్ ప్లేనుయొక్క ఏడవసబుప్లేను (అప్తత్త్వపు పృథివీ) ప్రకృతిచే నేర్పడిన యావరణము. ఇట్లు ఏడు ఆవరణములు జీవాత్మ కేర్పడును. వెలుపలినుండి చూచువారికి ఏడుప్రాకారములుగల కోటయొక్క నడుమనుండు యజమానునివలె జీవాత్మ అగపడును. మొట్ట మొదట అతిస్థూలమైన యావరణమునందు మాత్రము సంచరించి స్మారకము కలిగియుండునట్టిశక్తి జీవాత్మ కుండును. అపుడు జీవాత్మ ఆస్ట్రిల్ ప్లేను ఏడవ సబుప్లేనునందున్నాడు అందుగు.

## ఆస్ట్రిల్ ప్లేను, ఏడవ సబుప్లేను

సాధారణజనుడు భూలోకమందు ఉండినపుడు బహు నీచములైన కామములను కామించియుండును. సాధారణజనుడు శుద్ధపశుప్రాయుడై కామక్రోధములకు పరిపూర్ణముగా లోబడి పాపములను చేయును. కామలోకముయొక్క అతిఘనము అయిన ఈ భాగమునందు స్వప్రయోజనపరులై ఇతరులను చంపినవారు, మహాఘోరస్వభావముగలవారు, బంతిపోటు మొదలగు క్రూరములైన చర్యలను చేసినవారు, తాగుపోతులు, మహాక్రూరులు, నిర్ణయము లేక వ్యభిచారముచేసినవారు, ఇట్టి జీవాత్మలుందురు.

సోలిగా డనువాడొకడు భూలోకమందుండగా నొక బంతి పోటు అను నేరమును చేసి ఆకార్యమునందు తనకడ్డమువచ్చిన బుచ్చినాయడు అను మనుష్యుని తలనరికినాడనుకొందము. చచ్చిన తరువాత ఆస్ట్రిల్ ప్లేనుయొక్క ఏడవ సబుప్లేనునందు స్మారకముచెందినవాడై తనచేతచంపబడిన బుచ్చినాయునిపోలిక గల ఒకరూపము తనను చంపుటకుగా తరుముకొనిరాగా తన ప్రాణముకాపాడుకొనుటకు పరుగెత్తుచుండును. ఇట్టి భయంకర మైన పరుగెత్తుట ఎల్ల లేని విధముగా మితిలేనంతటి భయముతో విరామములేక జరుగుచుండును. స్థూలశరీరమును వదిలి ఆస్ట్రిల్ ప్లేనునందు చేరినవారికి భోజనము అవశ్యము లేదు. నిద్ర అవశ్యము లేదు. అలసట వారెరుగరు. భోజనము, నిద్ర, అలసట ఇవంతయు స్థూలశరీరము ఉన్నంతవరకే. కనుక స్థూలశరీరము లేమిచే నిద్రకు అవశ్యము లేని సోలిగానియొక్క భయమునకు పరుగుకు కొన లేనే లేదు. భూలోకమునందు చంపబడిన బుచ్చినాయడు నిజముగా సోలిగానిని తరుముకొని పోలేదు. సోలిగాని మనస్సునందు తాను చేసిన దుష్కార్యముయొక్క ఫలమైన భయమువల్ల పుట్టిన ఆకృతి బుచ్చినాయని శరీరముయొక్క పోలిక. తన మనస్సుతో కల్పించుకోబడిన బుచ్చినాయని రూపము తనను చంపుటకుగా తరుముకొని వచ్చుచుండగా ఆ రూపమును చూచి భయపడి తాను అయిన సోలిగాడు పరుగెత్తుటయే గాని వేరు కాదు. ఈ విధముగా అంతములేని భయముతో పరుగెత్తి విసికి పోయి ఇక నేను ఎవరినిని చంపుటలేదు అని నిశ్చయించుకొని, నిశ్చయించుకొని ఇట్లు పలుమారు అనగా వేలకొలది

తడవలు నిశ్చయించుకొని చంపుట అను స్వభావమును పో గొట్టుకొనును.

నరకబాధలను మన పురాణములలో అనేకవిధములగా వర్ణించియున్నారు. ఆవర్ణనలన్నియు మహాభయమును పుట్టించు నవి. ఇట్టి పాపమునుచేసిన యెడల ఇట్టి దండనయని విని భయపడి పాపములను చేయకుండవలయునను నుద్దేశముతో చెప్పిరేమో. ఐతే మనోవ్యథ, భయము అను దండనలు ఎడతెగక అనేక సంవ త్సరములకాలము అనుభవించుటకంటె కుంభీపాకము, రౌరవము మొదలగు నరకములయందు పాపాత్ములు అనుభవింతురు అని చెప్పిన దండనలు అతి సులభములు.

ఇదేవిధముగా సోలిగాడు భూలోకమందుండినపుడు చేసిన ఒక్కొక పాపమునకు ఫలముగా దండనలను మనోవ్యథరూప ముగా ననుభవించును. ౨౩౨ వ పుటయందు "తత్రైవ సూక్ష్మ కర్మణాం భోగో భవతి, స చ దుఃఖరూపః" అని చెప్పి దీనినే నరకము అని వ్యవహరింతురు అని చెప్పియున్నది. మానహీను లను దెబ్బలతో దండించిన గాని వారికి తమను దండించినారని తెలియదు. మానవంతులకు అవమానకరమైన యొక్క తిట్టు చాలును. మన పురాణములయందు వర్ణించిన నరకబాధలన్నియు శరీరమునకు శ్రమ కలుగచేయుద్వారా బుద్ధికుదురునట్టు చేయు నవి. అట్టి దండన శుద్ధమోటుమనుష్యులను భయపరుచును. మానవంతులకును కొంతమట్టుకు తెలివిగలవార్లకును మనస్సునకు కలుగు బాధలు శరీరమునకు కలుగు బాధలకన్న నధికముగా బుద్ధిని కుదుర్చును.

దురాత్ములు చేయు పాపములు అనేకములు. ప్రతిపాపమునకును పైవివరించిన ప్రకారము భువర్లోకపు దేవతావర్గము అయా పాపమునకు అన్వయించునటుల మనోవ్యధల నిచ్చి పాపము చేసినవానికి పాపభీతి కలుగునట్టు చేయుదురు. ఈ విషయమును గురించి యింతకంటె నధికముగా వ్రాయుటకు ఈ పుస్తకమునందు సాధ్యము కాదు. గ్రంథబాహుళ్యమగును.

కామలోకమునందలి యీ భాగమునందు మరియు ననేక విధములైన దుష్కార్యములను చేసినవారుందురు. ౧. అత్యంతవ్యభిచారాసక్తికలవారు, ౨. తాగుపోతులు, 3. మహాక్రూరస్వభావముగలవారు, ఇట్టి దుస్స్వభావముగలవారు ఇక్కడ ఉందురు. ఇక్కడ ఉండు మరికొందరు ఎవరంటే, జీవహత్యచేసికొనినవారు. భూలోకమందు శ్రమలను తప్పించుకోవలెనని కొందరు జీవహత్య చేసికొందురు. తనకు ఇతరులయొక్క తప్పులు తెలిసియుండి ఆ తప్పులు చేసినవారి విషయమై న్యాయస్థానమునందు విచారణ జరుగుచుండగా తనను సర్కారువారు సాక్షిగా కోరితే తనకు తెలిసిన సంగతులను చెప్పితే తప్పుచేసినవారికి దండన కలుగు రీత్యా అవమానము సంభవించు నని కేవల పరోపకారబుద్ధితో తాము జీవహత్యచేసికొని ఆ రీత్యా మానవంతులమానమును కాపాడువారు కొందరు. వీరును జీవహత్య చేసికొనినవారే. సాధారణముగా జీవహత్య చేసికొనినవారు ఏ విధముగా మనోవ్యధను అనుభవింతు రనగా తాము చేసినతప్పును ప్రతినిమిషమందును చింతించి అందువలన కలుగబోవు అవమానమును చింతించి చింతించి ఆ యవమానమును తప్పించుకొనుటకుగా తాను చేసిన జీవ

హత్యప్రయత్నములను మరల మరల చేయుచు జీవహత్యచేసికొను చుందురు. స్థూలశరీరమున్నపుడు ఒక తూరి జీవహత్యతో శరీరము రాలిపోవును. కనుక ఒకటే జీవహత్య. ఇచ్చట ఆ ప్రకారము కాదు. యాతనాశరీరమునకు మరణము లేదు. కనుక ఎన్ని మార్లు జీవహత్యను ఆచరించినను చావు రాదు. అయితే మనస్సునకు కలుగు వ్యధ, భయము, విసుకు, ఇవన్నియు చాలమెండు. పెద్ద చక్రము తిరిగినట్లు ౧. అవమానముకలుగునట్లు చేసినకార్యము, ౨. దానివలనకలుగుననియెంచిన అవమానము, ౩. అందువల్ల కలిగిన హాహాకారము, ౪. ఆ యవమానమును తప్పించుకొనుటకుగా చేసిన జీవహత్య, ఈ నాలుగు దుఃఖములును ఒకటి వెంబడి మరియొకటి వేలకొలదితడవలు తిరిగి తిరిగి జరుగుచు జీవహత్యను గాని అందుకు కారణమైన అవమానాస్పదమైన కార్యమునుగాని యికమీదట చేయను అను మనోదృఢము కలుగును.

పరోపకారార్థము జీవహత్య చేసికొనినవారి ఉద్దేశము అతి ఉన్నతమైనను జీవహత్య అను చర్య చెడ్డది గనుక మనోవ్యధకు కారణములేకున్నను ఈ కామలోకభాగమునందు వారు కూడ కొంతకాలముందురు.

పైన చెప్పిన తిండిపోతులు ఎల్లపుడును తిండితినుటకు ఆశించుచుందురు. ఐనను స్థూలశరీరము లేనందున భుజించుట సాధ్యము కాదు గనుక భూలోకమందు అప్పట్లో జీవించియుండు తిండిపోతులవద్ద చేరి వార్లను తమకు ఇష్టమైన పదార్థములను భుజించుమని మనసా ప్రేరేపించు రీత్యా మనోభావములను కుమ్మ

రించి వారు తిన నారంభించినపుడు వారల రసనేంద్రియములను ప్రవేశించి ఆ రుచిని అనుభవించుచుందురు.

ఇదే విధమున తాగుపోతులు కూడ సారాయి అంగళ్లు, కల్లు అంగళ్లు, కాఫీక్లబ్బులు, ఇటువంటి స్థలములవద్ద గుంపులుకూడి ఆ దుకాణములకు వచ్చువారిని తాగుటకు ప్రేరేపించి ప్రేరేపించి మితిలేక తాగునట్లు చేసి వారు తాగినపుడు వారల రసనేంద్రియములను ప్రవేశించి ఆ సారమును గ్రహించి ఆనందింతురు.

అమితమైన వ్యభిచారము చేయుచుండినవారు భూలోకమునందు ఉండు వ్యభిచారరతులైనవార్లను వ్యభిచారమునకు ప్రేరేపించి వారు ఆ దుష్కృత్యము చేసినపుడు వారియందు ప్రవేశించి ఆ చర్యయొక్క విషయమైన "ఆనందమును" అనుభవింతురు. ఇట్లు ఇతరులను దుష్కార్యములయందు ప్రేరేపించుటచేత కామలోకవాసులైనను క్రొత్త దుష్కర్మచేయుచుందురు. వీరికే అసుర సంపత్తిగలవారని పేరు.

అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరం ।
అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకం ॥ ౮ ॥
ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః ।
ప్రభవంత్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః ॥ ౯ ॥
కామమాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః ।
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః ॥ ౧౦ ॥
చింతామపరిమేయాం చ ప్రళయాంతా ముపాశ్రితాః ।
కామోపభోగపరమాః ఏతావ దితి నిశ్చితాః ॥ ౧౧ ॥
ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ।
ఈహంతే కామభోగార్థ మన్యాయే నార్థసంచయాన్ ॥ ౧౨ ॥

అనేక చిత్తవిభ్రాంతాః మోహజాలసమావృతాః ।
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ ॥ ౧౬ ॥
అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।
మా మాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః ॥ ౧౮ ॥
(శ్రీమద్భగవద్గీత, ౧౬ అధ్యా)

ఆసురసంపత్తిగల మూఢులు జగత్తునకు కారణమైన ఈశ్వరుడు లేడని నమ్మి జగత్తు తనంతట తానే కలుగుచున్నది అందురు. ఆడుదియును మగవాడును గలిసినందువలన లోకము కలిగినది అందురు. ఇంద్రియగోచరములు కాని వస్తువులు లేవని చెప్పుచు, స్వర్గము నరకము అనునవి లేవనుచు, లోకక్షోభ కలుగజేయుకార్యములను చేయుచు, ఇతరులచేత కూడ చేయించుచు, ఎంతకష్టపడినను తృప్తిపొందించుట కసాధ్యమైన దురాశగలవారలై, తమ్మునందరు గొప్పవాండ్రని మన్నించవలెనని తమను మించిన వేషభాషలుగలవారలై, “మాకు గదా యిట్టి అదృష్టము సంభవించె” నని దురభిమానము గలవారలై, అన్నియు తమకే తెలియునను నవివేకముతో కేవల కించిత్కాలికఫలముల నుద్దేశించి క్షుద్రదేవతలను పూజించి, మద్యము మాంసము మొదలగు ఆహారములను మెక్కి అధోగతి చెందుదురు. అశక్యములగు విషయమ్ములను అనుభవించు కోరికను కలిగించు ఆశాపాశములచే లెక్కలేనన్ని విధములగా బంధింపబడి, తమకామితార్థముల ననుభవించుటకుగా అన్యాయముచేత ద్రవ్యార్జనచేయుచు, అవివేకముచే నిరంతరము విషయానుభవమునందే కాలహరణము చేయుచు, మితిలేనిపాపమును కూడబెట్టుకొని నరకములందు పడుదురు. దంభముచేత నధార్మికములైన క్రియలనుకూడ ధార్మికక్రియలని వాడుచు, మాన

ముచేత అపూజ్యులైనవారలనుగూడ పూజ్యులని చాటించుచు, మదముచేత శ్రేష్ఠులుకానివారలనుకూడ శ్రేష్ఠులని సమ్మానించి యితరులనుకూడ తనవలెనే సమ్మానించునట్లు చేసియు, ఈ మంత్రములను ఆవర్తిచేసి ఈ దేవతను తృప్తిపరిచి మహానిధులను సంపాదించెదను, ఈ మంత్రములను జపించి స్త్రీవశ్యము మొదలగు సంతోషదాయకములైన ఫలముల ననుభవించెదను, శ్మశానముల యందు ఉండి తాంత్రికవామమార్గపూజలను చేసి ఇతరులకు బాధకరములైన సిద్ధులుపొందుదును, కామ మొక్కటే పురుషార్థము అని అనేకులకు కంటకులుగానుందును అని దంభమోహామదములను అభ్యసించుదురు. మరియు తమ శరీరములయందును ఇతరులశరీరములయందును వసించియుండు పరమేశ్వరుని ద్వేషించి భగవదాజ్ఞలైన శాస్త్రవాక్కులను ఉల్లంఘించుదురు.

ఇతరులచేత చంపబడినవారికి అకాలమరణము సంభవించినది. ఇదే విధమున దైవవశముగా నకాలమరణమునకు పాత్రులైనవారందరును ఆస్ట్రిల్ ప్లేనుయొక్క ఏడవ సబుప్లేనునందు నిద్రించియుందురు. మనఃపూర్వకముగా జీవహత్యచేసికొనినవారికిని అకాలమృత్యువునకు పాత్రులైనవార్లకును వ్యత్యాసము ఏమి అనిన అకాలమృత్యువును చెందినవారలు నిద్రించుచుందురు, తెలిసి జీవహత్యచేసికొనినవారు వ్యాకులము అను మనోవ్యధ చెందుచుందురు.

ఈ లోకమందైనను పరలోకమందైనను తప్పులుచేసిన వార్లకు దండనవిధించుటయొక్క ఉద్దేశ మేమనగా తప్పులుచేయు స్వభావము మారుటయే. మహానికృష్టములైన పాపములు చేసిన వారలయొక్క కామమయశరీరములయందు మహామూతకమైన

ప్రకృతిచేరియుండును. ఈ పైవివరించిన మనోవ్యథరూపమైన దండనవల్ల ముతకలైన అణువులన్నియు నరిగిపోయి అంతకన్న సూక్ష్మమైన అణువులతో నేర్పడిన

ఆస్ట్రల్ ప్లేను, ఆరవసబుప్లేను

కు వెళ్లుటకు సిద్ధమవుదురు. ఈ ప్రదేశమందుండువారు క్రౌర్యము, మోసము మొదలగు బహుళ్లోభాకరములైన గుణములుగలవారు కారు. పరపీడనము చేయకయే తమకుకావలెనని తోచినవియు అయినను తుచ్ఛములగు ఆశలను చింతించి చింతించి అనేకకాలముగడపినవారు ఈ ప్రదేశమందుందురు. దరిద్రదోషమువల్ల తనకును తనను అనుసరించినవారికిని జీవనము జరుపుటయే కష్టముగానుండగా తన యిరుగింటివారు పొరుగింటివారును మంచి వస్త్రాభరణములు ధరించియుండగా చూచి అట్టివస్తువులు తనకులేవే, ఇది యేమిపాపము అని దుఃఖించి దుఃఖించి కాలము గడపినవారును, "ఇదమద్యమయాలబ్ధం ఇమం ప్రాప్స్యే మనోరథం" అని తాను సంపాదించిన మంచివస్తువులను చూచి పదే పదే సంతోషించి మరియును మేలైనవస్తువులను సంపాదించవలెనని కోరుకొనుచుండువారును, మరియు తనకు కలిగిన నగలను వస్త్రములనును చూచి సంతోషించి అంతమాత్రమున తనియక అట్టి వస్తువులనెల్ల పెట్టెలలో నుండి బయటికితీసి ఒకటొకటిని చూచి సంతసించి మరల భద్రపరచి మరియు రేపటిదినమందుకూడ ఇట్లే పరీక్షించి పరీక్షించి తనియనివారును; మరియు "యక్ష్యే దాస్యామి మోదిష్యే" అని జంభములను పలుకువారును; మహాలోభులును,

అహంకారమమకారంబులచే ప్రేరేపింపబడి భూతములకు ద్రోహ మొనర్చి, దినదినము తనను కాపాడుకొనువారును ; పశువులను పక్షులను స్వప్రయోజనార్థము వేటాడి చంపిన నిర్దయులును; న్యాయాధిపత్యమందుండి లంచముల తిని దండనార్హుల దండించియు, దండనీయులను విడిచిపెట్టిన మదాంధులును; చిన్న దొంగతనములను చేసిన వారును; ఇతరులసొమ్ము గ్రముచ్చిలించినవారును; ధాంభికులై దంభ యజ్ఞములం జేసి పశువులనుపీడించినవారును; ఇతరుల యిండ్లకు నిప్పు పెట్టికాల్చినరీత్యా ఇతరులకు కష్టముకలుగ జేసినవారును; ఇట్టివారు ఇచ్చట తమతప్పులకు ప్రాయశ్చిత్తరూపక మనోవ్యథల ననుభవించుచుందురు.

మరికొందరు తాము భూలోకమందుండినపుడు మనసా చింతించియున్న కామములను అనుభవించకముందే చనిపోయిరి. అట్టివారు ఆయాకామములను అనుభవించుటకు ఇచ్ఛయించి తమ మనస్సులోని అభీష్టములను భూలోకమందుండు తమబంధువులకు తెలుపవలెనని కొన్ని విధములయిన ప్రయత్నములను చేయుదురు. అనగా పూర్వము తమయిండ్లుగానుండిన స్థలములకు వచ్చి తమ బంధువులు తమను కనుక్కొనుటకుగా నధికప్రయత్నముచేయుదురు. నిష్కారణముగా ఏదో తలుపులు తటతట శబ్దమవును. లేక వేరువిధములగా తమబంధువులను పిలుతురు. నీళ్లుచల్లినట్లు నీటితుంపరలను వెదచల్లుదురు. అపుడు ఇంటివారు ఇదేమి అని తమచుట్టు పరీక్షించి ఆ తుంపరకు కారణమును వెదకుచుండగా చనిపోయినవారు తమబంధువులతో మాటలాడుప్రయత్నము చేయుదురు. బంధువులు అది గ్రహించలేరు. బ్రతికియుండినపుడు

నగలపైన అతిప్రేమతోనుండిన స్త్రీ చచ్చిన పిదప ఆ నగలు ఉన్న స్థలముచుట్టు కావలియుండి ఆ నగలను ఎవ్వరైనను ఉపయోగించ కూడదని అట్లు ఉపయోగించువారిని బెదిరించి ఆ విధమున నగలకు తనకుగల బంధమును భద్రపరుచుచుందురు. మరికొందరు తమ అభీష్టములను తమబంధువులకు స్వప్నమందు కనబడి తెలియచేయుదురు. స్వప్నములను జ్ఞాపకముంచుకొన్నబంధువులు కొన్నిసందర్భములయందు ఆ అభీష్టములను నెరవేర్చునట్టు చేయుదురు.

హిందువులలో ప్రేతలకు నిత్యవిధిచేయునపుడు నిత్యపిండమును "గృధ్రవాయసజలచరముఖేనో పభుంక్ష్వ" అని యిత్తురు. ఆ పిండమును కొన్నిసందర్భములందు కాకులు తాకవు. అపుడు ఏమి జరుగుతున్నదంటే తనమనస్సులోని అభీష్టమును తనవారికి తెలుపగోరి ప్రేత ఆ పిండమును తాకుటకు వచ్చిన కాకులను బెదిరించును. మనుష్యులకు లేని సూక్ష్మదృష్టి కాకులకు కలదు. కనుక ప్రేతను కాకులు చూచి ఆపిండముయొక్క సమీపమునకు పోక దూరాన చెట్లుచేమలపై కూరుచుండును. అపుడు ప్రేతయొక్క బంధువులుకొందరు ప్రేతనుచూడకపోయినను తమయెదుట ఉన్నట్టు భావించి "నీమనస్సులో ఏమి కోరిక? ఇట్టిదా? ఇట్టిదా?" అని తమకు తోచిన విషయములనెల్ల మాటలతో అందురు. ఆ కోరికను ఈడేర్చెదము అని వాక్కుదత్తము చేయుదురు. అపుడు కాకులు పిండమును తినును. ఇట్టివారు కామలోకపు ఆరవ సబు ప్లేనువారు. చచ్చినవారికి స్థూలశరీరము ఒక్కటి లేదేగాని వారికి మనుష్యులయందు ప్రేమ ఏమియు తక్కువకాదు. కనుక తాము

ప్రేమించినవారితో మాటలాడవలెనని పిశాచరూపముతో తమ వారి సమీపమందే నిలిచియుందురు. ఈ విధమున పైలోకములకు పోవు భాగ్యము కొంతకాలమువరకు పోగొట్టుకొందురు. ఆరవ సబుప్శ్నను గురించి వ్రాయుట కారంభించినపుడు, "క్రౌర్యము" అను దుర్గుణమును మొట్టమొదట ప్రస్తావించితిమి. క్రూరబుద్ధి గలవానికి సంస్కృతభాషయందు "నృశంసః" అని పేరు. శ్రీసనత్సుజాతులవారి యభిప్రాయమునందు క్రూరులెవ్వరని విచారింతము.

సంభోగసంవి ద్విష మేధమానో దత్తానుతాపీ కృపణోఽబలీయాన్ ।
వర్గప్రశంసీ వనితాం చ ద్వేష్టా ఏతే పరే సప్త నృశంస రూపాః ॥

విషయసంభోగమందే బుద్ధిని వినియోగపరుచువాడును; ఇతరులకు ఎల్లప్పుడును చెరుపుకలుగజేసి జీవించువాడును; ఎవరైనను తనను యాచించినపుడు వార్లకు ధర్మార్థముగా ధనసహాయముచేసి వెనుక తానేల మోసపోతిని, కష్టార్జితమైన ధనమును ఇతరులకు ఇచ్చితిని గదా, ఏమి బుద్ధిహీనత ఇది, అని పరితాపము చెందువాడును; ఎంతకొంచమైన లాభము తనకు లభించినను చాలును అని, నీచ కార్యములకు నడుమకట్టి అందువలన కలుగు అవమానమును ఏ మాత్రమైనను లెక్క పెట్టక ద్రవ్యలాభము స్వల్పమైనను చింత లేదు అని ద్రవ్యమును సంపాదించు కృపణుడును; మనుష్యజన్మ సాఫల్యము అగు జ్ఞానమును సంపాదించక ఆత్మహత్యచేసికొను వాడును; అనన్యశరణమైన తన భార్యను గాని అదేవిధమున ఏ స్త్రీనిగాని ద్వేషించి పీడించువాడును; ఇద్దరుకూడి మాటలాడు నప్పుడంతయు నింద్రియవర్గములవల్ల మానవు డనుభవించను

సాధ్యమైన విషయములనుగురించియే మాటలాడు వాడును; క్రూరులు. కొంత మననము చేసి యీ శ్లోకముయొక్క అర్థమును అనువాదముచేసినపుడు ఈ శ్లోకములోని ప్రతి అంశమును పరమ సత్యము అని తెలియవచ్చును.

ఇట్టి క్రూరులు మొదలగువారు ఆస్ట్రిల్ప్లేనుయొక్క ఆరవ సబుప్లేనునందుందురు.

## ఆస్ట్రిల్ప్లేను, అయిదవ, నాలుగవ సబుప్లేనులు

ఈ రెండు ప్రదేశములును ముందుచెప్పిన రెండుప్రదేశముల కంటె చాలమేలైనవి. భూలోకమందు సాధారణచదువరులుగా నుండి కించిత్ స్వప్రయోజనార్థము కామసహితమైన చిన్న చిన్న తప్పులను చేసినవారు ఇచ్చట ఉందురు. ఈ రెండుసబుప్లేనుల ప్రకృతి అతిశీఘ్రముగా వారి కామమయశరీరములనుండి రాలి పోవును. ఈ ప్రదేశమందుండి ఇక్కడివారికి పురోదృష్టియే గాని వెనుకకు తిరుగు భూలోకదృష్టియుండదు. తమ కామము లను చింతారూపముగా అరుగకొట్టుకొను ప్రయత్నములో నుందురు.

## ఆస్ట్రిల్ప్లేను, మూడవ సబుప్లేను

ఈ ప్రదేశమందు కామలోకపు చిహ్నములు ఇదివరకును మనము చదివినటువంటివి ఏవియు నుండవు. కామలోకముయొక్క అసహ్యాకరములైన గురుతులు ఇది మొదలు ఉండవు. అబాధ కరములైన కామములు ఇతరులకు సహాయముచేసి ధారిచే సమ్మా

నింపబడవలెనను ఆశలు లేక ఇతరులకు సహాయము చేసి ఆ కార్య ములగుండా స్వర్గసుఖమును అనుభవించవలెనను ఆశ; లేక "స్వర్గ కామో యజేత" అనిన ప్రకారము రంభాసంభోగాది సంతోష ములను అనుభవించవలెనని చేసిన యజ్ఞయాగములు, చలివెం ద్రలు, సాలచెట్లు మొదలగునవి స్థాపించి జనసముదాయమునకు మేలుచేయురీత్యా తాము స్వర్గసుఖమును పొందవలెనని చేసిన ప్రయత్నములు; ఏ యే సత్కార్యములైనను కామసహితములు గానుండెనో అట్టి సత్కార్యములన్నియు కామలోకపు మూడవ సబుప్లేను, రెండవ సబుప్లేను ఈ ప్రదేశములలో ననుభవింతురు. లోకులకు మేలు చేసి వారు తనను స్తుతించితే వినవలెనని ఆశించి యుండిన తాము భూలోకమందు లేకున్నను అచ్చట ఉండినట్టు గానే భావించి ఆ కార్యములనే చేయుచు ఇకముందు భూలోక మందు జన్మించినపుడు తాము చేయవలెనని ఆశగొన్న పరోప కారములన్నియు మహావీర్యముతో చేసి సమర్పించుశక్తిని సంపా దించుకొనుచుందురు. ఇదే విధమున దేవాలయములయొక్కయు సత్రములయొక్కయు జీర్ణోద్ధారము చేసి కీర్తి వహించవలెనని కోరి యుండినవారలు దేవాలయజీర్ణోద్ధారములనే చేయుచు తాము భూలోకమందే ఉన్నామనుకొని సంతసించుచుందురు.

## ఆస్ట్రిల్ ప్లేను, రెండవ. సబుప్లేను

స్వప్రయోజనార్థమే జనసముదాయమునకు మేలుచేసినామ నుకొన్నవారందరును ఇచ్చట ఉందురు. "ఏవం త్రయీధర్మమను ప్రపన్నాగతాగతం కామకామా లభంతే" అను శ్రీమద్భవద్గీతా

వచనముయొక్క సంప్రదాయముగలవారు వారి స్వర్గమును ఇక్కడనే యనుభవించుదురు.

## ఆస్ట్రిల్ ప్లేను, మొదటి సబుప్లేను

భూలోకమందుండినప్పుడు కేవల ఐహికవిద్యనేయభ్యసించి నాస్తికులుగానుండిన ధాతుశాస్త్రజ్ఞులు, న్యాయవాదులు మొదలగువారు ఈ ప్రదేశమందుందురు. భూలోకమందారంభించిన విద్యాభ్యాసమును ఇచ్చట మరికొంత వృద్ధిపొందించుచు మరల భూలోకమునందు జన్మించినప్పుడు అతి సమర్థతతో తమ వ్యవహారములను జరుపుటకు సమర్థులగుదురు.

ఆస్ట్రిల్ ప్లేనుయొక్క సముదాయగుణములు లాభములు ఎట్టివి అని విచారించవలెను.

ఆస్ట్రిల్ ప్లేనులో నేడు సబుప్లేనులున్నవి. అందులో ముతకదైన ప్రకృతితో కలిగిన నాలుగు సబుప్లేనులు అనగా భూలోకమునకు సమీపములైన ఏడవది, ఆరవది, ఐదవది, నాలుగవది, ఈ నాలుగును మనవారు "నరకములు" అని పేళ్లు పెట్టినట్టివి. అంతకు పై మూడును కామసహితములయిన సత్కార్యముల యొక్క ప్రయోజనముల ననుభవించు స్వర్గలోకతుల్యములు. రంభా సంభోగములు నందనవనములు మొదలగు ఈ దిగువకనిన శ్లోకమందు శ్రీ కాళిదాసుగారు చెప్పినవి

తీర్థే తోయవ్యతికరభవే జహ్నుకన్యాసరయ్వో ర్దేహత్యాగా దమరగణనా లేఖ్య మాసాద్య సద్యః । పూర్వాకారాధికతర రుచా సంగతః కాంతయాసౌ లీలాగారే ష్వరమత పున ర్నందనాభ్యంతరేషు ॥

యిక్కడనేయున్నవి. కనుక కామలోకవాసము అంత గర్హితము కాదు. కామలోకపు అధోభాగము మాత్రమే అసూయ కలుగ చేయునది. మనుష్యులస్వభావమునందు ప్రకృతికి సంబంధించిన ౨౦౦ పుటయందు చెప్పిన కామక్రోధాదిపండ్రెండు దుర్గుణములను, ౨౦౯ వ పుటయందు చెప్పిన ఏడువిధములైన క్రౌర్యములును, మరియు ననేక దోషములనును కామలోకమందు ప్రతిజన్మమునందును కొంచెము కొంచెముగా పోగొట్టుకొందుము. "జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః". పాపకర్మక్షయానంతరము పురుషునకు జ్ఞానము జనించును అని యర్థము. కనుక కామలోకమందు కలుగు పాపక్షయమును, పాపభీతియు జీవాత్మయొక్క లాభముకొరకే యని సంతోషపడవలెను.

తమకు అపరవయస్సు, ముదుసలితనము, ముదిరిపోవుచుండగా, భరతఖండమునకు స్వరాజ్యమువచ్చినపుడు చూచి సంతసించితేనేగాని నేను చావను అని అపారమైన మనోదృఢముగ దీర్ఘకాలము జీవించవలెనని కోరుచుందువారు; శ్రీ జగదురువులుగారు భూలోకమందవతరించునప్పటికి నేను ఈ శరీరమందే యుండి చూచి ఆనందించవలెనని యుందువారుకొందరు; నామనుమనికి మనుమడు పుట్టిచూడవలెననియు అంతవరకును తన దేహము దృఢముగానుండవలెననియు అతిబలవంతమైన మనోదృఢముగనుందువారు కొందరు; ఇట్లు అనేకులు, సాధారణముగా అవ్వలు, తాతలు, అతిబలవంతమైన కోరికతోనుందువారున్నారు. సర్వకాలములయందును ఒకటే యుద్దేశము. అదే మనగా నెట్లైనను తనదేహమును మంచి దృఢమైనస్థితియందుంచు

కొని యుండవలెనను నది. ఎన్ని కార్యములు, నోములు, జపములు చేయుచుండినను ఈ ఒక అభిప్రాయమును మాత్రము ఏమరక యుందురు.

ముసలివార్లకు దేహపటుత్వము రావలెనంటే బాల్యదశ యందుండువారి శరీరములోని అణువులు ముసలిశరీరములలోపలికి చేరితేనేగాని సాధ్యముకాదు. కనుక తెలిసిస్తైనను తెలియకనైనను అన్నమయకోశమునకు అభిమానిస్తైన భూతాత్మ (౨౧౨ వ పుట చూడుడు) తన (అన్నమయకోశము) దేహమునందుండు ముదుసలి యణువులను తరుమగొట్టి తనచుట్టునుండు యౌవనపురుషులయొక్క శరీరములయందుండు అణువులను దొంగిలించి తన అన్నమయకోశ మందుచేర్చును. ఇట్లు కొంత కొంతగా ముసలివానిశరీరము కూడ యౌవనపురుషులశరీరములవలె ఆశిష్ఠములును ద్రఢిష్ఠములును గానగును.

సాధారణముగా మన దేశమందు లేతబిడ్డలను ముసలివాండ్ల సమీపమందువిడిచి ఆటలుచూపుమని చెప్పుటవాడుక. ఇది చాల తప్పు. అణువులకు తామున్నస్థలమువిడిచి తమయిష్టమువచ్చిన స్థలములకుపోవుట వాడుక యని యిదివరకే చెప్పబడినది. ముసలివార్ల శరీరములయందుండి అణువులు బిడ్డలశరీరములకును, బిడ్డలశరీరముల యందుండి అణువులు ముసలివార్ల శరీరములకు పోవుట సాధ్యము. దీనియొక్క ఫలమేమంటే ముసలివార్లకు బలమువచ్చును. బిడ్డలకు బలముతగ్గును. కనుక ముసలివార్లవద్ద బిడ్డలను ఇయ్యకూడదు.

ఆరోగ్యవంతమైన దేహమునుండి దేహముయొక్కబలము ప్రతిరోమకూపమునుండియు ఆకాశబాణములు బయలువెడలు

రీతిగా బయలువెడలుచుండును. ఆరోగ్యముతక్కువైనపుడు వేగము తక్కువైన బలరశ్మిలు బయలువెడలుచుండును.

ఇంగ్లీషుభాషయందు (Vampire) వాంపైర్ అని యొకశబ్దమున్నది. అర్థము ఏమనంటే. తన స్థూలశరీరమును ఏవిధముగానైనను క్రూరకార్యములు చేసి కాపాడుకొని సరియైన దేహబలముతో దీర్ఘకాలము బ్రతికియుండవలయునని యాశగొనియుండువారు. వాంపైర్లలో అనేకతరగతులున్నవి. ఒకతరగతివారు మనలో ననేకులున్నారు.

కొందరు ముసలివారలు ప్రయత్నపూర్వకముగా తనకంటె బలశాలులుగానుండు యౌవనపురుషులయొక్క దేహములనుండి వారి యెరుకలేకయే బలమును పీల్చుచు తమదేహములను ద్రోహమువల్ల కాపాడుకొనుచుందురు. యౌవనపురుషులు కొంతకాలమునకు ఏమోకారణము తెలిసికొనలేకనే బలహీనులై అనారోగ్యత చెందుదురు. ఇట్టి వారలను గురించియే

> స్వప్రాణాన్ యః పరప్రాణైః ప్రపుష్ణాత్యఘృణః ఖలః।
> తద్వధస్తస్య హి శ్రేయో యద్దోషాద్యాత్యధః పుమాన్॥
>
> (శ్రీమద్భాగవతము)

ఇట్టి పరప్రాణహారులు కామలోకమునందు పడు శ్రమనుగురించి వ్రాయవలసిన యవశ్యములేదు.

ఆస్ట్రల్ ప్లేనునుగురించి యింకననేకవిషయములను వ్రాయవలసియున్నను ఈగ్రంథమునందు ఈస్థలమునందు ఇంతకన్ననధికముగా వ్రాయుటకు సాధ్యము కాదు. ఆస్ట్రల్ ప్లేను నందుండు వారలయొక్క ఆశలను తృప్తిచెందించుటకై శ్రాద్ధాదులు చేయు

దురు. ఆస్ట్రిల్ ప్లేను నాలుగవ సబుప్లేను దాటి పైకి పోవునంత వరకును భూలోకమునందుండువారల దుఃఖములవల్ల ఆస్ట్రిల్ ప్లేను వాసులకు శ్రమకలుగవచ్చును. తమ వృద్ధిని తాము గమనించు కొనుచుండువారికి శ్రాద్ధాదులవల్ల అనుకూలములు కలిగినట్లుగానే భూలోకమందుండు బంధువుల శోకమువల్ల కీడును కలుగును. మనస్సులో అతిశోకముపుట్టితే ఆ స్పందములు ఆస్ట్రిల్ ప్లేనులో నుండువారిని మనతట్టు తిరిగిచూచునట్టు చేసి తద్ద్వారా వారి వృద్ధిని చెరుచును.

> అతీవ మనసా శోకః క్రియమాణో జనాధిప।
> సంతాపయతి వై తస్య పూర్వప్రేతాన్ పితామహాన్ ॥
> (శ్రీమహాభారతము, అశ్వమేధ-౨ వ అధ్యా)

కామమయశరీరమునందు ఏడుతరగతులప్రకృతి ఇమిడి యున్నదనియును ఆ ఏడువిధములైన ప్రకృతియు నేడు ఆవరణము లుగా కట్టబడుననియును ఆ ఆవరణములమధ్యన జీవాత్మ ఉండు ననియు, ఆ ఆవరణములలో స్థూలాతిస్థూలావరణముయొక్క ప్రకృతి యంతయు కాలాంతరమున నరిగిపోయినపిమ్మట అంతకంటె సూక్ష్మమైన ఆవరణము వెలుపటిదిగా నిలుచుననియు, నిట్టివిధ మున అన్ని ఆవరణములును ఒకటివెంబడి యొకటి అరిగిపోయి నప్పటికి కామమయశరీరమువల్ల జీవాత్మ సంపాదించిన శక్తులంత యు కామమయశరీరముయొక్క (దేహ) బీజమందిమిడియుండి, తదనంతరము స్వర్గలోకము అను మెంటల్ ప్లేనుయొక్క దిగువ నాలుగు అంతస్థు (సబ్ ప్లేనులగు) లకు వెళ్లి ఆ ప్రదేశమందు పయోగించుటకుగానేర్పడిన అశుద్ధమనోమయ (౧౩౪౭, ౧౩౭ వ పుట

లు చూడుడు). శరీరమందుండి అనేకసంవత్సరములకాలము జీవాత్మ సుఖములననుభవించుననియు చెప్పబడియె. కనుక కామమయ శరీరముతో కామలోకమందుండి పడిన మనోవ్యథలన్నిటివల్లను జీవాత్మకు విరక్తికలుగుటకు కారణమవును. ధర్మమునకు విరుద్ధములుకాని కామములనే తలంచునట్టి శక్తి యేర్పడును. ఇది కామలోకముయొక్క ఉపయోగము. మరియు భూలోకమందు అల్పాయుష్మంతులుగా చచ్చెడివారు ఒక సంవత్సరము లేక రెండు సంవత్సరముల కాలము చాల అనారోగ్యవంతులై రుగ్మతవల్ల బాధపడ లేక నాకు చావైననురాదా, ఈ శ్రమ ఆ విధముగానైనను నివర్తి కాదా అని పదే పదే ప్రతిదినము కోరుకొనుచుండి భూలోకమునందు ఆ శరీరమునందుండుటకు సాధ్యములేక చచ్చువారును, అతి దీర్ఘకాలము బ్రతికియుండి

జీర్యంతే జీర్యతః కేశాః దంతా జీర్యంతి జీర్యతః।
. . . . . . . . . . . . . తృష్ణైకా నిరుపద్రవా॥

ముసలితనము రాను రాను వెంట్రుకలు రాలిపోవును; పండ్లు రాలిపోవును; అంగములు బలహీనములైపోవును; అయినను ఆశ (కామము) మాత్రము నిరుపద్రవముగానుండును అని మనస్సులో ఇంద్రియచపలముకలిగినను ఆ చపలమును తీర్చుకొనుటకు ఇంద్రియములయందు వీర్యములేనందున " ఏల ఈ వృథా ఆశపడెదవు " అని మనస్సుకు పలుమారు బుద్ధిచెప్పుచువచ్చువారు, తద్ద్వారా కించిత్తువైరాగ్యమును అభ్యసించువారును, లేక సంసారమందు ముసలివారుగానుండి తనను తన పిల్లలు పాపలు యుక్తులు అడుగ

కున్నను తనకుతోచినయుక్తులను వార్లకు చెప్పబోయి వార్లచేత చీవాట్లుపడువారును, ఇన్నివిధముల భూలోకవాసమందు విసుకు చెందువారికిని కామలోకము (ఆస్ట్రిల్ ప్లేను) నందు మనోవ్యథలు తగ్గును.

## స్వర్గలోకము (లోయర్ మెంటల్ ప్లేను)

మెంటల్ప్లేనులో కూడ ఏడువిధములైన ప్రకృతిభాగము లున్న వని ౧౮౫ వ పుటయందు చెప్పబడెను. అందులో స్థూల ములైన నాలుగు (సబుప్లేనులు) భాగములకు లోయర్ మెంటల్ ప్లేను (Lower Mental Plane) అని పేరు. ఇదే స్వర్గలోకము. కామలోకము వదిలి జీవాత్మ లోయర్ మెంటల్ ప్లేనుకు "లోయర్ మెంటల్ బాడీ" అను అశుద్ధమానసశరీరముతో (౧౦౬ వ పుట చూడుడు) పోవును. కామలోకమందు జీవాత్మ తన కామ మయశరీరమునందు ఏవిధమైన తక్కువజాతిప్రకృతియుండునో అట్టి తక్కువైన సబుప్లేనుకు పోవును. లోయర్ మెంటల్ ప్లేను (Lower Mental Plane)లోనంటే జీవాత్మయొక్క లోయర్ మెంటల్ బాడీ (అశుద్ధమనోమయశరీరము) లో ఎంతటి ఉన్నతమైన ప్రకృతియణువులున్నవో ఆ సబుప్లేనుకు మొట్టమొదటనే పోవును. ఇది ముఖ్యముగా జ్ఞాపకముంచుకోవలెను. ఈ ప్రదేశ మునకు పోవలెనని ఆశగొనినవారు పరోపకారముచేయుబుద్ధి గలిగి స్వప్రయోజనమును మరిచినవారుగానుండవలెను. తన సంతతివారు, భార్య, బంధువులు, స్నేహితులు మొదలగువారి యందు స్నేహము, అనుకంప మొదలగు గుణములుగలవారును,

దైవభక్తిగలవారునుకూడ, ఈ గుణములు స్వప్రయోజనార్థము కానపుడు, లోయర్ మెంటల్ ప్లేనుకు పోగలరు. తల్లి తన చిన్ని బిడ్డయందు చూపు ప్రేమ స్వప్రయోజనార్థముకాదు. తన సుఖమునైనను విడనాడుకొని బిడ్డయొక్క క్షేమమును గమనించు తల్లిని పోలిన దైవము కలదే. అట్టివారిప్రేమ ఎప్పటికైనను స్వప్రయోజనార్థము అవునా? ఇట్టిప్రేమ ప్రేమించినవారిని స్వర్గలోకమునకు లాగుకొనిపోవును. ఇదే నిజమైన ప్రేమ. ఒకని భార్యయందు వానికి ప్రేమ యుండవచ్చును గాని అట్టి ప్రేమకు కారణము తనకు హక్కున్నట్టు తాననుకొన్న చాకిరి, పూజ ఇట్టివైతే ప్రేమ అన్నమాట అబద్ధము. అట్టి స్వకార్యధురంధరునికి స్వర్గలోకమందు స్థలములేదు. భగవంతునియందు భక్తి కూడ కామ్యభక్తి యయిన యెడల స్వర్గలోకమునకు హక్కు నియ్యదు.

యస్త ఆశిష ఆశాస్తే న వై భక్తస్స వై వణిక్ ।

ఎవ్వడైతే తనకు భగవదనుగ్రహముకావలెనను ఆశతో భక్తి చేయుచున్నాడో అతడు వర్తకుడుగాని భక్తుడు కాడని నాయభిప్రాయము అని ఒక భక్తునివాక్యము. (భక్తివిషయమై వ్రాయునప్పుడు ఈ సంగతినిగురించి విపులముగా వ్రాయనగును). నిష్కామభక్తుడే స్వర్గవాసమునకు అర్హుడు. సాధారణముగా ధర్మబుద్ధి గలవారలు ఈ లోకమునకు వెళ్లుదురు. కాని ఆ ధర్మబుద్ధియందు ఏమాత్రమైనను స్వప్రయోజనముండకూడదు. ఒక యూరియందు నిరుపేదలు రెండిండ్లవారున్నారనుకొందము. ఆ యూరివారి పైకి కొందరు కీర్తికావలెనని ఆ పేదలకు సహాయముచేతురు. మరి కొందరు కుడిచేత చేసిన దానము ఎడమచేతికి కూడ తెలియ

కూడదని తాము ఆ పేదలకు సహాయము యథాశక్తి మనఃపూర్వక
ముగా చేసి తాము ఇట్టిసహాయముచేసినాము అని సహాయముపొం
దినవార్లకుకూడ తెలియపరచకనే చేయుదురు. ఈ రెండవ తెగ
వారు నిష్కామభూతదయను చూపిన వారగుదురు. వీరు లోయర్
మెంటల్ ప్లేను అను స్వర్గలోకమునకు అర్హులు. భార్యాబిడ్డలయందు
ఒకరు చూపిన ప్రేమ మెంటల్ ప్లేనుయొక్కదిగువభాగము అయిన

మెంటల్ ప్లేను, ఏడవసబుప్లేను

కు తీసుకొనివెళ్లును. ఉదయము మొదలు అస్తమయము
వరకును తనకు కలుగు శ్రమను గమనించకయే తన బిడ్డపాపలకు
సుఖము కలుగవలెనను ఆశతో పనిచేయు కూలివాడు తాను కూలి
వాడైనను చదువరికాకున్నను ఈ సబుప్లేనుకు వెళ్లును.

తమ బిడ్డలయొక్క మంచిగుణమును సదా తలచి సంతో
షించు తలిదండ్రులును, తమ తలిదండ్రుల సుగుణములను చాల
స్తుతించుకొనుచుండు బిడ్డలును, తమకు గురువులగువారిని వారియొ
క్క యోగ్యతమాత్రమునకుగా నారాధించిన శిష్యులును కూడ
ఈ ప్రదేశమునకు వెళ్లుదురు.

ఈ ప్రదేశమందుండువారు ఏవిధముగా నానందింతురు అని
విచారించవలయును. తాము భూలోకమందుండినపుడు ఎవరిని
ప్రేమించిరో, ఎవరిని పూజించిరో, ఎవరికి సహాయముచేసిరో, అట్టి
వారియొక్క రూపములను మనసా చింతించి మనోమయరూప
ములుగా కట్టుకొని వానిని తమచేత అయినంతలెస్సగా నలంకరిం
చి అట్టి అలంకారసహితములైన రూపములను పూజించి, ప్రేమించి,

స్నేహించి, కౌగిలించి, ఆ విధమున ఆనందించి, మరల మరల అనేక కాలము ఇట్లు ఆనందించి స్వప్రయోజనము అను స్వభావము ను పరిపూర్ణముగా మరుతురు. లోకమందు చాలమందికి అను కంపనుచూపిన మహానుభావునిచేతిగుండా వేలకొలది జనులు మేలు పొందియుందురు. మేలుపొందినవారలలో కొందరు చనిపోయి స్వర్గలోకమందు చేరితే తమకు మేలు చేసినవానిని ఎల్లప్పుడును తలచుకొందురు. తలచుకోగానే మేలుచేసినవాని మనోమయమైన రూపము ఒక్కటి యేర్పడును. ఆ రూపమును మేలుపొందినవాడు ప్రేమించి పూజించి తన కృతజ్ఞతను చూప్రను. మేలుచేసినవాని జీవాత్మ మేలుపొందినవాడు కట్టిన మనోమయరూపమందు ప్రవే శించును. జీవాత్మ అనేక సూర్ల శరీరములలో ప్రవేశించి వాని కంతయు తేజస్సును ఇయ్యగలశక్తి కలిగియుండును. ఆ సమయ మందు మేలుచేసిన మహానుభావుడు భూలోకమందేయుండును. తనచేత మేలుపొందినవారలు తననుగురించి ప్రేమించుచున్నారని తెలియకయే యుండును. ఐతే ఈ ప్రకారము స్వర్గవాసులు తనను ప్రేమించుట మేలుచేసినవానికి మిగుల వృద్ధికరము.

ఒక పరమరహస్య మున్నది. ఆత్మబుద్ధిమనస్కుడు అని వాడబడిన ప్రాజ్ఞాత్మయొక్క శక్తి అపారము. సంసారచక్రభ్రమణ మునందు తనలో కొంతభాగమునే వినియోగపరిచి తాను మహా ర్లోకానుభవమును తరుచుగా పొందుచుండును. మరియొక పరమ రహస్య మేమన ఎవరైనను ఏ లోకమునందైనను తనను తలచిన యెడల ఆ తలంపు ప్రాజ్ఞాత్మకు వెంటనే తెలియును. ఆతలంపు తలచినవారు తనరూపమువంటిరూపమును మనసాకట్టితే వెంటనే

ఆ రూపమందు ప్రవేశించును. ఇట్లు నూరుగురు ఒకేకాలమందు నూరుస్థలములయందు తనరూపములను కట్టితే అన్నిరూపములలో నును తాను ప్రవేశించి ఆ రూపములకు ప్రాణకళ నిచ్చును. ఇది ప్రాజ్ఞాత్మయొక్క అద్భుతశక్తి. ఇన్నివ్యవహారములను జరిపిన సంగతి సంసారచక్రమందు భ్రమణముచేయుచున్న ప్రాజ్ఞాత్మయొక్క అంశకు తెలియదు. పైచెప్పిన ప్రకారము మేలుపొందినవార్లందరును ఏకకాలమందు కట్టుకొనిన మేలుచేసినవానియొక్క మనోమయరూపములయందు మేలుచేసినవానిప్రాజ్ఞాత్మ ప్రవేశించి మేలుపొందినవారు ప్రేమించిన ప్రేమలనెల్ల అంగీకరించును. భూతానుకంపయను గుణము అనుకంపచేసినవానికిని పొందినవారలకును కూడ మంచిది. అనుగ్రహముపొందినవారలు భూలోకమందు తత్కాలమునకు తమశ్రమలను తగ్గించుకొనుటయే కాక తాము మరణముచెంది స్వర్గలోకమునందు చేరినపుడు తమకు సహాయము చేసిన పుణ్యపురుషుని మనసాభావించి తమ కృతజ్ఞతను చూపుచు కృతజ్ఞత మొదలగు సద్గుణములను వృద్ధిచేసుకొనుటయే కాక తమకు సహాయముచేసిన పుణ్యపురుషునికి కూడ సహాయముచేయుట అను సుగుణమును వృద్ధిచెందించుదురు. మెంటల్ ప్లేనుయొక్క భోగము నిజముగా స్వర్గభోగమనే చెప్పవలెను. ఏడవ సబుప్లేనుకంటె ఆరవ సబుప్లేనునందు భోగమధికము.

## మెంటల్ ప్లేను, ఆరవసబుప్లేను

భగవంతుడు నరరూపముగలవాడు; మనుష్యులవలెనే స్వభావముకలవాడు; అయితే అమితమైన శక్తిమంతుడు; వేదు

కొంటే మేలుచేయువాడు; వేడుకోకుంటే కీడుచేయువాడు అను నీ విధములైన యభిప్రాయములు గల వారలు ఈ ప్రదేశమం దుందురు.

తిరుపతివేంకటేశ్వరులకు వడ్డికాసులవాడు అని యొక పేరు వాడుకలోనున్నది. వేడుకొన్నప్రకారము చెల్లించకుంటే వడ్డి కట్టుచుంటే కోపగించుకోడు అని నమ్మకము.

పెరటాశినెలలో శనివారమునాడు దీపారాధన చేయకుంటే రోగములను నొప్పులను ఇచ్చువాడు, మ్రొక్కుపడి చెల్లించినచో జాగ్రతగా కాపాడువాడు అనియు నమ్మకములును కలవు. ఇదే విధమున శ్రీ సుబ్రహ్మణ్యస్వామికి కూడ అపవాదము కలదు. కృత్తికానక్షత్రమునాడు ఉపవాసముండకుంటే రోగములను కలుగ జేయును. మ్రొక్కుకొనిన ప్రకారము కృత్తికలు నడువకుంటే శ్రమకలుగజేయువాడు అని మొదలగు విధములలో అప్రతిష్ఠకలదు.

ఇవంతయు. కొందరియనుభవములో నిజమే. ఇట్టి అనుభవ ములు అనుభవించువారలు కూడ భక్తులే. కాదనకూడదు. మరియు మహావైదికశిరోమణులైన బ్రాహ్మణశ్రేష్ఠులని పేరుపెట్టు కొన్న వారు కూడ ఇట్టి భక్తిసలుపువారు కొందరున్నారు. ఒక ఉదాహరణము. మధ్యార్జునము అని తంజావూరుజిల్లాయందు ఒక మహాప్రఖ్యాతికెక్కిన శివస్థలముకలదు. ఆ యూరియందు భస్మ జాబాలోపనిషత్తునందు చెప్పిన విధముగా పుష్కలముగా విభూతి పుండ్రములు ధరించినవారు ఒక పండితులుండిరి. మధ్యార్జున ములో కోవెలలోనున్న శివవిగ్రహమునకు మహాలింగస్వామియని పేరు. ఇపుడు చెప్పిన బ్రాహ్మణోత్తమునికి చిదంబరక్షేత్రము

నందు పూజలనుకొను నటరాజస్వామియందు భక్తి. ఐతే కర్మ వశమున మధ్యార్జునమునందు కాపురముండవలసినదిగా నేర్పడినది. ఈ వైదికశిరోమణి భగవన్నామస్మరణచేయుచు వృథా గ్రామ వార్తలు వదిలియుందురు. భక్తులే. వారి నామస్మరణ ఏమంటే "నటరాజప్రభోరేమహాలింగ, నటరాజప్రభోరేమహాలింగ" అని ఎలుగెత్తి స్మరణచేయుచుండిరి. నటరాజప్రభువు ఏమి? మహాలింగుడు ఏమి? అని విచారించినపుడు రహస్యము బయలుపడినది. భక్తుని ఇష్టదైవము నటరాజేశ్వరులు. వారు చిదంబరమునందుందురు. అయితే తానుండు ఊళ్లోని దైవమునకు పేరు మహాలింగులు. ఉన్నయూరిదైవమునకు మర్యాదచేయకున్న వారికి కోపమురా వచ్చును, ఇది మహా అపరాధము, గనుక తన యిష్టదైవము కొంతదూరమందున్న చిదంబరక్షేత్రవాసియైన నటరాజప్రభువు వినవలెనని ప్లుతసహితసంబుద్ధియు ఊళ్లోనిదైవమునకు సామాన్య సంబుద్ధియుగాను నామస్మరణము చేయుచుండిరి. ఇట్టి భక్తిచేయు వారు మెంటల్ ప్లేను ఆరవసబుప్లేనుకు వెళ్లుదురు.

మరియు ప్రతీక ఉపాసనచేసిన వారు కూడ ఇచ్చటికే వెళ్లుదురు.

మా ఊరియందుండు ద్రౌపదమ్మవంటి సత్యమైన దైవ మెక్కడయులేదు. శ్రీశైలమందుండు ఈశ్వరుడు సాక్షాత్తుగా కైలాసాధిపతియే అనువారును, పండ్రాపురమందుండు విఠలరాయలస్వామితో సమానమెవరు అనుచు ఆ విగ్రహములకు పూజసలిపి తమను తాము ఆ స్వాములకు నివేదించుకొనుచుండిన వారలందరును ఈ సబుప్లేనునందు తాము పూజచేసిన విగ్రహములను

తమయెదుటనుంచుకొని యితర చింతనములేకయే పూజయందు మగ్నులై యానందించుచుందురు. ఇట్టి యానందము పొందుటవల్ల భక్తియను గుణము వృద్ధిపొంది మరల భూలోకమునకు జన్మమునకు వచ్చునపుడు మరియునధికమైనతరగతి భక్తిని చేయుటకర్తలుగా జన్మింతురు.

తన మగడే దైవము అని పూజచేయుచుండిన ఒక హిందూ స్త్రీ యీప్రదేశమునకు పోవును. తనయింటియందు ఒక కృష్ణ విగ్రహమును పెట్టుకొని పూజచేయుచుండిన మరియొకస్త్రీ ఈ సబుప్లేనుకు వెళ్లును. అక్కడ భూలోకమందు తాను పూజలు సలిపిన కృష్ణవిగ్రహమునే మరి అధికమైన భక్తితో పూజించుచుండును. ముఖ్యముగా భూలోకమందు మూఢభక్తి జరిపినవారందరును ఈ సబుప్లేనుకు ఎక్కుదురు. ఒకటి ముఖ్యముగా విమర్శించవలసినది. మెంటల్ ప్లేనుయొక్క ఆరవసబుప్లేనునకు తీసుకొనివెళ్లునట్టి భక్తి ఏదో ఒక విగ్రహమునకు దారపోయబడినదియు, ఆ భక్తి, ఏవిధమైన లోకసేవారూపముగా పరిణమించకపోయునదియునై యుండును.

మరియు భూలోకమందు పూజలుచేయుచుండిన మృత్పాషాణలోహాదులతోచేసిన విగ్రహములే దేవుండ్లని భావించియుండిన వారుకూడ ఇక్కడ ఉందురు.

> తస్మాది నీచైస్స్వకృతానసత్యాన్ పాషాణమృద్దారుమయాంశ్చ దేవాన్ ।
> భజన్తి యే మాధవనిందకాస్తే పూర్ణస్సదానందమయో హి విష్ణుః ॥

రాళ్లుచెక్కువాడు, కుమ్మరవాడు, వడ్లవాడు మొదలగు అజ్ఞులు చేసిన బొమ్మలయందు ప్రాణప్రతిష్ఠ చేయకయే ఆ విగ్రహములే

దేవతలు తిని పూజలు సలిపి ధ్యానములుచేయువారు నిజమైన దేవుని యథావిధిగా పూజచేయకున్నను వారి యోగ్యతానుసారముగా భక్తిచేసినవారే గనుక వారును ఈ సబుప్లేనునందు ఉందురు.

## మెంటల్ ప్లేను, అయిదవసబుప్లేను

శ్రీరామచంద్రభక్తిభరితుండైన యొక పెద్ద జమీందారుడు భూలోకమందుండి నపుడు శ్రీరామచంద్రులవారు రాజ్యమేలినట్లు ధర్మరాజ్యమేలి ప్రజలకందరికిని పరిపూర్ణమైన సంతోషమును సుఖమును కలుగచేయవలెనని ప్రయత్నపడి భూలోకమందు అనేక ప్రత్యవాయములవల్ల తనయిష్టము జరుగకయుండినది. అట్టివాడు అయిదవ సబుప్లేనునందు తాను భూలోకములో చేయవలెనని కోరినంతకంటె అధికమైన సమగ్రతతో రాజ్యకార్యమును జరుపుచు శ్రీరామచంద్రులవారే స్వంతముగా విచ్చేసి తనయొక్క రాజ్యకార్యములను బాగుగజరుపుటకు తనకు యుక్తులు చెప్పియిచ్చుచున్నట్టు భావించి సుఖించి ఆనందించుచుండునట. దైవభక్తియొక్క పర్యవసానము లోకసేవగాననుకొని ప్రయత్నము చేసినవారు అయిదవసబుప్లేనుకు ఎక్కుదురు.

## మెంటల్ ప్లేను, నాలుగవసబుప్లేను

ఇది అశుద్ధమానసశరీరముతో నొకడు పోగల ప్రదేశములలో అతి ఉన్నతమైనది. పారమార్థిక ఉద్దేశముతో చేసిన అధ్యాత్మవిద్యావిచారము, భౌతికశాస్త్రపరిశీలన, భరతశాస్త్రప్రశంస,

స్వార్థత్యాగముచేసి అభ్యసించిన సంగీతశాస్త్రవిచారము, చిత్రములు మొదలగునవి వ్రాయుట, స్వార్థఅభిప్రాయ మేమైనను లేని కైంకర్యము, ఇట్టివి జీవాత్మను నాలుగవసబుప్లేనుకు లాగుకొని వెళ్లును. పైనచెప్పిన బహువిధములయిన ప్రయత్నములు భూలోకమందు జరిగియున్నయెడల ఆ జీవాత్మలు స్వర్గములో నీ భాగమునకు వెళ్లినపుడు ఏ యేశాస్త్రమునకు ఏయే వేదాంతమునకు ఎవరుస్థాపనాచార్యులుగా నుండిరో అట్టివారిగుండా ఆ యా విద్యలను నేర్చుచుందురు. శ్రీమహాభారతము ఆదిపర్వమునందు భీష్మాచార్యులవారి జన్మకథనుగురించి చెప్పునపుడు "దివ్యభూషణాలంకృతదేహుడైన కొడుకు వలపలిచేయూది కోమలాంగి" అని ప్రారంభించి యొక పద్యమున్నది. తల్లియైన గంగాదేవి భీష్ముడను బిడ్డయొక్క వలపలిచేయిపట్టి ఆ బిడ్డయొక్క తండ్రి అయిన శంతను మహారాజునకు బిడ్డను అప్పగించుచు "పరమాస్త్రవిద్యయం దప్పరశురాము డెంత దక్షు డంతయు కడు దక్షుడీతడు" అని మొదలగువిధముల నొక్కొక మహావిద్యయందును పరమాచార్యులవారుగానున్న వారిని వెదకి తన పుత్త్రునకు వారివలన విద్యాభ్యాసము చేయించినట్లు చెప్పుకొన్నది. ఆ విధముగా మెంటల్‌ప్లేను నాలుగవ సబుప్లేనునందు జీవాత్మ భూలోకమందుండినపుడు ఏ యే విద్యలను అభ్యసించుటకుగా ప్రయత్నపడియుండెనో అట్టి విద్యలందు అతిదృఢజ్ఞానముకలుగునట్లు అభ్యసించును.

స్వర్గలోకము అని వాడుకలోనుండు లోయర్ మెంటల్ ప్లేనులో ననేకనూర్లసంవత్సరములకాలము తాము భూలోకమునందు చేసిన నిష్కామప్రయత్నములయొక్క ఫలములనన్నిటిని

అనుభవింతురు. భూలోకమునందు సుమారు ౬౦, ౭౦ సంవత్సరములుండినవారు చాల దుర్మార్గులు కాకుంటే ౪౦, ౫౦ సంవత్సరములకు పైన ఆస్ట్రల్ ప్లేనులోనుండవలసిన అవశ్యముండదు. అదే విధమున భూలోకమందుండినపుడు నిష్కామముగా చేసిన వ్యాసంగములన్నియు లోయర్ మెంటల్ ప్లేనునందు సఫలములు అవును. ఎన్నివ్యాసంగములను చేసియుంటిమో అందుననుసరించియే లోయర్ మెంటల్ ప్లేననుందుండ తగినకాలము నిర్ధారింపబడును. "కృషీ ఫలీ" అనినట్లు విత్తనములు చల్లినంతటి పయిరు. సాధారణముగా కొంతభక్తివంతులై లోకసేవాపరులై శుద్ధనిష్కామకైంకర్యముచేసినవారు సుమారు ఒక వేయి సంవత్సరములకాలము స్వర్గవాసము చేసి తమశక్తులను అధికపరుచుకొందురు. భూలోకమునందుండినపుడు చేసిన శ్రవణమును స్వర్గలోకమునందు మననము, నిదిధ్యాసయను విధమున బలపరుచుకొందురు అనవచ్చును. ఇప్పటికి అశుద్ధమానసశరీరముతో పొందతగిన లాభములనన్నియు జీవాత్మ పొందెను. ఇక ఆ శరీరము అవశ్యము లేదు. కనుక ఆస్ట్రల్ ప్లేనులో పనిముగియగానే ఆస్ట్రల్ బాడీ చెదిరిపోయిన ప్రకారము మెంటల్ బాడీ (అశుద్ధమానసశరీరము) కూడ చెదిరిపోవును. దానిలోనిశక్తులన్నియు శుద్ధమనోమయశరీరమునందు ఇమిడిపోవును. జీవాత్మ తనయొక్క ఛాయమైన శరీరమును ఉనికిపట్టును (౧౪౧ వ పుటచూడుడు) అయిన శుద్ధమనోమయశరీరమునందు, హైయర్ మెంటల్ ప్లేను అను మహర్లోకమునందు నిలిచియుండును.

సంసారచక్రభ్రమణమును ఆరంభించి తన యిల్లు అయిన మహర్లోకము వదిలి లోయర్ మెంటల్ ఆస్ట్రల్ ప్లేనులద్రోవను

ఫిజికల్ ప్లేనును చేరి అచ్చట ౫౦-౬౦-౭౦ సంవత్సరములు జీవించియుండి అనుభవసామగ్రినిసంపాదించుకొని ఆ సామగ్రిపైకి ఒకతరహా సామగ్రియయిన కామములను కామలోకమందు విమర్శించుకొని ఆలోకపు ఉపాధియైన కామమయశరీరమును చెదరగొట్టుకొని ఆ దేహమందుసంపాదించిన వాసనలు (శక్తులు) అన్నిటిని ఆ దేహబీజమందు ఇముడ్చుకొని లోయర్ మెంటల్ ప్లేనును ఎక్కి అక్కడ అనుభవసామగ్రినంతయు పరిశీలించి అందుగుండా సంపాదించిన వాసనలు (శక్తులు) అన్నిటితో సహా తనయిల్లు చేరి శుద్ధమానసశరీరవాసియై తన యాత్రవల్ల తనకు కలిగిన లాభనష్టములను లెక్కచూచుకొనును. ఇపుడు ముగిసిన సంసార చక్రవర్తులమువలె మరియొక తూరి ప్రయాణోన్ముఖుడవును. కనుకనే ౧౯౫ వ పుటయందు "పునరపి జననం" అని యుపయోగింపబడినది.

జీవాత్మ యొక వ్యాపారితో పోలినవాడు. సముద్రమందు మునిగి ముత్యములను తెచ్చి వ్యాపారముచేయువాడు అని చెప్పదము. ఒక చిన్న ఇతిహాసమును వ్రాతము. ఒక దేశమందు ఒక యూరియందు సముద్రమందుమునిగి ముత్యములనుఎత్తివ్యాపారము చేయువారలు అనేకసంసారులుండిరి. అందులో కొందరు పదే పదే సముద్రమందు మునిగి ముత్యములనెత్తి తెచ్చి వ్యాపారము చేసి కోటీశ్వరులయిన వారు. మరికొందరు అనేక తరగతుల భాగ్యవంతులు. పేదలుకొందరు. పేదవార్లపైకి ఒకానొకడు తమ కులమువార్లలో కోటీశ్వరులను చూచి ఐశ్వర్యవంతులు అయినందున సముద్రములో మునగక సుఖముగానున్నారు, నేనెందుకు

అట్లు కాకూడదని విచారించి, వారు సంపాదించిన సొత్తు అంతయు సముద్రమునందు మునిగియే కదా సంపాదించిరి అని నిశ్చయించుకొని, తానును సముద్రమందు వారివలెనే మునిగి ముత్యములను ఎత్తి వ్యాపారముచేయుదునని నిశ్చయించుకొనెను. పిమ్మట సకాలమందు

౧. తనయిల్లువిడిచి బయలువెడలెను.

౨. త్రోవనడిచి సముద్రమునందు మునుగుటకు కావలసిన ఉపకరములను సంపాదించుకొనెను.

3. సముద్రతీరమును చేరి సముద్రములోమునుగుటకు కావలసిన దుస్తులను పూనెను.

౪. సముద్రములోమునిగెను; మునిగి ముత్యములను జవిరి సంచిలో వేసికొనెను.

౫. సముద్రములోనుండి గట్టుకు వచ్చి గట్టున సముద్రములో మునుగుటకు వేసికొనిన దుస్తులను తీసివేసి ముత్యములు ఎన్ని, మిగత మిశ్రములు ఎన్ని, గుల్లలుమొదలుగాగలవి ఎన్ని, అని తన సామగ్రినంతయు పరిశీలించి తక్కువ దర్జావాటిని వేరుపరిచి ముందుగా విక్రయముమొదలగు కార్యములవల్ల వాటిని ఖర్చుపెట్టును.

౬. మంచిసామగ్రినంతయు చేతతీసికొని దేశసంచారము చేసి విక్రయించి ద్రవ్యముగా మార్చుకొని కొన్ని మాసములకు పిదప

౭. తన యిల్లు చేరి, వ్యాపారముచేసి సంపాదించిన ద్రవ్యమును అదివఱకునుండిన మూలద్రవ్యముతో చేర్చి, తాను అప్పటి

కి కోటీశ్వరుడు కాలేదు గనుక మరల సముద్రమందు మునుగుటకు ప్రయాణోన్ముఖుడాయెను.

ఈ ప్రకారము ౧౦ - ౨౦ - 30 సంవత్సరములు చేసి కోటీశ్వరుడాయెను. ఈ యితిహాసమును జీవాత్మయొక్క సంసార చక్రయాత్రకు పోల్చవలయును. అదియెట్లంటే ముత్యములకుగా సముద్రములో మునుగువాడు జీవాత్మ. జీవాత్మయొక్క ఊరు హైయర్ మెంటల్ ప్లేను. ఆ యూరియందలి కోటీశ్వరులు ఎవరంటే అనేక జన్మములకుముందు మనము ఇపుడు ఉన్న విధముననే సాధారణ జనులుగానుండి అనేకజన్మములయందు ప్రయత్నముచేసి సంసిద్ధి చెందినవారు. వీరికి జీవన్ముక్తులని పేరు. జీవన్ముక్తులనుగురించి యిక ముందు వ్రాయబడును. హైయర్ మెంటల్ ప్లేను అను మహాలోకమందు భృగుమహర్షి మొదలగు జీవన్ముక్తులు నివసించుచుందురు. సంసారచక్రమునందు సంచరించుచుండు జీవాత్మలందరును ముత్యములవ్యాపారము చేయువారితో పోల్చబడుదురు. జీవన్ముక్తులు కోటీశ్వరులతో పోల్చబడుదురు. జీవన్ముక్తులు ఎల్లపుడును సంతోషభరితులై యుందురు.

శాంతామహాంతో నివసంతి సంతో వసంతవ ల్లోకహితం చరంతః।
తీర్ణాస్స్వయం భీమభవార్ణవం జనాన హేతునా న్యానపి తారయంతః॥

వసంతఋతువు అనగా చైత్రవైశాఖమాసములయందు సూర్యప్రకాశము బాగుగా నాహ్లాదకరముగానును ఆ వేడిమిని తగ్గించుటకుగా తొలకరివానలు కురిసి అంతకుముందు ఆకురాలుకారునందు చెట్లు, వృక్షములు మొదలగువానిలో పండుటాకులన్నియు రాలిపోయి, అశోకవృక్షములు మొదలగువానియందు చూడచూ

డను ఆనందకరముగా నెట్లని చిగురుజొంపములు కనపడుచు, లతలు పుష్పించి అందువలన సువాసనను వెదజల్లుచు లోకులకు మనస్సంతోషము కలుగజేయుచున్నను పరులకు ఆనందము కలుగచేసిన సంతోషమొక్కటిదక్క తనవరకును ఏమియుఁకోరక యుండునో అట్లు లోకహితంబాచరించుచు శాంతమూర్తులును ప్రకృతి సంబంధమైన భాధలనన్నియు గెలిచినందున మహాత్ములైన తాము సంసార సాగరమును ఈదుకొని పారంగతులై, నిర్హేతుకముగా మనవంటి వార్లను కూడ తమవలె సంతోషమును అనుభవించునట్లు చేయవలెనని శపథముచేసికొని, తాము సంపాదించుకొనిన మోక్షమునకు పోకయే మనలోకములయందే సంచరించుచు, తాము అందిన లోకంబులను వాని సంపాదించుసాధనంబును నెరుంగనివారు అక్కటా! దురంతదుఃఖములకు పాలుపడుదురన్న దయాసహిత పశ్చాత్తాపంబొక్కండు దక్క వేరు శోకంబులులేక యుందురు.

> ప్రాయేణ దేవ మునయః స్వవిముక్తికామాః మౌనం చరంతి విజనే న పరార్థనిష్ఠాః । నైతాన్విహాయ కృపణాన్ విముముక్షు ఏకో నాస్య త్వదన్యశరణం భ్రమతోఽనుపశ్యే ॥

ఓ దేవా, ప్రాయికంబుగా మునులు స్వముక్తి (తాము మోక్షము చెందవలెనని) ని కోరి మౌనము బూని జనసమ్మర్దములేని యరణ్యంబులందు దిరుగుచుందురు. అట్టివారు ఇతరులు అజ్ఞాన సాగరమునుండి తరించుమార్గమేదని యోచించరు. దీనులకు నుపదేశాదులనియ్యరు. నాకొక్కనికి నీవు ముక్తిని యిత్తువన్నను అట్టిదీనుల విడనాడి నీవిచ్చుముక్తిని నేను గ్రహింపనొల్లను అని భక్తశిరోమణియగు ప్రహ్లాదుడు చెప్పినట్లు తాము

మోతుకమునకు బోక నిలిచియుండు జీవన్ముక్తులు మహానుభావులు. ఇట్టికోటీశ్వరులనుచూచి పేదవారలు కోటీశ్వరత్వమును సంపాదించవలెనని సముద్రమందుమునిగి ముత్యములను తెచ్చుటకుగా ప్రయత్నపడిరి. అనగా భూలోకమునందు జన్మమెత్తి అనుభవసామగ్రిని సంపాదించవలెనని ప్రయత్నపడిరి. ఇల్లువిడిచివెడలి త్రోవనడిచిన

౨. అట్లు లోయర్ మెంటల్ ప్లేనుకువచ్చి అశుద్ధమనోమయశరీరమును సంపాదించుకొనిరి.

౩. లోయర్ మెంటల్ ప్లేనునుండి సముద్రతీరముతో పోల్చతగిన ఆస్ట్రల్ ప్లేనుకు దిగి ఆస్ట్రల్ బాడీ అను దుస్తులను సంపాదించుకొనిరి.

౪. సముద్రములో మునిగినందుకు సమానమైనట్లు భూలోకమందు జన్మించిరి.

వెలుపల గాలి బాగుగానున్నందున స్వేచ్ఛగాతిరుగుటకు వీలుండినట్లు భువర్లోకము, స్వర్గలోకము, ఈ లోకములయందు జీవాత్మకుండు అపారశక్తులలో లేశమాత్రమే భూలోకమందు కలిగియుండును. నీటమునిగిన వానికి శ్వాసవిడువను వీలులేక బద్ధుడై నీరువిడిచిపైకిరావలెనని కోరికయుండినట్లు భూలోకమందు జన్మించిన జీవాత్మకు కూడ త్వరగా భూలోకమువిడిచి పోవలెనను కోరిక బలముగానుండును.

నీటమునిగి ముత్యములను జవురువాడు ఆత్రము మాని నెమ్మదిగా ముత్యములను గ్రహించితే మంచివి చెడ్డవి విమర్శించి జవురును. అవసరపడితే పనికిరాని ముత్యములను కూడ జవురును. అదే విధమున జీవాత్మ భూలోకమునందు కామముచే ప్రేరేపింపబడి

తనకు ఉపయోగములు కానివియు కీడు కలుగచేయునవి కూడ అగు సుఖములను ఆశించును.

౫. నీటమునిగినవాడు పైకి తేలివచ్చి గట్టెక్కినది జీవాత్మ స్థూలశరీరమును పోగొట్టుకొని కామలోకమునందు ప్రవేశించినందు కో సమానము. తక్కువ దర్జాసామగ్రులైన గుల్లలు మొదలగు నవి కామప్రేరితములగు కార్యములను కామలోకమునందను భవించినట్లు.

౬. మంచిసామగ్రి అయిన ముత్యములను చేతతీసికొని దేశసంచారముచేసి వ్యాపారముచేసి ధనమునార్జించినట్లు కామ రాహిత్యములైన చర్యలయొక్క ఫలములను లోయర్ మెంటల్ ప్లేనునందు అనుభవించి శక్తులను సంపాదించుకొని,

౭. సంపాదించిన ధనమును తన మూలధనముతో చేర్చి నట్లు హైయర్ మెంటల్ ప్లేనుకు వెళ్లి అచ్చటి దేహబీజమునందు శక్తులను ఇమిడిచికొనుట.

ఈ ప్రకారము సంసారచక్రమునందు అనేకతడవలు యాత్ర లు చేసినయెడల జీవాత్మ తానిఘాడుండు స్థితినుండి క్రమక్రమము గానెక్కి జీవన్ముక్తుడగును.

---

## ౭ వ అధ్యాయము

నృత్యచ్ఛేదే కుతారః ప్రభవతి యదపి ప్రాణినోద్య స్తథాఽపి
ప్రాయోఽన్నం తృప్తిహేతు స్తదపి నిగదితం కారణం భోక్తృయత్నః।
ప్రాచీనం కర్మ తద్వ ద్విషమసమఫలప్రాప్తి హేతు స్తథాఽపి
స్వాతంత్ర్యం నశ్వరేఽస్మిన్నహిఖలు ఘటతే ప్రేరకోఽస్యాంతరాత్మా॥



### కర్మ

ఈ పుస్తకము ౧౧౦ వ పుటయందు పునర్జన్మమునకు కారణము కర్మ యని చెప్పబడినది. "కర్మ" అనగా పని అని యర్థము. ప్రతి పనికిని ఒక కారణముండును. కారణమున్నపుడు కార్యముండును. కార్యమున్నపుడు కారణముండును. కార్యకారణములు విభజించి యుంచుటకు సాధ్యముగానివి. కారణములు కార్యములుగా మారును. మరియు కార్యములే కారణములగును. ఇట్లు చక్రప్రవర్తనము జరుగుచుండును. కారణము మారుచున్నట్లెల్లయు కార్యము మారుచుండును. జీవాత్మకు కర్త యని పేరు. భోగార్హములగు సుఖదుఃఖముల ననుభవించువాడు గనుక జీవాత్మకు కర్త యని పేరు.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహఙ్కారవిమూఢాత్మా కర్తాహం ఇతి మన్యతే॥
(భ. గీ. 3 వ అధ్యా)

౧౮౫ వ పుటయందు చెప్పిన స్వభావముచేత చేయబడు కార్యములను తాము చేసినట్లు మూఢులు అనుకొందురు. అయినను ఆ స్వభావమును జయించు అధికారము జీవాత్మకున్నప్పుడు అట్లు జయించనందున జీవాత్మ

పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్ ।
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు ॥
(భ. గీ. ౧3 వ అధ్యా)

కార్యకారణరూపము అగు ప్రకృతి తానే అని నమ్మినందున అహంకారమమకారములవల్ల కార్యములయొక్క ఫలముల ననుభవించును.

స యథా కామో భవతి తత్క్రతుర్భవతి యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే యత్కర్మ కురుతే తదభిసంపద్యతే
(బృహదారణ్యకము)

జీవు డెట్టి కోరికలు గలవాడో యట్టి ప్రయత్నములు చేయును, ఎట్టి ప్రయత్నములు చేయునో అట్టి ఫలములను పొందును అని తాత్పర్యము.

సుఖదుఃఖానుభవశాలి యగు జీవు డెట్లు కామములుగలవాడై మనుస్సుతో కూడుకొని ఎట్టి కార్యములను చేయునో అట్టి ఫలముల ననుభవించును. కనుకనే

కః కస్య హేతు ర్దుఃఖస్య కశ్చ హేతు స్సుఖస్య వా ।
స్వపూర్వార్జితకర్మైవ కారణం సుఖదుఃఖయోః ॥
సుఖస్య దుఃఖస్య న కో౽పి దాతా పరో దదాతీతి కుబుద్ధిరేషా ।
అహం కరోమీతి వృథాభిమానః స్వకర్మసూత్రగ్రథితో హి లోకః ॥
(అధ్యాత్మరామాయణము)

సుఖదుఃఖములకు పూర్వమునందు అనగా పూర్వజన్మములయందు మనము చేసినకార్యములే కారణములు అని చెప్పబడెను.

మన జీవితకాలమందు మనము చేయు సత్కార్యములు దుష్కార్యములు వీట్లయొక్క ప్రతిఫలముల ననుభవించను మనమే బాధ్యులము. సత్కార్యములకు ప్రతిఫలము సుఖము. దుష్కార్యములకు ప్రతిఫలము దుఃఖము. సదాకాలమందును ఏదో యొక కార్యము చేయుచుండుట మనకు స్వభావము. "నహికశ్చిత్క్షణమపి జాతుతిష్ఠత్యకర్మకృత్" అని శ్రీమద్భగవద్గీతయందు చెప్పబడియున్నది. మనుష్యులు కార్యములుచేయుటకు మూడు కరణములు గలవు. కరణములనగా నాయుధములు. అవి యేవన: ౧. మనస్సు ౨. జ్ఞానేంద్రియములు ౩. కర్మేంద్రియములు. ఈ మూటికిని త్రికరణమని పేరు. ఇందులో మనస్సుయొక్క సహాయములేనిదే మిగిలిన రెండును నిజముగా పనిచేయుట యసాధ్యము. జ్ఞానేంద్రియములు: ౧. శ్రోత్రేంద్రియము అనగా చెవి, ౨. చక్షురింద్రియమనగా కన్ను, ౩. స్పర్శ లేక త్వగింద్రియమనగా చర్మము, ౪. రసనేంద్రియమనగా రుచిచూడగల నాలుక, ౫. ఘ్రాణేంద్రియమనగా ముక్కు. కర్మేంద్రియములనగా కార్యములను చేయునట్టి చేయి కాలు మొదలగునవి.

జన్మమెత్తి వ్యక్తదశ వచ్చినదిమొదలు మరణపర్యంతమును జీవాత్మలు ఈ మూడు కరణములతోనును కర్మ చేయుచునే యుందురు. ఒకానొకడు ప్రతిదినమును, దినమంతయు, తనకుగల భూములను దున్ని ఆభూములయందు విత్తనములను జల్లుచుండునను కొందము. అట్టి విత్తనములలో కొన్ని పదిదినములలో ఫలమిచ్చునవి, కొన్ని నెలదినములలో ఫలమిచ్చునవి, మరికొన్ని ఆరునెలలకు ఫలమిచ్చునవి, మరియును కొన్ని ఒక సంవత్సరమైతేనే ఫలమిచ్చునవి, మిగిలిన కొన్ని పది యిరువది సంవత్సరములకు గాని ఫలమియ్యనివి. ఇట్లు ప్రతినిత్యమును అపరిమితములైన చేలలో, మళ్లలో విత్తనములు చల్లుచుండును. ఇట్లు విత్తనములు చల్లువాడు జీవాత్మ. ఒక దినము పగలు ముగిసి రాత్రి సంభవించినపుడు విత్తనములు చల్లుచున్నజీవాత్మ ఆరాత్రియందు నిద్రించి మరునాడు ఉదయమున మేల్గాంచి మరల విత్తనములను చల్లును. ఇట్లు తాను చల్లిన విత్తనములలో పదిదినములైనతరువాత ఫలమియ్యగల విత్తనములఫలము ననుభవించను పదిరాత్రులు నిద్రపోయిన పిమ్మట గాని వీలుండదుగదా. ఆలాగే తాను చల్లిన విత్తనములు ఏ యే కాలముల ఫలమునిచ్చునో యా యా కాలములయందు ఫలములననుభవించ నిచ్ఛయించి యెన్నిరాత్రులు నిద్రించియుండవలెనో. అన్నిరాత్రులు నిద్దురబోవును గదా. ఇది మనలకు అనుభవసిద్ధమైన విషయము.

యస్మిన్ దేశేచ కాలేచ యస్మాద్వా యేన కేనవా,
కృతం శుభాఽశుభం కర్మ భోజ్యం తత్త్రత నాన్యథా ॥

అని చెప్పబడియున్నది. అనగా నేదేశమందు నేకాలమందు ఎవ్వనిచేత చేయబడిన శుభాశుభకర్మలయొక్క ఫలములు ఆ దేశములో నాకాలములో వాడే యనుభవించవలెనని తాత్పర్యము. జీవాత్మ యొక శరీరమందు చేసినకర్మలు పక్వము అగునంతవరకును ఆశరీరముండదు గనుక ఆశరీరము పోయినను వేరు శరీరమును సంపాదించికొని అనగా మరియొక జన్మమెత్తి తానుచేసిన కర్మల యొక్క ఫలములననుభవించును.

మనము మనస్సుతో, కామస్వభావముతో, చేతులు మొదల గు కరణములగుండా చేసిన కార్యములు, అనగా, తలంపులు కామ ములు క్రియలు, వీటియొక్క సముదాయములు కర్మ అని పేరు గొనియుండును. మనస్సుతో జేసినకార్యములు అనేకులను అందును. కర్మచేయుటయందు మనస్సు అతిబలశాలి; తలంపులు ఇతరులను అందును. ౧౬౮ వ పుటయందు చెప్పినప్రకారము తలంపులు వాటికి అనుగుణములైన రూపములను దాల్చును. ౧౬౯ వ పుట యందు చెప్పినప్రకారము తలంపులు కొనిన రూపములందు అం దుకనుగుణమైన ఒక చేతనము ప్రవేశించి యితరులను కూడ తనవలె తలచమని ప్రేరేపించినందున ఇతరులుకూడ ఆ స్వభావము గలతలంపులను తలతురు. ఇతరులు తాను తలచినరీతిన తలచు నట్లుచేసిన వానిని ఇతరులు తలచిన తలంపులయొక్క పూచి అందును.

కర్తు శ్శాస్తు రనుజ్ఞాతు స్తుల్యం యత్ప్రేత్య తత్ఫలం ।

(శ్రీమద్భాగవతము. ౭. సం - ౨౧ అధ్యా)

పుణ్యమాచరించువానికే ఫలంబగునో తత్తుల్యఫలంబు చేయుమని ప్రేరేపించువానికిని, అనుమోదించువానికిం గూడ కలుగును.

మనము తలంచుతలంపులు ఇతరులను మంచితలంపులు తలుచునట్లు చేసినను చెడ్డతలంపులుతలచునట్టు చేసినను ఆతలంపుల వల్ల కలుగు ప్రయోజనములు మంచివైనను చెడ్డవైనను వాటియందు మనకును భాగముకలదు. ౨౪౬ వ పుటయందు "సంభోగసంవిత్", "వర్గప్రశంసీ" అను పదములయొక్క అర్థము ఇపుడు మనకు విశదమగును. మనము ఒక్కరము తలంచిన దుష్టతలంపులు వేయ్యారుమందిని దుష్టతలంపులు తలచునట్లు చేయును. ఇందరిని చెడ్డదోవకు లాగిన పాపము మనది కదా. ఇదంతయు మన కర్మకు చేరును. రాబోవు జన్మములలో ఎప్పుడో ఏదేశమందో మనవల్ల చెడ్డస్వభావముపొందినవారలనందరినిని సన్మార్గమునకు తిప్పవలసినది మనభారము. ఇపుడు చెప్పిన విధముగా మనము తలచిన ఒక తలపువల్లనే వెయ్యారుమందికి మనము ఋణస్థులమైతే ప్రతినిత్యము ఎన్నితలంపులు తలచి యెందరిని చెడిపియుందుము, చెడుపుచున్నాము. ఇది గమనింపవలయును.

రాగద్వేషములను పురికొలుపు తలంపులను ఒకానొకడు తలంచుచుండినయెడల అతని ప్రతితలంపును రూపమెత్తి అట్టివి అనేకములు ఏ ఊళ్లోనో ఎక్కడనో మరియొకడు ఎవనినైనను చంపను ఉద్దేశించి నిశ్చయము తక్కువై సంశయించుచు ఉన్నవానిని మన ద్వేషతలంపులవల్లపుట్టినరూపములు ధైర్యపరిచి "అందువల్ల ఏమి? యోచించనక్కరలేదు. సంశయమెందుకు? నీవు చేయదలచుకొనియుండు ఘోరకృత్యమును చేయుము" అని ప్రేరేపించి ధైర్య

మునిచ్చి వానిచేత మహాఘోరకృత్యమైన హత్య, ఘాత అను పాపకృత్యములను చేయించును. ద్వేషతలంపులను తలంచిన మనకు పైచెప్పినపాపములయందు భాగము కలదు. ఇందువలన మనను మనము చెరుచుకోవడమేకాక ఇతరులను కూడ చెరిచిన వారైతిమి.

మనతలంపులు రూపములెత్తి యితరులను దుష్కార్యముల కో సత్కార్యములకో ప్రేరేపించియు మన కామక్రోధాదులును అదేప్రకారము చేయుటచేతను మన అశుద్ధమనోమయశరీరమును కామమయశరీరమును మనము తలచిన తలంపులకు అనుగుణముగా మారుచువచ్చును. మరియు పైన చెప్పిన ప్రకారము ఇతరులను కార్యములకు ప్రేరేపించిన పాపమునకుగా వారలుండుస్థలమున మనకు ఏదో ఒకజన్మము కలుగవలసియుండును. మనము పైన చెప్పినపాపమును తెలిసినవారముకాము. అందువల్లనే ప్రాయశ్చిత్త ములయందు

> "జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాసు మనోవాక్కాయవ్యాపారైః రహసి ప్రకాశే చ జ్ఞానతః అజ్ఞానతో వా మయా కృత మహాపాతకా నాం అజ్ఞానతః సకృత్కృతానాం జ్ఞానతః కృతానాం పాపానా మపనోదనార్థం"

అని చెప్పుదురు. అజ్ఞానముతో, అనగా ఎరుకలేక, చేసినను చేసిన వారమే కదా.

త్రికరణములచేత చేయబడు కార్యములు ఇతరులకు సం బంధించియుండును. ఇతరులకు సుఖమునో ఉపద్రవమునో కలుగ చేయురీత్యా వార్లకు మనకును సంబంధము నేర్పరుచును. ఈ

సంబంధము మనకు ముందురాబోవు జన్మమునందు వార్ల సమా గమమును ఇచ్చును.

ఈ లోకమందు ఇతరులకు అనగా జనసముదాయమునకు సుఖము గాని దుఃఖము గాని కలుగచేస్తే ముందుజన్మమందు సుఖమయమైన ఇల్లు తోటలు మొదలగునవి లభించును. ఉద్దేశము అనునది యొకటి కలదు. కర్మఫలములు ఉద్దేశముల స్వభావముల ననుసరించి నిశ్చయింపబడును. పరులయొక్క శ్రేయస్సుకోరిన ఉద్దేశముతో కార్యమునారంభించి దైవవశమున కార్యముచెడి పోయినను ఉద్దేశము మంచిది గనుక కర్తకు చెడుపురాదు.

కర్మ త్రివిధంబుగా నుండును. సంచితము, ప్రారబ్ధము, క్రియమాణము అని. క్రియమాణము అను కర్మకు ఆగామియని యు పేరు కలదు. ప్రకృతమందు మనము చేయుకార్యములన్నియు క్రియమాణము అను పేర వ్యవహరింపబడును. ఈ జన్మమందు కారణరూపములుగా మనము చేసిన కర్మ అంతయు సద్యఃఫలము నిచ్చినవి పోను మిగిలినవి సంచితము అను కర్మతో చేరును. సద్యః ఫలములనిచ్చునవి అనగా అప్పుడే ఫలమును ఇచ్చునట్టివి. ఎట్లనగా కాలిన ఇనుమును చేత ఎత్తితే ఇకముందు ఏదో యొక జన్మము వరకును దానియొక్క ఫలమునకు మనము కాచియుండనక్కర లేదు. ఆ నిమిషమునందే వ్రేళ్లుబొబ్బలెగిసిపోవును. ఇట్టివి కాని మిగిలిన కర్మలు సంచితముతో చేరియుండును. “అత్యు త్కటైః పుణ్యపాపైః ఇహైవ ఫలముచ్యతే” అనగా నతి బల వంతములైన పుణ్యపాపములకు ఇక్కడనే (యిపుడే) ఫలము కలుగును.

## సంచితకర్మము

సం+చితము అనగా కూడబెట్టబడినది. ఒక జన్మము నందు ఒకడు కలుగజేసినకారణములకన్నిటికిని ప్రయోజనము (కార్యము) అయిన అనుభవములను అనుభవించుటకు ఒక జన్మము చాలదు. మరియు మనము కలుగజేసినకారణములయొక్క ఫలములను మనముమాత్రము కాదు అనుభవించవలసినవారము. మనయొక్కతలంపులవల్ల, కామములవల్ల, చర్యలవల్ల, అనేకులకు మేలో, కీడో, సంతోషమో, దుఃఖమో కలిగియుండియుండును. ఆ విధమున సంబంధించినవారు కూడ భూలోకమందుండి, మనము భూలోకమందుండు సమయమునందే కదా ఆ కారణమునకు అనుగుణము అయిన ఫలమును సంబంధపడినవారందరును ఏక కాలమందు అనుభవించవలెను. అట్లు సంబంధపడినవారు పది మంది ఉన్నారనుకొందము. ఈ పదిమందిలో త్వరగా ఆస్ట్రిల్ ప్లేను అనుభవములను ముగించుకొని మెంటల్ ప్లేనులో దీర్ఘకాలము ఉండువారు కొందరు. వారు భూలోకమునందు ఇప్పటి వరకును జన్మమెత్తలేదు. మరికొందరు హైయర్ మెంటల్ ప్లేను నందు ఉండి భూలోకమునకు వచ్చుచుండు వారుకొందరు. ఈ విధముగా "కప్పలతక్కెడ" అనినట్టు ఒకరు ఉన్నపుడు మరియొకరు ఉండరు. కనుక సముదాయముగా పదుగురు అనుభవించవలసిన కర్మఫలమును పదుగురును ఏకకాలమందు భూమియందు జన్మించు సందర్భమువచ్చునంతవరకును ఆ కర్మను నిలిపియుంచవలెను. ఇంతలో కర్త (అనగా సముదాయముగా పదుగురు ఫలమును అనుభవించవలసినట్టుగా కారణమును కలుగ

జేసినవాడు) ఒకటి రెండు జన్మములెత్తి ఆ జన్మములలో అనేక కారణములను కలిగించియుండును. కనుక అనేక కారణములు ఫలవంతములు కాకనే నిలిచియుండును. ఇదే కూడబెట్టబడిన (సంచిత) కర్మ. పుస్తకములలో ఇందునుగురించి యొక యుదాహారణమునిత్తురు. ఒకానొక రైతుకు అనేక భూములున్నవి. అందులో అనేక విధములైన ధాన్యములను నాటించి పైరుచేసి మహసూలు వబ్బిడిచేయించి కుప్పలు వేయించియుంచును. ఆ సంవత్సరమునందు ఆ కుప్పల పైకి ఒకటి లేక రెండు కుప్పలను నురిపించి ఆ ధాన్యమును తన మనవర్తికి సెలవుచేసికొనును. ఇందువలన ఎనిమిది కుప్పలధాన్యము నిలవ యేర్పడును. ఇట్లు సంవత్సరప్రతి సంవత్సరమును మిగతగా నిలిచిన ధాన్యము ఎట్లైతే కూడబెట్టబడిన ధాన్యమో అట్లు ప్రతిజన్మమునందును మనము కలుగచేయు కారణముల పైకి కార్యములుగా పరిణమించని (మారకనిలిచిన) వి సంచితకర్మగా నిలుచును.

## వర్తమానకర్మ.

సంచితకర్మను సంగ్రహముగా వివరించి అయినది. ప్రారబ్ధకర్మను గురించి ముందు వ్రాయబడును. మూడవజాతికర్మకు క్రియమాణము అని ౨౭౯ వ పుటయందు పేరు ఉపయోగింపబడినది. క్రియమాణము, వర్తమానము, ఆగామి, అను మూడుపేళ్లును ఒకటేకర్మను సూచించును. వర్తమానకాలము అనగా నిపుడు నడుచుచుండుకాలము. ఇపుడు దినప్రతిదినమును మనము మనోవాక్కాయములచే చేయుచున్న కర్మకు వర్తమానకర్మయని పేరు.

## ప్రారబ్ధకర్మ

౧౧౦ వ పుటయందు చెప్పిన ప్రకారము కర్మదేవతలు ప్రతివానియొక్కయు కర్మల రహస్యమును విమర్శించి ఎవరెవరికి ఎవరెవరు కర్మానుభవరీత్యా సంబంధపడియున్నారో అట్టి వారు ఎవరెవరు భూలోకమందు ఒకప్పుడు జన్మమెత్తబోతున్నారో అది పరీక్షించి ఒకరి కర్మపైకి కొంతభాగమును విమర్శించి వేరుగాతీసి ఆ జీవాత్మను వాని అనుభవమునకుగా వేరుతీయబడిన కర్మను సహా ఒక చిన్న దేవతచేతికి ఇత్తురు. లోకమందుండు జనులకంద రకును లెక్కలు పెట్టను ఎందరు దేవతలుండవలెనో యోచన చేసి యూహించవలెను. ఈ వేరుతీయబడినకర్మకు ప్రారబ్ధకర్మ యని పేరు. "ప్రారబ్ధం భోగతో నశ్యేత్." ఈ ప్రారబ్ధకర్మ అనుభవమువల్లనే అరిగిపోవలసినది. వేరువిధమున నశించుటకు సాధ్యముకాదు.

ఈ ప్రారబ్ధకర్మను అనుసరించియే ఏదేశమందు జన్మమెత్త వలయును, ఏజాతియందు పుట్టవలెను, ఏఊళ్లో, ఏకులములో, ఏతెగ, మగశరీరమా ఆడుశరీరమా, ఇవంతయు నిర్ధారింపబడును. ఎన్ని సంవత్సరములకాలము భూలోకమందు జీవించవలసినది అనునదియు కూడ ప్రారబ్ధకర్మను పట్టియే. ౧౧౧ వ పుటయందు చెప్పిన ప్రకా రము, ఏ విద్యను నేర్చిజీవించును, ఏ యే విద్యలయందు ప్రావీణ్య ము, అధికపరుచుకొనును, అనునది అంతయు నిర్ధారింపబడును. ౨౫౩ వ పుటయందు ప్రస్తావించిన దేహబీజములయం దిమిడి యుండు వాసనలు (శక్తులు) ఏ విధముగా క్రియారూపముగా మారును అనునదియు ప్రారబ్ధకర్మను అనుసరించియే. ఆ కర్మ చేసి

నది ఎన్ని జన్మములకుముందో అప్పట్లో ఎవరికి స్నేహితులుగా నుంటిమో ఏయే దుర్మార్గములవల్ల ఎవరెవరిని శత్రువులుగా చేసికొంటిమో వారందరును ఇపుడు మనకు స్నేహమును, ద్వేషమును చూపుటకుగా భూలోకమందు జన్మించియుందురు. వార్లతో సమాగమము కలుగును. శరీరము ఏయే జాడ్యములకు లోబడవలెనో అవన్నియును ఈ కర్మను అనుసరించియే. ఈ స్థితులన్నియు జననకాలమునందు ఉండు గ్రహసంపత్తి సూచించును. మనకు ఇష్టమున్నను లేకున్నను ఈ పైన వివరించిన సందర్భములు సందర్భించేతీరును. ఇవన్నియు మనయిష్టానుసారము పూర్వమందు ఏదో ఒకజన్మమునందు నిర్ధారించినవి. ఇప్పటికి లభించినవి. ఐతే మనము నిర్ధారించుకొన్న ఆ పూర్వజన్మమునకును ఈ జన్మమునకును మధ్య కొన్నిజన్మములు అయిపోయినవి. అట్టి అవాంతరజన్మములయందు తపోవిద్యాశీలములవల్ల మనము అప్పటి కంటె కొంచెము ఉన్నతస్థితికి వచ్చియుండవచ్చును. అయినను ఏమి చేయవచ్చును. మనలయొక్క అభీష్టముప్రకారము కర్మదేవతలు మనయొక్క కోరికలను ఈడేర్చిరి. అవి ఇప్పటిస్థితిని పట్టి మనకు తగనివిగా నుండవచ్చును. విధి లేదు. మనము కోరుకొన్నదే గనుక అనుభవించే తీరవలెను. కాబట్టి కర్మఋణమును కడపటి రువ్వవరకును ఇచ్చి చెల్లించవలసినదే. ఇదండి ప్రారబ్ధము. ౨౭౪ వ పుటయందుండు "కః కస్యహేతుర్దుఃఖస్య" అను శ్లోకార్థము దీనిని విశదపరుచును. ఆస్ట్రల్ బాడీ, మెంటల్ బాడీ, స్థూలశరీరము, ఇవన్నియు నీ ప్రారబ్ధముయొక్క స్వభావమునుపట్టి యీ జన్మమునందు మనకు లభించును. ఆస్ట్రల్ బాడీ, మెంటల్

బాడీ, యీరెంటియొక్క (దేహ) బీజములలోని అధికమైనశక్తులను కూడ ప్రారబ్ధకర్మ ఆచ్ఛాదించియుంచును.

ప్రారబ్ధకర్మవల్ల కొన్ని స్వభావములు ప్రముఖతచెంది కనుబడుచుండును. అతి కోపము లేక అమితమైన పిరికితనము, ఇట్టివి. ఈ గుణములకు వేదాంతశాస్త్రములయందు "వాసనలు" అని పేరు పెట్టియున్నారు.

> దృఢభావనయా త్యక్త్వా పూర్వాపరవిచారణం ।
> యదాదానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా ॥

తాను చెయునదే సరియైన పని అను నిశ్చయముతో పూర్వాపర విచారములేకయే ఒక కార్యమును చేయుటకు వాసనాబలము అని పేరు. అనేకజన్మములందు ఒక విధమైనతలంపును ప్రయత్నపూర్వకముగా తలచియుండినయెడల ఆ తలంపును నిరూపించు కార్యమును పూర్వాపరవిచారములేకయే చేయు శక్తికలిగియుందుము. పూర్వమందు ప్రయత్నపూర్వకముగా మనమే తలచితిమి. ఇప్పటికి ఆ తలంపు వాసనారూపముగా దృఢమైనది. అది మంచి వాసనయైతే మరికొంతప్రయత్నముతో దృఢపరుచవలెను. మన పురోవృద్ధికి హానికరమైనవాసనయైతే పూర్వమందు మనము ఎంత ప్రయత్నముతో తలంపును తలచి తలచి ఆ తలంపునకు వాసనారూపమును ఇచ్చినామో అంత ప్రయత్నముతో అట్టి దుష్టవాసనకు విరోధియైన శుభమైనతలంపును తలచి తలచి ఆ దుష్టవాసనను అరుగగొట్టవచ్చును. ఇది మనకు సాధ్యము. గోడకట్టుటకు శక్తియుండినవానికి గోడను పడగొట్టుటకు శక్తి లేదా? ఇట్టి

శక్తికి "స్వతంత్రము." "పురుషప్రయత్నము" లేక "పురుష కారము" అని పేళ్లు.

### సంఘాతకర్మ

ప్రారబ్ధకర్మయే సంఘాతకర్మగా పరిణమించును. జర్మనీ దేశమునందు పుట్టినవారనేకులు అల్పాయుస్సులుగా యుద్ధరంగ మందు చచ్చిరి కదా. ఇంగ్లాండు మొదలగు దేశములు జర్మనీవారి తో యుద్ధమునకుపోవురీత్యా అనేక లక్షలమంది అల్పాయుస్సులు గా చచ్చిరి. ఇది సంఘాతకర్మ. ఇదే విధమున ఓడలు మునిగి అనేకులు చచ్చుట, రైలుబండిపార్లి అనేకులు మరణము చెం దుట మొదలగునవియు సంఘాతకర్మలే.

ఇట్లు ప్రారబ్ధకర్మచోదితులై మనము ఈ జన్మమునందు కార్యములుచేయుచు ఆ కార్యములయొక్క ఫలములను అనుభవిం చవలెనని కోరుచుందుము. ముందుచెప్పినరీతిగా ఇపుడే ఫలము నిచ్చునట్టివి కాని వర్తమాన (క్రియమాణ లేక ఆగామి) కర్మ అంతయు సంచితకర్మతో చేరుతున్నది. ఇట్లు చేరి చేరి సంచితము అపరిమితముగా పెరిగిపోతున్నది. ఏదో యొక జన్మమందు భగ వంతుని మాహాత్మ్యములను చదివియో వినియో పుణ్యావశంబున మోక్షేచ్ఛకలిగితే కర్మ అంతయు నశించితేనే గాని మోక్షము రాదు.

### కర్మక్షయోపాయము

పురుషకారము అను స్వతంత్రశక్తిని ఉపయోగించి మేలు పొందవచ్చును. వర్తమానకర్మతో ఇతరులకు ఎవరికైనను

కీడుతలచియుండినను, కీడుచేసియుండినను, తనచేత కీడుపొందినవారి నాశ్రయించి తన పశ్చాత్తాపమును వారికి మనవిచేసి వారివల్ల మన్నింపు పొందితే కొంత దుష్కర్మ చెల్లుపడిపోవును. ఇతరులకు కీడుతలచియుండినయెడల అట్టి కీడు మనస్సుయొక్క చర్యయే గనుక ఏ మనస్సుతో కీడుతలచితిమో అదే మనస్సుతో వారలకు ఆ కీడుతలంపుకు విరోధమైన మేలుతలంపు తలచి భగవంతుని ప్రార్థించి తాము ముందు వారలవిషయమై తలచియుండిన కీడు వారలకు రాకూడదు అని దృఢముగా తలచి తలచి మేలే కోరుచువచ్చినయెడల కీడుతలంపులు బలముతగ్గి క్రమేణ నశించిపోవును. ఈ ప్రకారము ఈ జన్మమునందు మనకు జ్ఞాపకమున్నంతవరకును వెదకి వెదకి అజ్ఞానదశలో మనము ఇతరులకు తలచిన కీడునంతయు మేలుకలుగవలయునని తలచు తలంపులతో మాపివేయవచ్చును. ఐనను కొంత వర్తమానకర్మ మిగతనిలుచును. ఇందుకే కర్మయోగమునందు నిష్కామ్యముగా భగవత్ప్రీతిగా కర్మచేయవలెనని చెప్పియున్నది. (ఈ పుస్తకము ఉత్తరభాగము చూడుడు). ఒకడు చేసిన సత్కర్మలను మాత్రమే భగవదర్పణముచేయవచ్చును గాని పాపకృత్యములను భగవదర్పణము చేయకూడదు. పాపకృత్యములను చేయనేకూడదు. అట్టి పాపకృత్యములను చేసి అట్టి వానిని భగవదర్పణగా విడిచిపెట్టుట కూడానా? పాపకృత్యములను క్షీణింపచేసికొనువిధము పైనచెప్పబడియున్నది. అనగా ఆ పాపకృత్యములకు విరోధములైన పుణ్యకృత్యములను మననము చేసి చేసియు నతి దృఢములైన సంకల్పరూపములను పుట్టించి వీనిచే పాపకృత్యరూపక సంకల్పరూపములకు ప్రతిహతి కలుగచేయుట.

పురుషకారము అనగా మనుష్యునికి గల స్వతంత్రశక్తి. కర్మచేసినపుడు ఎంతటి స్వతంత్రముతో చేసితిమో అంతటి స్వతంత్రముతో నిపుడును కర్మయొక్క వేగమును అరుగగొట్టుటకు మనకు శక్తికలదు. సాధారణముగా పండితంమన్యులు పురుషకారము లేదందురు. పండితంమన్యులనగా తాము పండితులు కాకున్నను పండితులము అని అనుకొనియుండువారు. వీరు కొంత మట్టుకు తమను తామే మోసపుచ్చుకొనువారు.

శ్రీమద్భగవద్గీత ౧౪ వ యధ్యాయమునందు సత్త్వము, రజస్సు, తమస్సు అని మూడు గుణములున్నవి అని చెప్పి, గుణములయొక్క స్వరూపములను, వానియొక్క కార్యములను, గుణముల స్వభావసిద్ధమైన కార్యములద్వారా మనకు బంధము కలుగుననియు, గుణముల అధికారమునకు లోబడిన మనుజుడు ఎట్టి జన్మములను ఎత్తుట సాధ్యమో ఆ విషయములనును చెప్పిరి. మరియు కార్యకారణ విషయములైన రూపములనుపొందునట్టి మూడుగుణములకన్న వేరుగ కర్తలేదని తెలుసుకొని గుణాతీతుడైతే మనుజుడు మోక్షమునుపొందగలడని చెప్పిరి. శ్రీమద్భగవద్గీత మూడవయధ్యాయమునందు కర్మయోగమును ఉపదేశించుచు వచ్చి, ఆ యధ్యాయము ౩౨ వ శ్లోకమునందు

> యే త్వేతదభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతం।
> సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః॥

నాయొక్క అభిప్రాయమును ద్వేషించువారలై దానిని అనుసరింపరో వారలు అవివేకులు, అజ్ఞానులు, అన్ని విధములను చెడిన వారలు అని శ్రీకృష్ణులవారు సెలవిచ్చిరి.

శిష్యుని మనస్సులో జనులు శాస్త్రప్రకారము వారి వారి కేర్పడిన ఆచారములను ఎందుకు అనుష్ఠించరు అని సందేహము కలుగునేమో అని శంకించి ౩౩ వ శ్లోకములో

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవా నపి।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥

ప్రతిమనుజుడును మంచిచెడ్డలు తెలిసినవాడైనను తన పూర్వజన్మ సంస్కారముచొప్పున (౧౮౫ వ పుటయందు చెప్పిన స్వభావము ప్రకారము) నడుచునుగాని మనము చెప్పిన మార్గము ననుసరింపడు, ప్రతిమనుష్యుడును నా యుపదేశప్రకారము నడుచునని యూహింపరాదు అని సెలవిచ్చిరి. మరియు ప్రతిమనుజుడును తన స్వభావము ననుసరించియే నడుచు నంటే శాస్త్రము లెందుకుండ వలెను. శాస్త్రములలో చెప్పిన పురుషకారము అను స్వతంత్ర శక్తికి అర్థమేమని ఆక్షేపము వచ్చునని

ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ ॥

సమస్తేంద్రియములకును వానివానికిని సంబంధపడిన విషయముల యందు కొన్నిటియందు ప్రీతియు కొన్నిటియందు ద్వేషమును ఏర్పడియున్నవి. రాగము అనగా నొక మంచివస్తువును చూచి నపుడు అది తనకు కావలెనని ఆశపడుట. ద్వేషము అనగా అట్టి వస్తువును తాను సంపాదించుటకు ప్రయత్నముచేసినపుడు అడ్డము వచ్చినవారియందు కలుగు విసుకు.

ఇంద్రియవ్యాపారములకు లోబడిన వారికందరికిని రాగ ద్వేషములుండుట తప్పదు; శాస్త్రార్థవిచారముచేసిన యోగ్యులు

రాగద్వేషములకు లోబడరు; రాగద్వేషములు గలవాడు స్వధర్మమును మరుచును; అని శ్రీజగద్గురువులవారు చెప్పినందుకు అర్జునుని ప్రశ్న యేమనగా

> అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
> అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥
>
> (శ్రీ భ. గీ. ౩—౩౬)

అయితే ప్రతిపురుషుడును రాగద్వేషములు రెంటిలో దేనిచేత ప్రేరేపింపబడి విషయసుఖములనుకోరని యోగ్యుడైనను బలాత్కారముగా నెవరో తనను లాగినట్లు పాపము చేయుచున్నాడు అని అర్జునుని ప్రశ్న. అందుకు శ్రీభగవద్వాక్య మేమనగా

> కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।
> మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణం ॥
> ధూమేనావ్రియతే వహ్ని ర్యథాఽదర్శో మలేన చ।
> యథోల్బేనావృతో గర్భ స్తథా తేనేద మావృతం ॥
> ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
> కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ ॥
> ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే।
> ఏతై ర్విమోహయత్యేషః జ్ఞానమావృత్య దేహినం ॥
> తస్మా త్త్వమింద్రియాణ్యాదౌ నియమ్యభరతర్షభ।
> పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనం ॥
> ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః।
> మనస స్తు పరా బుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః ॥
> ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా।
> జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదం ॥
>
> (శ్రీ భ. గీ. ౩ అధ్యా ౩౭—౪౩)

ఈ శ్లోకముల అర్థములో పురుషకారముయొక్క మహిమను చెప్పుచున్నారు. ఓయి అర్జునా, నీవడిగిన హేతువులు రజో గుణమువల్లపుట్టిన కామము, తాను కామించిన వస్తువు తట స్థించినపుడు ఆ వస్తువును స్వాధీనపరుచుకొనుటకు ఆటంకము కలుగచేసినవారియెడల పుట్టునట్టి క్రోధము. క్రోధమునకు కారణ మైన కామము ఎంతటితోనును తృప్తిపొందనిదియు, మహాపాప ములకు కారణభూతము అయినదియును గాన, ఈ కామమును మోక్షమార్గమును ఆశించువానికి శత్రువునుగా నెరుగుము. అగ్ని స్వభావతః ప్రకాశవంతమైనను ప్రకాశహీనమైనదియును, అగ్ని యున్నస్థలమందంతయు నుండునదియు నగు పొగచేత కప్పబడు చున్నది గదా అట్లును, అద్దము మాలిన్యముచేత కప్పబడు చున్న ది గదా అట్లును, గర్భమునందుండెడి శిశువు మావిచేత కప్ప బడియుండును గదా అదే విధమున, జ్ఞానము కామముచేత కప్ప బడును. ఓయి అర్జునా, తృప్తిపొందించను అశక్యమైనదియు, సర్వభక్షకుడైన అగ్నివంటిదియు, జ్ఞానికి నిత్యశత్రువునైన కామ రూపుడైన ఆశచేత జనులయొక్క తెలివి మూతపడియున్నది. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ఇవి కామము దాగియుండు స్థల ములు. కామరూపమైన ఆశ ఇంద్రియములు, మనస్సు, బుద్ధి వీటి గుండా తెలివిని మూసిపెట్టి మనుష్యులకు మోహముపుట్టించు చున్నది. కాబట్టి ఓ అర్జునా, నీవు కర్మయోగమారంభించుటకు పూర్వమే కామము దాగియుండు స్థలములలో నొకటియగు నింద్రియ ములను స్వాధీనము చేసికొని, తెలివిని, అనుభవజన్యజ్ఞానమును సహా, మూపివేయునట్టి పాపిమైన కామరూపమను ఆశను పరిపూర్ణ

ముగా వదలుము. మరియు స్థూలదేహమునకన్న జ్ఞానేంద్రియము
లు అధికములు. జ్ఞానేంద్రియములకన్న మనస్సు బలవంతమైనది.
మనస్సునకంటె బలశాలి బుద్ధి. ఇట్టి బలశాలి అయిన బుద్ధికంటె
ఆత్మ అధికుడు. ఓయి అర్జునా, ఎవడు తన్ను తాను మహాబల
శాలియయిన బుద్ధికన్న వ్యతిరిక్తుడైనవానిగానును మహాశక్తివంతు
డైన యాత్మయని నిశ్చయముగా తెలిసికొనునో అతడు ఇంద్రియ
ములను మనస్సుచేత నిగ్రహించి, అట్టి మనస్సును బుద్ధిచేత నియ
మించి, ఆ బుద్ధిని తనయొక్క ఆయుధముగా నుపయోగించి
జయించుట కసాధ్యుడైన కామరూపుడగు ఆశయను శత్రువును
జయించును. అని శ్రీకృష్ణమూర్తిగారు అర్జునునకు ఉపదేశించిరి.

శ్రీభగవద్గీత మూడవయధ్యాయము చివరను ప్రయత్న
పూర్వకముగా గీతాచార్యులవారగు శ్రీకృష్ణమూర్తి పురుష
కారమున్నది అని స్థాపించిరి. పురుషుడైన జీవాత్మయొక్క సేవకు
లైన బుద్ధి, మనస్సు, ఇంద్రియములు ఇవి యెంతబలవంతములై
నను ఆత్మకంటె బలవంతములు కావు. ఆత్మ పరబ్రహ్మముయొక్క
అంశ. బుద్ధ్యాదికరణములు ప్రకృతిజన్యములు. తక్కువ తరగతివి.
కనుక జయించుట సులభసాధ్యము.

పదేపదే అనేకస్థలములయందు పురాణములలో వేరు వేరు
శిష్యులచేత నడుగబడిన ప్రశ్న ఏమంటే, పురుషకార మనునది
యొకటి కలదా అని. శ్రీమన్మహాభారతము, అనుశాసనిక
పర్వము ౬ వ యధ్యాయమందు ఈ ప్రశ్నకు విపులముగా
జవాబున్నది. దైవపురుషకారములని శాస్త్రవచనము. దైవము
అనగా ప్రారబ్ధకర్మ. పురుషకారము జీవాత్మకుండుశక్తి, యుక్తా

యుక్తజ్ఞానము. యుక్తాయుక్తజ్ఞానమును సంపాదించని మూఢుడు ప్రారబ్ధకర్మను *నిరాకరించవలెనని కూడ తలవడు కదా. అట్లు నిరాకరించవలెనని తలచువానికి యుక్తాయుక్తజ్ఞానమున్నది అని నిశ్చయము. కొంతమట్టుకు శాస్త్రశ్రవణమువల్ల తానేమో పర బ్రహ్మయొక్క అంశయనియు, ౧౦ వ పుటయందును ౨౮ వ పుట యందును చెప్పినట్లు తాను (జీవాత్మ) నామరూపములను అంగీ కరించిన పరమాత్మనే అనియు తెలిసికొనియుండును. ఇది నిశ్చయ మైతే, (ఈ సందేహమెందుకు? అట్టి సందేహమునకు కూడ స్థలమున్నదా?) పరబ్రహ్మమునకున్నంతశక్తిలో సగమైనా మన కుండియేతీరవలెను. వినండి. అంతశక్తియు నిపుడే లేదు. ఎంత భారీపనినైనను చేయవచ్చును. కొంతతడవు ప్రయత్నము మాత్ర ము కావలెను. మనస్సుయొక్క శక్తి అపరిమితము. చతుర్ముఖ బ్రహ్మ మనస్సుయొక్క శక్తిచేతనే కదా లోకములను సృష్టించెను. అందువలననే కదా వారికి మానసధ్యాని యని పేరు. ఇపుడు చతుర్ముఖబ్రహ్మగానుండువారు కూడ పూర్వకల్పములలో ఎపుడో ఒకపుడు మనుష్యమాత్రులుగానుండిన వారే. ఇపుడు విష్ణువుగా (శ్రీమహావిష్ణువు కాదు) నుండువారుకూడ ఒకపుడు మనుష్య మాత్రుడే. ఈ విషయమును గర్గసంహితయందు చదువ వచ్చును.

> కర్మణేంద్రో భవేజ్జీవో బ్రహ్మపుత్ర స్స్వకర్మణా ।
> స్వకర్మణా హరేర్దాసో జన్మాది రహితో భవేత్ ॥
> స్వకర్మణా సర్వసిద్ధి మమరత్వం లభేద్ధ్రువం ।
> లభేత్ స్వకర్మణా విష్ణోః సాలోక్యాది చతుష్టయం ॥

సురత్వం చ మనుత్వం చ రాజేంద్రత్వం లభే న్నరః ।
కర్మణా చ శివత్వం చ గణేశత్వం తథైవ చ ॥

(దేవీభాగవతము)

దీనికి అర్థము: ఒకనియొక్క కర్మబలముచే వాఁడు ఇంద్రుడు కావచ్చును. బ్రహ్మపుత్త్రుఁడు కావచ్చును. హరిదాసుడు కావచ్చును. జననమరణరాహిత్యమును పొందవచ్చును. తన కర్మబలమువల్ల సిద్ధి చెందినవాఁడై దైవత్వము చెందవచ్చును. తన కర్మబలముచేత నొకఁడు చతుర్విధ మోక్షములను పొందవచ్చును. దైవత్వము, మనుత్వము, రాజేంద్రత్వము, శివత్వము, గణపతిత్వము అన్నియు పొందవచ్చును.

ఇంతటి దుర్లభములైన పదవులనంతయు నొకఁడు పురుషప్రయత్నమును అవలంబించి చేయు కర్మములవల్ల పొందవచ్చును అనగా వినను ఆశ్చర్యముగానుండును. అనంతశక్తిమంతుడైన జీవాత్మచేతకాని దేమి యున్నది. నిశ్చయమును నమ్మి తద్ద్వారా ప్రయత్నము చేసినపుడు అంతయు సాధ్యమే.

మనము ఇపుడు జయించవలెనను కామము అను స్వభావమును మనము పూర్వజన్మములందు అతి ప్రయాసపడి సంపాదించితిమి. దానిని సంపాదించుటకు పడిన కష్టము ఎంతో అంతకు సమానమైన కష్టమును ఇపుడు పడవలయును. అప్పటికే ప్రయత్నముతో సమానమైననిరోధము చేసిన వారగుదుము. వ్యాధిని ఏమరి పెరుగనిచ్చి మనము దేహమును వ్యాధికి స్వాధీనపరిచినవారము. ఆ వ్యాధియొక్క స్వాధీనమునుండి మరల దేహమును విడతీయవలెనంటే వ్యాధిని పెరుగుటకు ఒప్పుకొన్నంతకాలమైనను పట్టును.

వ్యాధి పోగొట్టుకోవలె నని అనుకొని నంతమాత్రమున ఆ వ్యాధి పోదు.

> పథ్య మౌషధ సేవా చ క్రియతే యేన రోగిణా ।
> ఆరోగ్యసిద్ధి ర్దృష్టాఽస్య నాన్యానుష్ఠితకర్మణా ॥
>
> (వివేక చూడామణి)

ఔషధములను పుచ్చుకొని ఆ యా ఔషధములకు నియమించిన పథ్యములను కూడ ఎవడు జరుపుచువచ్చునో అతనికే ఆరోగ్యసిద్ధి కలుగును.

> న గచ్ఛతి వినా పానం వ్యాధి రౌషధశబ్దతః ।
>
> (వివేక చూడామణి)

ఒకానొకడు జ్వరబాధ ననుభవించుచుంటే వానిని చూచి ఇదిగో జ్వరాంకుశము అన్న మాత్రమున జ్వరము పోదు. గనుక మనము ప్రయత్నము నిజముగా జరుపవలయును. ఒక ఉదాహరణము. మనమెప్పుడైనను చిన్న రైలుస్టేషనులో రైలుబండి రాకమునుపు నిలిచియుండి అక్కడపోర్టర్లు ఉళ్లోవర్తకులు తెచ్చి చేర్చిన సరుకులమూటలను ఒక వ్యాగనులో భర్తీ చేయుచుండగా చూచి యుందుము. భర్తీ అయినతరువాత ఆ వ్యాగనును గూడ్సుషెడ్డు నుండి వేరు లైనుకు కొనిపోవు ప్రయత్నమును చూచియుందుము. అనేకటన్నులభారముగల వ్యాగనుబండి ఇనుపగెళ్లపై నుండు దానిని ఒక పోర్టరు తోయుటకు యత్నించి హుంకించి హుంకించి ఆ వ్యాగనును తోయును. సుమారు పదితడవలు ఇట్లు ప్రయత్నపడినపిమ్మట అంతవరకును కొంచమైనను చలనమును చూపని వ్యాగను కొంచెముగా చలించుటకారంభించును. చల

నము ఆరంభించగానే పోర్టరు మరియు కొంచెమధికముగా హుం
కించి బండిని తోయును. అపుడు అతిసులభముగా బండి రైలు
కంబులపైన నడువనారంభించును. అపుడు పోర్టరు తనచేతిని ఆ
బండిని తాకించియుంచియుండును. అంతస్వల్పమైన శక్తిని విని
యోగపెట్టినందు మాత్రముననే ఆ వ్యాగను రైలుకంబులపైన
ప్రయాణమగుచుండును. అయితే కొంత దూరము పోయిన పిమ్మట
ఆ పోర్టరు ఆ వ్యాగనుబండిని ఒక చోట నిలుపుటకు ప్రయ
త్నముచేయును. అప్పుడు ఒకతూరి ఆ బండికి ఎదుటపోయి
నిలువడు. అయితే కొంతకొంతగా ఆ బండిని అడ్డగించి, మరల
చేతిని తీసివేసి, మరల అడ్డగించి, తానును ఆ బండితోకూడ నడు
చుచు ఇట్లు పది పండ్రెండు సారులు ప్రయత్నబడి ప్రయత్నపడి,
కొంతకొంతగా ఆ బండియొక్క వేగమును తగ్గించి కడపట
ఆ బండిని తాను నిలుపవలెననుకొన్న స్థలములోనిలుపును. ఇది
అనేకులు చూచియుందురు. ఇదే ప్రకారముగా కొన్ని జన్మము
లకు ముందు మనముగాప్రయత్నపడి సంపాదించిన కామమును
కూడ యుక్తితో ఇప్పట్లో మనమే నిగ్రహించవలయును. రైలు
బండి వ్యాగనును నిలుపుట ఆ పోర్టరుకు ఏ విధముగా సాధ్య
మైనదో ఆ విధముగా పురుషప్రయత్నమువల్ల మనకు కూడ
కామనిగ్రహము సాధ్యము అను సంగతి నిజము. “మనోజయం
తు మాండవ్యః” అని యొక వచనము కలదు. మాండవ్యుడను
ఋషి మనోజయమువల్లనే కార్యము సిద్ధించును అని సెలవిచ్చి
నారట. అట్లు మనోజయమువల్ల పురుషకారమును ఉపయోగించ
వలయును.

కర్మ స్వాత్మా స్వతంత్ర శ్చేత్ నివృత్తౌ చ తథేష్యతాం।
(ఉపదేశసహస్రీ)

కర్మలుచేయుటకు ఆత్మ స్వతంత్రుడైతే వానిని నివృత్తిచేయుటకు కూడ స్వతంత్రత కలదు. కనుక మనకు గల స్వతంత్రమును నమ్మి మనోజయముతో పురుషకారము నుపయోగించి పూర్వపు దుష్కర్మలను హరించవలయును.

ఇంతే కాక సాధారణజనుని యుక్తికైనను ఉచితముగా తోచు యుక్తి యొకటి కలదు. అది యేమనగా సంగతులు తెలిసినవాడొకడు మరియొకనివద్దకు వచ్చి, నాయనా, నేను నేటిదినం న్యాయస్థానమునకు పోయియుంటిని. అచ్చట ప్రస్తావములో నీ వెవ్వరికో సొమ్ము బాకీపడియుంటివట. వాడు నీ మీద కోర్టులో దావాచేసి నీపైన వారంటు పుట్టించికొని వారంటుతో సహా నీ అప్పులసాహుకారు రేపటిదినం ఇక్కడికి వచ్చి నీ పైన వారంటు అములు జరుపపోతారట అని చెప్పను. ఆ మాట వినగానే అప్పుపడినవాడు వారంటు తప్పించుకొనుటకుగా సకలప్రయత్నములును చేయును కదా. అటుగాక "వారంటు వచ్చి నన్ను వారలు తీసికొనిపోయి జెయిలులో వేసి నేను జెయిలులో నుండవలసినట్లు నా కర్మ ఉండును. లేకుంటే ఎందుకు వారంటు పుట్టును. కనుక కర్మానుభవమును పడగొట్టుటకు ఎవరికి సాధ్యము" అని తలపోసి వారంటు జవాను ఏలరాలేదని యెదురుచూచుచుండునా! ఉండడు కదా? ఇదేప్రకారము పూర్వకర్మములయొక్క శక్తిని మాత్రము తెలియునట్టు వ్రాయబడిన జన్మపత్రికను చదివి గ్రహగతులు మొదలగునవియం

తయు చూచి ‹‹ నాయనా, నీకు కష్టము రాబోవుచున్నది ’’ అని యొక జ్యోతిష్కుడు చెప్పినాడని రాబోవు కష్టములను నివారణచేసి కొనుటకు ప్రయత్న మెందుకు చేయకూడదు. ప్రయత్నము చేసి రాబోవు కష్టములను తప్పించుకోవచ్చును. జాతకమునందు ‹‹ శుక్రదశ, రాహుభుక్తి, అంగారకుని యంతరము రెండునెలల కాలమున్నది. అంతకాలమునందు నాయనా, నీకు స్త్రీవిషయమై ఏదో ఒక అవమానము రాగలదు ’’ అని జ్యోతిష్కుడు చెప్పితే ఆ రెండు నెలలు అను కాలమునకు ముందు ౧౫ దినములు, పిమ్మట ౧౫ దినములును జాగ్రతగా స్త్రీలున్న స్థలమునకు పోకయే, లేక పోవలసివచ్చినను తానొంటరిగా పోక, జాగ్రతతో నుండి మనసా వాచా కర్మణా స్త్రీలనుగురించిన దుష్కర్మచేయక ఉండు వాడు బుద్ధిశాలి. ఈ మాత్రము హెచ్చరిక ఇచ్చుటకు గానే జాతకములు వ్రాయుట. జ్యోతిష్కులు మనకు జోశ్యములు చెప్పుట. ఈ విధముగా పురుషకారమును ఉపయోగించి వర్తమానకర్మలో సాధ్యమైనంతవరకును ప్రతిహతిచేయవచ్చును. పురుషకారమునుగురించియు కర్మయొక్క రహస్యములనుగురించియును ఒక పెద్ద గ్రంథమే వ్రాయవచ్చును. ఐనను ఈ గ్రంథము అనేకవిషయములను విచారించు రీత్యా ఒక చిన్నగ్రంథము గనుక ఈ ఆత్మవిచారమను విషయమునందు కర్మనుగురించి వ్రాసినది ఇంతమాత్రముచాలును. ఈవిషయమును గురించి బాహుళ్యముగా శ్రీ జంగమకోట శ్రీనివాసరావుగారు ఒక పుస్తకము వ్రాసియున్నారు. ఆ గ్రంథమునందు అనేకవివరములున్నవి. ఆ గ్రంథమును చదువవలెను.

## జ్ఞానాగ్ని

శ్రీమద్భగవద్గీతయందు "జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి భస్మ సాత్కురుతే" అని చెప్పియున్నది. "ప్రారబ్ధకర్మణాం భోగా దేవ క్షయః" అని శాస్త్రములయందున్నది. ప్రారబ్ధకర్మను అనుభవించు సమయమందు అనేకులు వర్తమానకర్మకూడ పుట్టించుదురు. జ్ఞానము అనగా తెలివి. తెలివిని ఉపయోగించి నిరాకరించుటకు అసాధ్యమైనంత మాత్రము ప్రారబ్ధకర్మను అనుభవించి, అట్లు అనుభవించు నపుడు,

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నో ద్విజేత్ప్రాప్య చాఽప్రియం।
(శ్రీమద్భగవద్గీత ౫ – ౨౦)

ఇష్టమైనదానిని పొందినను సంతోషపడకూడదు. అనిష్టమైనదానిని పొందినను వ్యసనమును చెందకూడదు. సంతోషాధిక్యము వల్ల తనను తాను మరచును. అట్లు మరిచినపుడు ప్రమాదము సంభవించును. అదేవిధమున దుఃఖపడునపుడును తన్ను తాను మరచును. అపుడును ప్రమాదము కలుగును. కనకనే తెలివి ముఖ్యము. ఇదియే జ్ఞానము.

సంచితకర్మను ఇక అనేకజన్మములెత్తి అనుభవించి క్షీణింపచేయవలసినది; లేక జ్ఞానమును ఉపయోగించి అరుగగొట్టవచ్చును. కర్మక్షయముచేసికోవలెనను ఇచ్ఛ జీవాత్మ కొంతమట్టుకు జ్ఞానమును సంపాదించిన పిమ్మటనే పుట్టును. ఆ మాత్రము జ్ఞానము వచ్చినపుడు జీవాత్మ తన శీలమును చక్కపెట్టుకొనుటకు ప్రయత్నించును. తనయందుండు అసురసంపద్గుణము

లను పోగొట్టుకొని దైవీసంపద్గుణములను వృద్ధిచేసికొనుటకు ప్రయత్నపడును. ఈ లోపల తనయొక్క ఆస్ట్రిల్ బాడీ మెంటల్ బాడీ అను రెండుశరీరములును తన నిద్రాసమయమందు అస్ట్రిల్ ప్లేనులోనును మెంటల్ ప్లేనులోనును స్వంతముగా చరించుశక్తిని సంపాదించుకొనియుండును. తన సంచితకర్మయందు తాను ఎవ రెవరికి కీడుగాని దుఃఖముగాని కలుగజేసినాడో ఆ యా జీవాత్మలకు తానుచేసిన చెరుపుకు ప్రతిగా మేలుచేయుశక్తి కలుగును. తనకు కర్మసంబంధముగల జీవాత్మలు అస్ట్రిల్ ప్లేను లేక మెంటల్ ప్లేనునందు నుందురు. నిద్రాసమయామునందు వారిని సంధించి వారికి మేలుచేసి ఆ ద్వారా సంచితకర్మ చాలమట్టుకు అరుగగొట్టవచ్చును.

కనుక కర్మ అనగా ఏదో ఒక రాక్షసి, అట్టి రాక్షసిని జయించుట కష్టము అని భయపడకూడదు. ఏ జన్మమందైనను మనము త్రికరణములతోను చేసిన కార్యములు కారణములుగా మారి ఆ కారణములకు న్యాయమైన ఫలితమును మనకు ఇచ్చును. అన్యాయమేమేమియు లేదు. కర్మదేవతలు బడి ఉపాధ్యాయుల వలె “శివశ్శివానాం అశివోఽశివానాం” అని యుందురు. అనగా మంచివారికి మంచి, చెడుపుచేసినవారికి చెరుపును ఇత్తురు. అన్ని విధములవల్లను జీవాత్మలు వృద్ధికివచ్చి పరమార్థమును పొందుటకు కావలసిన సహాయమును చేయుచుందురు. కనుక వారలు మనలకు పరమహితులే.

ఇపుడో ఇంతకుముందుజన్మములలోనో త్రికరణములతో చేసిన కార్యములయొక్క ఫలములనే మనము ఇపుడు అనుభవించు

చున్నాము అను దృఢజ్ఞానము మనకు పుట్టవలెను. నిద్రలోనైనను మనకు ఈ విషయమందు సందేహము ఉండకూడదు. ఈ దృఢనిశ్చయము మనకు పుట్టకుంటే మనము సుఖమును అనుభవించలేము. ఉత్తరోత్తర మనము నివృత్తిమార్గమును అనుష్ఠించునపుడు "క్రోడీకరోతి ప్రభుః" అను వాక్యము ప్రకారము బలహీనులు పదిజన్మములయందు అనుభవించునంతకర్మను మనకు ఒకటే జన్మమునందు క్రోడీకరించి కర్మదేవతలు ఇత్తురు. కర్మ అంతయు అనుభవించి ముగియునంతవరకును మనకు జ్ఞానదీక్షలు రావు. జ్ఞానదీక్షలన్నియు వచ్చినగాని జీవన్ముక్తి రాదు. కనుక కర్మక్షయము పరిపూర్ణముగా కావలయును. కొన్ని జన్మములలోనే శిలుకునిలిచిన కర్మనంతయు ననుభవించవలసినదిగా వచ్చును. సంతోషమైనను దుఃఖము అయినను అపరిమితముగా ప్రాప్తించును. అపరిమితసంతోషము వచ్చినపుడు ఏవిధముగానైనను సహించుకొందుముగాని అపరిమితమగు దుఃఖము వచ్చినపుడు సహన యుండదు. సహన లేకపోయి ఏడ్చినపుడు క్రొత్తకర్మ ఉద్భవించును. కనుక సహనకు తెలివి ముఖ్యము. "దుఃఖేష్వనుద్విగ్నమనాః" అనియు "నిత్యం చ సమచిత్తత్వం ఇష్టానిష్టోపపత్తిషు" అనియును చెప్పియున్నగుణములు అనుష్ఠానమునకు వచ్చినగాని సంసారబంధవిముక్తి కాదు. ఇట్టి తెలివి అనునదే కర్మవిషయికజ్ఞానము. కనుక పదేపదే మననముచేసి "అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాఽశుభం" అని శాంతిచెందు స్వభావమును వృద్ధిపరుచుకొని సుఖమును అనుభవించవలెను.

---

## ౮ వ అధ్యాయము

సుశీలాః సదాచారనిష్ఠాః పవిత్రాః ।
హారిం వా హారం వా సమం సేవమానాః ।।
స్వాశాస్త్రీషు దక్షాః పరబ్రహ్మనిష్ఠాః ।
ఉదాసీనసాధూః నమస్య నమస్యే ॥

### శీలము

మనుష్యులు లోకమందు నడుచు నడవడికలు తమకును ఇతరులకును సంబంధముకలిగించునవి. దేశకాలములనును ఇరుగు పొరుగువార్లసంతోషమును గమనించియే మనము ఏకార్యమైనను చేయవలయును. మన ఇరుగుపొరుగువారనగా మనము కాపుర ముండు ఇంటికి ఇరుప్రక్కల ఉండు ఇండ్లవారు. ఇది చాల సమీపదృష్టిగలవారి మాట. దూరదృష్టివంతులకు ఇరుగు పొరుగు అన్నమాటకు అర్థము వారి వారి దృష్టివిశాల మును పట్టియుండును. కొందరు మన గ్రామమువారందరును మావారే. మేము ఏ కార్యముచేసినను మా గ్రామవాసులకు ఆ కార్యమువల్ల ఏ విధమైన కష్టమును రారాదు అందురు. అంత కంటె అధికమైన విశాలదృష్టిగలవారు మా జిల్లావారందరును

మావారే అందరు. ఈ విధముగా మావారు అనుమాటకు అర్థము అధికమగుచుండును. సాధారణముగా భూమిపైన నిలిచి తనచుట్టును చూచువానికి కొంతదూరమే దేశము అగుపడును. భారీ గోపురమును ఎక్కి చూచువారికి మరికొంచెము అధికముగా దేశము అగుపడును. పెద్దకొండ ఎక్కి చూచువారికి చాలా విశాలమైన దేశము అగుపడును. అదే విధమున మనుష్యులలో ఆత్మశక్తి అధికము కానుకాను మావారు అను మాటకు అర్థము చాల అధికము అగుచుండును.

శీలముయొక్క ఉద్దేశము ఏమనగా ఒక దేశమందలి జీవాత్మలకు ఒకరికార్యములవల్ల మిగతవార్లకును, ఇతరులకార్యముల వల్ల మనకును అననుకూలములు లేకయే జీవాత్మలందరును సముదాయముగా సుఖపడుటకు అనుకూలము కలుగజేయుటయే. ఒక సంసారమందుండు జీవాత్మలకు అందరికిని పరస్పర ఐకమత్యము; అనేక సంసారములుచేరిన ఒక తెగవారికంతయు ఐకమత్యము; అనేక తెగలుచేరిన ఒక దేశమందు అందరికిని ఐకమత్యము ఇట్లు అందరును ఒకటే సంసారమునకు చేరిన వారివలె బ్రతుకుచు మనకందరికిని పితామహుడైన మనువుయొక్క పెద్దసంసారమందు ఐకమత్యదృష్టి కలుగుటకు గానే శీలము ముఖ్యము. కనుకనే

> అయం నిజః పరోవేతి గణనా లఘుచేతసాం।
> ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకం॥

వీరు నావారు, వీరు నావారు కారు, అని అనుకొనుట అల్పబుద్ధి గలవారిచర్య; ఉదారబుద్ధిగలవారి ఆచారమేమనగా లోకమం

తయు వారికుటుంబమే. ౮౦ వ పుటయందు చెప్పినప్రకారముగా జీవాత్మలందరును పరమాత్మయొక్క అంశలే అయినపుడు జీవాత్మలలో భ్రాతృభావము చెప్పవలసిన అక్కరలేదు. అందరు జీవాత్మలకు జననస్థానము (పుట్టినస్థలము) ఒకటే. అందరికిని గమ్యస్థానమును ఒకటే. ౮౦ వ పుటయందు సచ్చిదానందమూర్తియొక్క శరీరమునందు జీవాత్మలందరను అణువులని చెప్పియున్నది. ఒకటే శరీరమందుండు అవయవములు ఒకటియొక్క క్షేమమును మరియొక్కటి కోరియే కదా ఉండవలెను.

జిహ్వాం క్వచిత్సన్వం దశతి స్వదద్భి స్తద్వేదనాయాం కతమాయ కుప్యేత్ ।

(శ్రీమద్భాగవతము, భిక్షుగీత.)

ఒకడు తన దంతములతో తనయొక్క నాలుకను కొరుక్కొనెనసగా నెవ్వరిపైన కోపించుకొన్న యెడల ఆ నొప్పిపూనును. అదే విధమున లోకమందెవ్వడు చేసిన కీడైనను తానుచేసినదే అని ప్రతిజీవాత్మయు స్నేహభావమును చూపి భ్రాతృభావమాచరించవలెననునది శీలముయొక్క పరమోద్దేశము.

యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః ।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥

(భ. గీ. ౧౩ - ౩౩)

ఓయి అర్జునా, ఒక సూర్యుడు లోకమునంతయు నే విధముగా ప్రకాశింపచేయుచున్నాడో అదే విధముగా ఒకక్షేత్రజ్ఞుడు అన్ని క్షేత్రములయందునున్నవాడు.

ఏకో దేవ స్సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా ।

ఒక దైవము సర్వభూతములయందును దాగియుండువాడు. సర్వమును వ్యాపించియుండువాడు. సర్వప్రాణులకును అంతరాత్మ. ఈ పై వాక్యములవలె అనేకములున్నవి.

అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।
(భ. గీ. ౧౦-౨౦)

సర్వభూతములయొక్క హృదయమందును ఉండు ఆత్మ నేనే.

సనాతనధర్మమతమునందు చెప్పియుండు శీలము జీవాత్మలందరును ఒకడగు సచ్చిదానందమూర్తియొక్క అంశలుగాని వేరుకారు అను నమ్మకముపైన చెప్పబడియున్నది.

ఒకని శరీరావయవములందు చేతికి తగిలిన గాయము కాలికి తెలియదు. కాలు జడము. జ్ఞానహీనమైనది. అయినను ఏ అంగమందు దెబ్బతగిలినను మనుష్యుడే కదా ఆ నొప్పిని అనుభవించు

అదే విధమున లోకమందు ఏ ఒకని చర్యవల్ల ఇతరులకు శ్రమకలిగినను ఆ శ్రమ అంతయు సచ్చిదానందమూర్తియగు తండ్రికే చేరును. కనుకనే "మామాత్మపరదేహేషు ప్రద్విషంతోభ్యసూయకాః" అనియు "కర్శయన్తశ్శరీరస్థం భూతగ్రామమచేతసః । మాం చైవాన్తశ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్" అనియు శ్రీమద్భగవద్గీతయందు చెప్పబడియున్నది. ఒకరు ఇతరులకు కలుగజేయు శ్రమవల్ల తమశరీరమందును, ఇతరుల శరీరములయందును బుద్ధిసాక్షిగానును, కర్మసాక్షిగానును ఉండెడి భగవంతుని ద్వేషించుచు అశాస్త్రవిహితములైన ఘోరతపస్సులను

చేసి భగవంతునికి శ్రమకలుగిచేయువారును ఆసురస్వభావముగల వారని శ్రీకృష్ణమూర్తిగారు ఉపదేశించినారు.

జీవాత్మలు ఏ యే గుణములు కలిగియుండవలె నను విషయమును మనుధర్మశాస్త్రము మొదలగు గ్రంథములు చాల వివరముగా చెప్పియున్నవి. ఐనను కలియుగము పుట్టుటకు కొన్ని అనగా 5-౬ సంవత్సరములకుముందు భీష్మాచార్యులవారు ధర్మనందనునకు చేసిన యుపదేశమునందు చెప్పిన గుణములను వివరింతము. మనుధర్మశాస్త్రము కలియుగమునకు అన్వయించదని లోకోక్తి. అందులో చెప్పిన సద్గుణములు "ఇవన్నియు కృతయుగం మాటలయ్యా" అను ఆక్షేపణకు లోబడును. కనుక భీష్మాచార్యులవారి యుపదేశపువాక్యలను ఉపయోగించుచున్నాము.

సత్యంచ సమతా చైవ దమ శ్చైవ న సంశయః ।
అమాత్సర్యం క్షమా చైవ హ్రీ స్తితీక్షా నసూయతా ॥
త్యాగో ధ్యాన మథార్యత్వం ధృతిశ్చ సతతం దయా ।
అహింసా చైవ రాజేంద్ర సత్యాకారా స్త్రయోదశ ॥
(శాంతిపర్వము, ౧౬౨ అధ్యా. ౮, ౯)

సత్యము, సమత, దమము, మాత్సర్యములేకుండుట, క్షమ, సంకోచము, తితీక్ష, అసూయలేమి, త్యాగము, ధ్యానము, ధృతి, దయ, అహింస, అను నీపదుమూడును సద్గుణములు. ఈ గుణములు అందరికిని ఉండవలెను. ఈ గుణములే మనుధర్మశాస్త్రము, ఆరవ యధ్యాయము ౯౨ వ శ్లోకమునందును, పదియవయధ్యాయము ౬౩ వ శ్లోకమునందును చెప్పబడియున్నవి.

దుర్గుణములను పోగొట్టుకొని సద్గుణములను సంపాదించిన గాని మోక్షము లేదను అర్థమును నొక్కి చెప్పవలెననే అభిప్రాయముతో శ్రీమద్భగవద్గీతయందు వ్యాసులవారు ఒక అధ్యాయమునే నిష్కర్షించినారు. పదునారవయధ్యాయమందు ఆసురసంపద్గుణములను విమర్శించి చెప్పి "దైవీసంపద్విమోక్షాయ నిబంధాయా సురీ మతా" అని దైవసంపద్గుణములు ఇవి అని చెప్పియున్నారు. పదునారవ యధ్యాయమును జాగ్రతగా చదివి అచ్చట చెప్పియుండు దైవీసంపద్గుణములను అభ్యసించవలసినది మనుష్యులయొక్క ధర్మము.

శ్రీమద్భగవద్గీత ౧౩ వ అధ్యాయము, ౭ వ శ్లోకమునందు అమానిత్వాది సద్గుణములనును చెప్పియున్నారు. శ్రీ సనత్సుజాతీయమునందు ద్వితీయాధ్యాయము, ౧౬, ౧౮, ౨౧, ౨౨, ౨౩ శ్లోకములయందు దుర్గుణములను వివరించియున్నారు. సద్గుణములను అభ్యసించుటకు ప్రయత్నపడినపుడు దుర్గుణములు పరువెత్తి పోవును. "పుణ్యేన పాపం వినిహత్య పశ్చాత్ సజాయతే జ్ఞాన విదీపితాత్మా" అని చెప్పబడియున్నది. పరమపురుషార్థమైన మోక్షమును పొందుటకు జ్ఞానము ముఖ్యము. ఆసురసంపద్గుణములను పోగొట్టి దైవ (సుర) సంపద్గుణములను వృద్ధిచేసుకోవలెను. సురులు అనగా

> ఆత్మన్యేవ రతి ర్యేషాం స్వస్మిన్ బ్రహ్మణి చా చలే ।
> తే సురా ఇతి విఖ్యాతాః నూరయశ్చ సురా మతాః ॥

అచలమైన బ్రహ్మమునందురక్తిగలవారు సురులు అని అర్థము.

ఈ క్రింద కొన్ని ఆచరణీయములైన గుణములు వివరించి చెప్పబడును.

అమానిత్వము అనగా ఆత్మస్తుతియు పరనిందయు లేక యుండుట. మాన మనగా :—తన్ను తాను పొగడుకొనుట. " మానా వమానీ దుఃఖీస్యా న్నైవసాధారణో జనః । అతో దుఃఖ నిదానత్వాన్మానం యోగీ పరిత్యజేత్ ॥" తనను స్తోత్రము చేసికొనుచు నితరులను నిందించువాడు దుఃఖపడును. అట్టి స్తుతినిందలులేనివాడు అట్టి దుఃఖమును పొందడు. కనుక స్వస్తుతిపరనిందలవిషయమై యిష్టమునుంచుకొనకూడదు. స్వస్తోత్రము లేకయుండుట అమానిత్వము; లేక " అన్నాం గనాదిభోగేషు భావో మాన ఇతిస్మృతః । బ్రహ్మానంద సుఖప్రాప్తిహేతు ర్మాన మితి స్మృతః" ॥ అనగా అన్నము, స్త్రీ మొదలగు భోగములందు తలంపులకు మానము అని పేరు. అట్టి తలంపులు లేకుండుట.

అదంభిత్వము. దంభము అనగా లేని పోని వేషభాషలు కలిగి యుండుట. " కృతం దంభా దదంభాద్వా కర్మ తుల్యశ్రమం భవేత్ । శ్రమైకఫలమాద్యం స్యాద్ద్వితీయం సుఖసాధనం ॥ దంభముతోగాని దంభములేకగాని చేయబడుకార్యములకు శ్రమము సమానమే. దంభముతోచేయబడుకార్యమునకు శ్రమము ఒకటియే ఫలమగును. దంభము లేక చేయ బడు కార్యమునందు శ్రమమున్నను సుఖము అనెడు ఫలము కలుగును. దంభములేకుండుట అదంభిత్వ మనబడును.

**అహింస.** హింస యనగా పరులను బాధించుట. "స్వయం బిభేమి హింస్రేభ్యస్తాన్ పాపాన్ వేద్మి త్రైరహైత్రైః । సుఖీస్యా మితి విజ్ఞాయ పరపీడాం వివర్జయేత్ ॥" పీడను కలుగజేయు జంతువులవల్ల నేను భయపడుదును. కనుక నేను ఇతరులకు హింస కలుగచేయకూడదు. అట్లు ఇతరులను బాధింపకుం డుట **యే** అహింస. ఇది సాధారణజనునికి కూడ ఉండ వలసిన గుణము.

**క్షాంతి.** "చింతావిలాపరాహిత్యేన ఆధ్యాత్మికాది ఉపద్రవ సహనం క్షాంతిః". తాపత్రయములని లోకవాడుకలో నుండు మనోవాక్కాయములవల్ల కలుగు దుఃఖములను ఇట్టి దుఃఖములు కలిగెనే, నేనేమిపాపము చేసితిని, నాబిడ్డ లేల చచ్చిరి, ఊళ్లో ఇందరు అమ్మలయొక్క బిడ్డలు బాగా ఉండలేదా, యముడు నాబిడ్డలనేనా కనుగొన్నాడు, అను మొదలగు విలాపములు లేక సంహించుకొనుట.

**ఆర్జవం.** అనగా "స్వధర్మే మనోవాక్కాయప్రవృత్తేః సదా ఏకరూపత్వం". అనగా స్వధర్మమునడుపుటయందు త్రికరణ ములు అనగా, మనస్సు, ఇంద్రియములు, శరీరము అను వాటి చేష్టలు ఒకటి కొకటి వ్యత్యాసము లేక నడుచు కొనుట. "మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మ నాం । మనస్యన్యం వచస్యన్యం కర్మణ్యన్యం దురాత్మనాం ॥" సత్పురుషులు తాము చింతించిన ప్రకారము మాటలాడు దురు; మాటలాడినప్రకారము కార్యము చేతురు. దుర్మార్గు లు మనస్సునందు ఒకటిని తలచి, ఆతలంపు ఇతరులకు

తెలియనీయక దాచిపెట్టి, మాటలు మరియొక విధముగా చెప్పి, కార్యములు మరియొక విధముగా చేయుదురు. అట్లు లేకుండుట ఆర్జవము.

ఆచార్యోపాసనం. బ్రహ్మజ్ఞాన మీయదగు గురువును సేవించుట. అక్షరాభ్యాసము, ఉపనయనము ఇట్టివి చేయించిన గురువులు ఆచార్యులవారు అనిపించుకోరు. "జ్ఞానోపదేష్టురాచార్యస్య శ్రద్ధాభక్తిభ్యాం శుశ్రూషాది క్రియయా ఆరాధనం ఉపాసనం।" అక్షరాభ్యాసఉపనయనాదులను చేయించిన గురువులకన్న జ్ఞానోపదేశముచేయు గురువులు ఏ విధముగా అధికము అని అడుగవచ్చును.

దృష్టాంతో నైవ దృష్టః త్రిభువనజఠరే సద్గురో ర్జ్ఞానదాతుః।
స్పర్శ శ్చేత్తత్రకల్ప్యః స నయతి యదహో స్వర్ణతా మశ్మసారం।
న స్పర్శత్వం తథాపి శ్రితచరణయుగే సద్గురుః స్వీయశిష్యే।
స్వీయం సామ్యం విధత్తే భవతి నిరుపమ స్తేన వాఽలౌకికేఽపి ॥

ముల్లోకంబులయందుగాని అంతకుపైననైనగాని జ్ఞానదాతయైన సద్గురువులవారితో తుల్యమైనది ఏదియును అగపడుటయే లేదు. అదేమండీ! అంతకష్టమా? "పరుసమినుము సోకిన బంగారమైన పగిది" అని ఇనుమును స్పర్శమాత్రమున బంగారముగా మార్చుశక్తిగలది "అశ్మసారం" అను రాయి ఉండలేదా అని అందురేమో. ఇనుమును బంగారముగా మార్చినదే గాని ఆ యినుమునకు మరియొక ఇనుపతునకను బంగారముగా మార్చుశక్తిని ఇయ్య

లేదు. సద్గురువులవారేమి జేయుదురంటే తనను శరణు జొచ్చినవారిని తనవంటివారినిగా చేయుదురు. అనగా మరియొకరిని జ్ఞానినిగా చేయుశక్తిని ఇత్తురు. కనుక జ్ఞానోపదేష్టయైన గురువులవారు అధికులు. అంతే కాదు. జ్ఞానదాతలైన గురువులవారు ఎవరనిన,

జన్మానేకశతైః సదాదరయుజా భక్త్యా సమారాధితో ।
భక్తై ర్వైదికలక్షణేన విధినా సంతుష్ట ఈశ స్స్వయం ।
సాక్షాచ్ఛ్రీగురురూప మేత్య కృపయా దృగ్గోచరస్సన్ ప్రభుః ।
తత్త్వం సాధు విశోధ్య సంతారయతి తాన్ సంసారదుఃఖార్ణవాత్ ॥
(సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహము)

సాక్షాత్ ఈశ్వరుడే గురువుగా రూపమెత్తి కరుణించును. ఏల అనగా భక్తుడైనవాడు అనేక జన్మములయందు ప్రేమాదరములతో ఈశ్వరుని ఆరాధించినందున సంతోషించి మహదనుగ్రహముతో శిష్యుని కండ్లకు కనబడి, ఈ మహాప్రభువు తత్త్వములను బాగుగా పరిశోధించి శిష్యునికి బోధపరిచి అతనిని సంసారదుఃఖసముద్రము నుండి పైకిలేపును. ఇట్టివారయ్యా జ్ఞానదాతలైన గురువులు.

శౌచం. అనగా పరిశుభ్రముగానుండుట. "శౌచం హి ద్వివిధం ప్రోక్తం బాహ్య మాభ్యంతరం తథా । మృజ్జలాభ్యాం స్మృతం బాహ్యం భావశుద్ధి స్తథాంతరం ॥" వెలుపల శుభ్రముగానుండుట, లోపల శుభ్రముగానుండుట, అని శౌచము రెండు విధములు. "శౌచం ద్వివిధం, బాహ్య మాభ్యంతరం చ । బాహ్యం మృజ్జలాభ్యాం, అస్పృశ్యాఽభక్ష్యాఽ

గ్రాహ్యత్యాగేన చ; అభ్యంతరం, రాగద్వేషలోభ మోహగర్వకాఠిన్యాది మలానాం తత్ప్రతికూలగుణా వష్టంభేన క్షాళనం అంతశ్శౌచం.” అర్థము: వెలుపలి శుభ్రత స్నానము, తాకరానివస్తువులను తాకకయు, తిన రానివస్తువులను తినకయు, ప్రతిగ్రహమునకు అనర్హము లైన వస్తువులను వదులుటవల్లను, కలుగును. అంతశ్శౌ చము; సాధారణముగా మనయందుండు రాగము, ద్వే షము, లోభము, మోహము, గర్వము, కాఠిన్యము (నిర్దయ) మొదలుగాగల దుర్గుణములను ఆ యా దుర్గుణ మునకును ప్రతికూలముగానుండు సద్గుణమును సంపాదించి స్థిరపరుచుకొను విధమున తరుమగొట్టుట. ఇదియొక మహో రహస్యమైన ఆచారము.

నిర్దయస్వభావము మనయందుండిన యెడల “నిర్దయ పోవలెను,” “నిర్దయ పోవలెను” అని పలుమారు ధ్యానించుచుండిన యెడల నిజముగా నిర్దయను పోగొట్టుకోవలెనను ఆశయుండినను చాల కాలము ఈ విధమున ప్రయత్నముచేసినగాని నిర్దయ అను దుర్గు ణము తగ్గదు. శీఘ్రకాలమందే నిర్దయ అను గుణమును పోగొట్టు కోవలెనని ప్రయత్నముచేయువాడు దయ అను సద్గుణమును పదే పదే మననము చేసి దయ అను గుణము తనకున్నట్టే నమ్మి, దయను చూపు సందర్భములను కలుగజేసికొని దయను అభ్య సించి త్రికరణములగుండా దయను అభ్యసించుచువచ్చినయెడల అతి శీఘ్రముగా నిర్దయ అను దుర్గుణము పోవును. ఇదే విధమున ఒకొ్కక దుర్గుణమునును అతిత్వరలో పోగొట్టుకోవచ్చును. ఈ

పై చెప్పిన ప్రకారము "దయ" అను గుణమునుగురించి ధ్యానించు చురాగా దయాస్వభావముగల అణువులు మనస్సునందును ఇంద్రియములయందును దేహమునందును నిండి, దయఅణువులకును నిర్దయఅణువులకును సమాగమము అగుటవలన నిర్దయఅణువులు ఓడిపోయి దేహములను విడిచిపోవును.

ఇదే విధముగా ఏ సద్గుణమును సంపాదించవలెనని తోచి నను సంపాదించవచ్చును. దుర్గుణములను పోగొట్టుకోవలెనని ప్రయత్నపడువారు ఆ దుర్గుణమునకు ప్రతికూలమైన సద్గుణ మేదో దానిని మననము చేసి చేసి అభ్యసించుచురావలెను. ఇదే అతి సులభమైన విధము.

## మనోరాజ్యము

ఈ విషయమునందు ముఖ్యమైన సహాయము "మనోరాజ్యము" అనునొక అభ్యాసము కలదు. మనోరాజ్యము అను పదమునకు ఇంగ్లీషుభాషయందు Imagination అని పేరు. అనగా నిదివరకును మనకు లభించని సుఖమునో, దుఃఖమునో, ఐశ్వర్యమునో, జాడ్యమునో, భయమునో, సందర్భించినట్టుభావించి అట్టి అవస్థసందర్భించినయెడల ఏ విధముగా నడుచుకొందుమో ఆ విధమైన నడవడికను కనుపరుచుటకు సాధ్యమైన మనోభావము. హాస్యవిషయముగా ఈ మనోభావమును "గొంతెమ్మకోరికలు" అందురు. పారమార్థికవిషయముగానును, నివృత్తిమార్గయాత్ర యందు ధ్యానాదిసమాధుల యనుష్ఠానమునందు మనోరాజ్యము ఉపాసకునికి అతిముఖ్యము అని జ్ఞానవాసిష్ఠమునందు చెప్పి

యున్నది. జ్ఞానవాసిష్ఠము, ఉత్పత్తిప్రకరణమునందు లవణు డను వాడు చేసిన మానసిక యజ్ఞము మనోరాజ్యము అనదగును. మరియును శ్రీమద్భాగవతమునందు, దశమస్కంధమునందు శ్రీకృష్ణబలరాములను మధురాపురంబునకు తోడితెచ్చుటకు అక్రూరుడు పోయినపుడు త్రోవనడుచుచు తనలో తాను మాటాడుకొనినవిధము.

అప్యంఘ్రిమూలే పతితస్య మే విభు శ్శిరస్యధాస్యన్ నిజహస్తపంకజం। దత్తాభయం కాలభుజంగరంహసా ప్రోద్వేజితానాం శరణైషిణాం నృణాం ॥

సమర్హణం యత్ర విధాయ కౌశిక స్తథా బలి శ్చాప జగత్త్రయేంద్రతాం। యద్వా విహారే వ్రజయోషితాం శ్రమం స్పర్శేన సౌగంధికగంధ్యపానుదత్ ॥

న మయ్యుపైష్యత్యరిబుద్ధి మచ్యుతః కంసస్య భృత్యః ప్రహితోపి విశ్వదృక్ । యోంతర్బహి శ్చేతస ఏతదీహితం క్షేత్రజ్ఞ ఈక్షత్యమలేన చక్షుషా ॥

అప్యంఘ్రిమూలేఽవహితం కృతాంజలిం మా మీక్షితా సస్మితయార్ద్రయా దృశా । సపద్యపధ్వస్త సమస్త కిల్బిషో వోఢా ముదం వీతవిశంక ఊర్జితాం

సుహృత్తమం జ్ఞాతి మనన్యదైవతం దోర్భ్యాం బృహద్భ్యాం పరిరప్స్యతే థ మాం । ఆత్మాహి తీర్థీక్రియతే తదైవ మే బంధ శ్చ కర్మాత్మక ఉచ్ఛ్వసిత్యతః ॥

లబ్ధాంగసంగం ప్రణతం కృతాంజలిం మాం వక్ష్యతేఽక్రూర తతే త్యురుశ్రవాః । తదావయం జన్మభృతో మహీయసా నైవాదృతో యో ధిగముష్య జన్మతత్ ॥

దీనికి అర్థము: నేను నందవ్రజంబునకు వెళ్లి మహానుభావులైన రామకృష్ణులను దర్శించి లోకహితుండైన శ్రీకృష్ణుని పాదారవిందంబులం బడియెద. అపుడు ఆ జగన్నాథుడు తన్నాశ్రయించిన వారికి అభయంబునొసంగు తనయొక్క కరారవిందంబును తన పాదంబులంబడియున్న నాశిరంబుపై నునుచును. మహాత్ములగు బలిచక్రవర్తిమొదలగువారు ఏ పాదారవిందములను పూజించిరో ఆ పాదారవిందములపై పడియెదను. సర్వహృదయాంతర్వర్తియై నిర్మలదృష్టిచే నఖిలభూతముల బాహ్యాంతరభావములనెరుగు నమ్మహాఘనుండు కంసునిపంపున పోయినందున కంసుని భృత్యుడని నాపై ద్వేషబుద్ధిచూపడని నమ్మెదను. తనపాదములకడ చాగిలపడి లేచి నిలిచి చేతులుజోడించి అంజలిబద్ధుండైన నన్ను కరుణారస శోభాయమానంబైన చిరునవ్వుగాన్పించు ప్రేమదృష్టితో చూచునుకదా. అందువలన నాపాపములెల్ల నశించినందున సందేహరహితుడనై పరమానందభరితుండయ్యెదనో. అత్యంతస్నేహితుడను, బంధువుడను, అనన్యభక్తుడను, అగు నన్ను ఆ దయానిధియైన వాసుదేవుండు తన దీర్ఘబాహువులంజాచి కౌగలింపడే? ఆహా! అప్పుడు నేను పరమపావనుండగుదునే. నా కర్మబంధమెల్ల వీడదా. అట్లు కౌగలించి కృతాంజలియైన నన్ను నాయనా, అక్రూరా యని పిలుచును గదా. అపుడుకదా నాజన్మంబు ఫలవంతంబగు. శ్రీకృష్ణునిచే నాదరింపబడని వాని జన్మంబు తుచ్ఛంబే కదా. ఈ విధమ్మున భక్తాగ్రగణ్యుండగు నక్రూరుండు తన మదిఁ మనోరాజ్యయుతంబైన కోరికలగోరుచు మార్గయానంబుగావించె. అక్రూరుని మననంబంతయు మనోరాజ్యంబే. ఇదివరకు నడువనిదియు నడిచిన

తనకు చాలసంతోషదంబైనదియు, సందర్శించుట కష్టసాధ్యంబు నైన విషయములు నడిచినట్టుగానే నమ్మి నడిచినపుడు సంతోషించినట్టుగా నడువకమునుపే సంతోషించి పులకాంకితశరీరుండు అగునట్టు చేయునట్టి మనస్సుయొక్క శక్తికి మనోరాజ్య మనిపేరు.

ఇందునుగురించి పంచదశియందు

> అనుభూతే రభావేఽపి బ్రహ్మాస్మీత్యేవ చింత్యతాం।
> అప్యసత్ప్రాప్యతే ధ్యానాన్నిత్యాప్తం బ్రహ్మ కిం పునః॥

అనుభవమునకు రాకపోయినను అనుభవమునకు వచ్చినట్టే అనుకొని ధ్యానించవలె నని తాత్పర్యము. ఇది మనోరాజ్యము. ఈ గ్రంథముయొక్క ఉత్తరభాగమునందు ధ్యానము అను విషయమును వ్రాయునపుడు మనోరాజ్యమునుగురించి మరికొన్ని సంగతులు వ్రాయబడును.

ప్రకృతమందు శీలమును పొందనిచ్ఛయించి "సుగుణావష్టంభమును" చేయ నుద్దేశించిన ఉపాసకుడు మనోరాజ్యము నుపయోగించు విధమును కొంతవివరించి చెప్పవలెను.

వాసనాబలంబున దుర్గుణంబులు నిండియుండు మనము

> శుభాఽశుభాభ్యాం మార్గాభ్యాం వహంతీ వాసనాసరిత్।
> పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభేపథి॥
> అశుభేషు సమావిష్టాంశుభేష్వేవావతారయేత్।
> స్వమనః పురుషార్థేన బలేన బలినాం వర॥

శుభము, అశుభము అను మార్గములయందు ప్రవహించుచుండు వాసనారూపమైన నదిని పురుషప్రయత్నమువల్ల శుభమైనమార్గ

మునకు తిప్పవలయును. మరియు తన మనస్సుచే కల్పింపబడిన పురుషకారమునుపయోగించి అశుభమార్గమందుండు వాసనలను కూడ శుభమార్గమునకు తిప్పవలయును అని అర్థము. కనుక పురుషకారమునుపయోగించి మనోరాజ్యము అను అభ్యాసము యొక్క సహాయముతో సుగుణములను దృఢపరిచికొనినయెడల తేజోమయంబైన దీపమును చేతపట్టుకొని చీకటిగదిలోనికి వెళ్లితే ఏవిధముగా చీకటి అంతయు పరుగెత్తిపోవునో ఆప్రకారము దుర్గుణములు మనలను విడిచిపోవును. ఉదాహరణమునకుగా సత్యము అను గుణమును దృఢపరుచుకొను విధమును విచారింతము. పరబ్రహ్మము సత్యము. నేను పరబ్రహ్మముయొక్క అంశను కనుక నేనును సత్యస్వభావుడనే. నేను మాటలాడునదంతయు సత్యమే. నేను తలంచునదంతయు సత్యమే. నేను చేయుకార్యము లన్నియు సత్యములే. సత్యస్వరూపము ప్రేమ; ద్వేషము అసత్యస్వరూపము. కనుక ప్రేమనే నేను అనుష్ఠించుచుందును. ప్రేమనే అనుష్ఠించుచున్నాను. ప్రేమవినాగా వేరేమియు నేననుష్ఠించను. ప్రేమనే నేనెల్లప్పుడు అనుష్ఠించుచున్నాను. అని ప్రేమరూపమైన సత్యమును మనసా-వాచా-కర్మణా అనుష్ఠించుప్రయత్నము ఎల్లప్పుడును చేయుచు రావలెను. ఇట్లు కొంతకాలము అనగా తనయందు ప్రేమఅను గుణము నైజముగా నేర్పడునంతవరకును మననము చేయుచు మననముచేసినంతయు అనుష్ఠించుచురావలెను. ౩౦౫ వ పుటయందు చెప్పిన (సత్యాకారాత్రయోదశ) అనిన గుణములను ఒకటివెంబడియొకటిగా ధ్యానించి దృఢపరుచుకొవలెను.

మంకిఉపాఖ్యాన మని యొకటి శ్రీమహాభారతమందున్నది. అందులో కామమును త్యజించిన వివరమును చెప్పియున్నది.

కామ జనామి తే మూలం సంకల్పా త్త్వం హి జాయసే।
న త్వాం సంకల్పయిష్యామి తస్మా న్మే న భవిష్యసి॥

(శ్రీమహాభారతము, శాంతి. ౧౭౭ అధ్యా.)

కామమా, నీ పుట్టినిల్లు నేనెరుగుదును; సంకల్పమువల్ల పుట్టుదువు; కనుక నిన్ను సంకల్పించను; అందువలన నీకు పుట్టుక లేక పోవును; అని చెప్పియున్నది.

సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధో భిజాయతే।
క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః॥
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశః బుద్ధినాశాత్ప్రణశ్యతి॥

(భ. గీ. ౨ వ అధ్యా.)

లోభాత్ క్రోధః ప్రభవతి క్రోధా ద్ద్రోహః ప్రవర్తతే।
ద్రోహేణ నరకం యాతి తస్మా ల్లోభం పరిత్యజేత్॥

(శివతత్త్వరత్నాకరము.)

ఈ పై చెప్పిన రెండు గమకములయందును కొన్ని దుర్గుణములకు కారణములు చెప్పబడియున్నవి. కారణములను నిరాకరించిన యెడల ఆ కారణములవల్ల పుట్టగల కార్యములు పుట్టవు. ఇది యొక విధమైన ప్రయత్నము.

శౌచము అను విషయమును ౩౧౦ వ పుటయందు వ్రాసినపుడు “ఆంతరం రాగద్వేషమోహగర్వకామాదిన్యాది మలానాం తత్ప్రతికూలగుణావష్టంభేన క్షాళనం” అని వ్రాయబడెను. అం

దుకు గమకములుగా కొన్ని శ్లోకములు ఈ దిగువ కనుపరుచ బడియున్నవి.

కామం క్రోధం చ లోభం చ భయం స్వప్నం చ పంచమం।
క్రోధం శమేన జయతి కామం సంకల్పవర్జనాత్ ॥
సత్త్వసంసేవనా ద్ధీరో నిద్రాం చ ఛేత్తు మర్హతి।
ధృత్యా శిశ్నోదరం రక్షేత్ పాణిపాదం చ చక్షుషా ॥
చక్షుశ్శ్రోత్రే చ మనసా మనోవాచం చ కర్మణా।
అప్రమాదా ద్భయం జహ్యా ద్దంభం ప్రాజ్ఞోపసేవనాత్ ॥

(శాంతిపర్వము)

క్షమయా క్రోధ ముచ్ఛింద్యా త్కామం సంకల్పవర్జనాత్।
సత్త్వసంసేవనా ద్ధీరో నిద్రాం చ ఛేత్తు మర్హతి॥
భ్రమం సమ్మోహ మావర్త మభ్యాసా ద్వినివర్తయేత్ ।
నిద్రాం చ ప్రతిభాం చైవ జ్ఞానాభ్యాసేన తత్త్వవిత్ ॥
ఉపద్రవాం స్తథా రోగాన్ వాతజీర్ణమితాశనాత్ ।
లోభం మోహం చ సంతోషా ద్విషయాం స్తత్త్వదర్శనాత్ ॥
అనుక్రోశా దధర్మం చ జయే ద్ధర్మ మవేక్షయా।
ఆయత్యా చ జయే దాశా మర్థసంగవివర్జనాత్ ॥
ఉత్థానేన జయే త్తంద్రీం వితర్కం నిశ్చయా జ్జయేత్ ।
మౌనేన బహుభాష్యం చ శౌర్యేణ చ భయం త్యజేత్ ॥
కారుణ్యే నాత్మనో మానం తృష్ణాం చ పరితోషతః ।

*

(శాంతిపర్వము)

అసంకల్పా జ్జయేత్కామం క్రోధం కామవివర్జనాత్ ।
అర్థేనర్థేక్షయా లోభం భయం తత్త్వావమర్శనాత్ ॥
అన్వీక్షిక్యా శోకమోహౌ దంభం మహదుపాశ్రయాత్ ।
యోగాంతరాయా న్మౌనేన హింసాం కాయాద్యనీహయా ॥

కృపయా భూతజం దుఃఖం దైవం జహ్యాత్సమాధినా।
ఆత్మజం యోగవీర్యేణ నిద్రాం సత్త్వనిషేవయా॥
రజస్తమశ్చ సత్త్వేన సత్త్వం చోపశమేన చ।
ఏతత్సర్వం గురౌ భక్త్యా పురుషో హ్యంజసా జయేత్॥
యస్య సాక్షాద్భగవతి జ్ఞానదీపప్రదే గురౌ।
మర్త్యాసద్ధీశ్శ్రుతం తస్య సర్వం కుంజరశౌచవత్॥

(శ్రీమద్భాగవతము, సప్తమస్కంధము, ౧౫వ అధ్యా)

శ్రీమద్భాగవతము సప్తమస్కంధమునందు శ్రీనారదమహాముని గారి ఉపదేశము పైన వ్రాయబడినది. దానిని మాత్రము తెనుగున వ్రాసినట్లైతే చాలును. “కామమునకు కారణంబైన సంకల్పవర్జనము వల్ల కామమును జయించుము. క్రోధకారణంబైన కామమును వర్జించి క్రోధమును జయించుము. దృశ్యపదార్థంబులెల్లయు ననర్థకారణంబులే యని విమర్శించురీత్యా లోభమును జయించుము. తత్త్వవిచారముచేసి భయమును మానుము. (భయము అనగా జ్ఞానమార్గమునందు నడుచునప్పుడు అపరిగ్రహము, వైరాగ్యము మొదలగు ధర్మములను అభ్యసించితే నేనెట్లు బ్రతుకగలను అను భీతి.) శోకమోహములను ఆత్మానాత్మ వివేకజ్ఞానమువల్ల జయించుము. దంభమును జయించుటకుగా సాధువులను సేవించవచ్చును. లేక తనకంటె నధికమైన ఐశ్వర్యముగలవారినిచూచి, వీరి ఐశ్వర్యమునకు ఎదుట నా ఐశ్వర్యము ఏమాత్రము అని విచారించి, నా దంభమునకు న్యాయము లేదు, అని సిగ్గుచెంది వదలవచ్చును. యోగమునకు ప్రత్యవాయము లగు లోకవార్తలను మౌనము నభ్యసించి జయించుము.

హింసచేయుస్వభావమున్నయెడల అందుకు కారణమగు దేహాభిమానమును వదలుటవల్ల హింసను జయించుము. ఇతరులవలన దుఃఖముగాని బాధగాని సందర్భించుననిన వారియందు కృపచూపుటచేత వారివల్ల కలుగు బాధను జయించుము. దేహపీడలను ప్రాణాయామాదులవల్ల జయించుము. నిద్రయను ప్రమాదమును సాత్త్వికాహారమువల్ల జయించుము. రజోగుణ తమోగుణంబులను సత్త్వగుణముచేతను సత్త్వగుణమును ఉపశమముచేతను జయించుము. ఉపశమమనగా "సర్వం బ్రహ్మమాత్రం" అను విచారజన్యజ్ఞానము. పై చెప్పిన అన్నిటిని గురువులవారియందు నిశ్చలభక్తిచేసి సంపాదించుము. జ్ఞానదీపమునిచ్చుగురువు సాక్షాద్భగవత్స్వరూపుడుగాని సామాన్యమనుష్యుడు కాడు అను నిశ్చయజ్ఞానము లేనివాని చదువు నిష్ఫలంబు.

ఈ విషయములను ప్రమాదరాహిత్యముతోను సూక్ష్మబుద్ధితోను విమర్శించి బాగుగ నభ్యసించువారికి కాలక్రమమున శీలము సాధ్యము. ఇందులో నొక విశేషమున్నది. "కృపయా భూతజం దుఃఖం" అని చెప్పియున్నది. మనకు దుఃఖము కలుగజేయువారియందు కృపచూపవలెనట. ఇది లోకులు నవ్వతగిన విషయము. దుఃఖము కలుగచేసినవారికి ప్రతిదుఃఖము కలుగచేయక వారియందు కృపచూపవలెనట. నిశ్చయమే. లోకులధర్మమెట్లుండినను ప్రవృత్తిమార్గయాత్రచేయుచు "బ్రహ్మైవలోకధిషణు" లై నివృత్తిమార్గ యాత్రయం దాసక్తిచెందిన జీవాత్మలు సాధారణజనులు కారు. వారు అసాధారణులు. వారి ధర్మము అసాధారణధర్మము.

ఎప్పుడైనను ఇతరుల తప్పులనుగురించి మనము మాటలాడ కూడదు. అందువల్ల తప్పులుచేసినవారలకును మనకును చెడుపు కలుగును. తప్పులుచేసినవారికి ఏ విధముగా చెడుపువచ్చుననగా, మనయొక్క హాస్యతలంపులు వారలను చేరి మరియును తప్పులు చేయునట్లు చేయును. అందువల్ల వారలకు చెడుపు. వారలయొక్క మేలు కోరినవారమైతే మనము వారలయందు ఉండు గుణములన్నియు మంచివికావలెనని సర్వదా భగవంతుని ప్రార్థించుచురావలెను. మనకు ఏ విధముగా చెడుపుకలుగుననగా తప్పులను తలచినపుడు తప్పుల స్పందములు మనయందు ఆ తప్పులుకలుగచేయుశక్తిగల అణువులను చేర్చును. ఆ యణువులు మనయందు చేరినందువలన కొన్నాళ్లకు ఇతరులయందున్నవని మనము హాస్యము చేసిన తప్పులను మనమే చేయునట్లు ఏర్పడును. ఇవన్నియు శీలమును చెరుచును. 'బ్రహ్మవలోకధిషణులై' మానవశరీరధారులైన మనము ఉత్తరోత్తర వృద్ధిని ఎదురుచూచుచు సదా జాగరూకులమై శీలమును వృద్ధిచేసికొనుచుండవలెను.

ఈ అధ్యాయప్రారంభమునందు అచ్చుపడియుండు శ్లోకముయొక్క అర్థమును కొంత విచారించవలెను.

సుశీలాః అనగా మంచిశీలముగలవారలు అని యర్థము. శీలము అనగా మంచినడత, సుశీలము అనగా సాధారణ "మంచి" కంటె నధికమైన "మంచి". మంచి కంటెనధికమంచి యనగా నధికతరమైన మంచినడక యని యర్థము.

సదాచారనిష్ఠాః అనగా నెల్లపుడును మంచి ఆచారము గలవారు, లేక ఎల్లపుడును ఆచారముగలవారు, లేక సద్వస్తువు

అయిన ఈశ్వరునియొక్క స్వభావమును చూపు ఆచారముగల వారని యర్థము.

పవిత్రాః అనగా శుద్ధులు, లేక శ్రేష్ఠులు. మంచికన్న నధికమైన మంచినడతగలిగి అట్టి నడతను ఎల్లపుడు ఆచరించి యితరులకు శ్రేష్ఠమైన నడతతో లోకమందు బ్రతుకుట సాధ్యము అని చూపుచు నితరులను కూడ తమవలెనే కష్టమైన మార్గమందు నడుచునట్లు చేయువారు.

హరిం వా హరం వా సమం సేవమానాః — విష్ణువునైనను మహాదేవునినైనను పక్షపాతము లేక భజించువారని యర్థము. లోకమందు తరుచుగా వైష్ణవులు శైవులు అని భక్తులయందు భాగములు గలవు. విష్ణుభక్తులు శివభక్తులను దూషించి తద్ద్వారా తమయొక్క ఆధిక్యమును చూపుకొనువారు అనేకులు. అదేవిధమున విష్ణుభక్తులు నికృష్టులు అను మొదలగు దూషణలవల్ల వారిని దూషించి తమయొక్క ఆధిక్యమును ప్రకటించుకొను శివభక్తులును గలరు. వీరందరును "బుద్ధిజాడ్యజనితోన్మాదులు" గాని వేరు గారు. బుద్ధిశాలురుగానుండువారు శాస్త్రాధ్యయనమును చేసి మననము గుండా

> సృష్టిస్థిత్యంతకరణాత్ బ్రహ్మవిష్ణుశివాత్మికాం।
> స సంజ్ఞాం యాతి భగవాన్ ఏక ఏవ జనార్దనః॥

(విష్ణుపురాణము.)

జనార్దనుడను పేర వ్యవహరింపబడు ఈశ్వరు డొక్కడే సృష్టిక్రియ చేయుచు బ్రహ్మయని పేరబరగు, స్థితిక్రియయందు విష్ణువని వ్యవహరింపబడును, లయముచేయుక్రియయందు శివుడని పేరుపొం

దును, అని తెలిసికొందురు. మార్కండేయులవారికి చేసిన యుపదేశమందు శివునియొక్క వచనము:

న తే మయ్యచ్యుతేఽజే చ భిదామణ్వపి చక్షతే।
నాఽత్మన శ్చ పర స్యాపి తస్మాత్ నయ మీహహే॥
(శ్రీభా, స్కం-౧౨, అధ్యా-౧౦.)

నాయందును, అచ్యుతునందును, బ్రహ్మయందును అణుమాత్రమైనను భేదంబుగానరు; ఆత్మపరభేదమును ఎరుగరు. మరియు శ్రీ కృష్ణుంజూచి యుధిష్ఠిరుండు

త్వం రుద్రరూపోసి వినాశహేతుః త్రిమూర్తిరూపాయ నమో నమస్తే।

అని ధ్యానించినందుకు శ్రీకృష్ణమూర్తి చెప్పిన దేమనగా

యః పూజయతి మాం పార్థ శూలపాణి మథాపి వా॥
శంకరం మాం చ సర్వేశం భేదజ్ఞానవివర్జితః।
యః పూజయేత్సదా భక్త్యా కాంక్షంతం లోక మేష్యతి॥
శివనిందాపరాణాం చ విష్ణునిందాపరాత్మనాం।
ఏతేషాం నిష్కృతి ర్నాస్తి ప్రాయశ్చిత్తాది కల్పనైః॥ (శేష.ధర్మము.)

భేదజ్ఞానము లేకయే నన్నైనను శివునైనను పూజచేయువారలు తాము కోరిన లోకమును పొందుదురు. శివనిందచేయు వైష్ణవులకైనను విష్ణునిందచేయు శైవులకైనను వారి తప్పులకు ప్రాయశ్చిత్తము లేదు.

బ్రహ్మా విష్ణూ రుద్రహుతాశౌ రవిచంద్రా వింద్రోవాయుర్యజ్ఞ ఇతీత్థం పరికల్ప్య। ఏకం సంతం యం బహుధా హు ర్మతిభేదా త్తం సంసారధ్వాంతవినాశం హరిమీశే॥

ఈ శ్లోకముయొక్క తాత్పర్యముకూడ హరిహరభేదములేదనియే. శాస్త్రములయందు శివవిష్ణుభేదము ఎంతమాత్రమైనను లేదు. విష్ణుసహస్రనామావళియందు శివాయనమః, శర్వాయనమః, శంభవేనమః, ఈశానాయనమః, మహాదేవాయనమః, ఖండపరశవేనమః అను మొదలగు శివనామములును, శివసహస్రనామావళియందు అనంతాయనమః, కృష్ణాయనమః, విష్వక్సేనాయనమః, సుదర్శనాయనమః, పద్మనాభాయనమః, విష్ణవేనమః అను మొదలగు విష్ణునామములును కలిసియున్నవి. హరిహరభేదము లేదనుటకు ఇది ఋజువు.

మద్భక్తః శంకరద్వేషీ మద్వేషీ శంకరప్రియః ।
తా వుభౌ నరకం యాతో యావచ్చంద్రదివాకరౌ ॥

(పురాణవచనము)

ఇట్లు అనేక గమకములవల్ల తెలియతగునది యేమనగా భక్తులయొక్క శ్రేయస్సుకుగా శివవిష్ణురూపములలో నొకటిని భక్తులంగీకరించినను అంగీకరించని మూర్తిపైన మర్యాద తగ్గకూడదు.

మహేశ్వరే వా జగతామధీశ్వరే జనార్దనే వా జగదంతరాత్మని ।
న వస్తుభేదప్రతిపత్తి రస్తి మే తథాపి భక్తి స్తరుణేందుశేఖరే ॥

లోకములకంతయు నాథుడైన మహేశ్వరునియందును జగత్తునకెల్లయు నంతరాత్మయైన జనార్దనునియందును నాకు సమానమైన ప్రేమాదరపూర్వకసమత్వ ముండినను నాకు భక్తితరుణేందుశేఖరుడైన మహాదేవునియందు అని మాత్రము ఒక్కరు చెప్పుకోవచ్చును. కనుక విష్ణుభక్తులు శివదూషణ చేయరు; శివభక్తులు

విష్ణుదూషణచేయరు. కనుకనే "హారిం వా హారం వా సమం సేవమానాః" అని ప్రవచనము.

స్వశాస్త్రేషు దక్షాః — శాస్త్రములయందెల్లయు నుత్కృష్టమైనది వేదము.

ఇదం శరణ మజ్ఞానాం । ఇద మేవ విజానతాం । ఇద మన్విచ్ఛతాం స్వర్గం ఇద మానంత్య మిచ్ఛతాం॥

వేదము అజ్ఞానులకును, జ్ఞానవంతులకును స్వర్గముకోరువారికిని అంతకన్ననధికమైన మోక్షముకోరువారికిని శరణ్యము అని యర్థము. వేదము నాలుగు భాగములు—ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము అని. ఏ యే వేదమునందు జన్మించినారో వారు వారి వారి స్వశాఖాధ్యయనము చేయవలెనని శాస్త్రము. స్వశాఖాధ్యయనము బాగుగ చేసినవారికి "స్వశాస్త్రేషు దక్షః" అని పేరు. మరియొక అర్థము కలదు. అనగా స్వ=బ్రహ్మము, స్వశాస్త్రము=ఉపనిషత్తులు లేక వేదాంతములు. స్వశాస్త్రేషు దక్షాః అనగా వేదాంతశాస్త్రాధ్యయనపారంగతులు అని యర్థము. వేదాంతశాస్త్రాభ్యాసము మాత్రము చాలదు. నిష్ఠకూడ కావలెను గనుక

పరబ్రహ్మనిష్ఠాః — యమనియమాసన ప్రాణాయామప్రత్యాహారధారణాధ్యానసహితసమాధినిష్ఠులు అని యర్థము. కనుక అటువంటివారికి

ఉదాసీనసాధూః — ఉదాసీనసాధువు లను పేరు. వైరాగ్యాధిక్యమువల్ల ఇహపరసుఖములను ఉదాసీనభావముతో చూచు

సాధువులు అని యర్థము. ఇట్టి సాధువులను "నమస్యే నమస్యే" నమస్కరించుచున్నానని యర్థము.

## సాధుసంగము

శీలము సాధుసంగమువల్ల వృద్ధియగును. సాధువులు అను మహాత్ముల సంగతిని యీ యధ్యాయాదియందు అచ్చుపడి యుండు శ్లోకము కొంతవరకు తెలియపరచుచున్నది. ప్రవృత్తి మార్గయాత్రను ముగించుచు నివృత్తిమార్గముయొక్క మహిమను శ్రవణమువల్ల తెలిసికొని అట్టి యుత్కృష్టమైన మార్గమునందు యాత్రను సఫలముగా ముగించవలెనని యాసగొన్న జీవాత్మలు నిజముగా "బ్రహ్మవలోకధిషణు" లే. బ్రహ్మవలోకమనగా బంధనిర్ముక్తి చేసికొనుట. బంధనిర్ముక్తికి మోక్షమని పేరు. శాంతి పర్వమునందు "మోక్షద్వారే ద్వారపాలాశ్చత్వారః" అని చెప్పి, వారెవరని ప్రశ్నకలుగునని "శమో విచార స్సంతోష శ్చతుర్థ స్సాధుసంగమః" అని చెప్పబడినది. శమము, విచారము, సంతోషము అను విషయములు ఈ పుస్తకముయొక్క ఉత్తరభాగమునందు వ్రాయబడును. ఇప్పట్లో సాధుసంగమమును గురించి వ్రాయనగును.

సాధువుల సంగమము లక్ష్మీకరము. కీర్తిని యిచ్చును. మహాదోషములను నివృత్తిచేయును. మిక్కిలి విమలమైన జ్ఞానము నిచ్చును.

> మహత్సేవాం ద్వార మాహు ర్విముక్తే స్తమోద్వారం యోషితాం సంగిసంగం । మహాంత స్తే సమచిత్తాః ప్రశాంతా విమన్యవ స్సుహృద స్సాధవో యే ॥ (శ్రీ భా—స్క-౦-౫, అధ్యా-౫.)

ప్రసంగ మజరం పాశం ఆత్మనః కవయో విదుః ।
స ఏవ సాధుషు కృతో మోక్షద్వార మపావృతం ॥
తితిక్షవః కారుణికా సుహృదః సర్వదేహినాం ।
అజాతశత్రవ శ్శాంతాః సాధవ స్సాధుభూషణాః ॥
మయ్యనన్యేన భావేన భక్తిం కుర్వంతి యే దృఢాం ।
మత్కృతే త్యక్త కర్మాణః త్యక్తస్వజనబాంధవాః ॥
మదాశ్రయకథామృష్టాః శృణ్వంతి కథయంతి చ ।
తపంతి వివిధా స్తాపా నైతాన్మద్గతచేతసః ॥
త ఏతే సాధవ స్సాధ్వి సర్వసంగవివర్జితాః ।
సంగ స్తేష్వథ తే ప్రార్థ్యః సర్వదోషహరా హి తే ॥

సతాం ప్రసంగాన్మమ వీర్యసంవిదో భవంతి హృత్కర్ణరసాయనాః కథాః । తజ్జోషణా దాశ్వపవర్గవర్త్మని శ్రద్ధారతిర్భక్తిరనుక్రమిష్యతి ॥

భక్త్యా పుమాన్ జాత విరాగ ఐంద్రియా ద్దృష్టశ్రుతాన్మద్రచనానుచింతయా । చిత్తస్య యత్తో గ్రహణేన యుక్తో యతిష్యతే ఋజుభిర్యోగమార్గైః ॥

(శ్రీ భా—స్కం-3, అధ్యా-౨౫.)

తతో దుస్సంగ ముత్సృజ్య సత్సు సజ్జేత బుద్ధిమాన్ ।
సంత ఏతస్య ఛిందంతి మనోవ్యాసంగ ముక్తిభిః ॥
సంతోఽనపేక్షా మచ్చిత్తాః ప్రశాంతా స్సమదర్శినః ।
నిర్మమా నిరహంకారా నిర్ద్వంద్వా నిష్పరిగ్రహాః ॥
తేషు నిత్యం మహాభాగ మహాభాగేషు మత్కథాః ।
సంభవంతి హి తా నృణాం జుషతాం ప్రపునంత్యఘం ॥
తా యే శృణ్వంతి గాయంతి హ్యనుమోదంతి చా దృతాః ।
మత్పరాః శ్రద్దధానా శ్చ భక్తిం విందంతి తే మయి ॥
భక్తిం లబ్ధవత స్సాధోః కిమన్య దవశిష్యతే ।
మయ్యనంతగుణే బ్రహ్మణ్యానందానుభవాత్మని ॥

యథో పశ్రయమాణస్య భగవంతం విభావసుం ।
శీతం భయం తమోప్యేతి సాధూన్ సంసేవత స్తథా ॥
నిమజ్జ్యోన్మజ్జతాం ఘోరే భవాబ్ధౌ పరమాయణం ।
సంతో బ్రహ్మవిద శ్శాంతాః నౌ దృఢేవాప్సు మజ్జతాం ॥
అన్నం హి ప్రాణినాం ప్రాణః ఆర్తానాం శరణం త్వహం ।
ధర్మో విత్తం నృణాం ప్రేత్య సంతోస్మా ద్బిభ్యతోరణం ॥
సంతో దిశంతి చక్షూంషి బహి రర్కః సముత్థితః ।
దేవతా బాంధవా స్సంతః సంత ఆత్మా హమేవ చ ॥

(శ్రీ భా—స్కం-౧౧, అధ్యా-౨౬.)

మహాత్ములసేవ మోక్షప్రాప్తిహేతువనియును, విషయసుఖేచ్ఛయు, విషయసుఖేచ్ఛగలవారిసహవాసమును, జననమరణజరారూపకమైన సంసారమునకు కారణమనియు నెరుగవలయును. సమచిత్తులు,[1] ప్రశాంతులు,[2] విగతక్రోధులు,[3] సుహృదులు,[4] సదాచారులు,[5] విరక్తిచెందినవారును మహాత్ములనంబడుదురు. వస్తుతః సంగము బలవత్తరమైన పాశము. అయినను సాధుజనులతో చేయబడు సంగము మోక్షమునకు పోవుమార్గమునందుండు మహద్ద్వారమును తెరువగల శక్తిగలిగియుండును. మూర్ఖులగు జనసముదాయము చేయు తప్పులను సైరించువారును, తమ కేమియు సుఖము

[1] భ. గీ. ౨-అధ్యా. ౫౬ శ్లో, ౧౩-అధ్యా. ౯ శ్లో, ౫-అధ్యా. ౨౦ శ్లో.

[2] భ. గీ. ౬-అధ్యా. ౧౪, ౨౭ శ్లో.

[3] భ. గీ. ౪-అధ్యా. ౧౦ శ్లో.

[4] భ. గీ. ౫-అధ్యా. ౨౯ శ్లో, ౯-అధ్యా. ౧౮ శ్లో
ఈ శ్లోకములను చదువవలెను.

[5] ౩౨౧-౩౨౨ వ పుటల చూడుడు.

కావలెననికోరకయే ఇతరులకు సంభవించిన దుఃఖములను నివారణచేయు కరుణామూర్తులును, వీడు నావాడా, వాడు నావాడు కాడా యని యోచించక ఎల్లరయందును స్నేహముచూపువారును, తమకు శత్రువు లనువారు లేరని చెప్పదగినట్లు నడుచుకొనువారును, శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము అను పేళ్లనెరుగబడు శమాదిషట్కసంపత్తి కలిగినందున శాంతమువహించినవారును, ఇట్టి నడతలే తమకు భూషణములుగా నంగీకరించు ప్రకృతిగలవారును, సర్వలోకేశ్వరుడును, సర్వభూతాంతరాత్మయునైన నాయందు (భగవంతునియందు) అచలమైన (దృఢ) భక్తిగలిగి నన్ను వినాగా నితర శరణ్యమనునది లేదను నమ్మకముగలవారును, సర్వకర్మలు అనగా శాస్త్రోక్తకర్మలే కాదు ఏ యే కర్మచేసినను భగవత్ప్రీతిగా చేయువారును, స్వజనులు, బంధువులు అను భేదములు లేక లోకులందరును తన స్వజనులు, బంధువులు అని ఎంచినవారును, నన్ను (భగవంతుని) ఆశ్రయించి నా ప్రభావములను వినుటయందు, వినిపించుటయందును, అత్యంత అనురక్తిగలవారును, సర్వవిధములైన సంగములను త్యజించినవారు సాధువులనబడుదురు. సర్వదోషములను హరించుశక్తిగల సాధువులసంగము తమకు లభించవలెనని ఎల్లరును ప్రయత్నించుచుండవలెను. ఎవరు సాధువులతో సంగముచేయుదురో వారు నాయొక్క కథలను వినగలరు. ఆ కథలయందు నాయొక్కవీర్యమును (ప్రభావమును) ప్రశంసించియుందురు. సత్సంగమువల్ల నా మాహాత్మ్యమునెరుగుదురు. నా కథలు విన్నందున చెవులకు అమృతధారవలె సుఖము కలుగును. కథాశ్రవణమువల్ల నాయందను

రక్తియు, ఆసక్తియు, అనంతరము భక్తియు కలుగును. తద్ద్వారా అవిద్యానాశమగును. భక్తిగల పురుషుడు నా కథాశ్రవణము చేయుటవలన నా లీలను చింతించి చింతించి ఐహికవిషయముల యందు ఆసక్తిని క్రమముగావదులుచు అదే విధమున ఆముష్మిక సుఖములయందుకూడ ఆశవదిలి నిస్పృహుడై పరమపావనంబైన యోగమార్గమును అభ్యసించుట కారంభించును. తద్ద్వారా నన్ను పొందును.

కాబట్టి, ఉద్ధవా, బుద్ధిమంతుడు దుస్సంగమును చాలించి సత్సంగమునే కోరవలయును. సాధువులు తమనాశ్రయించినవారి యొక్క మనస్సులయందు గల చింతలను మంచిమాటలతో దొలగింతురు. సత్పురుషులు లేక సాధువు లెవరనిన, అనపేక్షులు అనగా సుఖములయందు అపేక్షలేనివారు, మచ్చిత్తులు,[1] ప్రశాంతులు, సమదర్శనులు,[2] నిర్మములు,[3] నిరహంకారులు,[3] నిర్ద్వంద్వులు,[4] నిష్పరిగ్రహులు నగువారు. సాధువులు నా మాహాత్మ్యమును కీర్తించుచుందురు. అట్టి కీర్తనమువలన సేవించువారికి పాపపరిహారమగును. సేవించువారు సాధువులు కీర్తించు కథలను ఆదరముతో వినినను, కీర్తించినను, అనుమోదించినను, శ్రద్ధావంతులై నాయందు స్నేహమును వృద్ధిచేసికొనినవారై నాభక్తు

[1] భ. గీ. ౧౦-అధ్యా. ౯ శ్లో.

[2] భ. గీ. ౬-అధ్యా. ౩౨ శ్లో., ౧౩-అధ్యా. ౨౮ శ్లో., ౧౨-అధ్యా. ౧౮ శ్లో., ౧౮-అధ్యా. ౫౪ శ్లో., ౪-అధ్యా. ౨౨ శ్లో.

[3] భ. గీ. ౧౨-అధ్యా. ౧౩ శ్లో.

[4] భ. గీ. ౨-అధ్యా. ౪౫ శ్లో., ౫-అధ్యా. ౩ శ్లో., ౩-అధ్యా. ౨౭ శ్లో., ౪-అధ్యా. ౨౨ శ్లో., ౧౫-అధ్యా ౫ శ్లో.

లగుదురు. బ్రహ్మస్వరూపుడును, అనంతసద్గుణములకు పుట్టి నిల్లును, ఆనందానుభవాత్ముడు నగు నామీద భక్తిని సాధించిన వానికి సాధ్యముకాని దేమి యున్నది. సూర్యునియొక్క వెలుతురును అగ్నియొక్క తీక్ష్ణమును ఆశ్రయించినవానికి చలియు భయమును చీకటియును పొసగవు కదా? నన్నాశ్రయించిన వానికి సంసారసాగరభయమును అజ్ఞానమును నశించును. ఘోరమైన సంసార మను సముద్రమునందు మునుగుచు తేలుచునుండు వానిని శాంతులైన సాధువులు తరింపచేయుదురు. ప్రాణులకు అన్నము ఏవిధముగా జీవనము అగునో ఆవిధముగా ఆర్తులకు నేను శరణంబు. పరలోకప్రయాణము చేయువారికి ధర్మము ధనము వంటిది; అట్లు సంసారభీతిచెందినవారికి సాధువులు శరణమగుదురు. సూర్యుడు బాహ్యప్రపంచమునందలి చీకటిని పోగొట్టును. సాధువులన్ననో లోపలిచీకటిని పోగొట్టుటకు వేయికండ్లతో సమానమైన జ్ఞాననేత్రము నిత్తురు. దేవత లిచ్చు సహాయమును, బంధువులు, ఆత్మ, నేనును ఇయ్యగల సహాయమును సాధువులియ్యగలరు. ఇది పై శ్లోకముల తాత్పర్యము.

౧౨౩, ౧౨౪ వ పుటలయందు అణువులు ఒకరి శరీరము నందుండి మరియొకరిశరీరములో ప్రవేశించుననునది మొదలుగాగల సంగతులను చెప్పి సత్సంగమునుగురించి ప్రస్తావన జరిగియుండెను కదా. మనము ఎక్కడ కూరుచుండినను ఎవరితో మాటలాడినను ఏమి భోజనము చేసినను ఆయా సందర్భములయందు ఆయా మనుష్యులయొక్కయు ఆయా పదార్థములయొక్కయు అణువులు మనశరీరములయందు ప్రవేశించును అనునది నిశ్చయము. ప్రతి

వస్తువునందును ప్రతిగుణమునందును ప్రతివ్యక్తియందును స్పంద శక్తు లున్న వను సంగతి యిదివరకే విచారింపబడినది. మనుష్యులు, గుణములు, మొదలగువానియొక్క స్వభావములను పట్టి స్పందములయొక్క వేగము మారుచుండును. సువాసన, సద్గుణము ఇట్టివానియొక్క స్పందములు అతివేగములు. శబ్దముయొక్క స్పందవేగముకన్న వెలుతురుయొక్క స్పందవేగ మధికము. వెలుతురు అనగా నేత్రేంద్రియముయొక్క విషయ మగు వర్ణము కూడ అర్థము. వర్ణములలో ఎఱ్ఱవర్ణముయొక్క స్పందవేగము తక్కువ. అంతకంటె పసుపువర్ణముయొక్క స్పందవేగ మధికము. దైవసంపద్గుణములయొక్క స్పందవేగము ఆసురసంపద్గుణములయొక్క స్పందవేగమునకంటె చాల అధికము.

సత్పురుషులయందు సద్గుణములును దైవభక్తియు నిండియుండును. కనుక సత్పురుషులుండు స్థలమునందు వారి శరీరములయందుండు అణువులు అతివేగములగు స్పందములకు అభ్యాసపడియుండును. వారి తేజోబలము చాల అధికము. ఈ పుస్తకముయొక్క ఉత్తరార్థమునందు తేజస్సు అను అంశము క్రింద ఈ విషయమునుగురించి మరికొన్ని వివరములు వ్రాయబడును. శ్రీవేదవ్యాసులవారి తేజస్సును చూడలేక ధృతరాష్ట్రునితల్లి కండ్లు మూసికొన్నదని శ్రీమహాభారతమునందు చదివియున్నాము కదా. మహనీయుల శరీరముల సమీపమునకు సాధారణజనులు భక్తియుక్తులై పోయినయెడల వారి తేజస్సుయొక్క స్పందవేగమునకు ఓర్వలేక సాధారణజనునియొక్క శరీరమునందుండు తామసరాజస అణువులు సాధారణజనునియొక్క శరీరమునుండి రాలిపోవును.

దుర్గంధము మైల మొదలగు పదార్థములున్నచోట ఈగలు, దోమలు అతి ఆహ్లాదముతో ఝుంకారము చేయుచుండును. ఆ దోమలు, ఈగలు పరిమళవస్తువులుండు స్థలములకు పోవు. సాధారణజనుని శరీరము దుర్వాసనామయమై ఆసురసంపత్స్వభావ అణువులకు ఉనికి పట్టైయుండును. అట్టి సాధారణజనుడు సాధువుల సాంగత్యమునుకోరి వారికి కైంకర్యముచేయుచువచ్చెనేని పరిమళ ద్రవ్యములవద్దకు దోమలు, ఈగలు పోలేకపోయిన రీతిగా సాధారణజనుని శరీరమందుండు తామసరాజస అణువులు రాలిపోవును. రాలిపోయిన అణువులయొక్క స్థానమునందు సాధువులశరీరమునందలియణువులు వచ్చిచేరును. ఒక నిమిషమాత్రమే ఐనను సాధుసాంగత్యము జరిగినయెడల కొన్ని తామసస్వభావముగల అణువులను మనము పోగొట్టుకొని వానికి భర్తీగా సాత్త్వికఅణువులను సంపాదించుకోగలము. ఒక నిమిషకాలమునకు బదులు వారివద్దనే ఉండి వారికి కైంకర్యముచేయుచువచ్చినయెడల క్రమేణ తామసరాజసఅణువులు మనశరీరములను వదిలి పోవును. సాత్త్వికఅణువులు మనశరీరములయందు చేరును. కాలాంతరమునందు సాత్త్వికఅణువుల లెక్క చాల అధికమగును. ఆవిధమున మన శరీరము సత్త్వప్రధానమగును. సత్త్వప్రధానమగుశరీరమందు సత్త్వప్రధానమైన మనస్సు నివసించుటకు సాధ్యమగును. అందువలన సత్త్వశుద్ధికలుగును. ఇదంతయు సాధుసంగతివలని ఫలము.

భవద్విధా భాగవతాః తీర్థభూతా స్స్వయం ప్రభో।
తీర్థీకుర్వంతి తీర్థాని స్వాంతస్థేన గదాభృతా॥

(శ్రీభా—స్క-౧-౧, అధ్యా-౧౩.)

అయ్యా, తమవంటి భక్తులే తీర్థములు అనదగు. తమరు పునీతులు కావలెననియా తాము తీర్థములయందు స్నానముచేతురు; కాదు, కాదు. తమయొక్క హృదయకమలమునందు తేజరిల్లుచున్న గదాధరుండైన శ్రీవిష్ణువుయొక్క శక్తిని తీర్థములకియ్యవలెను అను నుద్దేశముతో తీర్థయాత్రచేసి ఆ తీర్థములయందు స్నానము చేయుసందర్భమునందు వానికి వీర్యమునిత్తురు గదా అని యర్థము. ఇది నిజమైన సంగతి. భగవద్భక్తులు సదా శుచిష్మంతులు. గంగాదితీర్థములు తమయందు స్నానములుచేయు పాపాత్ముల పాపములను కడిగి కడిగి వానియందలి వీర్యము తక్కువ యగు చుండగా సాధువులు ఆతీర్థములయందు స్నానముచేయువ్యాజ ముతో స్నానకాలమందు తమయందిమిడియుండు భగవద్వీర్య మును తీర్థములలో నెక్కించి బలపరుచుచుందురు. కనుకనే సాధువులు తీర్థములను తీర్థీకరించువారు అని ప్రవచనము.

> తత్రోపజగ్ము ర్భువనం పునానా మహానుభావా మునయ స్సశిష్యాః।
> ప్రాయేణ తీర్థాభిగమాపదేశై స్స్వయం హి తీర్థాని పునంతి సంతః॥
>
> (శ్రీభా—స్కం-౧, అధ్యా-౧౯.)

లోకమును శుద్ధిచేయునుద్దేశముతో తమతమశిష్యులతోకూడ మహానుభావులైన మునులు అచ్చటికి దయచేసిరి. తాము కృతార్థు లైనను లోకులను అనుగ్రహించవలెను అను కటాక్షముచేత ప్రేరితులై తాము తీర్థయాత్రచేయవలెను అని యితరులకు కను పరిచినట్లు తీర్థములయందు స్నానములుచేయుచు అ తీర్థములను శుచిష్మంతములుగా చేయుదురు. కనుకనే

న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః।
తే పునంత్యురుకాలేన దర్శనా దేవ సాధవః ॥

(శ్రీభా—స్క-౧౦, అధ్యా-౪౮.)

జలస్వరూపములైనవి తీర్థములు గావు. మృత్తికతోను శిలలతోను చేయబడినవి దేవతలు కారు. ఏలయంటే ఆ తీర్థములును దేవతలును మనుష్యులపాపములను హరించుటకు చాల కాలము కావలెను. ఐతే సాధువు లన్ననో దర్శనమాత్రంబుననే మన పాపములను హరింతురు.

338 వ పుటయందు గంగాదితీర్థములయందు పాపులు స్నానముచేయు రీత్యా వారి పాపములనెల్లను పోగొట్టుటవల్ల వీర్యముక్షీణింపజేసికొన్న తీర్థములకు ఋషులు మునులు మొదలగు సాధువులు వీర్యము నిత్తురు అని చెప్పబడియె. ఇందుకు గమకము

గంగా:

కిం చాహం న భువం యాస్యే నరా మయ్యామృజంత్యఘం।
మృజామి తదఘం క్వాహం రాజం స్తత్ర విచింత్యతాం ॥

రాజా:

సాధవో న్యాసిన శ్శాంతా ధర్మిష్ఠా లోకపావనాః ।
హరంత్యఘం తేంగసంగా త్తేష్వాస్తే హ్యఘభిద్ధరిః ॥

(శ్రీ భా—స్క-౯, అధ్యా-౧౦.)

భగీరథు డను రాజర్షి గంగాదేవిని భూలోకమునకు దయచేయుమని ప్రార్థించినపుడు గంగాదేవియొక్క వచనము: “మరియును నేను భూలోకంబునకు వచ్చినట్లైతే భూలోకమందలి పాపులు

వారి పాపములను నాలోన కడిగికొనిన ఆ పాపములను నేనేవిధ ముగా కడిగికొనగలను" అని యాక్షేపించిన భగీరథుండిట్లనియె. "దేవీ, సాధువులు సర్వసంగవివర్జితులై, శాంతమనస్కులై, ధర్మిష్ఠులై, లోకపావనులై యున్నవారు. సర్వపాపములను హరి యించు శక్తిగల శ్రీహరి వారియందు దీప్తిమంతుడుగానున్నాడు. ఆ సాధువులు నీ జలంబుల స్నానపానాదులు చేయుచు ఉందురు. వారి దేహస్పర్శయగునపుడు పాపజనసంసర్గమువలన నీలో ప్రవే శించిన పాపములెల్లయు నీగును" అని చెప్పి సమాధానపరిచి గంగను తెచ్చెను. కనుక తీర్థములను తీర్థములుగా జేయు మహ నీయులు మనలను అభిమానించినయెడల మన పాపములు పోయి వారియందుండు సుగుణములు కూడ మనకు వచ్చును కనుక "ఉదాసీన సాధూన్ నమస్యే నమస్యే".

ఆనంద మానందకరం ప్రసన్నం
జ్ఞానస్వరూపం నిజబోధయుక్తం।
యోగీంద్ర మీడ్యం భవరోగవైద్యం
శ్రీమద్గురుం నిత్య మహం నమామి॥

---

# విజ్ఞాపన

ఈ గ్రంథముయొక్క ఉపక్రమాధ్యాయమునందు ఆదిమ ధ్యాంతరహితమైన సచ్చిదానందమూర్తియొక్క "బహుస్యాం" అనుస్పందశక్తివల్ల వ్యక్తీకరింపబడిన ప్రజ్ఞానాంశువు అను తురీయాత్మకు పాంచభౌతికప్రపంచము క్రీడారంగముగా నేర్పడినదనియును; తురీయాత్మయొక్క క్రీడావిధానమునకు ప్రవృత్తిమార్గము, నివృత్తిమార్గము అని పేళ్లు అసియును (3౪ వ పుటచూడుడు); క్రీడకుడైన తురీయాత్మ మానవశరీరమును ధరించుటకు మునుపు ౧. అభ్యాత్మ, ౨. సౌరాత్మ, 3. చంద్రాత్మ, ౪. ధాతు, ౫. వృక్ష, ౬. మృగవర్గములయందెల్లయును అనుభవసంపాదనచేసెననియు ఆధిభౌతిక ఆధిదైవిక ఆధ్యాత్మిక సృష్టులయధ్యాయమునందు తెలిసికొని; మానుష్యం అను అధ్యాయమునందు ఆదికాలమందు ఏవిధముగా ప్రజోత్పత్తియగుచుండెను, ఏవిధముగా కల్పవృక్షములు, కామధేనువులు మొదలగు పరికరములను దేవతలు దయచేసిరనియు; మానుష్యము స్థిరమగుచు వచ్చినసమయమునందు శ్రీసనత్కుమారప్రముఖులైన మహనీయులు మహాపీఠముగా నేర్పడి జ్ఞానోపదేశము చేయుచుండగా మనువులు, ప్రజాపతులు, ఋషులు మొదలగువారలు ఆదికాలపుమనుష్యులకు విద్యలునేర్పిరనియు; ధర్మా

చరణార్థము నిదర్శనముగా నెనుబదియెనిమిది వేలమంది ఋషులను ప్రవృత్తిమార్గమునందును మరియు నెనుబదియెనిమిది వేలమందిమునులను నివృత్తిమార్గమందును నియమించియుంచిరని యు; ప్రవృత్తిమార్గవివరములను అనుభవించుచు జీవాత్మలు సంసారచక్రమునందు పరిభ్రమణముచేయుచు మనస్సుయొక్క శక్తులను వృద్ధిపరుచుకొనుచు కామమును వృద్ధిపరుచుకొని అందువల్ల శ్రమలుపడుచుండినను

> రజోధికాః కర్మపరా దుఃఖే చ సుఖమానినః ।
>
> (శ్రీ భా—స్కం-౩, అధ్యా-౧౧, శ్లో-౨౮.)

రజోగుణము అధికముగానుండుటవలన కర్మచేయుటయందు ప్రవృత్తి గలవారలై దుఃఖములను ఎడతెగక అనుభవించుచుండినను ఆ దుఃఖములనే సుఖములుగా నమ్ముచుండి మానుష్యముయొక్క పరమపురుషార్థమైన ఆత్మజ్ఞానసంపాదనయందు అభిలాషపుట్టకయే అనేకజన్మములయందు ఆస్ట్రిల్ ప్లేనులోనును మెంటల్ ప్లేనులోనును అనుభవములను అనుభవించి కొంచెము కొంచెముగా "బ్రహ్మవలోకధిషణు" లై సంసారములయందు విసికి ఐహికసుఖములయందు నిస్పృహులగుచు తాము మొదట ఎచ్చటనుండి వచ్చినవారము అను విచారమును చేయుటకు కొంచెము కొంచెముగా నిష్టపడుచు తాము ఇదివరకును నడుచుచున్న ప్రవృత్తిమార్గమును విడిచి ౩౮ వ పుటయందుసూచించిన నివృత్తిమార్గమును గురించి విచారముజరుపుటకు పుణ్యఫలాధిక్యము కలిగిన జీవాత్మలు ప్రయత్నపడుదురు అని తెలిసికోబడినది.

ప్రవృత్తిమార్గముయొక్క అంత్యస్థితియు నివృత్తిమార్గము యొక్క ఆదిమస్థితియు కొంచెము ఎక్కువతక్కువగా తుల్యములుగానుండును. నివృత్తిమార్గమును నడువను ఆరంభించునపుడు కొంచెము కొంచెముగా ఐహికసుఖములయందు పట్టుదల వదులుచు వచ్చును. శాస్త్రములను వినవలెనను అభిలాషపుట్టును; ఈ అభిలాషయొక్క ఫలితార్థముగా శ్రవణము అనుపదవిని చెందుటకు సిద్ధపడుదురు. శ్రవణము అను చర్యయందు చెప్పువారొకరు, వినువారొకరు ఉండవలెను. చెప్పువారికి వక్తయని పేరు. వారే గురువులవారు. వినువారికి శ్రోతయని పేరు. వీరే శిష్యులు. నివృత్తిమార్గమునందు నడువనారంభించువాడు గురువులవారిని ఆశ్రయించి శ్రవణముచేసి వినినవాక్యములను మననముచేసి శ్రవణమననములయొక్క ఫలితార్థమును నిదిధ్యాసము చేయ నారంభించవలయును. ఈ పుస్తకములో చెప్పిన విషయములను జాగ్రతగా చదివి మననముచేసి శీలమును కుదుర్చుకొనవలయును. ఈ పుస్తకముయొక్క ఉత్తరభాగమునందు ౧. సాధన చతుష్టయసంపత్తి, ౨. జీవన్ముక్తులు (గురువులు) ౩. దేహములు, వాని స్వాస్థ్యము, ౪. శ్రవణమననములు, ౫. యోగాంగములు (కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము), ౬. ధ్యానము, ౭. కైంకర్యము, ౮. జ్ఞానదీక్షలు, ౯. ప్రయోజనము అను అధ్యాయములయందు యథాశక్తిగాను యథోచితముగాను కొన్ని వివరములు వ్రాయవలయునని యుద్దేశము. ఐతే ప్రకృతమందు ఈ పుస్తకముయొక్క పూర్వభాగమును మాత్రము ముగించి ప్రచురించు అభిప్రాయమున్నది. ఇందు కనుపరిచిన విష

యములన్నియు దివ్యజ్ఞానసమాజమునందు ప్రవీణులు వ్రాసిన పుస్తకములలో చదువబడినవి. ఉత్తరార్ధమునందు వ్రాయబోవు నవి కూడయు అట్లే. అయినను ఇంగ్లీషుభాషయందు వ్రాయ బడిన గ్రంథములయందు పాశ్చాత్యసంజ్ఞావాచకములు అన్నిటిని సాధ్యమైనంతవరకు సనాతనధర్మగ్రంథములయందుపయోగించిన సంజ్ఞావాచకములతో పోల్చబడియున్నవి. మరియు ఎంతపోల్చినను సమానార్థకవాక్యములు అగపడనందున పాశ్చాత్య సంజ్ఞావాచ కములనే తరుచుగా నుపయోగించినను వాటియొక్క అర్థములు అక్కడక్కడనే వ్యక్తీకరింపబడియున్నవి. ఉపక్రమాధ్యాయము నందు గాని తరువాత గాని పరబ్రహ్మము అని యుపయోగించిన స్థలములయందంతయు సగుణబ్రహ్మమునే లక్ష్యముగా నుపయో గింపబడియున్నది. ఈ గ్రంథమునందు పూర్వభాగము ఇంతటితో ముగిసినది. ఇందలి విషయములు వేదాంతశాస్త్రప్రవీణులైన పండితులకు చాలమట్టుకు తృప్తికరంబుగానుండవని సందేహము. ఐనను వేదాంతశాస్త్రాభ్యాసముచేయని అస్మదాదులవంటి స్వల్ప విద్యాభ్యాసకులకుగానును, హూణభాషాజ్ఞానములేమిచే ఆభాష యందు వ్రాయబడియుండు గ్రంథములను చదువలేనివారియొక్క యుపయోగార్థముగానునే ఈ గ్రంథము వ్రాయబడినది.

ఓమ్ తత్ సత్

ఇతి శివం

Printed by J. R. Aria at the Vasanta Press, Adyar, Madras.

శ్రీ

బ్రహ్మజ్ఞానసమాజసద్గురుమణిః లోకైకరత్నామణిః ।
సద్విద్యామృతదానకల్పకమణిః కారుణ్యావార్ధిమణిః ।
యా మాతైవ విరాజతే ప్రభుమణిః శ్రీమద్వసంతామణిః ।
తస్యాః శ్రీపదపంకజే సవినయం భక్త్యార్పితేయం కృతిః ॥



జయతు జయతు నిత్యం బ్రహ్మవిజ్ఞానసంసత్
జయతు జయతు నిత్యం శ్రీవసంతాంబికా సా
జయతు జయతు నిత్యం శ్రీగురుశ్చాగమిష్యన్
జయతు జయతు నిత్యం సత్యరూపో హి ధర్మః ॥

## శ్రీ అల్లాడి మహాదేవశాస్త్రిలవారు
## "దివ్యజ్ఞానదీపిక" యందు వ్రాసిన గ్రంథవిమర్శ

---

ఆత్మవిచారము (అద్దంకి సీతారామశాస్త్రి రచితము).

బ్రహ్మవిద్యాసమాజము (Theosophical Society) 1879 సం॥న ఈ దేశమునకు వచ్చినది మొదలు దాని యధ్యక్షులైనవారలు బ్రహ్మవిద్యాప్రచారము చేయుచువచ్చుటచే మనవాండ్లకు హిందూ సనాతనధర్మమున ఆదరము హెచ్చుచు వచ్చినది కదా. అంతకు మునుపు మనలోని విద్యార్థులు గౌరవించుచుండిన పాశ్చాత్య వైజ్ఞానికులు అత్మజ్ఞానవిముఖులు కావున వారియనాదరణచే నేమి వారి దూషణములచే నేమి సనాతనధర్మము ఉపేక్షాస్పదమాయె. బ్రహ్మవిద్యాసమాజము నిలకడనొందినపై మహనీయులగు బ్లవాట్స్కి దొరసాని, ఆల్కాటు దొర, బెసంట్ దొరసాని, లెడ్బీటరు దొర మొదలగువారు పాశ్చాత్యవిజ్ఞానమార్గముననే గ్రంథమూలకముగను ఉపన్యాసమూలకముగను బ్రహ్మవిద్యాప్రచారము చేసి సనాతనధర్మ మూలతత్త్వములను యుక్తియుక్తముగను స్వానుభవపురస్సరముగను ఉపపాదించుటవలన హిందూజనులకు తమ సనాతన ధర్మమున గౌరవము కలిగినది. ఇట్టి ఉపన్యాసములును గ్రంథము

లును ఆంగ్లభాషామయమైనందున ఆభాష తెలియని జిజ్ఞాసువులకు వానిచే గలుగు జ్ఞానప్రకాశము ఇంతవఱకు గోచరము కాకయుండెను. ఇపుడు బ్రహ్మశ్రీ అద్దంకి సీతారామశాస్త్రిలుగారు ఆత్మవిచారము అను గ్రంథము వ్రాసి ఆ ప్రకాశమును గనదగు నేత్రము నాంధ్రుల కొసగిరి. వీరు ౩౦ సంవత్సరముల కాలము పైగా బ్రహ్మవిద్యా (Theosophy) వ్యాసంగము చేయుచుండు వారు. కొన్నియేండ్లు ఈ సమాజపు ఉపన్యాసకులుగ దక్షిణ ఇండియా దేశమున బ్రహ్మవిద్యాప్రచారము చేయుచుండిరి. తరువాత పదునాలుగు సంవత్సరములుగ బ్రహ్మవిద్యాసమాజ మూలస్థానమగు అడయారున వసించుచు శ్రీ బెసెంటమ్మగారు, యోగి లెడ్‌బీటరు గారు, వీరి సంనిధానమున జేరి గ్రంథస్థములు కాని అనేక రహస్యాంశముల దెలిసికొనియుండువారు. వీరీ గ్రంథము వ్రాయబూనుట ఆంధ్రుల యదృష్టమనియే చెప్పదగు. ఈ గ్రంథమున పూర్వోత్తరభాగములు రెండు కలవు. ఇపుడు ముద్రితమై వెలువడియుండునది పూర్వభాగము, ప్రవృత్తిమార్గప్రతిపాదకము. ఉత్తరభాగము నివృత్తిమార్గప్రతిపాదకము. పూర్వభాగమందలి ముఖ్యవిషయము లేవన—ఆధిభౌతిక ఆధిదైవిక అధ్యాత్మ సృష్టి, ప్రవృత్తిమార్గము, సంసారచక్రము, కర్మ, శీలము. మనశాస్త్రముల లో దిఙ్మాత్రముగను అతి సూక్ష్మముగను ప్రదర్శింపబడియుండు సనాతనధర్మతత్వము లనేకములు ఈ గ్రంథమున బ్రహ్మవిద్యా (Theosophy) సిద్ధాంతముల ననుసరించి సవిస్తరముగ వివరింపబడియున్నవి. దేహబీజములు, మరణానంతరగతి మొదలైన కొన్ని అంశములు బ్రహ్మవిద్యాపరిచయము లేనివారికి ఇంత సవిస్తరముగ

వివరింప నలవికాదనుటలో సంశయము లేదు. సమూహాత్మ (Group-soul), సప్తసృష్టివర్గము (Seven Elemental Kingdoms), జీవాత్మ సృష్టి, సప్తీకరణము, భావపరివర్తనము, పరేంగితజ్ఞానము, నాడీ పంజరము—ఇత్యాది అంశములు సామాన్యులకు అపూర్వములని యే తోచును. ఇదిగాక ప్రణవవాదము అను రహస్యశాస్త్రము ననుసరించిన గర్భాధానాది షోడశసంస్కారముల తత్త్వార్థవివరణము అపూర్వప్రాయమే. ప్రతియొక విషయమును శ్రుతిస్మృతి పురాణాదిప్రమాణవాక్యముల నుదాహరించి ఉపపాదింపబడి యున్నది. ఉపపాదనశైలి లలితము. ఇట్టి ప్రమేయములను పండితులుకానివారు తెలిసికొనునటుల వ్రాయుట సులభము కాదు. శాస్త్రిలుగారేమో ఇట్టిశైలినసే వ్రాయబూనిరి. ప్రమేయ కాఠిన్యమువలన కొన్నిభాగములుమాత్రము రెండుమూడు సార్లు చదివినగాని అవగాహనకు రాకపోవచ్చును. అది శాస్త్రిలవారి దోషముకానేరదు. శ్రద్ధగలవారికి ఏ కష్టము తోచనేరదనియే మా నమ్మిక. ఉత్తరభాగమును శీఘ్రముగనె వెడలునని మా నిరీక్షణ.

ఈపుస్తకము వలయువారు దివ్యజ్ఞానదీపిక ఆఫీసుకు వ్రాసి కొనవచ్చును. వెల ౧-౮-౦ రూ. తపాలాకూలి ప్రత్యేకము.

